శ్రీ:

శ్రీరామజయము.

---

# పదునాలుగురాజుల కథలు.



వే. కుప్పుస్వామి మొదలారి వారి

అమెరికన్ డైమండు ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపబడెను.

చెన్నపురి.



1909.

శ్రీరస్తు.

శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః.

శ్రీమత్ సచ్చిదానందాది మధ్యాంతరహిత జ్ఞానశిఖావల

ధ్యానా శరీర ద్వితీయమానస పూర్ణులగు

బ్రహ్మశ్రీ యిల్లాప్రపులూరి

కోటీశ్వర దేశికస్వామి అనుగ్రహంబుచే సాధించిన

# శ్రీ సీ తా రా మ హృ ద యం బ ను,

# ప దు నా లు రా జు ల క థ లు.

ఇయ్యది,

చీమకుర్తి. వీరరాఘవ కవివర్యులవల్లను

పురాణం. రామశర్మగారివల్లను

వ్రాయఁబడి

పండితులచే పరిష్కరింపఁబడి


వేలూరు కుప్పుస్వామి మొదలారివారి

అమెరికన్ డైమండు ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడియె

చెన్నపట్టణము

1922




దీని వెల.] [12 అణాలు.

# విజ్ఞాపనము.

ఆంధ్రభాషాభిముఖ్యులారా!

ఇయ్యది. బ్రహ్మశ్రీ, యిఱ్ఱావులవారి కోటేశ్వర దేశికస్వామి అనుగ్రహంబుచే సాధించిన నీగ్రంథమును, సకల జనులకాహ్లాదం బగునటుల వచనరూపముగ వ్రాయబడినదిగాన నిందలి లోపంబులం గుఱ్తెఱుగక భక్తిజ్ఞానైశ్వర్యరసమునం గ్రోలి సంప్రీతిగలవారలై మోక్షేచ్ఛతో నిజగురువులం జేరి లక్ష్యార్థదృష్టితో పూర్ణప్రజ్ఞంగలిగి ప్రజ్వరిల్లుదురను యెన్నికతో నిక్కథయంతయు సాంగోపాంగముగ నెల్లడించనైతిని. కాబట్టి నీగ్రంథమును యెల్లరు నిందుగల బోధాంశములను సాధన చతుష్టయ సంపన్నులగు భక్తిపరులకు యెరుకజేసి సన్మార్గవర్తులరై యుందురని నమ్మికతో కృతజ్ఞుడనై యనేక వందనంబు లర్పించుచున్నాడను.

ఇట్లు,

టీ. వీ.

# విషయసూచిక.



విషయసూచిక - సమాప్తము.

శ్రీ

శ్రీ సద్గురుపరబ్రహ్మణేనమః

శ్రీ సీతారామహృదయంబను

# పదునాఱు రాజుల కథలు

శ్రీమదనంత కల్యాణ పరిపూర్ణుండును, సంకల్ప వికల్ప రహితుండును, "ఏకోదేవోబహుధానివిష్టః ఏకంసంతంబహుధాఃకల్పయంతి। అజాయమానో బహుధావిజాయతే తస్యధీరాఃపరిజానంతియోనిం" అను వేద ప్రమాణముచేత బ్రహ్మ, విష్ణు, రుద్రేశ్వర, సదాశివాండములు, ఆ అండములలోని పర్వత వృక్ష దేవ నర పశు పక్షి జలచరాది స్థావరజంగమ జంతువులు, ఆ జంతువులకు భుజింపదగిన పదార్థములు మొదలయినవాని నిర్మాణమునకుం గారణములైన భూమి, జలము, అగ్ని, గాలి, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, ఆత్మయనెడి అష్టప్రకృతి స్వరూపమై ప్రకాశించుచున్న చిన్మయమును శ్రీరాముల యనుజ్ఞచే శ్రీమన్మహాదేవికి ఆంజనేయున కుపదేశించిన యంశంబును ననుసరించి నానేర్చుకొలది ఆమహామహులిరువురకును సంవాదంబు గల్పించి వేదాంతరహస్యార్థంబుల సులభోపాయంబున సర్వజనంబులు దెలిసికొని మోక్షమును బొందునట్టుల వచనకావ్యంబుగ కథారూపంబున వినోదకరముగను, బల్కుల నానందకరంబు బోధముగను, హాస్యకరంబుగను, సర్వపాపక్షయకరంబుగను, మహనీయులకును, తత్త్వయోగజ్ఞానులకును, సేవనీయంబగునట్లును, బదునాఱుచరిత్రంబుల గల్పించి, యొక్కొక్క చరిత్రమున నొక్కొక్క వేదాంతరహస్యమును గూర్చి గ్రంథవిస్తరంబు గాకుండ రచియింపం బూని ముందుగ శ్రీమత్ సచ్చిదానందాదిమధ్యాంత రహిత జ్ఞానాతీతాచల భావాశరీరా ద్వితీయమానస పరిపూర్ణులగు బ్రహ్మశ్రీ యుల్లావులూరి కోటేశ్వర దేశికస్వామిని మనంబున సేవించి, బ్రహ్మదేవునకు లోకములను విచిత్రముగ గల్పించుటకును, విష్ణుదేవునకు లోకముల రక్షించుటకును, సాంబమూర్తి లోకంబులను లయింపజేయుటకును, తగిన సామర్థ్యములను, శివజీవైక్యజ్ఞానమును, గారాబముతో కలుగజేసి రక్షించుచున్న సరస్వతీదేవిని, లక్ష్మీదేవిని, పార్వతీదేవినిం గొనియాడి, వేదవేదాంగములు

యే మహానుభావుని వేదములకు మొదటిదగు ఓంకారమై లోకములసృష్టింప హేతువై యుండు రూపమునకు చతుర్ముఖ బ్రహ్మయనియు, ప్రధానంబనియు, బురుషుండనియు, బ్రహ్మంబనియు, నిటుల బహు విధముల కొనియాడెదరో ఆ యిష్ట గణపతికి నమస్కరించి, తెనుగు కవులలో మేటియైన నన్నయభట్టును తిక్కన సోమయాజి మొదలుగాగల మహాకవులనందఱినిస్తుతించి నాకోరిక నెరవేరుటకు పొగడి ధ్యానించి శ్రీసీతారామహ్యాదయంబను పదునాలు రాజుల కథలని యీ గ్రంథంబునకు చేరిడి రచింపబూనిన కథా సరిత్సాగరం బభివర్ణింతు నెట్లనిన.

శ్రీ కైలాస నివాసుండగుశంకరుండు తదాకారమై తన యున్నతస్థితియం దిరువదినాలుగు తత్వములై, ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి, ఆదిశక్తి, పరాశక్తులై, విష్ణువు, బ్రహ్మ, యింద్రుడు, నందికేశ్వరుడు, భృంగీశ్వరుడు, విఘ్నేశ్వరుడు, కుమారస్వామి, మొదలయిన ప్రమథ గణాధిపతులై, బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవీ, వారాహి, యింద్రాణి, చాముండి, అనెడు సప్తమాతృకలై, వేరువేరుగా తన కటాక్షముచే అపేక్షించి తన్నే గొలువ తన్మయమైన స్వరూపము తనకు దానే వెలువడి దానై దన్ను సందర్శించుచు హాయిగానున్న సమయమందు ఆ సాంబమూర్తి దేహమున అర్ధశరీరముగా గలదియు పర అపర పరాపర అను త్రివిధప్రకృతులే స్వరూపముగాగలదియు కుండలకు మట్టియై, గుడ్డలకు తంతువులై యుండునట్లు త్రిలోకములకు ఉపాదాన కారణస్వరూపమైనదియు త్రిలోకములను పుట్టించినదియు త్రిలోకములే యిల్లుగాగలదియు త్రిలోకములకు నివాసమైనదియు, త్రిలోకములను మోహింపజేయునదియై ప్రకాశించు సర్వాధిష్టాన చైతన్యస్వరూపుడగు పరమశివునకు పట్టపు రాణియైన శ్రీపార్వతీదేవి అతిప్రీతితో భర్తకు నాలుగువిధ శుశ్రూషలు చేయుచు సేవించుచు పూజించుచు ధ్యానించుచు నమస్కరించుచు ఆరాధింపగా అతను మిక్కిలి కృపగలవాడై మెచ్చుకొని; ఓ పార్వతీ! నీ కేమి కావలయుననివేడ నామె మిక్కిలి సంతోషించి చిరునవ్వుతో నిట్లనియె. స్వామీ సర్వపరిపూర్ణ పరబ్రహ్మస్వరూపమగు ఓ ప్రాణేశ్వరా! జ్ఞానముగల స్త్రీకి తన మగనికి శుశ్రూషలు చేయుచుండుటకంటె వేఱు పనులు లేవు గనుక తమకు శుశ్రూషలు చేయవలెనన్న కోరిక తప్ప మరియొక కోరిక నాకు లేకున్నను, తమరిప్పుడు నీకిష్టమైనదానిని అడుగుము యిచ్చెదనని తమ దానతిచ్చితిరిగాన, నాకును నా

భక్తులకును మేలు గలుగునట్లుగ, అన్ని కోరికల నిచ్చునదియును, మితిలేని దియును, క్షీణింపనిదియును, లోకముల సృష్టించుటకును లయింపజేయుట కును కారణమైయుండు పరబ్రహ్మమును తన్నుగా తెలియజేయునదియైన, శ్రీమద్రామనునామ కోటి మాహామంత్రంబును కరుణతోనను గ్రహింపుడనిన చంద్రశేఖరుం డిట్లనియె? ఓ పార్వతీ! నా మనంబు శ్రీరామ, శ్రీరామ శ్రీరామ, అని జపించుచు ఆ శ్రీరాముని నాయందే సందర్శించుచు స్తుతిం చుచు సదా జ్ఞప్తిగలిగియుందును, నీవును ఆ రామనామ మహామంత్రమును ఒక్కతేప స్మరించిన విష్ణుకృష్ణాది సహస్రనామములన్నియు పఠించిన ఫలముల పొందగలవు. గనుక ఆ శ్రీరామ మంత్రమును నీమనస్సున నిలుపుము. అని ఆ రాముని వృత్తాంతం బంతయు సవిస్తరంబుగా నెఱింగింతు వినుమని శ్రీ సాంబమూర్తి పార్వతీదేవి కిట్లనియె.

అప్పుడు పార్వతీవల్లభుం డగు శ్రీసాంబమూర్తి వివరించున దేమన; దీనజనలోక సంరక్షణుండును దయాళుడును అధోక్షజుడును అయిన శ్రీమహా విష్ణువు సాధుజన బాధకులగు రాక్షసులను శిక్షించి లోకములకు మేలు చేయ భూలోకమున శ్రీరాముడై పుట్టి సీతా దేవిని వివాహమై అయోధ్యా పట్టణ మున కొన్ని యేండ్లుండి తల్లియైన కైక వరమునకు, తండ్రియైన దశరథుని మాటకు ఆటంకము లేకయు జవదాటకయు తండ్రికోరికను తృప్తిచేయుటకై తానున్ను సీతా లక్ష్మణులతోడ ఋషి వేషములను దాల్చి తాలిమితో మేలి మిగ దండకారణ్య పుణ్యప్రదేశములయందు తిరుగుచు ఖరదూషణ త్రిశిరు లగు మొదలైన దుష్టరాక్షసుల నష్టము చేయుటను విని రావణుడు మాయా సీతను చెఱబట్టుకొనిపోవ పుట్టలు చెట్లు గుట్టలు పొదలు మొదలైన వానిలో సీతను వెదకుచుబోయి, సుగ్రీవసఖ్యంబు చేసి, తన్మంత్రియగు హనుమంతు వలన సీత లంకనుండు టెఱింగి యచటకేగి కొడుకులు తమ్ములు చుట్టములు ఏనుగులు గుఱ్ఱములు రథములు మొదలైన వానితోడ రావణుని యుద్ధమున జంపి లక్ష్మణుడు, సుగ్రీవుడు, హనుమంతుడు మొదలగు సమస్త వానరులు తనవెంట వచ్చుచుండ సీతాదేవితోడ పుష్పకవిమానమెక్కి దేవతలును దేవ ఋషులును బ్రహ్మఋషులును పొగడ నప్పుడు శ్రీరాము డయోధ్యాపురంబు నకు వచ్చె, పిమ్మట శ్రీరామచంద్రుడు భద్రమఘమత్త కాశ్యపాది స్నేహి తులును వసిష్టవామదేవాది పురోహితులును పండితులును జనక కేకయాది బంధువులును సుమంత్రాది మంత్రులును డెబ్బదిరెండు విధములైన ఊడిగ

ములవారును లక్ష్మణ భరత శత్రుఘ్నులును సేవింప సీతాదేవితోఁగూడి యుండు నవసరంబున ఆంజనేయుడు తన పావుకోళ్లను శిరస్సుమీఁద పెట్టు కొని ఎదుట మోకరించుచు కూర్చునియుండ లక్ష్మణుడు తెల్లగొడుగును ధనస్సు అమ్ములను పట్టుకొని ఎడమచేతి ప్రక్కనుండగ నప్పుడు భరతుడును శత్రుఘ్నుడును తనకు రెండువైపులను నిలచి వింజామరలు వీచుచుండ నచ్చట దేదీప్యమైవెలుంగు నవరత్నములుచెక్కిన సింహాసనము మీఁద శ్రీ రామచంద్రులు మిక్కిలి ఠీవితోఁగూర్చుండి కోటిసూర్య ప్రకాశమానముగ వెలుగుచు వసిష్ట వామదేవాది మహాసీంద్రులు దీవింపగా పట్టము కట్టుకొని పురోహితులకు మంత్రులకు స్నేహితులకు పండితులకు బ్రాహ్మణులకు సమ స్తదేశ రాజులకు విభీషణుడు అనలుడు నీలుడు హరుడు మొదలైన రాక్షసు లకును సుగ్రీవుడు జాంబవంతుడు సుషేణుడు నీలుడు గజుడు గవయుడు గవాక్షుడు గంధమాదనుడు మొదలైన వానరులకును భట్రాజులు వంశా వళినిబొగడు మాగధులు పనివాండ్రు పనికత్తెలు మొదలయిన వారికిని తగిన రథములు గుఱ్ఱములు ఏనుగులు ఆవులు భూములు బంగారునాణెములు అగ్రహారములు రత్నములు వెలగల వస్తువులు నగలు పుష్పహారములు మొదలైనవాని నవ్వారిగనిచ్చి గౌరవించి పిమ్మట తనయెదుట నుదుటను చేతులను చేర్చుకొని యున్నవాడును మంచికీర్తిగలవాడును బ్రహ్మజ్ఞానము కలుగుటకు కారణము లైన వేదశాస్త్ర న్యాయోపాదుల కులోచితము లైన శ్రౌతస్మార్త నిత్యనైమిత్తిక విధినిషేధ కామ్య ప్రాయశ్చిత్తాది పుణ్య కార్యములను భగవత్ప్రీతిగ చేసినవాడును కోరికలు లేనివాడును పరబ్ర హ్మముతప్ప తక్కిన వన్నియు అనిత్యమనెడు జ్ఞానముగా గలవాడును ఇహపర లోక భోగములందు అపేక్ష లేనివాడును శమదమాది షట్క సంపత్తి గల వాడును తీవ్రమోక్షేచ్ఛ గలవాడును బ్రహ్మము నెఱుగదగిన బుద్ధిగలవా డైన హనుమంతుని శ్రీరామమూర్తిచూచి అతిప్రీతితో సీతాదేవిని గనుం గొని ఓ జానకీ మన కిద్దరికి నిత్యభక్తుడును నాదగు బ్రహ్మజ్ఞానమును తెలిసి కొనుటయందక్కఱ గలవాడగు వీనికి మనము మన నగర్యాలంకార వైభ వము పూర్తిజేయుటకు నింక పదునాలుగురోజు లున్నందున మనము విశ్ర మించుచు నీహనుమంతునికి సచ్చిదానంద నిత్యనిర్మలత్వము లనంబఱగు పంచలక్షణములైన నాస్వరూపం బెఱింగింపవలెనని దలంచుచుండ నప్పుడు తన్ను ప్రార్థించుచున్నవాడైన నితనికి కారణంబీఱు కృతార్థుండుగా నగు నని తన నిశ్చయముతో శ్రీరాముం డాంజనేయున కిట్లనియె.



ఓ ఆంజనేయా! దేవరహస్యంబులను సావధానచిత్తుండవై వినుము. ఈ రహస్యంబగు నచల మార్గంబుల గురుముఖంబున బోధింపంబడిన వారికి పాపపుణ్యంబులు జనన మరణంబులు లేక నిత్యులై పరిపూర్ణులై వికసించియుందురు అట్టి మహానుభావుల వర్ణించిచెప్పుట కలవియౌనే? పెక్కండ్రు ఈ అచల మార్గంబులలో నొక్కొక్క మార్గంబును బోధగాంగొని పుణ్యలోకంబుల జెందిరనిజెప్పిన మారుతాత్మజుండు "మహాత్మా! యామార్గంబులలో నొక్కదానిం గూర్చి యొక పుణ్యకథజెప్పి నన్ను మోక్షాపేక్షునిగా జేయవే" యని మొక్కులిడ శ్రీరామమూర్తి భవలతా పవిత్రంబగు అగ్నిదత్త మహారాజు చరిత్రమునువినుమనియిట్లనియె.

# అగ్నిదత్తమహారాజుకథ.

మారుతీ! పూర్వము శేషశైలమను నగరమును లోకకంటకుడను రాజు పరిపాలించుచుండెను. వానికి వీరదత్తుడు, సోమదత్తుడు, యజ్ఞదత్తుడు, భానుదత్తుడు, అగ్నిదత్తుడు, యనునైదుగురు పుత్రులు గలరు. ఒకనాడు పండువెన్నెల గాయుచుండగా లోకకంటక మహారాజు మేడిమీద భార్యతోకూడ గూర్చుండి సరససల్లాపంబు లాడుచుండ నపుడు రాజు భార్యను

బిలిచి ఆమెతో నిట్టిసమయమున మన కుమారులు ఏపని చేయుట కిచ్ఛ యింతురో విచారింతము అని చెప్పి భటులను పిలిచి, ఓరీ! మా కుమారులుండు మేడకుపోయి వారు ఈ సమయంబున నేపని చేయుట కిచ్ఛ యింతురో విచారించి రండని యుత్తరవు చేసెను. అంతట వారు రాజకుమారులుండు మేడలకు పోయి రాజు చెప్పిన ప్రకారము వారి యిష్టమును అడుగగా అందు మొదటి నలువురు అడిగినదానికి నేమియు ఉత్తరము చెప్పక యూరకుండిరి. కడపటివాడు మాత్రము చంద్రుడీలాగు పదునారుకళలతో ప్రకాశించుచుండు నపుడు దేవతా స్త్రీలు ఆకుమడుపు లందియ్య హంస తూలికా తల్పంబున పండుకొనివారితో సరస సల్లాపములు చేయుచుండవలె ననుటయే నాకోరిక యనెను. భటులు ఆమాటను విని ఇదేమి వింత? మన రాజకుమారునికోర్కె మనుష్యులు కోరదగినదిగా నుండలేదే యని యొకరితో నొకరు చెప్పుకొనుచు రాజుగారి దగ్గఱకుపోయి వారి అయిదవ కొమారుడు చెప్పిన మాటలను విన్నవించిరి. ఆయన వారిమాటలు విని మనకడపటి కుమారుని కోరిక అందరానిపండ్లు కల్లులుచాపు నట్లున్నదని యోజించి నురితీయువారలం బిలువనంపి వారితో మాయయిదవ కొమారుని ఈ క్షణమందే విజనస్థానంబునకు పిలుచుకొనిపోయి కాళికాశక్తికి బలియిండని యాజ్ఞాపించెను. ఆ సమాచారమును వాని తల్లివిని మిక్కిలి దుఃఖము గలదియై వరాలసంచి యెత్తుకొని తన యయిదవ కొమారుడుండు చోటికిబోయి ఓ నాప్రియ పుత్రుడా? నీవు మీ తండ్రిగారి చిత్తమునకు విరోధముగా ఏమి చేసితివో అదినాకు తెలిసినది కాదు. మీతండ్రిగారు నిన్ను జంపుటకు ఉత్తరవుచేసి యున్నారు అని మిక్కిలి దుఃఖముతో పుత్రునిం కౌగలించి ఏడ్చుచు కొంతసేపటికి ధైర్యము తెచ్చుకొని వానితో నిప్పుడు నేనొక సదుపాయము చెప్పెద వినుము. ఈ వరాల సంచిని తీసుకొని యెవరికిఁ దెలియక విజనమైన యరణ్యమునకు పోయి ప్రాణములు కాపాడుకొనుమని చెప్పి యాసంచి నిచ్చి యంపెను. వాడును ఆ వరాలమూటను బుచ్చుకొని యరణ్యమునకు నెవరికి తెలియకుండునట్లు ఒక గుఱ్ఱముపై నెక్కిజాడం దెలియకపోయెను. మరునాడుదయానహింసకులు వచ్చివానింటచూచి వానింగానక రాజుగారి దగ్గరకుబోయి మీకుమారుడు ఇంటలేడని మనవిచేసిరి. అదివిని రాజు చింతాక్రాంతుడై యూరకుండెను. రాజుగారి కొమారుడు నిల్లు విడిచి బయలుదేరి యనేకములయిన ఏళ్లను కొండలను దాటి పోవుచు నట అర్కమహాముని యాశ్రమంబుగాంచి యందుజేరి యా

మునీశ్వరునకు నమస్కరించెను. అతఁడారాజపుత్రునిందీవించి దగ్గఱఁగూర్చుండ నియమించి తన హస్తముచే నతని దేహమును దడివి, రాజాత్మజా? నీవర్తమానంబంతయు నెఱిఁగింపుమనిన నతఁడు తన దేశమును తల్లి దండ్రులెడ తాఁజెందిన కష్టంబులను సర్వము నెఱిగించెను. ఆమునీంద్రుఁడు సంతసించి పుణ్యాత్మా నీవుకొన్ని దినములవరకు నాయాశ్రమములోనుండి మార్గాయాసముదీర్చి పొమ్మని పలికిన నతఁడు మంచిదని యా మహాత్మునకు శుశ్రూషలు గావించుచు ఫలకాష్ఠ కుసుమములను దెచ్చిచ్చుచు నుండ నొక్క దినంబుననారాజసూనుం డాయరణ్య మార్గంబున కొంతదూరముగా కుసుమంబులు గోయుటకుం జని చని మార్గంబుదప్పి నాటి సాయంత్రమువఱకు మున్ను తానరుదెంచినబాటనుంగానక చింతిల్లియొక్కవృక్షంబుకడశయనించి యుండెను. అప్పుడు శుక్లపక్షము కాబట్టి నాటిరాత్రి నాచెట్టుకు సమీపమున నుండు దేవాలయమునకు దేవకన్యలువచ్చి స్వామిదర్శనము చేసికొని కొంతసేపునృత్యగీత వాద్యములచేత తమవాడుక ప్రకారము కాలహరణము చేయుచుండిరి. అప్పుడువారివాద్యముల శబ్దముచేత నీ రాజకుమారుఁడు నిద్ర మేలుకొనియాశబ్దము వినవచ్చుచున్న ప్రక్కకుబోయిదేవాలయమునుచూచి యచ్చట నాడుచు పాడుచున్న దేవకన్యకలను పొదల చాటునుండి చూచి వీరు దేవతాస్త్రీలని తెలిసికొని ఱెప్పవేయక వారిసౌందర్యమును చూచుచుండెను. ఇంతలో ఆ కన్యకలు ఆదేవాలయము దగ్గఱనుండు కొలంకునందు స్నానము చేయుటకై వారివారి వలువలను విప్పి యాకొలనిగట్టున నుంచి యందరు ఆకొలంకునదిగి స్నానము చేయుచుండిరి. ఆ సమయమునుచూచి రాజకుమారుఁడు ఆ కొలనిగట్టున పెట్టియుండిన వలువలకడకు మెల్లపోయి వారికి తెలియకుండ అందు ఒక చీరనెత్తుకొని పరుగెత్తి వచ్చుచుండ ఆకన్యకలు వానితో పలుతెఱఁగుల ఎగతాళిమాటలాడుచు వెంబండించి పరుగెత్తి వచ్చుచుండిరి. అతఁడు ఉపాయము తెలియనివాఁడై నందున తనవెనుక వారెంతదూరము వచ్చుచున్నారోయని తిరిగిచూచెను. అంతట వారు వానిని శిలయై పోవునట్లు శపించి యాచీరనెత్తుకొని పోయిరి.

ఆ మధ్యాహ్నమునకు కుసుమంబులకుఁ బోయిన రాచకొమారుఁడు రాకుండుటను అర్కమహాముని జూచి అయ్యో! పాపము మనము ఆరాచ చిన్నవానితో అరణ్యమున రాత్రిపూట నుండవలదనిచెప్పకపోతిమేయని యా రాత్రియంతయు దుఃఖించి తెల్లవాఱిలేచి యరణ్యంబునకేగి యచ్చట ఱాయియైపడియున్న రాచకుమారునిజూచి ఉదకము నభిమంత్రించి యా ఱాతిపై

జల్లగా రాచకుమారుడు నిద్రపోయి లేచువానివలె దిగ్గునలేచి కూర్చుండి ఎదుటనున్న అర్క మహామునింగాంచి వారి సంధ్యా కాలంబువరకు కుసుమంబులు చేర్పనందులకు ఏమనునోయని తలవంచుకొని యూరకుండెను. ఆముని పుంగవుండు వానిశిలను పైకెత్తి యేల ఇట్లు చింతాక్రాంతుడవై యున్నావు దానికి కారణమును నాతో దాచకుండ జెప్పుము నీకేమియు భయములేదు అని బుజ్జగించి యడిగెను అంతటవాడు కొంచెము ధైర్యము తెచ్చుకొని తానడవి ప్రవేశించినది మొదలు జరిగిన వృత్తాంత మంతయు దాచక చెప్పెను. అంతట నామునిపుంగవుండతని యింటికిపిలుచుకొని వాని యలసట తీరునట్లు కొంచముసేపు పరుండి నిద్రపొమ్మనిచెప్పెను. వాడు నిదురబోయి యలసట దీర్చుకొని లేచి యామునినిం గాంచి ఆదేవకన్యకలు తనకు స్వాధీనురాండ్రగు నట్లుపాయంబు దెల్పుమని వేడెను. అంత నామహాత్ముం డతనిదుఃఖంబుమాన్పి రాజాత్మజా! నీవుమేటి విలుకాడవు ధైర్యసాహసాదులకు డెబ్బదిరెండు గుణంబులుగల ధీరుడవు. స్త్రీలమరుభూమికాసించి కామాతురుండవైతి వక్కటా ఆమట్టుకొంపనిమిత్తము ఇంద్రచంద్రాదులు గాంచిన యపఖ్యాతియు మానభంగమును వినలేదా! అట్టిమూత్రద్వారంబునకు నీవేల యాసించెదవు. నీకొక్క మహామంత్రంబు నుపదేశించెద నీకేమియును గొఱత సంభవింపదు మిగుల బూజ్యుండ వగుదువని బలికిన నారాజపుత్రుండు మహాత్మా! నాచిత్తమునకు స్వస్థతగల్గునటుల నాకు దత్వోపదేశంబును దివ్యాస్త్రమంత్రమును ఉపదేశింపుము. నన్నుబరమపావనునింగ జేయుము అని ప్రార్థించిన నామునీంద్రుం డారాజసూనునకిట్లనియె.



అర్క మహాముని అగ్నిదత్త మహారాజునకు సాంఖ్యము బోధించుట.

రాజాత్మజా! ఎప్పుడు ప్రత్యగాత్మ స్వరూపమునందు తనకు తానే ఆనందించి మనోగతములైన సమస్త కామ్యములను విడిచి పెట్టునో, అప్పు

డతండు స్థితప్రజ్ఞుడని చెప్పబడును. బ్రహ్మప్రాప్తికొరకు ఇంద్రియనిగ్రహము చేయుటకు ప్రయత్నము చేయు వివేకులయొక్క మనస్సునుగూడ నీ యింద్రియములు బలాత్కారముగా చలింపఁజేయుచున్నవి, అట్టి ఇంద్రియములను నిగ్రహించి, యోగియై, భగవత్స్వరూపమందు ఆసక్తిగలవాడై యుండవలయును. ఎవరికి నింద్రియములు స్వాధీనములై యుండునో అట్టి పురుషులు స్థితప్రజ్ఞగలవారు. విషయములను దలచువానికి విషయాసక్తి గలుగును. ఆయాసక్తిచేత భోగేచ్ఛ పుట్టుచున్నది ఆ భోగేచ్ఛకు విరోధము గలుగునపుడు క్రోధము జనించును. క్రోధమువలన అవివేకమును, అందువలన విస్మృతియు గలుగును. తదనంతరము బుద్ధినశించును. తదనంతరము తాను చెడిపోవును. ఎవ్వరు ప్రియాప్రియములులేక ఇంద్రియములకు లోబబడక తన మనస్సును తానే స్వాధీనము చేసికొనుచున్నాడో అట్టివాడు శరీర పోషకమాత్రేంద్రియ విషయములను అనుభవించువాడై నప్పటికిని వాడు నిర్మలత్వమును బొందుచున్నాడు ఇట్టి నిర్మల చిత్తముగల పురుషుని ఏదుఃఖములు నంటవు అట్టి స్వచ్ఛమైన మనస్సుగల పురుషునకు అతిత్వరలో బుద్ధి స్థిరమగుచున్నది. ఇంద్రియ నిగ్రహము లేనివానికి ఆత్మవిషయమై నిత్యత్వము గోచరించవు. ఆత్మస్వరూపమగు భావనయును బొందవు. బ్రహ్మభావన జేయనివానికి చిత్తోపరతియు గలుగవు. గాన వానికి బ్రహ్మానంద సుఖము నెచట గలుగును? సమస్త కామములను వదలి ఆత్మాభిమానములేక అహంకార మమకారములను వదలి నెవడునైజమున సంచరించునో అట్టి పురుషుడు మోక్షమును బొందును. ఈ బ్రహ్మతత్వము తెలిసినవారు మఱల మోసపోరు. ఇట్టి బ్రహ్మతత్వమును నిజావలంబమై బొందు వానికి మోక్షసామ్రాజ్యస్థితి గలుగును. యని సూత్రములను సాంగోపాంగముగ కైవల్యానుభవమగునట్లు సాంఖ్యయోగంబును సాంగముగ నెఱింగించి పంచాక్షరీమంత్రం బుపదేశించగ ఆరాజసూనుడు గ్రహించి యా మునీంద్రునకు శుశ్రూషలు చేయుచుండెనని చెప్పిన నా పవనజుండు శ్రీరామునకు నమస్కరించి మహాత్మా! సాంఖ్య సూత్రంబును నేను చక్కగా దెలిసికొంటిని ఆ యుగ్నిదత్త మహారాజు వృత్తాంతంబెటులయ్యె సాంగముగావినిపించి నన్నుం గృతార్థునిగా జేయుడని ప్రార్థించిన నా భగవంతుం డిట్లనియె.

ఓ అంజనేయా! ఇట్లు ఆ యగ్నిదత్త మహారాజున కామునీంద్రుండు బోధించి కనికరము గలవారై మరియు వానితో నిట్లనియె. నీవు నేటిరా

త్రికి ఆయరణ్యముననుండు దేవాలయము దగ్గఱకుపోయి యెవ్వరి కగుపడక యీదేవకన్యకలు స్నానముచేయు సమయమును కాచి నిన్న తీసుకొనివచ్చిన చీరనెత్తుకొని వారెంత ఎగతాళి చేసినను ఎంతపిలచినను వెనుకకు తిరిగి చూడక యాశ్రమంబునకు రమ్ము;నీకొర్కె నెరవేరగలదనిచెప్పెను. ఆరాజ కుమారుడును ధైర్యముకలవాడు కాబట్టి యరణ్యముననుండు దేవాలయము దగ్గఱకుపోయి చీరనెత్తుకొనివచ్చుటకు సమయము వేచియుండెను. దేవకన్య కలు స్నానముచేయుటకై చీరలువిప్పి గట్టుననుంచి నీటిలోదిగిరి. అంతట రాచకొమారుడు తొలిదినము తానపహరించిన చీర నెత్తుకొని పరుగె త్తెను. అదిచూచి యీ దేవకన్యలు మునుపటివలెనే వానిని ఎగతాళిచే యుచు చేతులుతట్టుచు వెంబడించి తరుముకొని రాసాగిరి. వా రెంత అఱచి నను రాజకుమారుడు జంకక వెనుచూడక యాశ్రమంబునకు బోవుమార్గం బును దప్పించి వేరొక ఛాయనుంబట్టి పరుగిడి యట నొకపూరి నింటి యం దొక్క ముసలిదానింగాంచి తన సవిస్తారం బెల్లయుందెల్పి ఆ చీరను ఆ ముసలి దాని చేతికిచ్చెను వెంటనే ఆ ముసలిది మాయలమారి కాబట్టి యా చీరను కన్నుల కగుపడకుండునట్లుచేసి వానిని తన మంత్రప్రభావముచే రెండేండ్ల బాలునిగావించి ఉయ్యాలలో పరుండబెట్టి యూచుచుండెను. ఇంతలో దేవ కన్యకలు పరుగిడి ముసలిదానియింటికి వచ్చిరి. ఆ ముసలిదియు వారిని చూచి లేచిపోయి పిలుచుకొనివచ్చి యాసనములువేసి కూర్చుండబెట్టి యర్ఘ్యపాద్యాదులిచ్చి నేనుచేసుకొనిన పుణ్యముచేత మీరు మాయింటికి వచ్చితిరి. మీరు అడుగు పెట్టుటచేత మాయిల్లు పరిశుద్ధమాయెను అని వారిని స్తోత్రముచేసి మీరేపనికై యిచ్చటికి వచ్చితిరని యడిగెను. వారు మా చిన్నదాని చీరనెత్తుకొని పరుగెత్తివచ్చి యొక చిన్నవాడు మీయిల్లు ప్రవేశించెనే వాడెక్కడున్నాడని యడిగెను. అందుకు ఆ ముసలిది ఓకన్యా రత్నములారా? మీచిన్నదానిచీరనుఎత్తుకొనివచ్చినవాడుఆచిన్నదానినిపెం డ్లిచేసుకొనవలయునను నపేక్షగలవాడై యుండును. వానికి మీచిన్నదాని నిచ్చి వివాహముచేసితిరేని మీచీరమీకులభించును అని యనేకవిధములైన శృంగారవచనములను జెప్పి చిన్నదానిని వానికిచ్చి వివాహముచేయునట్లు గట్టి మాటతీసికొని శిశువుగానున్న రాజకుమారుని మంత్రమహిమచేత యౌవన వంతునిగా జేసెను. అంత నా దేవకన్యలు ఆ చిన్నదానిని మంచి సుముహూ ర్తమున నతనికి పెండ్లిచేయ నిశ్చయించి యీచిన్నదాని యందలి ప్రేమచేత నందఱు నచటనే యుండిరి.

ఇట్లుండ నొకనాడా ముసలిది రాచకొమారుని పిలిచి వానితో నీకుటుంబము పెద్దది యైనందున ఇక నీవు ఇక్కడనుండుట యుక్తముగాదు నీభార్యను మొదలైన వారిని వెంటబెట్టుకొని బిలుచుకొనిపోయి యెక్కడ నైన కాపురము చేయుము. ఎన్నాళ్ళకైనను ఎంత నమ్మకముగ నున్నను చీరను మాత్రము నీ భార్య మొదలగు వారికి చూపకుము. చూపితివేని నీవు చెడిపోదువు అని చెప్పెను. రాచకుమారుడును ఆ ముసలిది చెప్పిన మాటలను విని మంచిదని యొప్పుకొని తనభార్య మొదలగు వారిని పిలిచికొని బహులు దేరి యనేకములైన పర్వతములను వనములను దాటి పోవుచుండగా జనరంజనమను పేరుగల పట్టణ మొకటి యగుపడెను. ఆపట్టణ సమీపమునకు పోయియచ్చట నుండు పెద్దతటాకమున అందఱుదిగి కాళ్లు చేతులు కడుగుకొనినీరుద్రాగి దప్పిని ఆ యాసమును తీర్చుకొని యా గుంటగట్టున నుండు మఱ్ఱిచెట్ల క్రింద కూర్చుండి సరస సల్లాపము లాడుచుండిరి. ఆ సమయమున ఆ పట్టణపురాజు యొక్క మంత్రి యా గుంటగట్టునకు విహారార్థముగావచ్చి యచ్చోట గూర్చుండి యుండెడు రాచకొమారుని దేవకన్యకలను చూచి ఈకన్యారత్నంబులు మన్మథుని భార్యయగు రతీదేవియు సమానురాలైనదిగాదు, యనియెంచి మోహించి మఱికొంత సేపటికి తెలివిందెచ్చుకొని ఇటువంటిస్త్రీలను వివాహము చేసుకొనినవాని జన్మమే సఫలమైనదియని యోచించి పట్టణమునకుబోయి రాజునుచూచి, ఓ రాజకులోత్తమా ? నేడు నేను రతీదేవి కంటె నధిక సౌందర్యము గల స్త్రీలను చూచితి నని చెప్పెను. అది విని రాజు నీవు చెప్పునపుడె నా మనస్సు కలతజెందుచున్నదే. వారింజూచిన నా మనంబు నెట్లుండునో! అంతసౌందర్యము గలవారు మన నగరమునకే యుపాయముచే వత్తురు అనిమంత్రినడిగెను. మంత్రి ఓమహాప్రభో? మీరు మన్మథునివంటి సౌందర్యము గలవారు విక్రమార్కునివంటి సాహసంబుగలవారుమీకు నసాధ్యమైన కార్యము లోకంబుననుండుటరుదు. మీరుఉత్తరవు దయచేసితిరేని తక్షణముననే వారిని పిలుచుకొని వచ్చెదనని చెప్పెను.

రాజు ఆ మాటకుసంతసించి వారినిం బిలుచుకొనిరమ్మని సెలవిచ్చెను మంత్రిరాజుగారి యుత్తరువు చొప్పున ఆ పట్టణమునకు వెలుపట నుండు గుంటగట్టునకువచ్చి యచ్చట కూర్చుండి యున్నవారి నద్దకుపోయి యచ్చట నుండు రాచకుమారునింజూచి ఓ మహాప్రభో? మీరెవ్వరు మీ దేయూరు, ఎందుండి యెందుబోవుదు నిందుల కేతెంచినారని యడిగెను. ఆరాచకుమారుడు అయ్యా! నేనొక రాజకుమారుడను దైవాధీనముగ నిట్లు దేశ

సంచారము చేయునట్లు నాకు తటస్థించెను. ఏ రాజైన నెల యొకటింటికి పదునేను వేలరూపాయల జీతం బిచ్చెదరేని నేను వారియొద్ద కొలువు చేసెదనెను. అట్టివార లెవరైన నుండిన చెప్పుమనియడిగెను. అందులకు ఆమంత్రి ఈపట్టణపురాజు పదునేనువేల రూపాయలు కాదు, ఇరువదివేలరూపాయల నైననిచ్చి కొలువుగాండ్రను పెట్టుకొనదగినవారు. ఈతని మించువారు ఈ ప్రాంత్యంబులో మఱియెవ్వరునులేరు అని చెప్పెను. రాజకుమారుడు సంతోషించి యామంత్రితోగూడ పట్టణంబునకుబోయి రాజుగారి దర్శనము చేసుకొని రాజుగారి యుత్తరవు చొప్పున నొక విడిది యింటదిగెను. అది మొదలుకొని ప్రతిదినము రాజుదగ్గిఱకుపోవుచువచ్చుచుండెను. ఇట్లుకొన్నాళ్లు గడచిన వెనుక మంత్రి నగరినుండి రాజకుమారుని యింటికి నేదేని నొక సాకును పెట్టి పలుమారు బంట్రోతులను పంపుట కారంభించెను. వచ్చినపడంతయు నాబంట్రోతులు తాము వచ్చిన పనిని చూచుకొనిపోక స్త్రీ "మీరింత అందకత్తెలుగానుండి జీతము తెచ్చుకొని జీవించువానియొ యుండవలెను, మా రాజుగారి నగరికివచ్చి వారిని వివాహము చేసికొ , రేని సకలసౌఖ్యముల ననుభవించుచుండవచ్చు" నని చెప్పసాగిరి. ఆకన్యకలు వారిమాటలువిని బంట్రోతులారా! ఈమాటలను మీరు సొంతముగా చెప్పుచున్నారా? లేక మీ రాజుగారుత్తరవుంబొంది చెప్పుచున్నారా యని యడిగిరి, కపటములేనిబంట్రోతులు పీరుబప్పకొనునట్లున్నదని తలంచుకొని ఓ యమ్మలారా మారాజుగారి యుత్తరవులేక నేమింతటిమాటలను చెప్పుదుమాయనిరి. అంతనాకన్యలు సరే మీరు పొండని వారిని పంపిరి. అంత వారు తాము వచ్చినపని ననుకూల మాయెనని యెంచుకొని నగరికింబోయి రాజుతోను మంత్రితోను స్త్రీలకును తమకు జరిగిన సంభాషణ మంతయు నెఱింగించిరి. ఆ సమాచారమంతయు విని మంత్రి ఆరాచకుమారుని చంపిననే గాని వారు మనకు స్వాధీనులాండ్రగుదురని నాకుతోచలేదు అనిచెప్పెను. అందుల కెట్టి యుపాయము పన్నవలయునో యెఱింగింపుమనిరాజు మంత్రినడిగెను. మంత్రి రాజుతో నేడు మీరు తలనొప్పియని సభకురాక యంతఃపురంబున నుండుడు. నేను వాని నుపాయముగా చచ్చునట్లు చేసెదనని చెప్పి రాజును అంతఃపురమునకు పంపివేసి కొలువుగాడైన రాజకుమారునిం బిలువనంపి మన రాజుగారికి నేడు తలనొప్పి గలిగియున్నది. ఆనొప్పి పోవుటకు ఆదిశేషుని కోరలయందుండు విషము కావలెనని వైద్యులు చెప్పుచున్నారు. దానిని తేదగిన శక్తిగలవాడవు నీవుగాని

మాకు ఎవ్వడును ఇక్కడ లేడని చెప్పెను. రాజకుమారుడును సరే యని యొప్పుకొని ఇంటికివచ్చి దిగులుపడి యేమియు తోచక చింతాక్రాంతుడై యుండెను. వానిం జూచి యా కన్యకలు మీరీవేళ చింతాక్రాంతులుగా నుండుటకు కారణమేమని యడిగిరి. వాడును దాచక వారితో నగరిలో జరిగిన సమాచారము నంతయు చెప్పెను. అదివిని ఇందులకా మీరు చింతాక్రాంతులై యున్నారు మీకేమియు భయములేదు మేము తెప్పించి యిచ్చెదము లేచి స్నానముచేసి భోజనము చేయుడు అని చెప్పిరి. రాచకుమారుడు వారిమాటలకు సంతసించి స్నానముచేసి భుజించి సౌఖ్యముగా నుండెను. ఆ కన్యలలో నొకతె పాతాళమునకుపోయి యాదిశేషుని ప్రార్థించి యతని కోరలయందలి విషము నొక భరణియందు తీసికొనివచ్చి యిచ్చెను, రాజకుమారుడును దానిని తీసికొని నగరికిపోయి మంత్రిచేత నిచ్చెను. మంత్రియు దానిని భటులచేతి కిచ్చి ఆరణ్యంబున పారవైచి రండని యుత్తరవు చేసెను. భటులును మంత్రి యుత్తరువు ప్రకారము ఆ భరణిని నరణ్యంబున పారవైచివచ్చిరి. మంత్రియు రాజుగారి దగ్గరకుపోయి మనము చేసిన యుపాయము చేత వాడు చచ్చినట్లులేదు. పామువిషము తెచ్చెను గానిచావలేదు. అని కొంతసేపుయోచించి మంత్రిరాజుతో అయ్యా? మీరు నేడు కడుపునొప్పియని సభకు రాక యంతఃపురంబున నుండుడని చెప్పెను. రాజును మంత్రిమాటకు సరేయని యొప్పుకొని యంతఃపురంబునకు బోయెను. అంత మంత్రి రాజకుమారుని బిలువనంపి నేడు మహారాజుగారికి కడుపునొప్పి యధికరించి యుండుట వలన మిక్కిలి బాధపడుచున్నారు. మొసలి కన్నుగ్రుడ్లు తెచ్చిన ఆనొప్పి సౌఖ్యమగునని వైద్యులు చెప్పుచున్నారు. వానిం దేదగినవాడు నీవుతప్ప మరి యెవడునులేడు. కాబట్టి ఏలాగునన్నైన ప్రయాసపడి వానిం దీసుక రావలయునని చెప్పెను. రాజకుమారుడును సరేయని యొప్పుకొని ఇంటికివచ్చి తనభార్యలతో చెప్పెను. వారు సరేకానిమ్ము అని చెప్పిరి, వాడును స్నానముచేసి భోజనముచేసి పరుండి నిదురపోయి లేచునప్పటికి మొసలి కన్నులను తెచ్చి పెట్టియుండిరి. వాడు దానిదీసుకొని నగరికిపోయి మంత్రిచేతనిచ్చెను. మంత్రియు ఆశ్చర్యపడి వీనిని మనము జయింపజాలము ఎంతఅసాధ్యములైన కార్యములు చెప్పినను అతిశీఘ్రముముగ చేసుకొని వచ్చుచున్నాడేయని యెంచుకొని రాజుగారి దగ్గరకుపోయి యారాజకొమారుని సామర్థ్యము చెప్పనలవియైనదికాదు. వాడెంతటి కార్యములను చెప్పినను లక్ష్యముచేయక అతిశీఘ్రముగ చేసుకొని వచ్చుచున్నాడు. అని చెప్పి

యామొసలి కన్నులను రాజుగారికిచూపి పారవేసెను. అంతట రాజు నిక
నేమిసేయుదము మనము కోరిన కోరిక నెఱవేరక పోయెనే యని మంత్రిని
అడుగగా మంత్రి ఓ మహాప్రభో మనకోరిక ఫలితము కాకపోయెనేయని
చింతింపవలదు ఈ తడవ నేను చేయబోవు ఉపాయముచేత నారాజకు
మారుడు చావకబోడు. ఆ యుపాయము ఎటువంటిదని యడిగెద వేమో
దానిని చెప్పెదను వినుము. మనపితృదేవతలకు జాబులువ్రాసి వానిచేతనిచ్చి
యమలోకమునకు బంపి బదులు త్తరములు తీసికొని రమ్మని వానిని వేడు
కొందము వాడుమనమాటను అతిక్రమింపలేక యమలోకమునకు పోవును.
అచ్చటనుండి మఱల వాడువచ్చుట దుర్లభము కాబట్టి మనకోరిక ఈ యుపా
యముచేత నెఱవేరును అనివానిని బిలువనంపి వానితో మాపితృదేవతలకు
జాబులు వ్రాసియిచ్చెదమువానిందీసికొని యమలోకమునకుబోయి వారికిచ్చి
వారిదగ్గరనుండి బదులు త్తరములను తీసికొని రావలయునని ప్రార్థింప
వాడును వారి మాటలకు మాఱుమాటాడలేక ఆజాబులం దీసికొని యి
కివచ్చి తనభార్యలతో రాజుగారును మంత్రియుచెప్పిన వృత్తాంతమంతం
చెప్పెను. వారు ఆసమాచారములనువిని ఈరాజుగారికిని మంత్రికిని అవసా
నకాలము సమీపించినది కాబట్టి యిటువంటిబుద్దులు పుట్టుచున్నవి అనితమ
మగనింబిలిచి అయ్యా తాముురాజుగారి సముఖమునకుంబోయి రేపటిదిన
ము సాయంకాలమునకు లోపల ఈపట్టణమునకు బయట పెద్దగుంటనొక
దానిని త్రవ్వించి దానినిండ కట్టెలు వేయించి నిప్పుపెట్టించి ప్రజ్వలింపచేయ
వలసినదియని చెప్పిరందు ఆవల నందులకుదగిన యుపాయమును చెప్పెదము
అనిరి. ఆరాచకొమారుడు వారుచెప్పిన ప్రకారమే రాజుగారిసముఖమునకు
పోయిచెప్పెను. రాజును అట్లులన కానిమ్మని యొప్పుకొనెను. రాజకుమారు
డునురాజుగారు సమ్మతించినవైనమును ఇంటికివచ్చి తనభార్యలతో చెప్పెను
ఆరాజుకొమారుని భార్యలురాజు మొదలైనవారు వ్రాసియిచ్చిన జాబులకు
ప్రత్యుత్తరములను వారివారి పితృదేవతలు వ్రాసినట్లు వ్రాసియుంచియగ్నిదే
వుని ప్రార్థించిరి అగ్నియు వారియందలి ప్రేమచేత వారియెదుటవచ్చినిలిచెను.

వారు ఆయనను అనేకవిధంబులస్తోత్రముచేసి స్వామీ! రేపటిదినము
సాయంకాలము మాపెనిమిటి యీపట్టణమునకు బయట ఒకగుంటయందు
నిప్పులో దుముకును. ఆయనకు నెట్టి ఆపదయు లేకుండ మీరు కాపాడవల
యునని ప్రార్థించిరి. అగ్నిదేవుడు వారిప్రార్థనను అంగీకరించి మఱుగయ్యెను
ఆకన్యకలు తాము వ్రాసిన జాబులనుతనమగనిచేతికిచ్చి యాతనితో రాజుగా

ద్రవ్వించు అగ్నిగుండమున దుమికి కొంత సేపుండి బయటరండు మీకెట్టి భయమును లేదనిదిటవుగచెప్పిరి రాజుగారును రాజకుమారునితో చెప్పిన ప్రకారము పెద్దయగ్ని గుండమును త్రవ్వించి యందు అగ్నిని ప్రజ్వలింపిచేసి మంత్రియు తానును ఇంక ఆపట్టణమునసుండు వారందఱును ఆగుండముదగ్గఱకు వేడుకచూచుటకై వచ్చినిలిచి యుండిరి రాజకుమారుడును ఆయగ్ని గుండము దగ్గఱకువచ్చి ప్రదక్షిణముచేసి యగ్నిసూక్తములజపించి రాజు మొదలైనవారు చూచుచుండగానే అందుసదుమికి కొంతసేపుతాళి మఱల ఆ యగ్నిగుండమునుండి బయటికివచ్చిరాజు మొదలైనవారికిజాబులనిచ్చెను వారందఱు ఆ జాబులను చదువుకొని ఇతడు మనుష్యమాత్రుడు కాడు దైవమేమనభక్తికిమెచ్చిమనకు మోక్షమిచ్చి కాపాడుటకై ఈరీతిని రాజకుమారరూపమునవచ్చియున్నాడని తలంచి యందఱు వానికినమస్కరించి ఓస్వామీ? మీరుమాయందఱిపై దయయుంచి మాపితరులదగ్గఱకు పిలుచుకొనిపోయెదరా? యని అడిగిరి. అందులకు రాజకుమారుడు మీరుకోరునట్టి పనికినేను అభ్యంతరము చెప్పునంతటివాడనా! అలాగే పోదమురండు వారునుమిమ్ము జూడగోరుచున్నారు అనియందఱికన్న ముందుగతాను ఆయగ్ని గుండమున ధుమికెను. వారందఱు వానివెంటనే ఆగుండమునధుమికికాలి మోడిదయ్యెరి దేవకన్యకల మగడైన రాజకుమారుడు మాత్రము బైటవచ్చెను. వాడు బయటికి వచ్చునప్పటికి వానిభార్యలు అచ్చటికివచ్చియుండి వానినిబిలుచుకొని యింటికిబోయి పన్నీట జలకమాడించి పీతాంబరము కట్టుకొనుటకిచ్చి పంచభక్ష్యపరమాన్నములతోడ భోజనముపెట్టి భోజనము చేయనిచ్చి యాకుమడుపులందించిరి వాడును తనబడలికతీరునట్లు హంసతూలికా తల్పమునపరుండి నిద్రపోయెను. మరుసటిదినము తెల్లవారినిద్రలేచి యాపట్టణమునకు పట్టాభిషేకము చేసికొని భార్యలతోగూడియుండెను. ఇట్లుండ కొంతకాలమునకువెనుక వానితల్లి దండ్రులు వాడు బయటరాగానే రాజ్యమును బోగొట్టుకొని దేశసంచారముచేయుచు సకలవిధములైనకష్టముల ననుభవించుచు నీపట్టణమునకు వచ్చిచేరి వీథినడుమ పోవుచుండిరి. రాజకుమారుడును మేడమీద నుండి వారినిచూచి పిలువనంపికుశలప్రశ్నముచేసి, పిమ్మట వారితోనేను మీకుమారుడనని చెప్పి వారినితనదగ్గఱ బెట్టుకొని పోషించుచు తనతండ్రి రాజ్యమును స్వాధీనము చేసికొని దేవకన్యకలతోకూడ చిరకాలము సౌఖ్యమననుభవించుచుండెను ఇట్లు గొన్నిసంవత్సరములు ధర్మముతప్పక రాజ్యపాలనంబుచేసి పిమ్మట దేహమును చాలించి పుణ్యలోకము జెందెనని చెప్పిన నాయంజనిసూనుండాశ్చర్యపడి యాభగవంతునిజూచి మహానుభావా? సకల పాపక్షయమగునీదివ్యకథను చక్కగావింటిని సాంఖ్యసూత్రంబు దెలిసికొంటిని నిద్రనేత్రములయందు వ్యాపించియున్నది. నిద్రింతమురమ్మనిన నా దేవుండుసమ్మతించి యిరువురు శయనించి సుఖనిద్రం జెందిరి.

ప్రథమరాత్రికథ సమాప్తము.

ఓమ్.

# ద్వితీయ కథారత్నము.

రెండవదినమురాత్రి శ్రీరాములు సీతాదేవినింగూడి తాంబూలంబు సేయుచు, దివ్యసుగంధాదుల నాఘ్రాణించుచు, నగరుగంధముల నలది కొనుచు సరససల్లాపములాడుసమయంబున మారుతాత్మజుండు భగవంతునికి పాదసేవచేయుచు స్వామీ యపవర్గ మార్గమైన వేదాంతసారములోని భాగంబు మరియొకటి దెలుసుకొను నటుల నొకవిచిత్రమైన చరిత్రమునుజెప్పి నన్నుం గృతార్థునిగా జేయుమని ప్రార్థించిన దశరథనందనుండు మందస్మితముఖుండై మారుతాత్మజా శ్రద్ధాసక్తుండవై ధర్మగుప్త మహారాజు చరిత్రమును వినుమని యిట్లనియె.

పూర్వకాలమునందు కౌశాంబియను నగరంబునం దొకరాజు చిరకాలము రాజ్యముచేసి వార్ధకంబున నొకపుత్రుని నీశ్వరకటాక్షంబునం బొంది మిక్కిలి ముసలివాడై యుండుసమయంబున, ఒకనాడు తాను దొరతనమునకు వచ్చినది మొదలుకొని యింతవరకును తనయెడల భక్తిగలిగి క్రమముతప్పక నడుచుకొనుచున్న సునీతియను మంత్రిని రప్పించె. అతడు తానుపండుకొని యున్నపడకదగ్గరకు రాగానే ఓ మిత్రుడా! నాకుభగవంతుని సన్నిధానము పొందునట్టి కాలము సమీపించి యున్నట్లు తోచుచున్నది. నేనుగతించిన పిమ్మట నాకొమారుండైన ధర్మగుప్తుని అక్కఱతో కాపాడు వారెవరునులేరు. మంచిచెబ్బరలు తెలిసి సన్మార్గమునవలంబించి ప్రవర్తించునంతటి ప్రాయము వానికిరాలేదు. కనుక వానికివిద్యాబుద్ధులునేర్పి యేమరకపోషించునట్లునీవు వాగ్దానముచేసితివేని నేనుబ్రతికియున్న రెండుగడియలును నెమ్మదిగానుండి ప్రాణము విడిచెదను. లేనియెడల ఈవిచారము నన్ను నెన్నటికి వదలదు. ఇందులకేమనెదవని యడిగెను మంత్రి ఓయేలినవారా? మీయిష్టముచొప్పున నా ప్రాణములీబొంది యున్నవఱకు నీకొమారుని చేజాఱక కాపాడెదను. నన్ను నమ్ముమని ప్రత్యుత్తరముచెప్పెను. అందులకురాజు సంతోషించినవాడై, నా చెలికాడా! ఇక నా దేహమును విడుచుటకు ఎట్టి అడ్డియు లేదు. నేను గతించిన పిమ్మట నా కొమారునిచక్కగా పోషించి వానికి తగిన యీడు రాగానే సర్వస్వమును వానికికనబఱచి ఒప్పింపుము. అయినను పెద్ద కూటము లోనికడపటి గదిని మాత్రము తెఱచి చూపవలదు. అందులో స్వర్ణనగరపు రాచకొమార్తెయొక్క పటము ఉన్నది. ఆ పటమును వాడు

చూచిన యెడల దాని పై భ్రాంతిగొని తదేకధ్యానంబున నుండును. ఆరాచ కొమార్తెను వెదకిపట్టి తెచ్చుట అసాధ్యము, గనుక ఆ సంగతి యేదియును నీవు వానికి తెలియజేయవలదు అనెను. అంతట మంత్రి చిత్తము అట్లే చేసెదను అని ఒప్పుకొనగా రాజు సంతోషించి మఱికొంతసేపటికి చనిపోయెను.

పిమ్మట మంత్రి అతనికి ఉత్తరక్రియలు నడిపి అతడు చెప్పిన పద్ధతులన్నియు నతని కొమారునికి తెలియచేసి, మీతండ్రి నన్ను అడుగుకొన్న విషయములకన్నిటికి అదేమేరకు తప్పక నడుచుకొనెదనని చెప్ప యొప్పుకొని యున్నాను. కాబట్టి ఇదివరకు రాజ్యతంత్రమును ఎట్లునడుపుచు వచ్చితినో అట్లే ఇప్పుడును నడుపుటకు సిద్ధపడి యున్నాను. నీ నగళ్ళలోగల ఆస్తియంతయు నీకు గనబఱచెదను రమ్మని చెప్పి పిలుచుకొనిపోయి రాజు నగళ్ళలోగల అన్ని ప్రదేశములను ఒకగదియైనతప్పక తెఱచి సకలపదార్థములను చూపెనుగాని రాజుచూపవలదన్న చిన్నగది నొకటి మాత్రము తెఱచిచూపలేదు. అంతట రాచకొమారుడు ఈయఱమాత్రము యేలనాకు తెఱచి చూపకపోతివి అని యడుగగా మంత్రి దానిలోనుండు వస్తువును చూచిన యెడ నీవు భయపడుదువు గనుక దానిని నీకు చూపలేదనెను. ఆమాటవిని రాచకొమారుడు నేను భయపడుదు ననుశంక నీకు అక్కఱ లేదు. నగళ్ళలోని సమస్తమును చూచినాడను, దీనిని మాత్రము చూడకుందునా? అవశ్యము చూతునని ఆ యఱతలుపు తెఱవబోయెను. అంతట మంత్రి వానిచేయిబట్టి ఎడముగా తీసుకొనిపోయి నాయనా! యీ యఱయొకటిని మాత్రము నీకు చూపవలదని మీతండ్రి నాతో చెప్పి యున్నాడు. కనుక దానిని తెఱచి చూచిన యెడల నీకుమాత్రముకాక నాకుగూడా కీడుమూడును. నామాట విని ఈ ప్రయత్నమును మానుకొనుము అని బహువిధముల నీతులు చెప్పి వేడుకొనెను. ఎంతచెప్పినను వినక ఈ యఱలోనుండు దానిని చూచునంత వఱకు నా మనసులోని కలత తీరదు. రేయుంబవలును అదేచింతగా మిక్కిలి నొచ్చిపోదును. ఈ గదితలుపు తీసిచూడక యిక్కడనుండి కదలనని వైరాగ్యముపట్టి కూర్చుండెను.

ఆ వైరాగ్యమును విడిపించుటకు ఏయుపాయమును తోచక మంత్రి, యికవీడు మనము చెప్పినమాటనువినడు. అగునదియేమో కానిమ్ము అని మనస్సు దృఢపఱచుకొని ముందుతాను ప్రవేశించి యందలిచిత్రపటమును మాటుపఱుచుతలపుతో, వానియిష్టము చొప్పున తలుపు తెఱవగా తత్తరపడుచున్న రాజకుమారుడు తలుపు తెఱచి తెఱవక యుండగానే మంత్రిని త్రోసికొని దూఱి

పోయి యందున్న చిత్రపటమును చక్కగాజూచి, మోహపరవశుడై దేహము తెలియక సొరిగి నేలబడెను. అది మంత్రిజూచి మిక్కిల విచారగ్రస్తుడై దైవయత్నమునకు ఏమి చేయవచ్చుననుకొనుచు, మెల్లగా వానినియెత్తి ఒక పాన్పున బండబెట్టి పెక్కు ఉపచారములుచేయ వానికి కళదేలెను. కొంచెము ప్రజ్ఞరాగానే రాజకుమారుడు ఆపటములో వ్రాయబడియుండు బంగారుబొమ్మ యెవరని యడుగగా, అది స్వర్ణపురి రాజుకూతురు అని మంత్రి చెప్పెను. అదివిని రాజకొమారుడు నామనసు దానియందే నాటియున్నది అట్టి బాలికామణినింగూడ సుఖింపని పురుషునికి నీ జన్మంబేల! నేనిక నిమిషమాత్రంబైన నిలువనోప, నెట్లకేలకు నేనాస్వర్ణపురికరిగి నాబాలికారత్నంబును గైకొందుగాక యని మనోదృఢ కృతంబుజేసుకొని యర్థరాత్రంబున లేచి యెవ్వరికిం దెలియరాక వడిగల యొక అశ్వంబెక్కి నిర్భయంబుగా దట్టములయిన యడవులలోజొచ్చి విచ్చలవిడిం బోవుచు, బెబ్బులులను పడగొట్టుచు, ఘోరభల్లూకములను గ్రుచ్చుచు, మదపుటేనుంగుల బడద్రోయుచు నాకన్నియను దలంచి చిత్తజుని కోలలకు దత్తరించి, పొన్నరని చెట్లనీడల నిలుచుచు మాధుర్యఫలములభక్షించుచు తేటచల్లని నీరుద్రావుచు నాచంద్రముఖిమీద భ్రమచేత సంపూర్ణ చంద్రునింజూచు బుద్ధిభ్రంశము గలిగి యా యిందుముఖి జలక్రీడలాడుటకు నొంటరిగా వచ్చుచున్నదని భావించి యోహో కమలముఖి నన్నుమారుని బారికొప్పగించి కొంచెమైన గనికరము లేక నామనంబీలాగు వ్యధచేయవలెనా! నీవంటి నిర్దయురాలి లోకంబున లేదుగదా అనిపల్కుచు నిరీక్షించి పిమ్మట చంద్రోదయంబని యెఱింగి విచారమొందుచు నేమియుదోచక పరితపించుచుబోయి నొకదట్టమైన వనమును జూచి యిదిస్వర్ణపురి శృంగారవనంబనియు నాయిందుముఖయిందు జలక్రీడలాడుచుండుననియు సందడిసేయక మెల్లగాబోయి యాముద్దుగుమ్మనుం బట్టుకొని భోగించి మన్మథుని బారదోలుదుననియు యోజించి గుంపులుగుంపులై యుండు చెట్లమఱుగున బొంచిపొంచి పోవుచుండెను. ఆవనము కపిలమహర్షి యాశ్రమమగుటంజేసి యాముని శిష్యులలో నొకడారాజపుత్రునింజూచి, యింతడు వెఱ్ఱివాడని యెంచి యతనిం బిలుచుకొనిపోయి మహర్షి ముందఱనిలిపి యతని వర్తమానమును జెప్పెను. ఆఋషిశ్రేష్టుడతని నాదరించి తనచెంతను గూర్చుండబెట్టుకొని రాజాత్మజా నీవు పొంచిపొంచి చెట్లమఱుగున వచ్చుటకుగతమేమి నాకు దాచక నెఱింగించుమనిన నతడా మునిపాదములకు నమస్కరించి నిజవర్తమానంబంతయు నెఱింగించి దుఃఖంబుతోదూలిన యమ్మ

హాత్ముండితని దుఃఖంబునుమాన్పి తనయాశ్రమంబున గొంతకాలంబుండి సేద తీర్చుకొని పొమ్మని సెలవిచ్చెను అంత నారాజసూనుండు అమ్మహామునీంద్రునకు ఫలకాష్ఠకుసుమంబులదెచ్చి యిచ్చుచు వివిధశుశ్రూషలు గావించుచు నొకనాడామహాత్ముని పాదములపైబ్రాలి ఋషిశ్రేష్ఠా! మానవునకు ముముక్షుత్వంబెటుల గైకూడును. జ్ఞానంబెటుల నిలుకడయగును. ఆ యోగంబు నాకు దెలియంజెప్పుడని ప్రార్థించెగ నాతపోధనుడు ఫక్కుననగి రాజాత్మజా! నీప్రశ్నలమోఘములు దేవతలకైన జెప్పుటకు నలవిగావు మిక్కిలి గోప్యమైన దేవరహస్యములనడిగితివి. నీవు మిగుల బావనుడవగుటంజేసి యిట్టి రహస్యమయిన జ్ఞానయోగ మార్గంబు నీకు జెప్పబూనికొంటినని పలికి యారాజకుమారుని దగ్గఱకుంబిలిచి గూర్చుండబెట్టుకొని పరమకరుణారసంబున మునీంద్రుం డిట్లనియె.



కపిలమహర్షి ధర్మగుప్త మహారాజునకు జ్ఞానయోగంబు దెలుపుట.

రాజకుమారా! ఈలోకమందు మనుష్యులు ఫలాపేక్షచేత దేవతలను పూజించుచున్నారు. వారికి మనుష్యలోకమునందు కర్మఫలము శీఘ్రములో లభించుచున్నది. గుణములు, కర్మలు, వీనిభేదములచేత నాలుగువర్ణములు భగవంతుచే సృజింపబడినవి, ఆ నాలుగు వర్ణములకు భగవంతుడు మాయా వ్యవహారమైన కర్తయైనను పరమార్థమున వానిని కర్తగాని వానిగా తెలిసికొనవలయును. భగవంతుని గర్మములంటవనియు, నతనికిం గర్మఫలంబులందు గోరికలేదనియు నెఱుంగువానిని గర్మములంటవు. జనకాదులదియెఱింగి కర్మములాచరించిరి. కర్మయనగా నెద్ది? అకర్మయన నెద్ది? ఈ విషయమునందు విద్వాంసులుకూడా భ్రమించిరి. ఆ కర్మాకర్మల యొక్క విషయమును నీకొఱకై చెప్పుచున్నాను. దానిని తెలిసికొనిన నీవు

క్షేమమును పొందగలవు. కర్మ, వికర్మ, అకర్మ, ఈమూటియొక్క యదార్థస్వరూపమును చక్కగా తెలియవలయును. ఈ కర్మ, వికర్మ, అకర్మ, వీనియొక్క యదార్థస్థితి, తెలిసికొనుటకు అశక్యము ధర్మగుప్తా! శ్రద్ధతో వినుము. కర్మల యథార్థస్థితి తెలిసికొనుట కష్టమైనను వానిలక్షణంబుల నూటిగా జెప్పెద నీవే గ్రహించి యెఱింగికొమ్ము కర్మయన:- జ్ఞానకర్మేంద్రియములు మనస్సుతోగూడి శాస్త్రసమ్మతమైన వ్యాపారమును గలిగి యుండుట, ఉదాహరణము.—భగవంతుని కథలువినుట శ్రోత్రేంద్రియ వ్యాపారము, భగవద్విగ్రహమును సేవించుట చక్షువ్యాపారము, తులసి మొదలగు భగవత్ప్రియవస్తువుల మూర్కొనుట, ఘ్రాణవ్యాపారము, భగవత్పాత్రాదుల దాకుట త్వక్ వ్యాపారము ప్రసాదభక్షణము జిహ్వాకార్యము, పూజించుట గుళ్లకుపోవుట పాణీపాదవ్యాపారము, భగవన్నామ సంకీర్తనము నోటిపని, ఋతుసమయ భార్యాసంసర్గము ఉపస్థవ్యాపారము, దక్షిణంబుగా బహిర్భూమికేగుట గుదవ్యాపారము. ఇట్టికర్మములు సఫలమై యుండిన వికర్మ. అఫలమైయుండిన అకర్మ, కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను, ఎవడు చూచునో వాడు మనుష్యులలోన బుద్ధిమంతుడు. వాడే యోగి. వాడే సమస్త కర్మలు చేసినవాడు. ఎవనికర్మలు కామసంకల్పములు లేనివొ, యెవనికర్మలు జ్ఞానమను అగ్నిచేత దహింపబడినవో, అట్టివానిని పండితుడని విద్వాంసులని చెప్పుదురు. కర్మఫలాపేక్షను విడచి నిత్యతృప్తుడై విషయప్రవృత్తిలోలేనివాడు కర్మయందు ప్రవర్తించినవాడైనను అట్టివాడు కర్మజేసినవాడు కాడు. కోరికలు వదలిపెట్టి చిత్తస్వాధీనముగలిగి సమస్త విషయముల యందు అభిమానమును వదలి శరీరపోషణ కొఱకు ఉపయుక్తమైన కర్మము చేయు పురుషుని సకలకర్మలైన పాపమంట నేరదు. అప్రార్థిత లాభముచేత సంతోషించి ద్వంద్వగుణములకు లోబడక మత్సరము లేక సిద్ధ్యసిద్ధులయందు సముడై కర్మచేసినవాడు కర్మబద్ధముకాని వాడై. ఆసక్తిలేనివాడై ముక్తుడై జ్ఞానమందు స్థిరబుద్ధిగలవాడై భగవత్ప్రీత్యర్థమై చేయువానియొక్క కర్మనిశ్శేషముగా నశించుచున్నది. యజ్ఞపాత్ర బ్రహ్మమే, హోమద్రవ్యము బ్రహ్మమే, అగ్ని బ్రహ్మమే, హోమకర్త బ్రహ్మమే, బ్రహ్మకర్మసమాధిచేత కొందఱు దేవతాయజన సాధనమైన యజ్ఞము చేయుచున్నారు. మఱికొందఱు జ్ఞానులు బ్రహ్మమను అగ్నియందు కర్మమను హవిస్సును హోమము చేయుచున్నారు. మఱికొందఱు యోగులు జ్ఞానేంద్రియములను, నిగ్రహమను అగ్నియందు హోమముచేసి నశింపజేయు చున్నారు. మఱి

కొందఱు మితమైన ఆహారములు గలవారగుచు ప్రాణవాయువులను వశీకృత వాయువులయందు లయింపజేయుచున్నారు. గనుక ఈపైనజెప్పిన యోగ పురుషులు యజ్ఞకర్మలు దెలిసిన వారుగనుక తమపాపములను యజ్ఞకర్మల చేత నశింపజేయుచున్నారు. యజ్ఞకర్మములో మిగిలిన శేషముచు భుజించిన వారు శాశ్వతమైన బ్రహ్మమును పొందుచున్నారు. ఈపైనజెప్పిన యజ్ఞ కర్మములలో నొకటినైనా జేయనివానికి ఈలోకమునందు సౌఖ్యము గలుగ దు. ఇపుడుజెప్పిన నానావిధములైన యజ్ఞకర్మలు వేదములవలన విధింపబడి నవి. ఆ యజ్ఞములన్నియు కర్మరూపములని తెలియుము. ఈ ప్రకారము తెలి సితివేని నీవు సంసార బంధములోనుండి విముక్తుడవగుదువు. నీకోరిక లన్నియు సానుకూలము కాగలవనిచెప్పి, నీవుఅష్టాక్షరీ మంత్రమును నియమవ్రతుం డవై జపించిన శ్రీవిష్ణుదేవుండు నీకిష్టసిద్ధి గలిగించునని "ఓం నమోనారా యణాయ" అను మంత్రంబు నుపదేశించెనని చెప్పిన ఆంజనేయుండు పర మానంద భరితుండై నమస్కరించి స్వామీ అష్టాక్షరీ మంత్రంబును గాంచి తిని యింక నాయిష్టార్థంబులు సమకూరె. జ్ఞానమార్గం బతిరమ్యంబుగనున్న యది; గాన యా ధర్మగుప్తమహారాజు వృత్తాంతం బెటులయ్యె సాంగంబుగా వినుపింపుమనిన నా భగవంతుం డిట్లనియె.

అంతట ధర్మగుప్త మహారాజు తనగురువైన ఋషిశ్రేష్ఠునకు వివిధశు శ్రూషలు గావించుచు నిండువైరాగ్యంబుతోనుండెను. అచ్చట కౌశాంబి నగరంబున మంత్రియైన సునీతిధర్మగుప్తుని వియోగంబునకుచింతించి నతని తండ్రికిజేసిన వాగ్దత్తంబు తప్పిపోయెనేయని పరితాపంబునొంది అన్నపానీ యాదులొల్లక పరిభ్రమించుచు గొందఱి భటులరావించి నలుదిక్కులకు రాజునువెదుకనంపెను. అంతట ఉత్తరదిక్కునకు బోయిన సైనికులు నైదు మాసంబులకు కపిలమహాముని యాశ్రమంబునుగాంచి యందుదపోవృత్తితో నున్న రాజపుంగవుంగాంచి గుఱుతిడి యాముని పాదంబులకు బ్రణమిల్లి యా మహాత్మునకు రాజపుత్రుని వర్తమానమును, మంత్రియైన సునీతి వియోగ తాపంబును, తల్లిదుఃఖంబును దెల్పిన నా మునీశ్వరుం డాశ్చర్యపడి రాజపు త్రునింబిలిచి యోరిమానసపుత్రా! నీవు సూర్యవంశపు రాజుగా జన్మించి తల్లిదుఃఖముతో బారిగొని పోవునటుల జేసితివి. నీజననీజనకులకు ఒక్కకుమా రుండవై వారి నీలాగు దుఃఖసాగరంబున మునుంగజేయుటకన్న మహాపాత కంబుగలదే? నీ వతిరయంబున నీ భటులవెంటం జనుదెంచి నీ జననీదుఃఖం బులమాన్పుము. నీకోర్కె నీమంత్రి పుంగవునివలన సానుకూలంబు కాగల

విధి నిశ్చయంబు నీ గృహంబున కరుగుమని యమ్మని దీవించిన నా రాజపు త్రుండు సెలవుపొంది తన సైన్యముల వెంట కౌశాంబిని నగరంబు జేరె నంత తన మంత్రియు తల్లియు దుఃఖంబుమాని సుఖంబుగా నుండిరి.

ఇట్లు కొన్ని దినంబులు గడచిన పిమ్మట నా రాజపుత్రుండు తన మంత్రినిరావించి నీవునాయందు ప్రేమగలవాడవైతివేని యా స్వర్ణపురి రాజకొమార్తెను నాకు భార్యగా జేయుమని వేడెను. అంతట మంత్రి ఏమియుచెప్ప నతోపక కొంతసేపు ఆలోచించి తుదకు ఒక విధమైన యేర్పాటు స్థిరపరుచుకొని రాజకుమారుని జూచి అయ్యా; ఆ రాజకూతురు ఉండునట్టి పట్టణము బంగారుకోట అందుగల సకలవస్తువులును స్వర్ణమయంబుగా నుండును. ఆ కన్యక బంగారునుతప్ప ఇతరమైనదాని నపేక్షించదు. కాబట్టి ఇప్పుడు మన నగరమందుండు వేయిబారువలబంగారమును తగినశిల్పులచేత ఆచిన్నది యపేక్షింప దగిన నానావిధ వస్తువులుగా చేయించి యెత్తుకొని పోతిమేని మన యదృష్టము చక్కగానున్న యెడనా కార్యము అనుకూలించవచ్చును. అని చెప్పగా నా రాజకుమారుడు సంతోషించివెంటనే తనరాజ్యమందు గలయగసాలెవాండ్రనందఱినిరావించి బహువిధములైన మనోజ్ఞవస్తువులను కావలసినంతమట్టుకు రెండు మూడు దినములలోచేయించి సిద్ధపరిచెను. అంతట మంత్రి తన యాలోచనచొప్పున రాజకొమారుడును తానును వర్తక వేషము వేసికొని యా బంగారువస్తువుల నన్నిటిని ఒక యోడకు ఎగుమతిచేయించుకొని ఓడవర్తకులవలెనే స్వర్ణపట్టణమునుగూర్చి వెడలిరి. ఇట్లుపోయిస్వర్ణపట్టణపు రేవున ఓడలంగరువేయించి రాజకుమారుని ఓడయందే వస్తుసంభారమును కనిపెట్టియుండుడని జాగ్రతను చెప్పి తానుమాత్రమే ఓడదిగి పట్టణము ప్రవేశించి రాజమార్గమున బోవుచుండగా నప్పుడుబంగారు కుండలో నీళ్లు ముంచియెత్తుకొనిపోవుచున్న యొకపడుచునుచూచి దాని కెదురుగా నిలువబడెను. అట్లు నిలువబడగానే ఆచిన్నది యతనినిజూచినీవెవరు అనియడిగెను. అంతట మంత్రి తన మూపున వేసికొనివచ్చిన బలిమినంచినిదించి నేనొక వర్తకుడను అనిచెప్పి తాను తెచ్చిన వస్తువులలో కొన్నిటినిజూపెను. అది ఆ వస్తువులను మనోజ్ఞతగచూచి మెచ్చుకొని నీళ్ళకుండనుదించి దిగువనుండు ఈవస్తువులను మా దొరసాని చూచినయెడల తప్పకకొనును. గాన తమరు తీసికొని నావెంటరమ్మని రాచకొమార్తెయొద్దకు పిలుచుకొనిపోయెను. రాజకూతురు ఆ వస్తువులను జూచి మిక్కిలి మెచ్చుకొని వీని పనితనమును చూచిన మిక్కిలి విచిత్రముగా నున్నది. యివన్ని తీసికొనెదను వెలచెప్పుము, అని యడుగగా

మంత్రి ఇవి నావికావు నేనొక కూలివాడను కనుక వీనివెల నాకు తెలియదు.
ఇంతకంటె మిక్కిలి అందమైనవస్తువులు లెక్కలేక ఒక యోడకు ఎగుమతిచేసు
కొని మా యజమానుడు వచ్చియున్నాడు. ఆయన నడిగిన వెల తెలియును
అనెను. అదివిని రాచకొమార్తె అట్లయిన ఆ సామ్రగులు అన్ని ఎత్తించు
కొని మీ యజమానుని పిలుచుకొనిరా వెలతీర్చుకొని అన్నిటిని నేను కొని
యెదను అని ప్రత్యుత్తరముచెప్పెను. అందులకు మంత్రినవ్వి అమ్మా ఆవస్తు
వులన్ని ఇచ్చటికి తెచ్చుటకు బహుదినములుపట్టును. పైగా అవన్ని తెప్పిం
చిన యెడల పఱచిపెట్టుటకు కావలసినంతచోటు ఎక్కడవున్నదిఅనగా, అట్ల
యిన నేనే అక్కడికివచ్చి ఆ వింతవస్తువులనుచూచి కావలసినవి కొనుక్కొ
నెదను అని బయలు దేరెను.

అప్పుడు మంత్రి మిక్కిలి సంతోషించి ఆ చిన్నదానిని పిలుచు కొని
సముద్రతీరమునకుపోగా ఓడలోనున్న రాజకుమారుడు ఆ కన్యకారత్నమును
చూచినేను ఆ పటమునందేమోచూచి భ్రమసితిని, ఇప్పుడు ప్రత్యక్షముగా
ఈ కన్యకను చూచినంతట ఆ పటములోని యాకృతియొక యందమైనదిగా
తోచలేదు. నాకు మంత్రోపదేశంబుచేసిన కపిలమహాముని మహిమయో!
యని యాతని మంత్రప్రభావంబుచే నా కోర్కె సంఘటించునో కాదో అని
తలచుచు నిలువబడి చూచు చుండెను. ఆరాచకూతురును కొంచెము సేపటి
లోనే మెల్లమెల్లగాపోయి ఓడయెక్కెను. ఎక్కగానే వర్తక వేషధారియైన
రాచకొమారుడు ఓడ లోపలి పై గదులలో నుంచియుండు వస్తువులను
చూపు వానివలె ఆ లోపలి గదులలోనికి పిలుచుకొనిపోయెను. బయటగా
చూచుండియుండినమంత్రి ఇదియేసమయమని ఓడలంగరుయెత్తి గాలిచాపలన్ని
యెత్తికట్టి నిమిషమాత్రమున తమ దేశము చేర్చునట్లు ఓడవానికిఆజ్ఞాపించెను.
ఓడలోపలనున్న రాజకుమారుడు అక్కడ నుండునట్టి బంగారు ప్రతిమలను,
బిందెలు చెంబులు మొదలు గాగల బంగారు పాత్రములను, ఇంక అనేక
విధములైన వింతవస్తువులనుచూపుచు ప్రొద్దుపుచ్చుచుండెను. అవన్నిచూచి
యగునంతలో బహు దినములు గడచినను వానిని చూచుటయందు గలిగిన
యాసక్తిచేత ఓడనడుచుట సహితము ఆ చిన్న దానికి తెలిసినది కాదు. అట్లు
ఏకాగ్రచిత్తయై యా వింతవస్తువులనన్నిటిని ఒకటైనతప్పక చూచి మనసురంజి
ల్లిన పిమ్మట ఆచిన్నది వర్తక వేషము ధరించిన రాజకుమారునకు వందనము
చేసి నేనుపోయివచ్చెదనని చెప్పి యందుండి బయటికివచ్చిచూడగా గాలిచాప
లన్ని ముడుచుకొనక నడిసముద్రములో మహా వేగమున ఓడ పోవు చున్నం

దున, ఆమెకు ఇదిదారి ఇదిత్రోవయని తెలియకపోయెను. అందువల్ల ఆ రాచ కూతురు మిగులభయపడి దేహముత్తరపడి ముందువెనుకతోచక అయ్యో నేను మోసపోతినే, వంచకులైన వర్తకులలో తగులుకొంటినే, ఇక నాగతి ఏమి ఇకనేమిచేయుదునని బహువిధముల ప్రలాపింపసాగెను. అదిచూచి ఓర్వ లేక రాచకుమారుడు తటాలున ఆమె చెయిపట్టుకొని ఓ ప్రియసఖి నేనెవరో యనియెంచి దిగులు పడవలదు, నేనుక రాజకుమారుడను నీకు ప్రియుడను ఎవడో ఒక హీనజాతివర్తకుడనియెంచి నన్నువిడనాడబోకుము. నీకు తెలియ కుండ నింత దూరము నిన్ను తీసుకొని వచ్చిన తప్పు మాత్రము నా యందు గలదు. నీ యందు నాకుగలిగియున్న ఆపేక్షచే నన్నింతటిపనికి తెగించునట్లు చేసినది. మొట్టమొదట చిత్రపటమునందు నీరూపమునుచూచినప్పుడు నేను పడ్డపాటు దైవమేయెఱుగును అటువంటి నన్నుచల్లనిచూపునచూచి మన్నిం పుముఅనిబహువిధముల తనమక్కువ తేటబడచెప్పి తగిన యుపచారవాక్కు లతో ఊరడించెను. ఆరాచకూతురును వానివేడుకోలును తనయొక్కస్థితియు మనసునకు వింతలై తోపింపగా కొంతసేపు విచారపడి పిమ్మట ధైర్యమును అవలంబించి వానితో గూడియుండుటకు ఒప్పుకొని నెమ్మదిగా వెళ్లెను.

ఈ విధముగా స్వర్ణపురపు రాచకొమార్తెను వశపరుచుకొని నడిసముద్రపు దారిని పోవునపుడు మంత్రి వినోదముగా ఓడయెక్కి మీది భాగమునందుగూర్చుండి వీణవాయించుచు పోవుచుండు వాడు, ఆ దారిని మూడు కాకులుపోవుచుండగాజూచి వీణాగానమునుమానివానినిచూచుచు గూర్చుండెను. అప్పుడు ఆ కాకులలో ఒకటిచూచితివా ఈ రాజకుమారుడు స్వర్ణపురపురాచకొమార్తెను మోసపుచ్చి పిలుచుకొని పోవుచున్నాడనెను. అదివిని మఱియొకకాకి అయిననేమి ఇల్లుపోయి చేరలేదేలఅనెను. అంతట మూడవది ఇల్లు చేరక పోయిన నేమి, అది వాని వశమాయెను. ఇరువురు కూడుకొని ఓడలో పోవుచున్నారు చూడుమనెను.

అంతట రెండవకాకి ఇరువురుకూడ కూర్చుండి పోయిన మాత్రాన అన్నియెనగూడినట్టా; ఇల్లలుకగానే పండుగగాదు వీరు ఓడదిగిదరిచేరగానే ఒక వింతయైనగుఱ్ఱము వీరియొద్దకువచ్చును. రాగానే రాజకుమారుడు దాని బట్టుకొని యెక్కి సవారిచేయబోవును. ఆ గుఱ్ఱము వాని నెత్తుకొని ఆకాశమున కెగిరి పోవును. అంతట వాడు మరలి రానిదారి బట్టిపోవును అనెను. మరల తొలుతటికాకి దానికి నూఱేమియులేదా? అనగా కలదు, అది ఎవరెఱుగుదురు. రాజకుమారునితోడ మరియొకడు ఎవడైన ఆ గుఱ్ఱమునెక్కు

కాని తుపాకితో దానిని కాల్చినపక్షమందు రాజకుమారునికి నేయపాయమును గలుగదు. ఈ సంగతి ఎవరికి తెలియదు. ఒకవేళ ఎవరికైన తెలిసియున్నను ఇతరులకు జెప్పరాదు. చెప్పినేని నప్పుడే చెప్పినవాడు ఱాయియై పోవును. అని అంతటితో నిలుపక ఆకాకి కికనడువబోవు వర్తమానము కూడనాకు తెలియును. ఎవడైన పుణ్యాత్ముడు ఆగుఱ్ఱమునుజంపి ఈ రాజకొమారుని బ్రతికించినను పీడు నీరాజకొమార్తెను పెండ్లాడుటకుఅవకాశముగలుగదు. వీరు ఓడదిగి పట్టణము ప్రవేశింపబోవునపుడు గోపురద్వారములో ఒకయపరంజితట్టలో ఒకపచ్చపట్టుపీతాంబర ముంచబడియుండును. దానింజూచి రాజకొమారుడు ప్రియపడియెత్తి కట్టుకొనును. కట్టుకొన్న మాత్రాననే వాడు మండిపోవును అనెను. ఆయపాయము తప్పుటకు ఉపాయమేమియు లేదాయని ఇంకొకకాకి అడుగగా నది ఒకటియున్నది ఎవడైన ఒకడు పీతాంబరమును తనమీది వస్త్రముతో పట్టి మంటలో పడవేసిన పక్షమున రాచకొమారుడు బ్రతుకును. ఈయుపాయము ఎవరికి తెలియును? ఒకవేళయెవనికైనను తెలిసియుండినను ఆసంగతి బయలుపరచినయెడ అప్పుడే ఱాయియైపోవునే అనెను.

అంతట ఇదంతయు వినుచున్న మూడవకాకి ఇకమీద జరుగబోవు సంగతియు నాకు తెలియును. ఇప్పుడుచెప్పిన చొప్పున నెవడైన ఆదేవలోకపువస్త్రమును కాల్చివేసినను రాజు ఆపడుచుతోగూడి సంసారసుఖమును అనుభవింపబోడు ఇన్నిగండములు గడిచి యీకన్నియను యితడుపెండ్లాడగానే ఒకనాటిరాత్రి ఆటలు పాటలు మొదలైన వేడుకలు జరుపుదురు. ఆవేడుకను చూచుచుండగా, ఈరాచకూతురు మొగము వెలవెలపోవగాశవాకృతితో నేలబడును. అప్పుడు ఎవరైన సీపెయొక్క కుడిప్రక్క ఱొమ్మునమూడుబొట్లునెత్తురు బయటతీసినగా బ్రతుకును లేనియెడల చనిపోవును. ఈ రహస్యమెవరికిని తెలిసియుండదు. ఎవరికైన తెలిసియుండినను బయలుపరచినయెడల ఱాయియైపోవునేయని యెవరును బయలుపరుపనేరరు అనియిట్లు చెప్పుకొనుచు ఆకాశమధ్యంబున ఆమూడుకాకులును పాఱిపోయెను.

మంత్రి పక్షిభాష తెలిసినవాడుగనుక ఇదంతయు విశదముగా విని తెలిసికొని కొంతసేపు విచారగ్రస్తుడై యేమియుతోచక ఱాతిప్రతిమవలె యూరకయుండి పిమ్మట యీసంగతి రాజకుమారునికి తెలియజేయక పోయినయెడల వానికి అపాయమురాక తప్పదు. తెలియజేసిన యెడల తనకేప్రాణహానియగును. ఇందులకేమిచేయవచ్చునని యాలోచించి తుదకు ఏవిధము

చేతనైన రాజకుమారునికి హాని రాకుండుటకు తగిన ప్రయత్నము జేయవలసినదిగా నిశ్చయించుకొని తనమనస్సులోని విచారమును బయలుపడనీక మెలగుచుండెను. ఇంతలో ఓడయు రేవునకు వచ్చిచేరెను. అంతటవారు రాచకూతురితోడ ఓడదిగగానే కాకులుచెప్పిన చొప్పున మిక్కిలి గొప్పగుఱ్ఱమొకటి వారియెదుట వచ్చినిలిచెను. రాజకుమారుడు ఆగుఱ్ఱమునుజూచి, ఔరా! మంచిగుఱ్ఱము చిక్కెను మనము నగరుచొచ్చునపుడు దీనినే ఎక్కిపోదగినదని దానినెక్కెను. మంత్రియు వెంటనేయెక్కి దానిని తుపాకితో కాల్చిచంపెను అప్పుడు చూచినవారందరు ఇంతమంచిగుఱ్ఱమును ముందువెనుకచూడక చంపుటకు ఇతనికెట్లు బుద్ధిపుట్టెనో, ఇంతపనిచేసిన ఇతనిని రాజుదండింపక పోవచ్చునా అని దూషింపసాగిరి. అందులకు రాచకుమారుడుపదరక ఇతడు నాయెడల నిష్కపట స్వభావముతో ప్రవర్తించువాడు ఇతనికంటె నామేలుగోరువారు మఱియొకరులేరు. ఆయన చేసినపని యెట్టిదైనను కీడుగానుండనేరదు. మీరు తోచినట్లెల్ల మాటలాడకుడు అని వారి కలతలను మాన్పెను.

అటుపిమ్మట వారు అక్కడనుండి బయలుదేరి గోపురద్వారము చేరబోగా, అక్కడ అపరంజి తట్టలో నుంచియున్న దివ్యమైన పచ్చపట్టుపీతాంబర మొకటికనబడెను దానిని రాజకుమారుడు కట్టుకోదలచి యెత్తబోగా, మంత్రి తాళు నిలువుమని తానుముందు మిగిలి తనచేతిగుడ్డతో ఆపట్టుపీతాంబరము పొడిగియెత్తి మండుచున్న నిప్పులోబడవేసెను. అప్పుడును అక్కడనుండి చూచుచున్న వారందరు ఇదేమిపని ! ఇట్టి వెలలేని పీతాంబరమును రాజును ధరింపనీక కాల్పవచ్చునా అని మంత్రిని నిందింపసాగిరి. అదివిని రాజకుమారుడు ఈపుణ్యపురుషునియెడల మీరుతప్పులు పట్టబోకుడు నావిషయమున నితడు ఎంతమాత్రము చెరుపుచేయడు ఇంతటియాప్తులు నాకుమరియెవరును జిక్కరు ఇప్పుడు ఈకార్యము చేయుటకు తగినకారణము నేదో యొకటియుండును అని చెప్పి వారిని సమాధానపరచి, యీవిధముగా రెండు గండములు తప్పించుకొని నగరుప్రవేశించిన తోడనే మహావైభవముతో వివాహమహోత్సవము నడచెను. పెండ్లి నాలుగు దినములయిన పిమ్మట ఒకనాటిరాత్రి చూచువారికి నేత్రోత్సవముగానుండు ఆటలతోను వినువారికి శ్రవణానందముగా నుండుపాటలతోను వేడుక జరుపబడెను. ఆమహోత్సవకాలమునందు మంత్రి ఆటపాటలయందు తనమనస్సుంచక పెండ్లికూతురు ముఖమునందే చూపునిలిపి మిక్కిలి జాగ్రతతో నుండెను. అప్పుడు ఉన్న

ట్టుండి ఆ పెండ్లికూతురు ముఖము వెలవెలపోగా ఒళ్లు తెలియక నేలబడెను. వెంటనే తెప్పవాల్పక చూచుచున్న మంత్రి తటుక్కున ఆమె నెత్తుకొని ఒక చిన్నగదిలోనికి తీసుకొనిపోయి పరుండబెట్టి కుడిప్రక్క రొమ్మునందుండి మూడు చుక్కల నెత్తురు బయటతీసెను. తీయగానే ఆచిన్నది ప్రజ్ఞవచ్చి లేచి కూర్చుండెను.

ఇదంతయు చూచుచున్న రాజకొమారుడు వీడు మనకు ఆస్త్రీని స్పృశియున్నందు కెంతటి సాహసమునకు ఒడిగట్టెను అని మహాకోపముతో అతనియందు గలిగియుండిన ప్రతికంటె నినుమడించిన విరోధము నవలంబించి తక్షణమే చాటబెట్టించి మఱునాడు తెల్లవాఱగానే, పట్టణపుతలారివాండ్రను రప్పించి మంత్రిని కొఱత వేయ నుత్తరువుచేసెను మంత్రి తలారులు తన్ను చంపుడు గట్టునకు బిలుచుకొని పోవుచుండగా రాజకుమారునిజూచి ఎంతటి అపరాధికైనను కొఱత వేయ బోవునపుడు ఏదేనికోరిక యున్నయెడల ఆకోరికను తీర్చుకొనుటకు ఉత్తరువు నియ్యవచ్చును కనుక నామనసు నందుగల యభీష్ట మందఱికి తెలియజేయునట్లు నాకును ఉత్తరువు నిప్పింపవలెను అని అడిగి, అందులకు ఒప్పుకొనగా, రాజుతో ఇంతపర్యంతము నేను నిన్ను కడుపున పుట్టిన బిడ్డకంటె హెచ్చుగా నెంచి మిక్కిలి జాగ్రతతో కాపాడుచునచ్చి సందులకు నీవిషయమందు నేనుచేసిన మేలేదియు విచారింపక రాజవై సందున దండనవిధించితివి. అయినను నేనిప్పుడు చెప్పబోవు వృత్తాంతమును మాత్రము హెచ్చరికతో విని పిమ్మటనైన నాయందు నీకుగలిగిన దురభిప్రాయమును మానివ మేలని యెంచుచున్నాను. అనితాము ఓడయెక్కిపోయినది. మొదలు అంతవఱకు జరిగిన వర్తమానమంతయు విశదముగా చెప్పి, కాకులు చెప్పినరహస్యమును బయలుపఱచి నందున ఱాయియై నిలువబడెను.

అంతట రాజకొమారుడు వింతయు విచారంబును అతిశయింపగా నాతండ్రీ? నా యాపద్బాంధవా! ప్రాణదాతవైన నిన్ను అవమానించిన బుద్ధిహీనుని కృతఘ్నుని పరమ పాపిని నిక కాపాడువారెవరు? అయ్యో కల్పవృక్షమును కాల్చివేసికొంటినే అని బహు విధముల ప్రలాపించుచు ఆఱాతిని కౌగలించుకొని కొంతసేపు నేడ్చి ఎంతఏడ్చినను మించిన పనికి ఏమిసేయవచ్చునని మనస్సునకు కొంతయూఱడి కలుగజేసుకొని తన్నుతాను నిందించుకొనుచు, తనవలెనే విచారగ్రస్తురాలైయున్న రాజకుమార్తెను తగినమాటలు చెప్పి, యూరడించి ఆశిలను అక్కడనుండి యెత్తించుకొనిపోయి తనపడకటింట జేర్చి రేయుంబగళ్లు వేఱుచింతలేక, ఆఱాతికెదుటనిలచి ఓమంత్రీ! ఇక నిన్నెప్పటివలె ప్రాణముతో నుండగా జూచి మాటలాడుట యెన్నటికి? నీవలె ప్రేమతో ఆదరించి పెంచువారొకరు నాకిక దిక్కుడురా ఎక్కడిమాట అని ఇట్టిమాటలతో ప్రొద్దుపుచ్చుచుండెను.

ఈ విధముగా కొంతకాలము గడిచిన పిమ్మట ఆతనికి స్వర్ణపురపు రాజకూతురు నందు అవడలుగ నిద్దరు మగబిడ్డలు గలిగిరి, అదిమొదలు ఆ బిడ్డలముఖములు చూచుటచేత కొన్నికొన్ని సమయములయందు కొంతకొంత విచారము పరిహార మగుచుండెను. ఇట్లుండగా ఒకనాడు రాణి తన బిడ్డలను యిరువురిని పడకటింట మగనియొద్దవిడిచి దేవతాప్రార్థన చేయునదియై దేవాలయమునకువెళ్ళెను, అప్పుడు రాయియైయున్న మంత్రికి ఎదురుగానిలిచి తనముందర ఆడుకొనుచున్న బిడ్డలనైతము కన్నెత్తిచూడక ఓ ప్రాణధాతా నిన్ను బ్రతికించుకొనుటకు నాకు నేయుపాయమును లేకపోయెనుగదా? యని చెప్పగానే ఆ రాతిప్రతిమనోరు తెరచి నీవింతవిచారపడనేల! ఈలోకమునందు నీకు ప్రేమాస్పద మైనవస్తువేది గలదో దానినాకు బలియిచ్చిన పక్షమున నాకు ప్రాణము వచ్చునని చెప్పెను. అంతట రాజు ఇంతమాట ప్రతిమనోటనుండి రాగా వినునంతటి భాగ్యము అబ్బెనుగదా? ఇదియే నాకు నదివేలు. నాకు మిక్కిలిప్రియమైన ఒకపదార్థము మాత్రమే కాదు. నాసర్వమైనను నీకొఱకు సమర్పణ జేసెదను. అనగా రాతిప్రతిమ అట్లయిన నీప్రియపుత్రులైన యీయిద్దఱిబిడ్డలయొక్క తలలు నీచేతులారనఱికి ఆనెత్తురు నామీద చిలుకరించితివేని నాకు ప్రాణము వచ్చునని మందలించెను. ఆమాట రాజువిని తొలుతకొంచెము సంకోచించినవాడయ్యును మంత్రి చేసిన మహోపకారము తలచిబిడ్డలకేమి? ప్రాప్తియున్న వలసినంతమంది కలుగుదురు. ఈపుణ్యపురుషుడు బ్రతుకుటయేప్రధానకార్యమని విచారించి తనకడుపున బుట్టినబిడ్డల నెట్లునఱక వచ్చునని యెంచక తటుక్కున చంద్రాయుధమెత్తి యాయిద్దఱిబిడ్డలతలలు నఱికి యానెత్తురు రాతిప్రతిమమీద చిలుకరించెను. చిలుకరింపగానే మంత్రి రాతిరూపు విడిచి స్వస్వరూపమును ధరించి లేచివచ్చి నాయనా! నీవు చేసినపనిచేత నాకు మిక్కిలి సంతోషము కలుగజేసెను నీనెనరుగల తలపునకు దగిన మేలు నీకు లభింపకపోదు అని చెప్పి తల యొకతట్టుగాను మొండెమొకతట్టుగాను పడియున్న బిడ్డలను ఒకతట్టు చేర్చి ఆ తలలను మొండెములతో అతికించి మంత్రివారిని బ్రతికించెను. అంతట బిడ్డ లిరువురును కలకలనవ్వుచు ఆటలాడ నారంభించిరి, ఇంతలో గుడికి పోయియుండిన రాణియును ఇంటికి వచ్చెను. ఆ యమ్మ వచ్చుటను రాజు చూచి మంత్రిని దాగియుండుమని చెప్పి ఓ ప్రాణనాయకీ! నీవు గుడికిపోయి దేవుని నేమి వేడితివని అని అడుగగా ఆమె మన మంత్రి రాయియై పడియున్నాడే అతడెట్లు ఎప్పటివలె స్వస్వరూపమును వహించును ఆ మార్గమును తోపింపజేయుము అని ప్రార్థించితినని చెప్పెను. అది విని రాజు మనమంత్రి బ్రతుకుటకు ఒక ఉపాయము ఉన్నది, దానికి నీవు సమ్మతించిన పక్షమందు కార్యము అనుకూలించును అదియేమనిన మఱియేమియునుంగాదు మనబిడ్డల నిరువురిని చంపుటయే అనగానే రాణిదేహము దడదడయెత్తి తత్తరించెను ఎంతపనికైనను తెగబడి నిర్దోషియైన మంత్రినిచంపినారన్న అపవాదమును తొలగించుకొనుటయే మంచిదనియెంచి యందులకు సమ్మతించెను. అంతట రాజు సంతోషించి చిఱునవ్వు నవ్వుచు మంత్రిని ఆమెకుజూపి తాను జేసిన సాహసమును బిడ్డలు చచ్చి మరల బ్రతుకుటయు దెలియజేసి నేరక చేసినపనికి దేవుడే మనలను గాపాడెనని చెప్పి మంత్రిచే గౌరవింపంబడెను. అనంతరము రాజు మంత్రితో గూడుకొని యేకొఱతయులేక భార్యాపుత్రులతో సుఖముగా కాలముగడుపుచు చిరకాలము ప్రజలపాలించి తుదకు విష్ణుపదంబు నొందెనని చెప్పిన నాయాంజనేయుండా ధర్మగుప్తుని గీర్తించి శ్రీరామునిం బొగడి యీ పుణ్యచరిత్రంబు వలన నాదురితంబులు హరించె నిద్ర నేత్రములయందు తాండవమాడుచున్నది నిద్రింతము రమ్మనిన నాభగవంతుడు సమ్మతించి యిరువురు శయనించి సుఖనిద్ర బొందిరి.

ద్వితీయరాత్రికథ - సమాప్తము.

ఓమ్

శ్రీ సద్గురుపరబ్రహ్మణేనమః

# తృతీయకథారత్నము.

మూఁడవదినము రాత్రి సీతారాములిరువురు లీలావినోదంబుగాఁ దాంబూలము జేయుచు జల్లగా వీచుచుండెడు మలయమారుతంబున కానందించుచుండు నవసరంబున నా మారుతాత్మజుండు భగవంతుని నమస్కరించి మహానుభావా! ముద్రాప్రభావంబు నాకు హృద్గోచరంబగునటుల చిత్రమయిన కథారత్నమును జెప్పి పరమపావనునిగా జేయుడని ప్రార్థించిన నా భగవంతుడు శ్రద్ధాసక్తుండవై చిరకీర్తి మహారాజు చరిత్రమును వినుమని యిట్లనియె.

## చిరకీర్తిమహారాజుకథ.

మున్నొకకాలంబున భూలోకతిలకంబైనట్టి కళింగపట్టణమను రాజధాని యొక్కెటిగలదందు జయసేనుండను రాజు సాధ్యుడను మంత్రిపుంగవునిం గూడి రాజ్యము జేయుచు నిద్దరికన్నియల వివాహంబై ద్వితీయభార్యయందతి మోహాతిశయంబు గలిగి చంద్రముఖియను పెద్దభార్యకు గ్రామమునకు వెలుపలనొక్క విజనస్థలంబున నొక్క మేడగట్టించి యందునామెనుంచి ప్రధానితో దానికి మనవర్తియిచ్చుచుండుమని యాజ్ఞాపించి చిన్నభార్యనుంగూడి కాపురంబు సేయుచుండ గొన్నిదినంబుల కాపనిత కాలనేమి, కంటకాత్ముడను నిరువుర పుత్రులంబడసె నాబాలురు దినదిన ప్రవర్ధమానులై పదునాఱేండ్లవారైరి. అక్కడ పెద్దభార్యకు సంతోషములేనందున మిక్కిలి దుఃఖాక్రాంతురాలై యొకానొక సమయంబున ప్రధానిం గాంచి యిట్లనియె. ఓ అన్నా! నేనిక భూలోకంబున బ్రతికియుండిన ఫలంబేమి రాజు నా మోమునుం జూడకపోయె నాకు నెట్టిసంతోషంబును లేకపోయె నేనేమిచేయుదానననివిలపించిన మంత్రిపుంగవుండు దయాళుండై ఓయమ్మా! నీకు సంతతిగల్గు నుపాయంబొకటి చెప్పెదను. నీయొక్క ఋతుకాలంబు నాకెఱింగింపుము నేనప్పుడా రాజును వెంటబెట్టుకొని వచ్చెద నీనేర్పుకొలది నాతని లాలించి మదనక్రీడావినోదంబులం దేలి యాతని నడిగి శిఖాయుంగరమును చంద్రాయుధమును తీసికొమ్మని చెప్పిన నామె సంతసించి యాకాలం బెఱింగింప ప్రధానియు రాజు సమీపంబు జేరి ఓ నరేంద్రా నేడరణ్యంబునకు వేటాడబోదమని సకలమైన-

వేటకాండ్ర బిలిపించి కావలయునన్ని భోజనసామగ్రులాయత్తంబుజేసిచతు
రంగబలంబులుగొలువ రాజును అడవికి వెంటబెట్టుకొని పోయెను. పిమ్మట
వారలు వేటలాడుచుండ వానయు గాలియు వచ్చినందున సైన్యంబులు
మార్గంబుదప్పి వేఱుమార్గంబున పోవంబోవ రాజచంద్రుండును ప్రధానియు
నాయరణ్యంబున కలతజెంది యొకసరోవర తీరంబు చేరి తురంగంబులదిగి
నీరుద్రావి మరల గుఱ్ఱంబునెక్కి నిశీథిసమయంబున వణకుచు నాపట్టణము
సమీపమందుండు నారాజు పెద్దభార్య గృహంబు వాకిటజేరిరి సైన్యంబు
తెల్ల దైన్యంబులై పలుమార్గంబుల పట్టణంబుజేరె. ఆసమయంబున జయ
సేనుండు గడగడవడంకుచు ప్రధానిఁగాంచి ఓయీ ఈయిల్లు ఎవరిదో తెలిసి
కొమ్మనిన నతండు లోపలికింబోయి అమ్మా రాజు వాకిటనున్నారు. వేశ్య
యిల్లని వెంటబెట్టుకొని వచ్చుచున్నాను. నీకు సరిపోయిన తెఱంగున రాజు
నకు సంతోషము చేయుమని చెప్పి రాజుదగ్గఱకువచ్చి అయ్యా ఒక క్రొత్త
వేశ్యవచ్చియున్నది మీరు ఈవేళ యిక్కడనుండుడు తెల్లవారగానేపోదమని
నడవలోనికి వెంటబెట్టుకొనిపోయిన నాతని జ్యేష్టభార్య బంగారుచెంబుతో
నీళ్లుతెచ్చి కాళ్లుకడిగి లోపలికి వెంట బెట్టుకొనిపోయి అభ్యంగ స్నానము
సేయించి సుకూలంబులగు వస్త్రాభరణాదుల నొసంగి పంచభక్ష్య పరమా
న్నంబులిడి పడకటిల్లు శృంగారించి గంధకస్తూరి పరిమళాదులం బూసి
కర్పూర తాంబూలంబులిచ్చి చౌశీతిబంధముల రతిసలిపె. అంతరాజు చాల
సంతోషపడి నీవేమిగోరెదవని యడుగగా స్వామీ నామీద దయయుంచవ
లెను మీయానవాలు దయచేయవలెననగా రాజు ఏమిఆనవాలు నీకియ్యమ
నెద వనిన నాకు శిఖాయుంగరమును చంద్రాయుధమును దయ సేయవలె
ననిన నతండవి యొసంగి తెల్లవాఱగానే నగరికింబోయెను. అంత నా రాజు
పెద్దభార్యకు గర్భంబుధరించి పదినెలలరిగివెనుక నొక్కకుమారునిం గనియె.
ఇట్లు గొంతకాలంబునకు నాబాలుం డైదు వంవత్సరములు గలవాడై సకల
విద్యలు నేర్చుకొనుచుండ నా బాలునకు పదునాఱుసంవత్సరంబు లాయెను.

ఇట్లుండ రాజునకు నొక్క నేత్రమున జాడ్యంబు గలిగి వైద్యులంబిలి
పించి దీనిని మాన్పుండన వారలు మాతరంబు గాదనిరి పిమ్మట నొకయో
గీశ్వరుండాయూరుచేరి రాజునుంజూచి నందిశిఖరంబుననుండు కంటికానుగు
ఆకుతెచ్చి మర్దించి పట్టువేసిన మానుననెను. పిమ్మట రాజు చిన్నభార్య
కొమారులిరువురు ఆయాకును మేము గొనివచ్చెదమని పోయిరి మఱియొక
నాడు ఆరాజు పెద్దభార్య మంత్రిసింజూచి ఓ నాయనా రాజుగారికి శరీరము

స్వస్థత లేకున్నదట. అతడు క్షేమముగా నుండినగదా మేమీా పసుపు కుంకమున కర్హులమగుదుము. చిన్నభార్య కొమాళులిరువురు కంటికానుగుఆకు తేబోయిరట, యెంతదూరము పోయిరో యెన్నాళ్లకు వత్తురో తెలియదని విచారింపుచుండు సమయమున నచ్చటనున్న రాజసూనుం డామాటలువిని ఖడ్గంబునుబూని తల్లియెదుట నిలువంబడి ప్రధానింజూచి మీారెవరు నాతల్లి యేది తండ్రియెవరు నిజంబుచెప్పితిరాసరే లేకున్న మిమ్ము నీఖడ్గంబున కాహారంబు గావించెద నని ఝళిపింప మంత్రి గడగడవణకి అయ్యా కూర్చుండుమని తొడలపై కూర్చుండ బెట్టుకొని జరిగినసంగతి యెల్లయు సవిస్తరంబుగా జెప్పినవిని రాచకుమారుండు నేనుపోయి కంటికానుగు ఆకు తెచ్చెదను సెలవుదయచేయుండన వారలు నీవేమియెఱుగుదువు అంత దూరంబునకుబోయి యేలాగు సంపాదింతువు నీవలనం గాదు పోవలదనిన నాబాలుం డిట్లనియె. ఓతల్లీ నేను పుట్టినది మాతండ్రి గుర్తెఱుంగడు. నాయన క్షేమంబుగనుండినకదా నీగుర్తులు వారికి జూపించి మెప్పింతువు గనుక చద్దికావడి కట్టియిమ్మని తానుభోజనంబుచేసి నడుము కట్టుకొని నూరువరహాలు తీసుకొనిఖడ్గాయుధపాణియైపైనంబై మార్గంబున బోవుచు నొక్క గ్రామంబుజేర నాగ్రామంబున కంచుకియను వేశ్యయొక్కతె యిష్టంబు గలవారు నాతో జూదంబాడి నన్నోడించిన వారికి నాసర్వస్వము సమర్పించి వారికి నేను ఊడిగంబుజేసెద. వారు నాకు నోడిన నాయింట చాకిరిచేయుచు నుండవలయునని శాసనంబువ్రాసి మొగసాలలో పెద్దగంట యొకటి యేర్పరచి వచ్చువారలు ముందుగా ఆ గంటను మ్రోగించి తన గృహంబు ప్రవేశించ వలయునని ప్రచురంబు చేసి యుండె దానిని నా రాజ కుమారుండు గాంచి, మనము పోవుపనియో తొందరయైనది ఇప్పుడీ వేశ్యతో మాట్లాడుటకు సమయంబు కాదు తిరిగివచ్చునెడ నాలోచింతమని సాగి ప్రయాణమైపోయెను. ఇట్లు గొంతదూరంబుజని నట కల్యాణుండను రాజు కమలాంబయను భార్యనుంగూడి సుగంధియను కుమార్తెనుంగాంచి రాజ్యంబు సేయుచుండె ఆ పట్టణంబున కారాజసూనుండు చని యందొక పేదరాలి పెద్దమ్మయింటికి నరిగి వకవరహాయిచ్చి అవ్వానాకు సౌఖ్యముగా అన్నము పెట్టుమని కొంతసేపు అటపరుండి యుండెను. ఆముసలిదియు వంటచేసి యాతనికి స్నానంబునకు నీళ్ళిచ్చి ఆహారంబుపెట్టెను. అతడు భుజియించి యోయవ్వా నీపట్టణంబున వింతలేమైనంగలవా యునియడిగిన నామెయిట్లనియె? నాయనా యేమిచెప్పుదును ఈ నగరంబేలు రాజుగారికుమార్తె బహుచక్కనిది దానిపేరు సుగంధి

యనుచున్నది. దానిని బెండ్లాడవలెనని సకలదేశ రాజన్యులు వచ్చి దానిచే నిర్మింపబడిన యంత్రంబును గొట్టజాలక తప్పి మందమతులై వెళ్లిరి. ఇంత వఱకు నాయంత్రం బాలాగుననే యున్నది. దానిని పడగొట్టినవారిని తాను వివాహం బాడెదనని శపథముచేసి యున్నది యనిన నతండు సంతసించి తక్షణంబా రాజు సభామండపంబునకరిగి యందుండిన మంత్రి పురోహితులం జూచి మీ ప్రభువు వచ్చినా లేనియెడల నతనిత్వరితముగ రప్పింపుడు నేనీ యంత్రమును బడగొట్టెదనని పలికిన నామంత్రి చిఱునవ్వునవ్వి యోహో బాలరాజా! నీవు పసితనముచేత దృణీకరించెదవు. దిగువనుండు యర్థము లో లక్ష్యముంచి యొకబాణమున నీయంత్రమును గొట్టుటకు దేవతలకైన నలవికాదు. పెక్కు యుద్ధములలో దేఁటిమిగులశూరులైనయంగ, వంగ, కళింగ కాశ్మీర, మాళవ, నేపాళ, ఘూర్జర, కుకుర, బర్బర, సింధు, సౌరాష్ట్ర, పారసీక కొంకణ, కోంకణ, దేశాధిపతులువచ్చి యీ యంత్రమునుజూచి ప్రకంపితశరీరులై డెందముల్లలెయగా ముఖములువాడగా దలలువంచుకొని విముఖులై యున్నారు. అయ్యయ్యో నీకు సాధ్యపడ నేరదు. పొమ్మనిపలికిన నతడు గోపించి నేత్రములెఱ్ఱజేసి నీవు మాట్లాడవద్దని పలికి దిక్కులుగంపించునటుల ధనుష్టంకారముచేసి వాడియైన నొక్క బాణమును విటసంధించి యూర్థములో లక్ష్యముంచి ప్రయోగించెను. ఆబాణము త్రేతాగ్నుల నావహింపజేసికొని యగ్నికణములను దొరగించుచు జిటిలి పెటిలియను శబ్దములను అనేకఘుంటల రవములనుగలిగి నాలుకలు సాచుచుంబోయి యాయంత్రమును బడగూల్చి సౌమ్యరూపము తోడవచ్చి యతని తూణీరంబున ప్రవేశించెను. దివిజలు మింటియందుండి యతనిం గీర్తించి దేవ దుందుభులను మ్రోగించిరి ఆరాజు లందఱు నితడింద్రుడో చంద్రుడో వరుణుడో గాక మానవుడుగాడని ముక్కులమీద వ్రేలుబెట్టుకొని యతనిగీర్తించి గొల్లుంజేతులుతట్టిరి ప్రతిధ్వనులిచ్చునటుల జయభేరులు మ్రోయుచుండెను. కళ్యాణేశ్వరుడు నానందంబును జెందియల్లుని నాలింగనము చేసికొని మహాత్మా నావంశమును బావనము చేయుటకై యవతరించిన పుణ్య పురుషుండవని పెక్కువిధంబుల గీర్తించెను. అంతనా రాజపుత్రి క్రొక్కాఱు మెఱుంగుపగిది నారాజ సూను నేత్రంబులకు మిఱుమిట్లుగలిగించుచు మత్తగజముభంగి వేయిచెలికత్తెలతోడనువచ్చి యతనికంఠంబున పూలమాలిక ధరియించెను. అంత నాపృథ్వీపతి యల్లునిపట్టపు టేనుంగుమీదం గూర్చుండబెట్టుకొని మంగళవాద్యములతోడ నగరులోనికిం గొనిపోయి యతనివృత్తాంతము నడిగి తెలిసికొని యత్యంతసంతోషముతో

శుభ ముహూర్తంబున వివాహంబు గావించెను. పిమ్మట నారాజపుత్రుం డొకదినంబున నతనిభార్యతో నేను కంటికానుగు ఆకు తేబోవు చున్నాను. నాపనితీర్చుకొని తిరిగివచ్చుచున్నానని చెప్పగా నాసుందరి ఓయీ రాజకుమారకా నీకాయాకుయెట్లులభించును. అదిదొరకునట్టి ఉపాయంబు జెప్పెదను వినుము ఇక్కడికి పదియామడల దూరంబున వజ్రపురంబను పట్టణంబుగలదు. ఆరాజ్యంబును మదన భూపాలుండనురాజు స్థిరప్రజ్ఞుడను మంత్రితోగూడి రాజ్యపాలనంబు సేయుచు ముద్దుల వనితారత్నంబగు కంజాక్షియనుభార్యను జయసేనియను కూతురింగాంచి యున్నాడు. ఈ భామిని దేవతాస్త్రీ యయ్యు కాలవశంబున నీలాగు రాచకుమార్తెయయ్యె నామెను నీశక్తియుపాయంబుచే జయించి పెండ్లాడిన నామెమూలంబున జయంబు జెందగలవని చెప్పగా నతడు అత్తమామల యనుజ్ఞ వడసి ప్రయాణమై యరణ్యంబు జొచ్చి వేటాడుచు దుష్టమృగంబులైన వ్యాఘ్రములను నఱికివ్రేయుచు, బొదల లోడాగియుండిన పులులను లేవగొట్టి బాణములతో గూల్చుచు, నీప్రకారమాయడవియంతయు నల్లకల్లోలముగావించి గుహాలలో దూరుచు చీకటికోనలో జొచ్చుచు నిర్భయముగా లయకాలరుద్రునివలె దుష్టమృగంబులనుమాడుచు బహుదూరంబు జని యచట కణ్వమహాముని యాశ్రమంబు గాంచి యందు ప్రవేశించి తపోవృత్తినున్న యామహామునింగాంచి వీరిని నాశ్రయించి యొక్కమహామంత్రంబు గైకొని యనుభవించితిమేని మనజన్మసాఫల్యం బగుటయేగాక మనమిపుడుపూనిన యీకార్యంబునకు ననుకూలంబుగాంచవచ్చునని యోచించి మనోనిశ్చయంబు జేసి యమ్ముని పాదంబుల పైవ్రాలి మునీంద్రా మదనభూపాలునికూతురు నన్నువరించునటులును నేబోవుకార్యంబును నాకు జన్మసాఫల్యంబగునట్లు ఒక్క మహామంత్రంబు నుపదేశించుడి. మీరే గన్నతండ్రి గతి నాకనులకు గాన్పించి నన్నుగడ తేర్చుటకు మీకన్న నితరులు గాజాలరనినమ్మి మీపాదంబులు బట్టుకొన్నాడను నన్ను గృతార్థుని జేయుమని యనేకవిధంబుల ప్రార్థించు రాజసూనుని గారవించి యతని మనోనిశ్చయంబు దెలిసికొని కరుణారసంబుగలవాడై దగ్గఱగూర్చుండబెట్టుకొని బరమపావనమయిన పంచముద్రల నికనుబోధించెదను. శివమూర్తి నీకిష్టసిద్ధియును మోక్షమును నిచ్చునని పలికి యామునిచంద్రుండిట్లనియె.

నాప్రియశిష్యా! శ్రద్ధాశక్తుండవై దేవరహస్యముల జెప్పెదను వినుము. పెక్కండ్రు గురుముఖంబున ద్వాదశాక్షరీ మహామంత్రమునుగ్రహించి పుణ్యలోకంబు జెందిరి. నీవును వానిని ధరించుమని యాద్వాదశాక్షరము

{ కణ్వమహాముని చిరకీర్తి మహారాజునకు జెప్పిన పంచముద్రల ప్రభావంబును యోగముల విధాయకంబును. }



లుండు స్థానములను జూపించి ఓంకారమున నిలిపి యాప్రణవ స్వరూపుని వర్ణించిచెప్పి రాజకుమారా? సద్గురూపదేశములచేత ఈపంచముద్రల విషయములను చక్కగా తెలిసికొని అభ్యాసముచేసి ఓంకారమందలి చిణిచిణిఘుంటా శంఖవీణా తాళ వేణు భేరీ మృదంగ మేఘనాదములను విని జ్ఞాతృమనోబుద్ధి చిత్త అహంకారములను సమష్టివ్యష్టి భేదములనువదలి యీశ్వర జీవచైతన్యములను విచారించెనేని ప్రణవలక్ష్యార్థమైన పరబ్రహ్మము తాననెడు నిర్వికల్పస్థితి లభించునుగనుక కన్నులుమూసియైనను మూయకయైననుండి చూపునుద్రిప్పి కనుబొమలనడుమనిలిపి మీది దిక్కుననున్న చిదాకాశమును చూచుచుండెనేని ఖేచరిముద్ర యనందగు దీనికి నధిష్టానదేవత యాకాశంబు కన్నులను కదలింపక తనముక్కుకొనను మక్కువతో చూచుచుండెనేని భూచరీముద్ర యనందగు దీనికధిష్టాన దైవంబు పృథివి కన్నులు సగము మూసి ముక్కు నడుమను గ్రక్కున చూపులునిలిపి మీదనున్న నుదురును కుదురుగ జూచుచుండెనేని మధ్యమ లక్ష్యముద్రయని తెలియందగు. దీనికి సూర్యచంద్రు లధిదేవతలు. చెవులను, కన్నులను, ముక్కులనుమూసి బహిర్ముఖమైన దృష్టిని మనస్సునులోనడంచిన అంతర్ముఖముద్రయని యొన్నందగు దీనికధిదేవుండుగురుండు, ప్రాణాదిదశవాయువులును, మనస్సుమొదలైన పదునాలుగింద్రియంబులను జయించి కన్నులు తెఱచుకొని చూపులను చిదాకాశమున నిలిపి అక్కడవింతలు చక్కగజూచి చొక్కియుండెనేని శాంభవీముద్రయని పేరందు, దీనికధిదేవత సదాశివుండు, అగ్నిమండల సూర్యమండల చంద్రమండలములయందలి ముప్పదియెనిమిది కళలను చూచుటకు సాధనములైన అం

తర్లక్ష్యముగల ఖేచరీ షణ్ముఖి శాంభవీ ముద్రలును బహిర్లక్ష్యముగల భూచ
రీముద్రను మధ్యలక్ష్యముగల మధ్యముద్రను యమనియమాద్యష్టాంగ యో
గములను వాడుకకు తెచ్చుకొనెనేని ఓంకారమందలి దశవిధనాదములను,
చిద్బిందువును, ఆబిందువందలి చిత్కళను, ఆలింప దర్శింపవచ్చును. బ్రహ్మ
జ్ఞాని జ్ఞానేంద్రియ కర్మేంద్రియములకు రాజైన మనస్సును వశపఱచుకొని
యితర చింతలేక ఓర్పుగలిగి నేర్పుతో నాద బిందుకళలను దర్శింపుచుండె
నేని నేనేపరబ్రహ్మమనెడు విజ్ఞానము ప్రబలి నిరతిశయానందమందు మును
గుచుండును. గాన వీని నన్నిటిం బరీక్షింపుము నీకు దోచిన విషయంబులు
చెప్పుమనిన? రాజపుత్రుండు నిండు వైరాగ్యంబుతో సమాధియందునిలిచి
యొక్కొక్క ముద్రనుంబట్టి చూచుచు, నందుదోచిన వింతలన్నియు సాము
నీంద్రుని కెఱుకపఱచినతండతని సూక్ష్మజ్ఞానంబునకు సంతసించి ముద్దుకొ
నెను. అనిచెప్పిన నంజనీసూనుండు సంతోషసాగరంబున మునింగి ముకు
ళితహస్తుండై భక్తజనబాంధవా యా చిరకీర్తిమహారాజు వృత్తాంతం బెటు
లయ్యె నెఱింగింపు డనిన నా భగవంతుం డిట్లనియె.

ఆ చిరకీర్తి మహారాజును తన గురుండైన ఋషిశ్రేష్ఠునకు వివిధశు
శ్రూషలుగావించుచు నిండువైరాగ్యంబుతో నామునియొసంగిన మంత్రం
బును మననంబు గావించుటచేత నా భగవంతుండు ప్రసన్నుడై యదృశ్య
కరణీయంబను మంత్రంబు నుపదేశించి యంతర్ధానము నొందెను. ఆ రాజ
పుత్రుండు మునీంద్రునకు నమస్కరించి శ్రీ భగవానులొసంగిన మంత్రంబు
జెప్పిన నా మహాత్ముండు నాయనా! నీవీమంత్రంబును జపించుచుండిన నీవె
వ్వరికిని గనుపింపవు, ఘోరరక్కసియైనను ఎదురొడ్డి రూపుమాప నేర్తువు.
నిర్భయముగాబొమ్మని సెలవిచ్చిన నా ధీరుం డామునిపాదంబులకు బ్రణమిల్లి
తిరిగి వచ్చెదనని చెప్పి నా యరణ్యంబుజొచ్చి కొంత దూరంబున వజ్రపురం
బను పట్టణంబునుగాంచి యందు బ్రవేశించెను. ఇట్లు ప్రవేశించి యారాజు
గారు తనచే నిర్మింపబడిన యంత్రమును నెవ్వడు నొక్క బాణంబుచే దుని
యలుగా జేయుచున్నాడో వానికి తన కూతురునిచ్చి వివాహంబు సేతునని
ప్రతిజ్ఞ చేయుటయు, ఆ యంత్రమును గొట్టుటకు మానవులకు నలవిగానం ప
లకై విచారంబు నొందుటను తాను శపథంబుతీసి రెండువత్సరంబులై నది
యు, నంతదనుక ఎవరుంగాని నా యంత్రమును సాధింపలేక ఖిన్నులై పోవు
టను మదిందలచి విచార మొందుటను నా రాజసూనుండు విని తక్షణంబా
రాజుచే నిర్మింపంబడిన యంత్రంబుకడకుం బోయెను. ఇట్లు పోవుటను ఇతర

దేశరాజులందఱునుజూచి విస్మయమంది ఓహో! ఇతడొక మునిపుత్రుడుగా నుండును. కృష్ణాజిన దండకమండలు జటావల్కలములును నార చీరెలును ధరించిన తేజోవంతుడు ఈసన్యాసి యస్త్రశస్త్రములనుధరించి యంత్రము చెంతకుంబోవుట మిగుల వింతగా నున్నది. ఆహా యీజయసేనియనుసుందరి రత్నం బీసన్యాసికి సంభవించు నేమోయని వ్యసనపడు వారును, త్రిమూర్తులలో నొకరీవేషమును ధరించి వచ్చియుందు రనువారును నుత్తములగు యోగపురుషులకు నలవిగాని దొకటికలదా యనువారలును, నీప్రకారము పలుతెఱంగుల భాషింపుచుండిరి. ఆచిరకీర్తి మహారాజు రాజులచెవులు చిందఱబోవునట్లు ధనుష్టంకారముచేసి వింట బాణమును సంధించి యుద్దములో జూచి సద్గురువును మనంబున ధ్యానించి దృష్టిముష్టికింజేర్చి ప్రయోగించిన నది యనలరూపంబునుబొంది యగ్నికణముల దొరగించుచు జిటెలిపెటిలి యను శబ్దములతో నాయంత్రంబును భూమిమీద బడగొట్టెను ఆభూపాలుండు ముక్కుమీద వ్రేలుపెట్టుకొని యోహోహో యిదే మన్యాయము. ఈమునిపుత్రుం డెందుండి యిందులకే తెంచె, సునాయాసంబుగా నీయంత్రంబును గొట్టుటకు గారణంబేమి? నాముద్దులబిడ్డను దయమాలి యడవుల పాలెట్లు చేయుదును? ముందుగానే యీయంత్రమును మార్పాటుచేయనందున నింత దుఃఖంబు జెంద వలసివచ్చెనని దుఃఖితుండై మూర్ఛాపరవశుండాయెను. ఆజయసేని మంచి తెలివి గలది యగుటంజేసి తండ్రిని మూర్ఛనుండిదేల్చి లేవదీసి నాయనా? ఈమహాత్ముం డింద్రుడో చంద్రుడో గాక సామాన్యమైన మునిపుత్రుండుగాడు శరీరము శుష్కించి జటావల్కలములు ధరించియుండినను ముఖమునందు రాజకళలు తాండవమాడుచున్నవి. అనిన అంత యీరాజేంద్రుడు సంతసించి యీమహాత్ముని నాలింగనముచేసికొని పుణ్యాత్మా నావంశమును పావనంబు సేయుటకొఱకై యవతరించిన దివ్యపురుషుం డవని కీర్తించి జయభేరి మోగించెను, ఆజయసేనియు నత్యంత సంతోషముతో వేయిచెలికత్తెల నడుమ దొలకరి మెఱుపుతీగవలె ప్రకాశించుచుబోయి యతనికంఠమున పుష్పహారమువైచెను. ఆమదనభూపాలుండు అల్లుని దనపట్టపుటేనుగు మీదం గూర్చుండబెట్టుకొని నగరులోనికింగొనిపోయి జటాబంధంబుల వదలించి తైలస్నానముచేయించి దివ్యవస్త్రాభరణములనిచ్చి విందులుగావించుచు మంచి సుముహూర్తంబున వివాహంబుగావించెను. ఇట్లు గొంతకాలం బచ్చట నేయుండి సుఖభోగంబు లనుభవించుచు తాను వచ్చినకార్యంబు తనభార్యతో నెఱుకపఱచిన నామెయిని ఇట్లనియె.

ఓ ప్రాణనాయకా! నీవు గోరినయాకు నీకు లభించుటదుర్లము అచ్చటి శిఖరంబున నొక అంధ రాక్షసి యున్నది. దాని కూతురి యుద్యాన వనంబున నా కంటి కానుగు ఆకుగలదు. ఆ యాకును నేమారక బగటియందు నా రాక్షసి కావలియుండును. రాత్రివేళలందు నా రాక్షసి పగటియందు నీ చెట్టునొద్ద పరుండిన కారణంబున నా గాలి స్పర్శనంబుచే గన్నులగుపడుట వలన సంచారంబుచేసి తెల్లవాఱకమున్నె తన నివాసంబువచ్చి చేరును. ఆయాకు లెవ్వరైన ద్రుంచిరేని దానికనులకు మసకలుగప్పి గన్నులంగానక బొబ్బలు పెట్టుచువచ్చి చెట్టుకడనున్న వారిని హరింప చేయుచుండును. గాన నీవచటికిం బోదగదని యెన్నివిధంబులు జెప్పినను వినక అత్తమామల సెలవంది వాడియైన బాణంబులగైకొని కణ్వామహాముని యుపదేశించిన మహామంత్రంబును జపించుచు నాకొండనెక్కి యాశిఖరముసకుంబోయి యొకమరుగు ప్రదేశంబున గూర్చుండి అక్కటా దేవేంద్రునకు నలవిగాని యీఘోర రక్కసిని నెటులసంహరింతును. నేగోరివచ్చిన యాకు నెటుల గ్రహింతును. అని యోచించుచుండునెడ నారక్కసి ప్రొద్దుగుంకిన వెనుక బైటవచ్చి యా రాజకుమారునిం గనజాలక కూతలార్భాటము చేయుచు సంచారంబునకుం బోయెను. ఆ చిరకీర్తి యా రక్కసి రూపంబుగాంచి వెఱుగుపడి తనకు దైవసహాయము గలుగునని ధైర్యమును తెంపును, సంతోషమును జెంది లేచి యావనంబు ప్రవేశించి నా చెట్టుకొమ్మ పట్టుకొని విఱిచినంతలో ఆరక్కసి దిక్కులు గంపింప బొబ్బలుపెట్టుచు వెనుకకుదిరిగి వచ్చుచుండుటం జూచి యా రాజచంద్రుండు ధనుష్టంకారముచేసి పిడుగుల వంటి మూడు బాణములను దానియురమునందు గ్రుచ్చిన నదిచలింపక శత్రువునుగానక మింటికెగసి నలుదిక్కులకుంబారి యెవ్వరిం గనలేక మగుడవచ్చుచుండినం జూచి తనగురువును మనంబునధ్యానించి యొక్కవాడియైన యస్త్రంబును బ్రయోగించెను. ఆబాణము ఘోరరూపంబును బొంది దానియురమున నాటి వీపున దూసిపోయిన నారక్కసి రుధిరమాంసములను గ్రక్కుచు విలవిలదన్నుకొని ప్రాణములువిడిచెను. అంతట నా రాజసూనుండు ఆరాక్షసిచెఱలోనుంచబడిన భ్రమరవేణి పద్మగంధియను రాజకుమార్తెల నాదరించి వారిని గాంధర్వవివాహంబున గ్రహించి వారిరువురిం దోడ్కొని మదన భూపాలుని పట్టణంబునకు వచ్చి భార్యయగు జయసేనిం బిలుచుకొని మామగారివలన చతురంగబలంబులగైకొని కణ్వామహాముని యాశ్రమంబుజొచ్చి మునిపాదంబులకు నమస్కరించి తాను ఆశ్రమంబు విడిచి పోయినది మొదలు నంత

రకు తాగాంచిన సుఖంబును గష్టంబులును విన్నవించి మునిడెందబు నానందం బుచేసి వారి యాశీర్వాదంబుగాంచి నిజగ్రామంబున కేగుటకు సెలవంది కల్యాణుని పురంబుజేరి పెద్దభార్యయగు సుగంధిని బరిగ్రహించి నిజనగర గమనోన్ముఖుండై వచ్చుచు త్రోవలో కంచుకియను వేశ్య ప్రచురించిన శాస నంబునుంగాంచి దీని నోడించి దీనియాడిగవు దానిగా జేకొనవలయునని నిశ్చయించి తనభార్యల నలువుర నొకవిడిది యింటనిలిపి తానొకవీథిం బట్టి పోవుచు ఆ వేశ్యయింటి పొరుగుననున్న నొక ముసలిదానింగాంచి దీనివలన మనకార్యంబు సంఘటించునని తలంచి యాముదుసలి కెదురుగాపోయి త్రొక్కి పాదములమీదబడి అయ్యో యని మిక్కిలి దుఃఖించువానివలె నేడ్చుచుండగా ఆముసలిది తటాలున వానినెత్తి నూరార్చి నీవు ఎవరవు ఎచ్చటనుండి వచ్చుచున్నావు నీవు పిచ్చివాడవా లేక కష్టముల ననుభవింపజాలక దుఃఖించెదవా చెప్పుమని యడిగెను. అప్పుడా రాజసూనుండు మిగుల దుఃఖము గల వానివలె దానిముందు వెక్కి వెక్కి యేడ్వసాగెను. పిమ్మట కొంత నెమ్మది పొంది తనవృత్తాంత మంతయును చెప్పుట కారంభించెను. ఓయవ్వా నేనొక బాటసారిని నేను నాతల్లి దండ్రులచేత వెళ్లగొట్టబంపి ఆదరించు వారులేక శక్తిని బోగొట్టుకొని దుఃఖించెడి దిక్కులేనివాడను. భిక్షమెత్తి జీవింపను గూడ యోగ్యతలేనట్టి మహాపాపిని. నాకొక యవ్వగలదు ఆమెను ఆదిదేవుడైన శ్రీమహావిష్ణువు తప్ప వేరురక్షకులు లేక నన్ను చేయివిడిచిపెట్టి ఆమె మృతినొందెను. పిమ్మట నేను దిక్కునులేని పరదేశినై దేశ దేశంబులందిరిగి యిప్పుడు నిన్నుంగాంచి నీయందు నాయవ్వయొక్క అందము చందము ప్రాయముండుటనుచూచి నాకుపట్టగూడని దుఃఖముగలిగి నీపాదములపైబడి యేడ్చితిని కాని వేఱొక కారణంబులేదు. నీవు నాయొక్క కష్టములనంతయు నీకంటితో చూచి నీపరిపూర్ణ అనుగ్రహముచే నన్నాదరింపవలయును. అట్లు నన్ను చేయివదలక కాపాడినట్లయిన నేను నీయిష్టప్రకారము నడుచుకొనువాడను ఇకను నీ పేరు చెప్పుకొని నాప్రాణములు నిలుపుకొనెదను అని మిక్కిలి అణకువతో చెప్పెను. అంత నాముసలిది యారాజపుత్రుడు చెప్పినట్టి దివ్యవాక్కులనువిని నిప్పును చూచిన మైనమువలెకఱిగి ఓ బాల కుమారకా! నాకును ఈలోకమునం దొకరును లేరు నేడు మొదలుకొని నీకు నేనవ్వగాను నీవు ముద్దుల మనుమడుగాను భావించుకొంటిని నీవు దేనికి భయపడకుము. నీ మనస్సుననుండు దుఃఖమును నేటితో తీసి అవల పారవేయుము అని చెప్పెను. అటుపిమ్మట ఆ రాజపుత్రుడు దుఃఖసాగరంబున మునింగి కంచుకిని జయింప

వలయునని అభిప్రాయమును తలంచినవాడై కొంతకాలము గడపెను. అట్లుండగా కొంతకాలమునకు నిద్దఱు శరీరప్రాణములవలె స్నేహముకలవారైరి. ఇట్లుండ ఒకనాడు ఆ ముసలిబానితో ఆయాదేశపు సంగతులను మాట్లాడుకొనుచు నిరువురును సంతోషముగా నుండెడు సమయమున నిదే మంచి సమయమని తలచి యా మాటలతో కలిసినట్టుగానే నా ప్రియమైన అవ్వా యీ నగరము నందుండు కంచుకియను వేశ్యతో పగడశాల ఆడుటకు సమర్థులగువార లెవ్వరును లేకుండుటకు కారణమేమో తెలియలేదు. దానియొక్క మర్మమునంతయు నేదైన నీకు కొంత తెలియునా యనియడుగగా దానికా ముసలిది నా ప్రియమైన మనుమడా యీసంగతి మిక్కిలి సులభమైనది. నీవు దీనిని మాత్రము నీకెట్టిస్నేహితులైననప్పటికిని తెలుక చేయవలదనిన రాజపుత్రుండు నావిషయమందు నీవుదయచేత చెప్పినమర్మములను చెప్పుదునా నీకే హానిగలిగినను నాకు గలిగినట్లుగాదా! గాన నేనెవ్వరితో చెప్పనని వేడెను. అంత నాముసలిది వీనియొక్క సత్యమును ప్రేమయును మొదలగు గుణములు తనయందుంచి యుండుటచే రహస్యముగా మంత్రమువలె చెప్పందొడంగెను.

నా ప్రియమగు ముద్దులమనుమడా అదియొక పిల్లిని నెలుకను పెంచి యా రెంటిలో పిల్లి తలమీాద దీపముపెట్టి అది క్రిందపడునట్లు ఎలుకను ఆ దీపపు నీడయందు మరుగులో దాగియుండునట్లును ఉంచి దానికి మనస్సునకు తగినట్టు పాచికలు పడకుండినట్టయిన పిల్లి తనతల నాడించడమును ఎలుక పాచికలను చక్కగాపడునట్లు పొరలించును. ఈరీతిగ దానికి నేర్పించి పగడశాల ఆడుచుండుటచేత అది యెవరిచేతను నోడిపోక బహు దినములుగా తానే గెలుచుచు వచ్చుచున్నది. అందుచేతనే జూదమాడునట్టి రాజపుత్రులు మొదలగువారు జయములేక యోడిపోవుచున్నారని ఆ మర్మమొకటిని దాచక చెప్పెను. అదియంతయు చక్కగా చెవియిచ్చివిని రాజపుత్రుడు అదే జ్ఞాపకముచే దానియొద్ద సెలవుపొంది సేరుగా యంగడికివచ్చి యొకముంగిసయొక్కపిల్లను సంపాదించి దానిని తనభార్యలుండు చోటునకుం గొనిపోయి దానికి తనచొక్కాయి జేబులో నిలిచియుండునట్లును వ్రేళ్ళు నెటికలు విరచినట్లయిన జేబులోనుండి బయటికి వచ్చునట్లును మరల నెటికలు విరచినట్లయిన మరల జేబులో దాగియుండునట్లును దానికి కొన్నిదినములు చక్కగ నేర్పించెను. అంత నా రాజసూనుండు వేశ్యను జయింపవలెనను తలంపుతో సకల వస్త్రాభరణ భూషితుండై మిక్కిలి వేగముగల గుఱ్ఱము నెక్కి ఆ వేశ్యయింటి సమీపంబునకుంబోయి గుఱ్ఱముదిగి యచ్చట మొగసాలలో యుండుగంటను

వాయించి తోడనే ఆటంకములేక లోపల జొరబడివచ్చునట్టి ఆడంబరములను ఆదాసిచూచి ఆవేశ్యయొక్క ముఖవిలాసము తప్పిపోయెను. తోడనే యెదుర్కొనివచ్చెడి ఆరాజపుత్రుడు దానినిచూచి యిట్లనిచెప్పదొడంగెను. ఓచిన్నదానా నీవు బహుకాలముగా నీనగరమునకువచ్చెడు దేశాంతరులనుగూడి మిక్కిలి యానందించుచున్నావు. నేనీపట్టణమునందుండిన వారిలో గొప్పవానిగా నుండగా నాతో నీవు ఇష్టముగలదానవై కలిసియుండుటలేదు ఇప్పుడు నాయొద్ద నేదైననుండిన నీయిష్టము నెరవేర్తునని చెప్పగా నదివిని గొప్పరత్నములచే పొదగబడిన కుర్చియొకటి తనపనికత్తెచే తెచ్చివేయ నట్లాజ్ఞాపించి దానిపైగూర్చుండుమని చెప్పగా ఆరాజపుత్రుడాపీఠమునందు గూర్చుండెను ఆవేశ్యయు క్రిందనొక పార్శ్వంబున గూర్చొనియుండు నవసరంబున సూర్యాస్తమయంబయ్యె. అంత నాచిరకీర్తి ఆవేశ్య ముఖమునుజూచి నీవు జూదంబు లాడుటయందు మిక్కిలి అపేక్షకల దానవని ఇదివఱకే వినియున్నానుగనుక మనమిద్దఱమును చెఱియొకయాట ఆడుదము రమ్మని చెప్పెను. అది విని యావేశ్య యారాజపుత్రునితో కలిసి యాడుటకు ఇష్టములేనిదై యుండుటను నాధీరుండుగని ఆవేశ్యతో నిట్లనియె. ఓ భామినీ నీవు ఆయాదేశపు దేశాంతరులను నీయొక్క కపటజూదమున నోడించినట్లు నన్ను నోడింపజూచినను నాయొక్క గంభీర ఔదార్యములనుజూచి సిగ్గుపడి వెనుక చిక్కినను నిన్ను వదలనుగనుక నాతో జూదమాడవలయునని చెప్పెను. ఈరీతి వీడు చెప్పిన దంతయువిని మనము ఈలోకమునందు పాచికలాడుటయందు సామర్థ్యముగల దానవని పేరంది యిప్పుడీతనితో నాడకుండినట్లయితే మిక్కిలి యవమానము కలుగునని తలంచి తోడనే ఆపాచికలసంచిని తెమ్మని క్రింద పఱచి పిల్లి తలమీద దీపముపెట్టి ఆటకు లక్షరూపాయలు పందెముపెట్టి పాచికలను దొర్లించిరి. అంత రాజపుత్రునికి ఆమర్మము తెలిసియుండియు మొదటి యాటను నోడిపోయెను. ఆవేశ్యయు మనపిల్లి యెలుకయొక్క సామర్థ్యముచేతనే మనము గెలిచితిమని సంతోషించి మరల రెండోతూరియు పందెము పెట్టి యాటనారంభించెను. అది యట్లుండగా పాచికలను దొర్లించుటలో నిది యోడిపోవునట్లు అగుపడెను అప్పుడా పిల్లి చూచి తలయాడించగా అంతలో నెలుక ఆపాచికలను పందెము గెలుచుటకు పొరలించుటకు సిద్ధముగానుండెను. అంతట చిరకీర్తి తన కంటిచూపుచేత పిల్లిచేయు పనియంతయును ఆదీపపు నీడలయందుండి పాచికలను అతిలాఘవములో పొరలించునట్టి యెలుకయొక్క సామర్థ్యమంతయు ఆరాజపుత్రుడుచూచి తనచేతి వ్రేళ్లను నెటికలు విఱువనారంభించెను తోడనే తనచొక్కాయి జేబులోనుండి ముంగిసపిల్ల తటాలున ఒక ఱెప్పపాటులోదుమికి బయటవచ్చెను. దానిని

జూచి యెలుకభయబడి మరల రాకనేపోయెను పిల్లియును దిగులుపడి తలమీదనుండెడి నేను దీపము బడవైచి అదియునుపోయి దాగెను. అంత రాజపుత్రుడా వేశ్యనుంజూచి నీవు మిక్కిలి ధనవంతురాలవని పేరు తెచ్చుకొన్నను నీయింటను దీపపుసెమ్మె తీసికొనుటకు అనుకూలపడ లేదాయనిన దానియొడలు ఝల్లుమని చెమ్మటచే నీళ్ళు ధారధారలుగా దేహమున గారెను.

పిమ్మట నొకదీపపు సెమ్మెను తెచ్చిపెట్టుమని చెప్పి తెప్పించుకొని ఆడుట కారంభించిరి ప్రతియాటయందు రాజపుత్రుడే గెలుచుచు దాని సర్వస్వమును నపహరించెను. అప్పుడు దానియొద్ద యేడుకోట్ల రూపాయలున్నవి అప్పుడా ధనమునుగ్రహించి నావేశ్యనుతోడ తీసుకొని తమప్రయాణమునకు కావలసిన వస్తువులను సిద్ధపరచి ఓడనొకటి తయారు చేయునట్లు తనభటుల కాజ్ఞాపించిన వారట్లు చేసిరి, అంతలో చెఱసాలయందున్న కావలిభటులు రాజపుత్రుని నెదుర్కొనివచ్చి మిక్కిలి వినయముతో అయ్యా కళింగ పట్టణపు రాజపుత్రుల విషయమై తామేమి సెలవిచ్చెదరు ఆసంగతి యొకటియు తెలియజేయలేదని యడుగ రాజపుత్రుండు వేశ్యనుగాంచివారు తనతమ్ములన్నియు వారిని వదలవలెనని చెప్పి తమ్ముల వెంటబెట్టుకొని తనభార్యలుండు స్థలంబునకువచ్చి వారిని బిలుచుకొని ఓడయెక్కి తమగ్రామరేవునందు లంగరువేసిరి. ఇంతలో రాజుచిన్నభార్య పుత్రులు అన్నా మనతండ్రిగారికంటికి కానుగు ఆకు తెచ్చితివిగాన నెక్కడ దాచినావనిన నతండు వీరిమోసంబులను గనజాలక యిదిగో చూడుమని వారిచేతికిచ్చెను అంతనా రాజసూను లిరువురు తనయన్నను జంపిననేగాని యీయాకు లభింపదనియు రాజసన్మానంబు కలగదనియు నిశ్చయించి వానిని సముద్రంబున బడద్రోసి యోడదిగి వారువెళ్ళి యీయాకును రాజుగారికంటికి పట్టువేయించిరంత రాజేంద్రునకునుచూపుగలిగి సంతోషముతోనుండెను రాజు పెద్దభార్య తనచవితికొమాళ్ళు అచ్చట తీసికొని వచ్చిరని యుతన కొమారుడు రాకుండుటను దుఃఖించుచుండెను. అట సముద్రములో బడిన రాజచంద్రునిం జూచి యతనిభార్యలు గొల్లున నేడ్వసాగిరి. ఆ రాజసూర్యుండు కణ్వమునియాశ్రమంబున విష్ణుదేవుండు పదేశించిన మంత్రస్వభావంబుచే చావకబ్రతికి నెవరికి గానరాకుండ రేవుగట్టున నిలువంబడి తనభార్యలను రమ్మని బిగ్గర కేకవేసిన వారు వానినింజూచి ఇతడు మహానుభావుండని సంతసించి వానికడకరుగుదెంచి మంగళవాద్యంబులు మ్రోయ కళింగపురంబు ప్రవేసించునెడ రాజచంద్రుండు ఎవరోయొక గొప్పరాజు తనదర్శనకాంక్షచే వచ్చుచున్నాడని తలంచి వారి నెదుర్కొని తగిన మర్యాదలం జేసిన నతండు నాయనా నేను ఎవరినని జూచుచున్నావు, నీకొమారుడను అని చెప్పి తల్లిని బిలువనంపిన నాడు రాజొసంగిన ఆనవాలుచూపించి తనపినతల్లికొమారులు చేసిన ద్రోహంబును దెలియ పరచి భార్యలతోడ జననీజనకులకు సాష్టాంగ నమస్కారంబులు చేసి తండ్రి యాజ్ఞానుసారంబుగా పట్టంబుగట్టుకొని కొంతకాలంబు రాజ్యంబుచేసి తుదకు కైవల్యప్రాప్తి జెందెనని సెప్పిన, నాయంజనీ సూనుండు చిరకీర్తి మహారాజునుం గొనియాడి యాభగవంతుని కరుణారసంబును వేనోళ్ల బొగడి యాపుణ్యచరిత్రంబు వలన బాపంబు హరించె, పంచముద్రల ప్రభావంబు గాంచితి నిద్ర హెచ్చుచున్నది. సుఖింతము రమ్మనిన భగవంతుండును తానును శయనించి సుఖనిద్ర జెందిరి. తృతీయరాత్రికథ - సమాప్తము.

ఓమ్.

# చతుర్థ కథా రత్నము.

నాల్గవ దినము రాత్రి శ్రీసీతారాములిరువురు లీలావినోదంబుగా తాంబూలము జేయుచు, సుగంధ కుసుమముల యొక్కయు జందన వృక్షముల యొక్కయు, మాధుర్య ఫలముల యొక్కయు గాలిని నాఘ్రాణించుచు చల్లగావీచు మలయ మారుతంబున కానందించు చుండు నవసరంబున అంజనేయుండు శ్రీరాములం జూచి స్వామీ! షట్చక్రంబుల ప్రభావంబు నాకు హృద్గోచరం బగునటుల చిత్రమైన కథయొకటిం జెప్పి నన్నుంగడ తేర్చుమని ప్రార్థించిన ఆరాముండు దయగల వాడై శబర మహారాజు చరిత్రంబును వక్కాణింప దొడంగె నెట్లనిన?

## శబర మహారాజు కథ.

వాయునందనా? తొల్లి యమరావతీ దేశంబును బాలించు చుండిన కళ్యాణమహారాజునకు శబరుడను నొక్క సుపుత్రుండుగలిగెను. ఆరాజపుత్రుండు మిగుల సౌందర్యముచే నొప్పుచు. ధైర్యశౌర్య సాహస పరాక్రమ గాంభీర్యమునుగల్గి సకల విద్యలను నేర్చుకొనుచు ధనుర్విద్యయందుమిగుల కౌశలత్వముగల్గి దివ్యాస్త్ర ప్రయోగముల నభ్యసించి యవ్వనమంకురించి బాలసూర్యునిపగిదిని ప్రకాశించుచు దండ్రి సభయందుగూర్చుండిధర్మాధర్మములను దెలిసికొనుచుండెను, ఒకనాడారాజసభకుదూతలుకొందఱువచ్చినమస్కరించి రాజోత్తమా మాద్రదేశంబునుబాలించు రత్నాలరాజు తనకుమార్తెయైననీలవేణికి స్వయంవరము సాటింపజేసెను ఆకన్యక రూపరేఖావిలాసంబులంబొగడ నాదిశేషునికైన శక్యంబుగాదు. నానాదేశములనుండిరాజులు వచ్చుచున్నారు. దేవరవారును పుత్రసమేతముగా రావలయునని చెప్పి సెలవుపొందిపోయిరి. అ శబరుండు తండ్రికి నమస్కరించి నాయనా మనమాదేశంబునకు బోదమనిన నానరేంద్రుడునవ్వి ఓరినాకూనా నీవుదూతలు చెప్పిపోయినమాటలనువిని పలుకుచున్నావుఆరాజు మానవులకునలవిగానియంత్రంబునునిర్మించి దానిని గొట్టినవారికి తనకుమార్తెనిచ్చి వివాహముచేయునట మనమటకరుదెంచి నా యంత్రంబునుద్రుంచలేక నలువురిలోతలవంపులగుటకన్న పోకుండుటయే మంచిదని చెప్పినతండ్రిపలుకులనువినక నాయనా మానవుల కలవిగాని కార్యంబొకటికలదా, నేర్చినవిద్యను ప్రకాశింపజేయుట కీర్తిగాదా, మీకు తెలియని ధర్మములుగలవా, నేనాయంత్రమునుగొట్టి

యా కన్నికను వివాహము చేసుకొనక మగుడి పురికి వచ్చుట లేదని ప్రతిజ్ఞ బల్కి దిగ్గున లేవగాజూచి యారాజు మిగుల దుఃఖించి ఎంత జెప్పినను విన డనినిశ్చయించుకొని రణశూరులను వెంటనిచ్చి సాధ్యము కానియెడల మఱల యింటికి రమ్మని పుత్రునకు బోధించి శూరులకుం జెప్పి యంపెను. ఆశ బరుఁడు సైన్యంబుల వెంటంబోవుచు గొన్నిదినంబులకు మద్రనగరంబు జేరి యట జనసమ్మర్దమును తప్పించుకొని యంత్రము దగ్గఱకుం బోయెను. అందుండిన పురోహితుండు యా రాజకులోత్తములంజూచి రాజచంద్రులారా యీ యా ద్దములో యంత్రమును లక్ష్యించి యొక బాణంబున బడగొట్టినవానికి యీరా జపుత్రి వరించునని చెప్పెను. అచ్చటికి వచ్చిన రాజులందరు యాయద్దములో నాయంత్రము గుర్తును దృష్టించజాలక ఆహా యిది దేవతలకైన నలవిగాదని పలుకుచునందరు ఖిన్నులై తలలువంచుకొని వారివారి శిబిరంబులకుం బోవు చుండిరి ఆశబరుడు నాయద్దములో లక్ష్యము నిలుపజాలక విచారంబు నొం దుచు తననిజనివాసంబునకుంజని హా దైవమా నేను నా తండ్రి చెప్పిన నీతివా క్యంబులను దిరస్కరించి వచ్చి విఫలయత్నుండనై పురికిం బోవుటకంటెను జచ్చుటయుత్తమంబు కొందరు పెద్దలు ఆత్మహత్య చేసికొనుట నరకమని చెప్పు దురు. ఇందులకేమి సేయుదునని మనోదుఃఖము నొందుచు బహువిధముల యోచించి ధనుర్బాణంబుల బుచ్చుకొని తనసైనికులకుం దెలియకుండ యర్థ రాత్రివేళ నొంటరిగా ప్రయాణమై పోయెను తెల్లవాఱిన వెనుక నాసైని కులు రాజపుత్రునింగానక దిగులొంది యతనిపోబడి దెలియక దుఃఖించుచు దమ పట్టణంబునకు వచ్చుచుండిరి.

ఆశబరుండు దట్టములయిన యడవులలో జొచ్చిపోవుచు బాదముల నాటుకొనిన కంటకములకు దుఃఖించుచు సూర్యకిరణములకు పరితపించుచు నడువలేక చెట్లుసీడలం బరుండుచు గొన్నిదినంబులకు జాబాలిమహాముని యాశ్రమంబు జేరి యా మునిచంద్రునకు నమస్కరించి ఓ ఋషిశ్రేష్టమా! నేను దిక్కులేని రాజకుమారుడను మోక్షార్థినై తమపాదంబులు సేవింప వచ్చితి నాకు పరతత్వమార్గంబు బోధించి నన్నుం గృతార్థునిజేయుమని వేడిన నా ముని యిట్లనియె; బాలకా! నీవు పసితనంబు చేత తెలియక తపోవృత్తినుల భంబని యూరు దెంచితివి. అది మిగుల గష్టతరంబు మావంటి మునులు సాధిం పలేక విఫలులగుచున్నాము. నీవు సుకుమారివి, ఈ కందమూల ఫలాదు లను భక్షించి తపోవృత్తి నుండజాలవు. నీవు వచ్చిన త్రోవంబట్టుకొని నీపురికి బొమ్మనిన నాశబరుండు చింతించి కన్నులనీళ్ళు రాల్చుచు నను గన్నతండ్రి

సమానులని మీమరుగుజొచ్చి నందులకు నన్ను విడనాడ యత్నించితిరి. మీరు చేపట్టక విడిచిననేను బ్రాణవియోగము బొందుటకు సిద్ధముగా నున్నాననిపలికి నామునిచంద్రుం డాబాలుని వైరాగ్యంబునకు సంతసించి దగ్గరగూర్చుండబెట్టుకొని కరుణారసభరితుండై ఓ రాజాత్మజా! నీదేహము నందుగల ఆరుచక్రంబులను వాని మహిమలను అధిదేవతలనుయందు జరుపగల మంత్రంబు నుపదేశించెద శంకరుండునీకిష్టసిద్ధియు మోక్షంబును నిచ్చును. మరియును ప్రణవాంగమైన జీవిహంస మనోమారుతముల తోడ జేరి మూలాధార, స్వాధిష్టాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞేయ ములనెడు షట్కమలములయందును డమ్రక్రియచేత ఇరువది యొక్క వేల ఆఱునూఱుమాఱులు నిర్ణయ ప్రకారముగా విహరించుచునుండును గనుక ఆ దేవరహస్యంబు నీకు బోధించెదను. శ్రద్ధాభక్తుండవై వినుమనిన నాశబర మహారాజు భక్తివినయంబుతో వినందొడంగె:—



శ్రీజాబాలి మహామునీంద్రుండు సబరమహారాజునకు దెల్పినషట్చక్రముల ప్రభావము.

ఓరి రాజోత్తమా! సచ్చిదానంద స్వరూపుడనగాఆత్మ ఆత్మకు సత్తుచిత్తుఆనందరూపములుగలవు. సత్తుత్వంపద మనియును,నాదమనియును అకారమనియును, సూక్ష్మంబనియును జెప్పంబడును చిద్రూపము తత్పదమ నియు, బిందువనియు, ఉకారమనియు, గారణంబనియు, నూహించదగు ఆనందము అసిపదమనియు, కళయనియు, మనోకారమనియు, మహాకారమ నియు జెప్పంబడును. త్వక్ మాంసరుధిరమేధోమజ్జాస్థి స్నాయువులనెడి సప్తధాతువులతో గూడుకొని యుండునదియు మాతాపితృలయొక్క శుక్ల శ్రోణితాదుల వలన పుట్టినదియు కరచరణాద్యవయవములతో కూడుకొని స్తంభమువలె కనుపడుచున్నట్టిదియు నగు స్థూలదేహంబు పదునేడు నవయ ములతో కూడుకొనియుండునది, పదునేడునవయవము లేవియనగా మనో

బుద్ధి చిత్తాహంకారములు నాలుగును పదునేడింటి లెక్కను మనస్సును చిత్తమునుకూడి యొకటిమాయెను. బుద్ధియు అహంకారమునుకూడి యొకటి యాయెను. ఈ మనోబుద్ధులు రెండును, జ్ఞానేంద్రియములు అయిదును, కర్మేంద్రియములు అయిదును, ప్రాణాలు అయిదును, అన్నియు జేరి పదునేడు నవయవములతో గూడుకొని యుండునది సూక్ష్మదేహం బనదగు దీనికే లింగదేహమని మరియొక బేరునుంగలదు. కారణదేహమనగా మలిన సత్వరజస్తమోగుణాత్మకమైన అవిద్య ఆత్మారాము బ్రహ్మమైన హంసుండు లింగ శరీరములకు నాధారమై యంతర్బహిర్వ్యాప్యకత్వము గల్గి పంచాగ్నులలో గాలక సప్తసముద్రములలో మునుగక జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలును లేక తంద్రీ రూపకమై షట్చక్రంబుల జుట్టుకొని దినదినంబును ఇరువదియొక్క వేల ఆరునూరులు ప్రణవమెడ తెగక పల్కుచుండును. గావున గుదస్థానంబున వ శ ష స వర్ణగంబై చతుర్దళ యుక్తంబై తప్తకాంచన సన్నిభంబై మహానిలయంబై ఘ్రాణకారణంబై మూలాధారచక్రంబు విలసిల్లు నందు గణపతికి ఆరునూరులును, లింగస్థానమున బ భ మ య ర ల వర్ణగంబై షడ్దళ సమన్వితంబై రక్తవర్ణంబై జలాలయంబై రసనాకారణంబై స్వాధిష్ఠాన చక్రంబు రంజిల్లు నందు జతుర్ముఖున కారు వేలును, నాభిస్థానంబున డ ఢ ణ త థ ద ధ న ప ఫ వర్ణగంబై దశదళోపేతంబై తేజోనివాసంబై పీత వర్ణంబై నేత్రకారణంబై మణిపూరకచక్రంబు ప్రకాశించునందు శ్రీమహావిష్ణువునకారు వేలునుహృదయస్థానంబున క ఖ గ ఘ జ చ ఛ జ ఝ ఞ ట ఠ వర్ణగంబై ద్వాదశదళోపేతంబై శ్వేతవర్ణంబై మరున్మందిరంబై త్వగింద్రియకారణంబై యనాహతచక్రంబుదనరు. నందు రుద్రునకారు వేలునుగంఠస్థానంబునం దకారాది షోడశ స్వర్ణగంబై షోడశదళయుతంబై నీలవర్ణంబై గగన సదనంబై శ్రోత్రకారణంబై విశుద్ధచక్రం బలరునందు జీవాత్మునకు సహస్రంబును, భ్రూమధ్యస్థానంబున హం క్షం యను వర్ణంబులుగలిగి ద్విదళ లలితంబై మాణిక్యవర్ణంబై యంతఃకరణ భవనంబై యాజ్ఞాచక్రంబొప్పు, నందు బరమాత్మునకు సహస్రంబును, బ్రహ్మరంధ్ర స్థానంబున ఓంకార వర్ణగంబై సహస్రదళ శోభితంబై కోటిసూర్య ప్రకాశమానంబై ధీనిలయస్థలంబై సహస్రారచక్రం బలరారు నందు శ్రీ గురుస్వామికి సహస్రంబును, శ్రీమద్దేశికోక్తాసన ముద్రాలక్ష్య మంత్రధ్యాన క్రమపూర్వకంబుగా సమర్పింప వలయు నీ ప్రకారము ప్రణవమును భాగింపం బడి యజపగాయత్రి యని జెప్పంబడి యిడా పింగళ నాళ్ళయందా ప్రణవాక్షర ద్వయము పలు

కుచునుండును. అని సర్వము నెఱింగించి సమాధినిష్ఠునిగా జేసెనని చెప్పెను. వాయునందనుండా రహస్యంబుల నడిగి తెలుసుకొని సద్గురుమూర్తి షట్చక్రముల ప్రభావంబు మిగుల శ్లాఘనీయము. భవదీయ కరుణారసంబుచే గ్రహించి పావనుండనైతిని, యా శబరునివృత్తాంతంబు జరిగిన విషయముల దెలుపుడని ప్రార్థించిన నా శ్రీరాముం డిట్లనియె.

ఓ ఆంజనేయా! ఆశబరుండు నిండువైరాగ్యంబుతో యోగాభ్యాసంబు చేయుచు, హంసమంత్రంబు నుపదేశ పూర్వకంబుగా గైకొని యామునిపాదంబులకు బ్రణమిల్లి నేను తండ్రితో పంతమాడివచ్చితిని, మద్రదేశాధీశునిచే నిర్మింపబడిన యంత్రంబునుగొట్టి యా నీలవేణి వివాహంబు చేసుకొని నా జననీజనకులు డెందంబానందంబు జేసెద. నాకు సెలవొసంగుడని ప్రార్థించిన నా మునిచంద్రుండు పుణ్యాత్మా నీ దురితములన్నియు నశించి పరమపావనుండవైతివి. షట్చక్రముల భావంబు తెలుసుకొని ముద్రలచేసాధించిన కతంబున యా యధిష్ఠానదేవతలు నీకు సహాయులుగా నుందురు. సంశయింపక సునాయాసముగా నా యంత్రంబునుగొట్టి యా కన్యకను వివాహంబు జేసుకొందువని దీవించిన నా రాజపుత్రుడు శెలవుపొంది తన సైనికులవెంట మద్రదేశంబున కరిగెను. అట్లరిగి నా యంత్రంబు చెంతకు జేరి యందుండు రాజుల చెవులు చిందర పోవునట్లు ధనుష్టంకారములుచేసి వింటబాణమును సంధించి సద్గురుని మనంబున ధ్యానించి దృష్టిముష్టికిం జేర్చి ప్రయోగించిన నది మెనుమంటల దొరిగించుచు జిటిలి పెటిలి యను శబ్దములతో దశదిశలు భీతిల్ల నాయంత్రమును నేలంబడగూల్చెను. అమరులదివిని గీర్తించిరి. ఆమద్రభూపాలుండును యాశ్చర్యమును సంతోషమునుజెంది నాలింగనము జేసుకొని తన పుత్రికనిచ్చి శుభముహూర్తంబున వివాహంబుగావించెను. ఆశబరుండు సుఖసంతోషములంబొందుచు నచట మూడుమాసములుండి పిమ్మట మామగారిచ్చిన చతురంగబలంబులను వివిధవస్తు వాహనములను వస్త్రాభరణములనుబుచ్చుకొని భార్యను వెంటబెట్టుకొని వచ్చుచు కొన్నిదినంబులకు తన పట్టణంబు జేరి తల్లిదండ్రులకునమస్కరించి జరిగిన వర్తమానంబంతయు జెప్పి వారికి నేత్రోత్సవము గావించి తన భార్యనుం గూడి సుఖభోగంబులనుభవించుచుండెను.

ఇట్లుండ విశాలనగరంబున నరసింహమహారాజు తనముద్దుల వనితను గూడి సుఖంబుండి తన పెద్దగికొమార్తెలనుబిలిచి ఓ బిడ్డలారా మీకు అన్నము మొదలైన వానినిపెట్టి కాపాడువాడెవడు అనియడిగెను. అందుకు ఆరు

గురు పశుచులు మీ యనుగ్రహముచేతనే భోజనముచేయుచు సుఖముగా నున్నవారమనిరి. ఏడవ కుమార్తె కమలాంబయను చిన్నది తల్లితండ్రులను జూచి నాకు దైవానుగ్రహముచేత కలుగుచున్నది గాని మరి యెవరిచేతనుం గాదని జవాబుచెప్పెను. ఆమాటవిని దానితల్లితండ్రులు మిక్కిలి కోపగించు కొని ఇది యెంత దుష్టురాలు దీనిని మనయింటనుంచనీయ గూడదని నిశ్చయిం చుకొనిరి. వెంటనే రాజు సేవకులను బిలిచి మీరు మాకడపటి చిన్నదాని పల్లకిమీద నెక్కించుకొని పోయి యడవినడుమ విడిచిపెట్టి రండని యుత్త రువు చేసెను. అనంతరము సేవకులు రాజుచెప్పిన ప్రకారము పల్లకినిదెచ్చి దానిలో రాజుగారి కడపటి చిన్నదానిని కూర్చుండ బెట్టుకొనిపోయి యడవి నడుమ పల్లకిని దించి మేము దాహము త్రాగి వచ్చెదము ఇక్కడ నుండు మని రాచకొమార్తెతో చెప్పిరి. అదియామాటవిని వారితో తప్పికినీళ్లు త్రాగి మరల యేల రావలయును. మా తండ్రిగారి యుత్తరువు చొప్పున మీరు మీ యిండ్లకు పోవచ్చునని చెప్పెను. వారు ఆ ప్రకారముగానే దానిని అక్కడ విడిచి పెట్టి మరల రాజు నగరి పోయి చేరిరి అంతట ఆ చిన్నది దైవమును స్తోత్రముచేయుచు తన పల్లకిలో పండుకొని నిద్రబోయెను. తిరుగ ఆ చిన్నది లేచునప్పటికి ఆపల్లకిలో యొకప్రక్క ఒక చెంబుతో నీళ్లును ఒక పాత్రమున అన్నమును పెట్టి యుండెను. అదిచూచి యా చిన్నది దైవము మన మీద దయచేత వీనిని తెచ్చిపెట్టి యుండవలెనని యెంచి యాయనను అనేకవిధముల నుతించెను. ఆవల నా చిన్నది కనుచీకటి పడకమునుపే చేతులుకాళ్లు కడుగు కొని యా యన్నమునుతిని యానీళ్లుత్రాగి మెల్లగాపోయి పల్లకిమీద పండు కొని నిద్రబోయెను. అనంతరము దేవుడు ఆ చిన్నదానియొక్క ఓర్పును సద్గు ణమును మంచి పనులు చేయుట యందలి యాసక్తిని చూచి దానియందు మిక్కిలి దయగలవాడై ఆచిన్నది నిద్రపోవునప్పుడే అది పండుకొని నిద్రించు తావునకు సమీపమునుండు బయలులో ఆ చిన్నదానికొరకు ఒక పెద్దతో టను ఆతోటనడుమ పెద్దకొలనిని ఆ కొలనుగట్టున అందమైన మేడను నిర్మిం చెను. ఆ చిన్నది తెల్లవారి నిద్రలేచి కన్నులు నులుముకొని తెరచి చూచున ప్పటికి ఎదుట పెద్దతోటయును ఆతోటలో పెద్దకోనేరును ఆకోనేటిగట్టున అందమైన మేడయు అగుపడెను. వానిజూచి యా చిన్నది నేనురాత్రి పండు కొనునప్పుడు ఇచ్చోట తోట మొదలైనవి ఏమియును లేవు అని ఆశ్చర్యప డుచు ఆతోటలోనికిపోయెను. అది యక్కడికిపోగానే యక్కడనుండు సేవ కులు నామెకు కైవారంబులు చేసిరి ఆ మేడ దానితండ్రి మేడకంటె మిక్కిలి

యందమైనదిగా నుండెను. అది ఆ మేడలోనికిపోయి చూడగా అక్కడ సేవకులనేకులుండిరి, వారలను చూచి ఈ మేడ ఎవరిదని యా చిన్నది యడిగెను. వారు దేవుడు రాత్రి నీకై ఈ మేడను మమ్మును సృజించెనని చెప్పిరి. దేవునిచే ఆమె దగ్గఱనుండులాగు నియమింప బడినవారు మనుష్యులుగాని దేవతలుగారు. ఆ చిన్నది తనమీద దయగలిగి తనకు నింత సహాయము చేసిన ఈశ్వరుని మిక్కిలి సంతోషించి పొగడెను.

ఇట్లు కొంతకాలము జరిగిన వెనుక రాజు ఆ చిన్నదానిని విడిచిపెట్టిన యడవిలో పెద్దతోటయును ఆతోటనడుమ కోనేరును ఆకోనేటిగట్టున అందమైన పెద్దమేడయున్నట్లు ఆ మేడయందు తన ఏడవకూతురు వాసము చేయుచుండునట్లును నరసింహభూపతివినెను. విన్న వెనుక ఔనుఔను నాకూతురు చెప్పినమాట నిజము, మనకు అన్నియు నిచ్చువాడు దేవుడే కాని మరి ఎవడునుకారు. యీ యరణ్యము నడుమ ఇంత యందమైన మేడను నిర్మించిన వాడు దేవుడేకాని మరి ఎవడునుకాడు అనిచెప్పెనుగాని దానిని చూచుటకు మాత్రముపోలేదు. పిమ్మట రాజు కొన్నాళ్లయిన వెనుక నేను నేడు దేశాంతరము పోవలయును. ఓడను సిద్ధముగా పెట్టియుండుడని సేవకులకు ఉత్తరువుచేసెను. సేవకులును ఓడ ప్రయాణమునకు సిద్ధముగా పెట్టియున్నామని చెప్పిరి. రాజు తన కొమార్తెల నందర బిలువనంపి నేను దేశాంతరమునకు బోవుచున్నాను. మీ కేమేమి కావలయునో వానినంతయును జెప్పుడు తీసుకొనివచ్చి ఇచ్చెదనని చెప్పెను. వారిలో కొందరు కంఠహారములు మొదలగు సొమ్ములు కావలయునని కొందరు మంచి మంచి చీరెలు కావలయునని చెప్పిరి. అనంతరము రాజు తన ఏడవకూతురునకు ఏమికావలయునో విచారించి రమ్మని మనుష్యులను పంపెను. వారుపోయి దానితో యీ సంగతి చెప్పినప్పటికి ఆపె దేవతార్చన చేయుచుండెను. కాబట్టి వారితో విశేషము మాట్లాడుటకు సందర్భములేక సబరు అనిచెప్పెను. సబర్ అనగా కనిపెట్టియుండుడనియర్థము.) ఈ యర్థమును వారు తెలుసుకోలేక సబరు అను వస్తువులు తెమ్మని చెప్పినదని తలచి, రాజుదగ్గఱకు పోయిరి. ఆయన వీరలనుచూచి ఏ వస్తువును తెమ్మని చెప్పెనని యడిగిన సేవకులు సబరు తెమ్మని చెప్పెనని బలికిరి. అదివిని రాజు సబరు అనగా ఎటువంటిదో నే నిదివరకు ఎరుగను నేను పోవుదేశమున సబరు అను వస్తువు ఉన్నట్లయిన తీసిపంపెదనని యోచించుకొని ఓడనెక్కి దేశాంతరమునకు పోయెను. దేశాంతరమునకుబోయి అక్కడ కొన్నాళ్లుండి తన కుమార్తెలు ఆరుగురు చెప్పిన నగలును చీరలును తీసు

కొని తన దేశముకురాను బయలుదేరి ఓడ ఎక్కెను. ఆ యోడ ఎన్ని ప్రయత్నములు చేసినను కదలలేదు. రాజు ఆ సంగతికని ఏల యోడ కదల లేదని యోచించి తనకూతురు చెప్పినవస్తువు తెచ్చుటను తాను మరచినందువలన కదలలేదని తెలుసుకొని యావస్తువును తెచ్చుటకు నొకని చేత నాలుగు వేలరూపాయలిచ్చి యాపట్టణంబున విచారించి తీసుకొనిరమ్మని యమరావతిపురంబునకనిపెను. ఆపట్టణంబువాడు చేరిఅంగళ్ళన్ని యువెవిచారించి ఎందునుంగానక ఇదేమివింతగానున్నది ఏయంగడియందు గాని సబరు అనువస్తువుయున్నట్టు కనపడలేదు ఏనుగునుదెచ్చి యేకులబుట్టలో పెట్టుమన్నట్టు లేనివస్తువును తెమ్మన్న యెట్లు గొనిపోవచ్చునని యోచించుచుండెను. ఇట్లు చింతించుచుండగ ఆపట్టణమున నున్నవారుకొందరుజూచి యేమియోచించుచున్నావని నాథటునినడిగిరి. మాప్రభువుమారాజసబరు తెమ్మనినన్ను బంపెను ఈపట్టణపు అంగడివాండ్రు సబరుఅనువస్తువు నెటువంటిదో యెరుగనట్టు తోచుచున్నది. మీరేమైన ఎఱుగుదురా అనియడిగెను. వారు సబరు అను వస్తువు వున్నదో లేదో మేమెఱుగముగాని ఈపట్టణమురాజుకొడుకు సబరు అతనివద్దకుబోయి అడిగితి వేని తెలియుననిరి. వాడును వారిమాటప్రకారము సబరునుపోయి చూచెను అయ్యా! సబరుగారూ! మారాజుగారి యేడవకూతురు సబరుతెమ్మని రాజుతో చెప్పెను. ఆయుననన్ను సబరుతెమ్మని నాచేత నాలుగువేల రూపాయలనిచ్చి పంపినాడు ఈ బట్టణమున ఆవస్తువువున్నట్టు తోచలేదు. మీరేమైనవిచారించి యిప్పింపగలరాయని యడిగెను. అందుకారాజకుమారుడు మంచిది యీపెట్టను తీసుకొని మీరాజుగారిచేతనిచ్చి ఆయునతో యీపెట్టను సబరుఅని యేదిన్నదియడిగినదో యాపెయే దీనిని తెరవవలసినదని చెప్పుమని చెప్పి వానినిపంపెను, వాడదితీసుకొనివచ్చి రాజుగారిచేతికియిచ్చి అయ్యాసబరు అని యేదిన్నది యడిగినదో యదేదీనిని తెరవవలసినదని చెప్పి ఈదేశపు రాజకుమారుడు ఈపెట్టెను యిచ్చెను. అని చెప్పిన మంచిదని ఓడచాపలు ఎత్తివిడిచి ప్రయాణమై కొంతకాలంబునకు స్వదేశంబునకు చేరిరి. రాజుగారు తాను తెచ్చిన వారివారివస్తువులనుయిచ్చివేసి ఈ పెట్టెను తన యేడవపుత్రికకునంపెను. ఆమెతనతండ్రి తెచ్చియిచ్చిన పెట్టెను నెలదినములవరకు మూలయింటవేసి పెట్టియుండి యావల ఆపెట్టెలో యేమున్నదోయని తెరచిచూచెను అందు అందమైన విసనకర్రయుండెను. ఆమె దానినిచూచి ఇటువంటి విసనకర్ర ఎక్కడను చిక్కదని జాగ్రతగా కాపాడుకొనుచు దానితో అప్పుడప్పుడువిసరుకొనుచుండెను. ఒక

నాడువిసరుకొనుచుండగా రాజకుమారుడుఒకడుఆపెయెదుటవచ్చినిలిచెను,
ఆరాజకూతురు వానినిచూచి సంతోషించినీవెవరవు యెక్కడనుం
వచ్చితివి యనియడిగెను. రాజకొమారుడు నేనుశబరుడను యమరావతీష
రేశుని కొమారుడను మాతండ్రిగారు మాదేశమునకువచ్చి నీవు "సబరు'
అనువస్తువు తెమ్మని చెప్పినట్లు ఒకమనుష్యుని నాయొద్దకుపంపెను. నేను
ఈవిసనకర్రనుపెట్టి ఈపెట్టెను నీకోసరము వానిచేతనిచ్చి పంపితిని. ఎవరు
ఈవిసనకఱ్ఱను కుడివైపుగా త్రిప్పుచున్నారో వారికినేను స్వాధీనుడుగానుం
దును. ఎడమవైపున విసరినవారిని విడిచిపోదును. అదివినియాచిన్నదిమంచిది
యనియొప్పుకొనెను ఈలాగువారిరువురు కొంతకాలము అక్కట మాటలా
డుచుండిరి వెనుక ఆపె విసనకర్రను ఎడమచేతివైపు త్రిప్పగానేవాడుఅంత
ర్ధానమైపోయెను. ఈ ప్రకారము సుమారు నెలదినములవరకు ఆరాజకుమా
రుడు ఈపెకుడిచేతితో విసరగానేవచ్చుచు ఎడమచేతితో విసరగానేపోవుచు
నుండెను. ఒకనాడు సబరుడుఆపెతో నాకునిన్ను పెండ్లాడవలయునని యిష్ట
మున్నది. నీకును యిష్టమున్నదాయని అడిగెను. అందుకు ఆచిన్నదినాకును
నిన్ను పెండ్లాడవలెననియే యున్నదనెను. ఇట్లు ఇరువురు మాటలాడుచుండ
గానే యాపె తనతల్లితండ్రులకు తోడబుట్టువులకును నేనొక రాజకొమా
రుని పెండ్లాడబోయెదను రండుఅని జాబులువ్రాసెను. ఆజాబులు చూచు
కొని వారందరువచ్చిరి రాజు తనచిన్నకూతురుఉండుమేడనుఆపెను పెండ్లా
డబోవు రాజకుమారునిచూచి దేవుడు దీనియందు మిక్కిలి దయ గలిగి
యున్నాడనియు లోకమున అందరుదైవానుగ్రహముచేత సకల సంపద
లనుభవించుచున్నారనియుయోచించుచుండెను. పెండ్లికాగానేయాపె
అక్కలు తమచెల్లెతో నీపడకటింటికి మేము అలంకరించుచున్నామని
చెప్పిరి. ఆపె ఇక్కడ సేవకులు అనేకులున్నారు వారుఅలంకరింతురుమీ
రూరకుండుడనెను, ఆమాటవారువినక నీపడకటింటిని మేమే అలంకరింపవల-
యునని చెప్పిరి. ఆపెమీకు అంతఇష్టమున్న పక్షంబునమీరే యలంకరింపు
డనెను. వారంఱు పెద్దవారమును తల్లిగారి యింటనుండు వారమునైన
మనకంటె యీపెముందుగాపెండ్లి చేసుకొన్నదిగదా యని యసూయగల
వారై పడకటింటిని చక్కగా అలంకరించి పాన్పుమీద తమచెల్లెలి మగడు
పండుకొనుప్రక్కను గాజులుపొడిచేసిపోసి పాన్పుమీదపరచి తెలియకుండు
నట్లు ఆపొడిపై దుప్పట్లుపరచియుంచిరి. రాత్రి పెండ్లికొడుకును పెండ్లి
కూతురును ఆపాన్పుమీద పడుకొనిరి. పడుకొన్న కొంతసేపటికి పెండ్లి

కొడుకునకు దేహమంతయు గాయములై నెత్తురుకారనారంభించెను. వాడు ఆ బాధ నోర్వజాలక విసనకఱ్ఱను ఎడమచేతితో త్రిప్పు మా యూరికిను పోయెదననెను. అదియు వానికిగలిగిన యాపదనుచూచి దీనికి ఔషధము యిక్కడ చిక్కదని యోచించి విసనకఱ్ఱను ఎడమచేతితో విసరెను. విసర గానే వాడు అంతర్ధానమైపోయెను. ఆపెకు తనయుక్కలవలవ నీకీడు సంభ వించినదని తెలియదు. వారును ఈసంగతివిని మనస్సునసంతోషముగలవారై నను పైకిదుఃఖముగలవారివలె కొంచెముదుఃఖపడితండ్రిగారియూరికిపోయిరి.

వానికి దేహమందంతటనుగాజు పెంకులుగ్రుచ్చుకొన్న దానివల్లవాని తల్లిదండ్రులు ఏయౌషధము యిచ్చినను గాయములు మానలేదు. ఈపెకు యీసంగతి తెలియక ప్రతిదినము విసనకఱ్ఱను కుడిచేతితో పలుమారువిస రుచుండెను. ఎంతవిసరినను వాడువ్యాధిగ్రస్థుడుగా నుండుటచేత రాలేదు. ఒకానొకదినమురాజకుమారునికి ఏమియాపదసంభవించెనో ఏలాగున్నాడో యనిదుఃఖింపసాగెను. నాటిదినము రాత్రియే ఆపె రాచకుమారుడు వ్యాధి గ్రస్తుడుగా నుండునట్లు కలగనెను. ఆకలగని దిగ్గున లేచి ఆ రాజకుమారుడు ఏలాగున కష్టపడుచున్నాడో చూచిరావలయునని యోచించి యాడదియని తెలియకుండ జోగివేషము వేసుకొని గుఱ్ఱమెక్కి బయలుదేరెను. ఇట్లు బయలుదేరి నాటిరాత్రికి తానుండు యడవిదాటి మరియొక యడవికిపోయి చేరెను. అప్పుడురాత్రియైనందున అచ్చటనొకచెట్టుక్రింద గుఱ్ఱమునుకట్టివేసి తానుపండుకొని నిద్రపోయెను. కొంతసేపు నిద్రపోయి యా చెట్టునందలి పక్షుల కలకలధ్వనికి మేలుకొని పండుకొని యుండెను. అప్పుడు గోరంక రొయొక చిలుకనుజూచి సమాచార మేమని యడిగెను.

చిలుక: ఒకరాజుకుమారుడు దేశాంతరమునకుపోయి యచ్చట నొక రాజకుమా ర్తెను పెండ్లాడి యాపె అక్కలు పడకటింటిలో గాజుపెంకులు పఱచియున్న పాన్పు మీదనుపండుకొనుటజేత వ్యాధిగ్రస్తుడై యున్నాడనెను.

గోరంక: వానికి ఏమందుయిచ్చిన ఆవ్యాధి కుదురును.

చిలుక: మంచా! అనికొంతసేపు యోచించి ఈచెట్టుక్రింద పండుకొనియుండువా డు తాము పండుకొన్నతావునకు క్రిందనున్నమట్టిని చన్నీళ్లలోకలిపివాని దేహమునకుపూసి నేనిఆవ్యాధికుదురును.ఇదితప్పవేఱుమందు లేదనెను.

ఆ చెట్టుక్రింద పండుకొనియున్న రాజకుమార్తె ఈ సంవాదమును వినిలేచికొంచె మమట్టిని మూటకట్టుకొని గుఱ్ఱముమీద యెక్కిపోయెను. ఇట్లు కొంతదూరముపోయియ చ్చటనున్న జనులనుజూచి ఈ దేశము ఎవరిది యనియడిగెను. వారు శబరుడు అనువాని తండ్రి రాజ్యము అని చెప్పిరి అంతట ఆపె యాపట్టణమునకుపోయి పేదరాలి పెద్దమ్మ యింటదిగెను. అక్కడ భోజనము చేయునప్పుడు ఆ ముసలిదాని అమ్మా! ఈ రాజ్యం

బున ఏమిసమాచారము అనియడిగెను, ఈపలుకువిని ఆ ముసలిది అయ్యా! మారాజు గారి కొమారుడగు శబరుడు వ్యాధిగ్రస్తుడుగా నున్నాడు. కాబట్టి నేను ప్రతిదినము నగరునకు పోవుచు వచ్చుచుండవలయును నాకు సమాచారములు ఏమియు తెలియవు అనెను. జోగి వారికి నిప్పుడెట్లున్నదియని యడిగెను ఎందరు యౌషధములు యిచ్చినను కుదురలేదు. అది యెటువంటి వ్యాధియో తెలియదు అనిచెప్పెను. జోగి నేను మందు చేసెదనని రాజుగారితో చెప్పుమనెను. ఆమాటవిని యాపేదరాలిపెద్దమ్మ పరుగెత్తుకొని పోయి రాజు గారితో అయ్యా! మాయింట నొకజోగివచ్చి గదియున్నాడువాడుత్వరలో మీకుమారుని వ్యాధితీర్చెదనని చెప్పుచున్నాడని మనవిచేసెను. ఆమాటవినిరాజునా జోగి నిపిలుచుకొని రమ్మని అముసలిదానితో చెప్పెను అముసలిది ఇంటికివచ్చి యాజోగితో రాజునిన్నుపిలుచుకొని రమ్మన్నాడని చెప్పెను ఆజోగియు మంచిదివచ్చుచున్నానని ఆపె దమ్మ వెంట రాజునగరికి పోయెను. రాజుగారు ఆ జోగివచ్చుటను జూచిమర్యాదలుచేసి కూర్చుండఆసనమిచ్చి కూర్చుండమని చెప్పెను ఆజోగి కూర్చుండిన పిదప తనకుమారుడు వ్యాధిగ్రస్థుడుగా నున్నాడుమీరు దయచేసి యౌషధమిచ్చి యీవ్యాధిని మాన్పవలయు నని ప్రార్థించెను. మంచినీళ్ళు తెమ్మనగానే తనదగ్గిరనున్న మట్టిని నీళ్లలోకలిపి అప్పుడు రాజకుమారుని దేహమంతయుపూసెను ఇట్లు రెండు మూడు దినములు పూయగానే ఆ రాజకుమారునకు ఆరోగమునిశ్శేషముగా వాసియాయెను. అనంతరము రాజు జోగినిచూచి స్వామీ మీయనుగ్రహముచేత మావాని వ్యాధి వాసియాయెను మీరు బహుమానముగా దేనినడిగినను ఇచ్చుటకు నేనుసిద్ధముగా యున్నాను. మీకిష్టమైన దానిని నడుగుమనెను, జోగీ శబరుడు ధరించిన యుంగరము నాకు నిచ్చిన చాలుననెను. రాజు సబరుని యుంగరము జోగికి బహుమానము చేసెను. ఉంగరమును బహుమానముగా ఇయ్యవలయు నని యడుగగానే శబరుడు యాజోగి మాయలమారియని యోచించెను. పిమ్మట జోగి రాజును సెలవడిగి తీసుకొని పేదరాలి పెద్దమ్మ యింటికిపోయి భోజనము చేసి గుఱ్ఱముసెక్కి తనమేడకు వచ్చిచేరెను. జోగివేషమును తీసివేసి యెప్పటివలె నలంకరించుకొని విసనకఱ్ఱను కుడిచేతితో విసరెను. విసరగానె శబరుడు దాని యెదుటవచ్చి నిలిచెను. వానినిజూచి యీనడుమయెన్నిమారులు విసరినను నీవురానికారణంబేమని యడిగెను. వ్యాధిగ్రస్థుడనుగా నుంటినికాబట్టిరాలేదుఒకజోగివచ్చి యీవ్యాధిని వాసిచేసెను. అతనికి నాయుంగరము బహుమానముచేసితినని చెప్పెను. అందుకాపె జోగికాదు గీగికాదు నేననిచెప్పెను. అదివినిరాజకుమారుడు బాగుబాగునీవా వాసిచేసితివి జోగికాని నీవుకావుఅనెను, ఆపెనేనునీకు వాసిచేసితినని చెప్పి బహుమానముగా యిచ్చినయుంగరమును చూపెను. దానినిచూచి రాజకుమారుడు ఆదేవాసిచేసినదనినమ్మెను. ఆరాజపిన్నది తానుకలగన్నది మొదలుకొని జరిగిన సమాచారము నంతయును వానికి విశదముగా చెప్పెను. వాడు ఆసమాచా[illegible]మునంతయు విని నీవుకాబట్టిఇంతకష్టపడి నావ్యాధిని వాసిచేసితివియని చెప్పెను. అనంతర వారిరువురు సకలైశ్వర్యంబను భవించుచు చిరకాలంబు రాజ్యంబుచేసి తుదను పుణ్యలోకంబు జెందిరనినవిని ఆంజనేయుడు స్వామి మీయొక్క పరిపూర్ణ కటాక్షంబు నాపైనుండుట వలనగదానింత పుణ్యకథనింటిని దేవరహాస్యంబు గంటిని యిదుముగుల బావనమైన చరిత్రమని పొగడుచు నాభాగవంతుని గీర్తించి కాలాతీతంబైనది గనుకయందు నిద్ర ఆలాజాలంబు సేయుచున్నది. భరించుటకు గష్టతరంబు నిద్రింతమురమ్మనిన స్వామిసమ్మతించి నిరువురు శయనించి సుఖనిద్ర జెందిరి.

చతుర్థ రాత్రికథ - సమాప్తము.

ఓమ్.

శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః.

# పంచమకథారత్నము.

ఐదవదినము రాత్రి శ్రీసీతా రాము లిరువురు లీలావినోదంబుగా కేళీవిలాసంబు లాడుచు జల్లగా వీచుచుండెడి మలయమారుతంబున కానందించుచు ముచ్చటలాడుచుండు సమయంబున వాయునందనుండు శ్రీరాములంజూచి నమస్కరించి స్వామీ దేవరహస్యంబులలోనొక్కటియగు షడ్విధసమాధిమార్గంబు దెలుసుకొనునట్లు వక చిత్రమైన చరిత్రంబుజెప్పి నన్ను మోక్షయుక్తునిగా జేయుడని ప్రార్థించిన నాభగవంతుడు శ్రద్ధాశక్తుండవై వినుమని యిట్లనియె:—

## సత్యవ్రత మహారాజు కథ.

పూర్వ మొకప్పుడు వంగదేశమును పాలించుచుండిన చిత్రకేతు మహారాజునకు మిక్కిలి సుందరవంతులగు భార్యలనేకులుండిరి. వారిలో నెవ్వరికిని సంతానములేక యుండగా నా భార్యలలో నొకతె అందరికంటె రూపవతియైనను కొంతకాలమునకు గర్భవతియైయుండి ఒక ఆడబిడ్డను కనెను. అదే రీతిగా మూడు తేపలును గర్భముధరియించి ఆడబిడ్డనే కనెను నాలుగవ తేప గర్భముగా నుండునపుడు రాజు భార్యనుజూచి ఈ తేపకూడ ఆడుబిడ్డనే కనినట్టులైన తన పడతిని కత్తికాహారంబు జేతునని ప్రతిజ్ఞ చేసుకొని యుండెను. మరల నాడుక ప్రకారము మిక్కిలి సుందరమైన ఆడబిడ్డనే కనెను. అంతట అచ్చటనుండు వారందరు ఆయాడబుడుత పుట్టినసంగతి రాజునకెరుగింపక మొగబిడ్డ పుట్టియున్నాడని చెప్పిరి అదివిని రాజు మిక్కిలి సంతోషించి జ్యోతిష్కులను రప్పించి ఆ బిడ్డకు జాతకము వ్రాయించి జాతకమున విధింపబడుఫలాఫలములను తెలియజెప్పుమనిన వారును ఆరాజుయొక్క ప్రతిజ్ఞను తెలుసుకొన్నవారై అయ్యా యిప్పుడు పుట్టినబిడ్డ ముఖమును తాము పదిసంవత్సరముల వరకు చూడగూడదని చెప్పిరి. అదివిని రాజు ఆబిడ్డమొగము చూడక మిక్కిలి గారాబముగా పెంచుచుండగా ఆబిడ్డ శుక్లపక్షచంద్రునివలెవృద్ధిపొంది పదియవసంవత్సరము గడచెను. అంత నాబిడ్డయొక్క తల్లి తనకోమార్తెను చూచి ముఖ్యమైన సంగతిని తెలియజెప్పెను. ఓనాముద్దులబిడ్డా యికనీవునీతండ్రియొద్దకు పురుషరూపమునుపొంది పోయివచ్చుచుండుము అట్లుగాక నీ స్త్రీరూపమును తెలియజేసినట్లయిన మనయిద్దరి ప్రాణ

మూలకును హానికలుగునని చెప్పెను. అది యాచిన్నదివిని పురుషరూపమును జెంది తనతండ్రి యొద్దకుపోయి కొంతసేపుండి వచ్చుచుండెను. ఇట్లు కొంత కాలము జరిగిన తర్వాత యాబిడ్డకు వివాహము జేయుటకు యత్నించి వేరొక రాజపుత్రికను తన పుత్రునకు తీసుకొని వివాహంబుజేయ నుద్యుక్తుండై యుండెను.

ఇట్లు కొంతకాలము జరుగుచుండ ముహూర్తదినము సమీపింప రాజు తనపుత్రునకు మిక్కిలి వెలగల వస్త్రాభరణములను ధరింపజేసి పట్టపు యేనుగను శృంగారించి దానిపై గూర్చుండబెట్టి మంత్రులు మొదలగుచతురంగ బలంబులుకూడ నడువ తన పట్టణము విడిచి పెండ్లికూతురున్న పట్టణమునుగూర్చి పోవుటకు బయలుదేరి పోవుచుండ ఆ యాడకూతురు తాను పోవునట్టి వేడుకయున్న తన నిజ స్వరూపమును తలంచుకొని దుఃఖించుచు అచ్చటచ్చట విడుదులనుదిగి అలసటతీర్చుకొనుచూ పోవుచుండగా ఒకవిడిదియందు కొండగుహాలతో చేరిన అడవిగానుండెను. అచ్చట దిగియుండగా నాటిరాత్రి రాజపుత్రిక తనవేషముయొక్క వికారమును తలంచుకొని ఇట్టి దొంగవేషముతో బ్రతుకుటకంటె ప్రాణమువిడుచుట యుత్తమంబనితలంచి యొకరికిని తెలియక యాయడవిలో దాచుకొని తనమనస్సంకటముచే నన్నేదయిన నొకపులి మ్రింగినట్టయిన మంచిదని తలంచి ఆయడవియందు బహుదూరము నడచిపోవుచుండ అచ్చట నొకపెద్దచెట్టు కనబడెను. ఆ చెట్టునీడను ఒక పెనుకొండవంటిభూతము కనబడగా దానిచెంతబోయి కూర్చుండెను. అంత నాభూతము యారాజ కూతురనుంజూచి దానియందమునకు మెచ్చుకొని మనుష్యరూపముతో ఆకన్యకెదుట కూర్చుండి యాచిన్నదాని యొక్క సమాచారము నడుగగా అప్పుడు తన సమాచారము నంతయు నాద్యంతముతో చెప్పనారంభించెను.

ఓ ప్రియమైన తల్లితో సమానమగు భూతమా నాయొక్క సంగతిని వినగోరువారు ఎవరున్నారు. ఇప్పుడు నీవత్యంత ప్రేమచే నన్నడిగినకతంబున విన్నవించెద నామొర యాలకింపుము. నేనొక సముద్ధురాలైన రాజపుత్రికను నాయొక్క గతి నేనేమనిచెప్పుదును. మిక్కిలి గారాబముతో పెరిగి ఇట్లు ఇప్పుడు దుఃఖమనుభవింప వలసివచ్చెను, ఓ దయగల భూతమా నేను మిక్కిలి సిరిగల రాజుగర్భమున బుట్టిన యాడుబిడ్డలనందరిలో నానెత్తిరవాత యనునది నా తండ్రిచేసిన శపథముచే ఆడుదాననై పుట్టి మగరూపముతో పెరిగి యనేకసుఖముల ననుభవించి తుదకిప్పుడు యీ జన్మమేలయనిరోసి

యీ యడవిలో నా ప్రాణము పోగొట్టుకొన తలచి వచ్చిన నన్ను భక్షించి రక్షింపుమాయని ప్రార్థించుచుండెను అంత నా భూతము యీ రాజకన్యక యొక్క దుఃఖవచనములనువిని మిక్కిలి కనికరముకలదై యో చిన్నదానా నేను నీకొక వస్తువునిచ్చెద దానిని మిక్కిలి జాగ్రతతో కాపాడుచుండు మని తన పురుషరూపమును ఆ కన్యకకునిచ్చి దాని స్త్రీరూపమును తాను బొంది పురుషరూపము పొందిన రాజకన్యకనుజూచి వోయి నీవు పోయి నీ కార్యములు నెరవేర్చుకొని మరలవచ్చునపుడు నారూపమును నాకిచ్చి పోవలయును అనిచెప్పెను. అంత నారాజపుత్రుడు సమ్మతించి అధికసంతోషముతో తానుండు గుడారమునకు పోయి ముందున్నట్లుగానే యుండియీ రాత్రిగడపి ఉదయమునలేచి తనకు పిల్లనిచ్చు మామగారి నగరము చేరి యందరితో నిర్భయముగా కూడికలిసి సంతోషించుచుండెను. అంత నా రాజు మంచి సుముహూర్తమునందు మహావైభవముతో పెండ్లి చేసి తనపట్టణమందుండు జనులకందరికిని నానావిధములైన బహుమానములు చేసి ఆనందించుచుండెను. అట్లు మూడుదినములు గడచిన తర్వాత యీ రాజపుత్రుని తల్లిదండ్రులు కొమారుని యచ్చటనే వదలిపెట్టి తమ దేశమునకు పోయిచేరిరి. పిమ్మట రాజకుమారుడు మామగారింట నానావిధములయిన ఆహారాదుల ననుభవించి తనభార్యతోగూడి సుఖభోగముల ననుభవించుచు కాలముగడపుచుండగా కొంతకాలమునకు అతనిభార్య గర్భమును ధరించి తుదకొక మొగబిడ్డనుకనెను. అంతకొన్ని దినములు గడచినపిమ్మట రాజపుత్రుడు తన పట్టణమునకు పోవలయునని తలంచి మామగారికి తెలియజేయగా ఆ రాజు తనకూతురికి కావలసిన వస్త్రాభరణములు మొదలగునవి యిచ్చి అత్తగారింటికి యల్లునితోగూడ సాగనంపెను. రాజపుత్రుడు మామగారిచ్చిన స్త్రీధనమును పుచ్చుకొని భార్యను వెంటబెట్టుకొని బయలుదేరి తన పట్టణమునుగూర్చి వచ్చుచు మునుపు తానుపురుషరూపమును పొందిన చోటునకు వచ్చి వాగ్దత్తముచేసిన భూతముండు చెట్టుకడకుపోయి చూడగా ఆ భూతమొక ముసలిదానివలెనే ముసుకు వేసుకొని దుఃఖించుచుండగా చూచి ఓ నా ప్రియభూతమా నీయనుగ్రహమువలన నాకార్యము నెరవేర్చుకొంటిని. ఇకనీవు నీరూపమును తీసుకొని నారూపము నాకిప్పింపుమని యడిగెను. అది యీభూతము విని ఓ రాజపుత్రుడా నిన్ను మెచ్చితిని. సత్యంబు దప్పనివాడవు గనుకనే నీకు సత్యవ్రతుడను నామంబుజెల్లును నీవు ముందు వాగ్దత్తము చేసినట్లు యిక్క జరుగదు గనుకనీవు నీదారిని పోయిరమ్ము నా నెత్తిన వ్రాసి

నట్లు నేననుభవించెదనని భూతముచెప్పెను దానికి ఆరాజపుత్రుడు ముందు నీవుచెప్పినట్లు నడుచుకొనక పోవుటకేమి కారణమనినడుగ ఆభూతము నీవిచ్చినరూపముతో నీరాకను ఎదురుచూచుచుండగా యిచ్చటికొకపురుషభూతము యవ్వనముతోగూడుకొని మిక్కిలి యందముగా నుండువాడు నాముందువచ్చి నిలువగా నేనువానిజూచి యౌవ్వనజాలనికామాపేక్షగలిగి ఆమోహావేశముతో నెదుర్కొనిపోయి వానినిగూడి సుఖభోగముల ననుభవించి తదానందమున నిక మనము ఒకరినొకరు నెడబాయకుండ నుండవలయునని ప్రతిజ్ఞచేసుకొని యున్నాముగనుక నేనట్టి ప్రతిజ్ఞ నతిక్రమించుటమాభూతజాతులకుధర్మముకాదు మేముసత్యమును అతిక్రమింపకుండుటయే మాకులాచారముగనుక నారూపమును నీకేదత్తము చేసితిని యికనీవు నీస్త్రీవపోయి సుఖముగజీవింపుము. అనియుత్తరవిచ్చి పంపి తననుమనస్సున తాను అయ్యో నాపూర్వ జన్మమందు చేసిన పాపఫలమును నది నాపురుషత్వ మిూచిన్నదానికిచ్చుటచేతకదా యిప్పుడు స్త్రీరూపమునుపొంది మిక్కిలి కామాతురముచే మనస్సు కలతనొంది అల్పసుఖభోగముల కానందించి యవ్వనముపోగొట్టుకొని ముసలిదాననై అందరానిఫలమున కాసించినట్లు పోగొట్టుకొంటినిగదా ? యిక నేనేమిచేయుదును నాతలవ్రాత నేననుభవించక తీరదనితలపోయుచుండెను. అంత నాసత్యవ్రతుండు భూతమువద్ద సెలవుపుచ్చుకొనిభార్యను వెంటదోడ్కొని నిజపురంబున కరిగి సుఖంబుగానుండె. ఇట్లుండనొకనాడా రాజపుత్రుండు మంత్రికొమారునితోడ వేటకుబోవ యత్నించి జననీజనకుల యుత్తరువునొంది వేటకాండ్రను వెంటబెట్టుకొని యడవికి బోయి వినోదముగ వనమృగములను వేటలాడుచు నుత్సాహముతో నాయడవిని దాటి దట్టమైనయడవిలోజొచ్చి బహుళముగా నుండెడు వ్యాఘ్రభల్లూకాది దుష్టమృగములనుజూచి యొక్కరితో నొకరు పంతంబులాడి బాణములబడగొట్టుచు తరుముకొనిపోవుచు నిరువురును వేరువేరు మార్గంబుల బట్టిరి. ఆసత్యవ్రతుండొక వ్యాఘ్రమును దఱుముకొని పోవుచుండ నదితనబాణములకుచావకుండుటకుగోపించి తనగురువునుమనంబునందలంచి యొకదివ్యాస్త్రమును ప్రయోగింప నాబెబ్బులి యాబాణమునకు భూమిమీదంబడి విలవిల దన్నుకొని ప్రాణమువిడిచి మిగుల సుందరమైన జింకరూపమునుదాల్చి గంతులువేయుచు ముఖమెత్తి రాజపుత్రునిజూచుచుం బోవుచుండెను. రాజపుత్రుం డాశ్చర్యపడి ఆహా ! ఇది మిగుల వింతగానున్నది. దీనిం బడగొట్టుదమనియోచించి కఱకుటమ్ములను బ్రయోగించుచు దానివెంటందగిలి పోవు

చుండెను ఆ మాయలేడి యా రాజపుత్రుని బహు దూరము గొనిపోయి యచట మాయమై యా రూపమునువిడిచి దివ్యసుందర యౌవనరూపమున నొప్పుచుండెడు స్త్రీరూపమునుదాల్చి పరుగుల్మలతాదులకునిక్కినిక్కి పుష్పములుగోయుచుండెను. ఆ సత్యవ్రతుఁడు క్షుత్పిపాసలకుడస్సి యా లేడినిం గానక వెనుక దిరిగిజూచి తనమంత్రికొమారునింగానకవిచారపడుచు గుఱ్ఱమునుదిగియొకపున్నాగవృక్షంబుక్రిందం గూర్చుండిపలుదెఱంగులయోచించుచు నలుదిక్కులుబరికించుచు నదాటున నాకన్యకారత్నంబునుజూచిదాని దేహకాంతులు తన కన్నులకు మిరుమిట్లు గలిగించి నారాజసూనుడు వెఱగుపడి నేత్రములను మూసికొని కొంతసేపు నిశ్చేష్టితుండై యిది వనదేవతగానుండుననిధైర్యము దెచ్చుకొని మెల్లగా గనులువిచ్చిచక్కగా దృష్టించి చూచి ఆహా! యిది వనదేవతయైన పుష్పములు గోయుటకు గారణం బేమి, అది వనదేవతగానుండదు. దేవకన్నియలలో నొకతెగా నుండుననిమనంబున నిశ్చయించి మెల్లగా నా కన్యక చెంతకుంబోయి ఓ ఇందుముఖీ నీవెవ్వరిదానవు ఈ యడవిలో నొంటరిగా కుసుమములు గోయ కారణం బేమని యడిగిన నా చంద్రవదన చిఱునగవుతో యతనింజూచి యోహో! రాజకుమారా! నీవీ యడవిలో నొంటిం గ్రుమ్మరుటకుగారణమేమి నిర్భయముగా నావంటి కన్నియల యొద్దకు రాదగునా అయ్యయో నేనురాచకన్నియను నొక రాక్షసి వలన బెరుగు చున్నాను. పుష్పములనిమిత్తముగావచ్చితిని. నీ వర్తమానమును జెప్పి యీ రక్కసుడు రాకమునుపే నీ పురికిం బొమ్మని పలికి క్రీగంటిచూపుల నతనింజూచుచు తన పయ్యెదను సవరించుకొనుచుండెను. ఆరాజపుత్రునకు జిత్తచాంచల్యముగలిగి యో బాలికామణీ నేనువంగదేశమును బాలించు చిత్రకేతు మహారాజునకు పుత్రుడను వేటకువచ్చిదుష్టమృగములను వేటాడుచు నామంత్రికొమారుని వేటకాండ్రను బాసి యొంటరివాడనైతిని, ఆహా నీదివ్యరూపముజూచి నదిమొదలు నాకు చిత్తచాంచల్యముగలుగుచున్నది అకటా నిన్నువిడచి పోవుటకు నాకుగాళ్లుతడబడుచున్నవి. పూవిలుకాడుపొంచిపొంచి బాణములవేయుచున్నాడు. నేనునిలువనోపను ప్రాణనాయకీ గౌగలించి ముద్దుబెట్టి నా ప్రాణములను నిలుపుము నీకుపుణ్యము గలుగుననని పలికిన నామాయలాడిచిరునగవుతో నతనిపొంతం చేరి నేను రాజకన్య నయ్యును చిరకాలమునుండి రాక్షసిచే బెంపడుచున్నాను ఈసంగతి యామెకుం దెలిసినమనమిరువురకుగీడువాటిల్లునని బలికిన నారాజసూనుండు కొంతవడి యోచించి పలుతెఱంగుల నీతులు నాబా

లికకు బోధించి మరుకేళికి సమాధానపరిచి గాంధర్వవిధిని బెండ్లాడి యాహో దరిండ్ల మఱుగుననురతక్రీడలఁదేలెను. ఇట్లు కొంతకాల మచ్చటనుండితిరిగి వత్తునని నారాజకొమారునికిఁజెప్పి నటనుండు శివమునియాశ్రమంబునదేవ రహస్యంబులు గాంచుచు కాలంబుబుచ్చుచుండని మార్గముఁజెప్పి తానునిజని వాసంబున కరిగెను. అంత నారాజపుత్రుండు చంద్రవదనయందు దగిలిన మోహంబుచే దానింవిడఁజాలక యదిజెప్పిననెఱుంగుననటనుండు శివముని యుపవనంబుచేరి మునిశిష్యుండై ఫలకాష్ఠ కుసుమంబులు దెచ్చియిచ్చుచు భగవత్స్వరూపముగ నాతని నెరనమ్మి స్వామీ నేనింతకుమున్ను నొక్కమ హామహునివలన ముద్రలక్ష్యంబునుగాంచి కృతార్థుండనైతి. తామునా యందు పుత్రవాత్సల్యతయుంచి షడ్విధసమాధిలక్షణంబనుదేవరహస్యంబు దెలియంబల్కుఁడని యనేకవిధంబుల పాదంబులుబట్టిప్రార్థించినకరుణారసభ రితుండై నామునిచంద్రుం డారాజచంద్రునకిట్లనియె! రాజాత్మజా నీప్రశ్న యమోఘంబు ఇది మహామునులకు నలవిగానున్న యదినీవుమిగులభావనుడ వనియు సాధించి సమాధినిష్ఠ జెందగలవనియు నట్టిరహస్యంబు నీకుజెప్ప బూనితిని నీవుశ్రద్ధాసక్తుండవై వినుము నిన్నుభగవంతుడు నెట్టియాపదల నుండియైనం దొలగంద్రోసి రక్షించగలండు అనిపంచాక్షరి మంత్రంబుపదే శించి వానిమరుగులు విశోధీకరించి బోధించి నీపాపంబెల్లయు భస్మీపటలం బయ్యె నింకసమాధినిష్ఠం బొందుమని యిట్లని బోధించె.



శివముని సత్యవ్రత మహారాజునకు సమాధిలక్షణంబు దెల్పుట.

సమాధి వికల్పమని నిర్వికల్పమని ద్వివిధము. అందు సవికల్పములు దృశ్యానువిద్ధ సవికల్పకము. శబ్దానువిద్ధసవికల్పకములను యిరు తెరగులుగలది యగును. ఈరెండున్ను నిర్వికల్పమొక్కటియునుగూడిమూడువిధములయ్యెను ఈమూడును బాహ్యాంతర భేదముచేత బాహ్యదృశ్యానువిద్ధసవికల్పకసమా

ధియని, బాహ్య శబ్దానువిద్ధ సవికల్పక సమాధియని, బాహ్య నిర్వికల్పక సమాధియని, అంతర దృశ్యానువిద్ధ సవికల్పక సమాధియని, అంతర శబ్దానువిద్ధ సవికల్పక సమాధియని, అంతర నిర్వికల్పక సమాధియని ఆఱువిధములు. అందుతనకంటె అన్యములుగ తోఁచెడుబ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివాది పిపీలికాంతమగు సమస్త చేతనములును తృణాదిమేరు పర్యంతమైన అచేతనములును తనతెలివియందే పుట్టిగిట్టినవి కాబట్టి అవిప్రజ్ఞాన కల్పితములని ఆప్రజ్ఞానమే పరబ్రహ్మమని ఆపరబ్రహ్మమే తానని చూచుట బాహ్యదృశ్యానువిద్ధ సవికల్పక సమాధియనంబడును. (౧) శివ రామ గోవింద నారాయణ వాసుదేవ మహాదేవాది సకలనామములతో తనచెవికి వినబడిన నామము తానుగానని విడిచి సర్వనామ విలక్షణమైన పరబ్రహ్మవస్తువు తానని యోచించుటే బాహ్యశబ్దానువిద్ధ సవికల్పక సమాధియనంబడును. (౨) కామాది స్వజ్ఞప్తివఱకుగల వృత్తులు తనయందు గలిగినప్పుడు వానినన్నింటిని అప్పుడప్పుడు ఒక్కొక్కనికి క్రమముగా నేనుగానని నిగ్రహించివీనికన్నిటికిని విలక్షణమైన పరబ్రహ్మము తానని భావించుటే అంతర్దృశ్యానువిద్ధ సవికల్పక సమాధియనగడు (౩) రాగద్వేష కామక్రోధ లోభ మోహ మద మత్సర ఈర్ష్య అసూయదర్ప అహంకారాది స్వజ్ఞప్తి పర్యంతమైన సకలాంతరవస్తు నామములును నేనుగానని విడచి సర్వవిలక్షణమైన పరమాత్మ తానని యూహించుటే అంతర శబ్దానువిద్ధ సవికల్పక సమాధి (౪) పైజెప్పిన చతుర్విధ సవికల్పక సమాధులయందు సుస్థిరత గలిగి అంతర బాహ్యములయందు తనకు నన్యమేమియు తోఁచక తోఁచినను సముద్రమునందు ముంచినకుండలోపల వెలుపల పరిపూర్ణమై ఆకాశమందుంచిన కుండలోపల వెలుపల శూన్యమైనట్లుండుటే బాహ్యనిర్వికల్పక సమాధి. (౫) యిప్పుడు చెప్పిన వృత్తులేమియులేక అఖండ పరిపూర్ణ సచ్చిదానంద పరబ్రహ్మస్వరూపమై యుండుటే అంతర నిర్వికల్పసమాధి. (౬) వీనిని పంచముద్రలచే సాధింపవలయును ఈ సమాధి నిష్ఠయందు గమనముంచి సాధించెనేని త్రిలోక పూజ్యుండగుచు విష్ణుపదంబు జెందునని చెప్పినవిని మారుతాత్మజుండు స్వామీ! యింతకుమున్ను తమచే ననేక దేవరహస్యంబులు వింటిని. యీ సమాధివిధుల సాధింప గష్టసాధ్యంబని తోఁచుచున్నది. వీనిగ్రహించి భవదీయ కరుణామృతంబుచే సాధించెదనని విన్నవించి తదనంతరంబా రాజసూను వృత్తాంతంబు దెలియబల్కుడని వేడిన ఆంజనేయునకు శ్రీరామచంద్రమూర్తి యిట్లనియె.

కపివర్యా ? ఆసత్యవ్రతుండు శివమునిచే సమాధినిష్ఠాను మార్గంబు బోధనొంది యామహాత్మునకు సకల శుశ్రూషలు గావించుచు సమాధినిష్ఠ లుసలుపుచుండెను. ఇంతలో తన్ను నాయాశ్రమమందు గాలంబుపుచ్చుడ నియు తానొకవారంబునకు తిరిగివత్తుననియుచెప్పిన చంద్రవదన వచ్చుచుం డుటంగాంచిపులకాంకితశరీరుండై నెదురుజని నెన్నరానితమకంబున నారాజ సూనుండు నంటగమకించిన వలదని సతనింబిలుచుకొని తన యంతఃపురంబు జేరి నొరులకు నీ మార్గంబు దెలియకుండజేసి బగలెల్లయు నారాజపుత్రుని నెక్కచో మరుగుపరచి రేయెల్లసతనింగూడి మరుకేళిం దనియుచుండె, ఇట్లా చంద్రవదన యా రాజపుత్రునితో గలసి సుఖించుచుండగా కొంత కాలమునకు నీ విషయమును పరిచారకులగు చెలికత్తెలు కొందరుజూచిదా నితల్లియైన వికటఘటితయను రాక్షసునికి తెలియజేయకుండుట ధర్మము కాదనితలంచి యామెచెంతకుంబోయి అమ్మానీకూతురగు చంద్రవదనమా నవజాతిలోపుట్టిన రాజపుత్రుని మోహించి వానియందు మిక్కిలి ప్రేమాతి శయముగలిగి సుఖించుచున్నది యని తెలియజేయ ఆవికటఘటిత ఆవిషయ మునొక్క నిజస్థితి నెరుగవలయునని చంద్రవదనయంతఃపురమునకు వచ్చిచూ డరాజపుత్రుడచ్చట కనబడక మోహావేశగురుతులతో అలసినిద్రించుచున్న చంద్రవదనంజూచి అత్యాగ్రహముతో కండ్లెఱ్ఱ చేసుకొని ఓసి బుద్ధిచెడిన దానా కేవలతుచ్ఛభోగముల ననుభవింప మనకుతక్కువ కులమునందుపుట్టి నమానవునియందు బుద్ధితగిలినట్లున్నది. నీకేలయిట్టిదురాచారమునందు కోరి కగలిగి యిట్లు రూపు మాపుకొనుట నీకు ధర్మమగునా మిగుల గొప్పదగు భూతకులమునబుట్టి మనుష్యుని బొందగోరుట మనకులమునకంతయు మాన హానియగును. ఓసి కులద్రోహివైన కపటాత్మురాలా! నీకేలయిట్టి దుర్బుద్ధి యని అనేకవిధముల నిందింప దగినమాటలను మాట్లాడుచుండుటను చంద్ర వదనవిని రెండుచేతులతో చెవులుమూసికొని అహా రామరామ యెంతమా టయంటివి అనిచివుక్కునలేచి ఎదుటవచ్చినిలచి యిట్లుచెప్పసాగెను, ఓనాప్రి యమైన తల్లీ నాకులదైవము సాక్షిగా నిదివరకును నాకు ఆశగొప్పదనియు ఆయాశ యిట్టిదనియు మనుష్యు డిట్టివాడనియు స్వప్నమందుకూడ వినను చూడను లేదు. అట్టినన్ను నీవిట్లునిందించుట తగునా యిట్టిదుర్భోధలు నెవరు కఱపిరో దెలిసినదికాదు ఐననుఅట్టివిషయమును నాకు తెలియజేయుము లేకు న్ననాప్రాణమును పోగొట్టుకొందునని చెప్పెను. ఇందుగలదీనంపు మాటలావి కటఘటితవినిమిగులకనికరముగలిగి బిడ్డానీవునీమీద తప్పులేదనిపించుకొనుట

కై యిల్లేల మాట్లాడెదవు పల్లమున్న చోట నీళ్లునిలువకబోదు గనుక ఊరకుండుమనిసమ్మతిబరచి యూరార్చుచుండ నంతలోవికటఘటిత తోబుట్టువులు ఈద్వేష కార్యమునంతయు తెలుసుకొని సత్యవ్రతుని ఒకరహస్య స్థలమునగొనిపోయి మరుగుచేసెను అంత చంద్రవదని తనతల్లికడకుపోయి మనస్సునొక కళంకములేని దానివలె ప్రవర్తించుచుండగా నంతలో సూర్యాస్తమయమాయెను. అంతవికటఘటిత తనమనస్సున నేమిసందేహము లేనిదై ఎప్పటివలె నెమ్మదిగొని నిద్రించెను. అంతచంద్రవదని తనతల్లి ఒళ్లుమఱచినిద్రించుచుండుటను నెఱిగి మిక్కిలి ధైర్యముగలదై లేచి తానుండు చోటువిడిచికాలిచప్పుడు కలుగనీయక మెల్లగా అడుగులు పెట్టుచు బయటికివచ్చిమిగుల నాతురముతో తనచెలికాని వెదుక నారంభించు చుండగా రాజపుత్రుడు తనప్రియురాలినిజూడ సమయము కనిపెట్టియుండెను. అంతకొంత సేపటికి జగన్మోహనాకారముగు చంద్రవదని మెఱుగుతీగవలె కనబడెను. అదిచూచి మిక్కిలి సంతోషించి యాకన్యతోగూడి శృంగారవనము నందున్న నొకపువ్వుల పొదరిల్లుజొచ్చి యందుమితిలేని యానందముతో సరసములాడుచు ఒకరినొకరు పరహాసించుకొనుచు కామశాస్త్రమున విధింపబడ్డిన ప్రకారముగా నానావిధములయిన యాలింగనాదులచే రతిక్రీడలనెడి మల్లయుద్ధముచేసి అత్యధిక సుఖానుభవములచే అలసి బడలికచెందిబుద్ధిమఱచి అన్యోన్యముగా పెనగిచుట్టుకొని క్రిందబడి నిదురపోయిరి. నంత నావికటఘటిత కొంతసేపటికి మెలకువగలిగి లేచి పూర్వచంద్రుని వెన్నెల సిందారకాయు చల్లనిగాలి కావలసి తనపడకవిడిచి బయలు దేరి యావుద్యానవనమంతయు తిరుగుచు పువ్వులపొదరిండ్ల దూరుచుండ నొక్కచోటచంద్రవదని సత్యవ్రతు లిద్దరును అధికసురతక్రీడల తేరియాడి అలసి ఒకరినొకరు పెనగిమైమఱచి నిద్రించుచుండుటనుజూచి అత్యాగ్రహముకలదై కండ్లెఱ్ఱజేసుకొని యారాజపుత్రు నెత్తుకొనిపోయి సముద్రమున బడవైచి చంద్రవదనిపై మండిపడిదవడలువాయునట్లు రెండఱపులుఅరచి దానితండ్రియగు ప్రజ్వాలుడను వాడుండునట్టి శిఖరమునకు కొనిపోయి వానితో నీ సంగతి నంతయు వినువక చెప్పెను. అదియాప్రజ్వాల రాజువిని మిక్కిలిదుఃఖించి దానికితగిన నీతులనుబోధింప తనమంత్రుల కాజ్ఞాపించెను. ఆమంత్రులు తమయజమానుని యుత్తరువుపొంది చంద్రవదని యొద్దకువచ్చి ఓచిన్నదానా మనము మిక్కిలి గొప్పదగు భూతకులమునందుపుట్టి భూలోకమునందు బుట్టిన మనుష్యుని పొందగోరుట ధర్మముకాదు. మనజాతిలో

పుట్టిన పురుషుని బెండ్లాడి సుఖించుట ధర్మముగాకుండ నీవట్లు చేయకకే
వలము తక్కువకులమునందు పుట్టినవాని పొందగోరుట మనకులమునకంత
యు అవమానము కలుగజేయునని చెప్పెను. అదియాచంద్రవదని చెవులకు
సీసము కరిగిపోసి నట్లుండునదిగాక యారాజపుత్రుని రూపగుణ సౌందర్యాతి
శయములను వర్ణించిచెప్పుచు వానితలంచి దుఃఖించుచుండుటను మంత్రులు
మొదలగువారువిని తనయజమానుని కడకుబోయి మహాప్రభూ యీరాత్రి
యంతయు తమపుత్రికకు ననేకవిధములైననీతులను బోధించియువానినిచెవి
బెట్టక తనప్రియునియందే మోహాతిశయమైన తలంపులుగలిగి అదేకలవరము
తోనున్నది అట్టిమనస్సు ఇప్పటికు మావలనకానేరదు అనిచెప్పిరి అంత
ప్రజ్వలరాజు అధికకోపముగలవాడై యాబిడ్డమీదనున్న ప్రేమనువిడచిదా
నిరెండుకాళ్లకు మిక్కిలి బరువైన ఇనుపసంకెళ్లను వేయించి యాసమీపమం
దుండు నిర్జనద్వీపమున చెరబెట్టెను. ఆవికటఘటితచే అధికకోపముతోసము
ద్రమున వేయబడిన సత్యవ్రతుండు ఆసముద్రమునందు ముత్యములకైమును
గువారివలె ఒకనుడిలోచిక్కి లోపలపోవుటయు బయటవచ్చుటయు ఈరీ
తిగమునిగియీదులాడుచు చాలదినములుకష్టపడుచుకడపట ఒకనొప్పయల
చేబడ్డునకు తోలగ త్రోయబడి గట్టుచేరెను. అంతటవాడు ఆనీళ్ళలోఊ
రుటచే శరీరమంతయుచిక్కి అధికచలితో వణకుచు ఎండలోనుండి చక్కగఆ
రుచుకొనుచుండ కొంతసేపటికి నడుచుటకు శక్తిగలిగెను. ఇట్లు సత్యవ్రతుం
డు నాసముద్రపు గట్టునపోవుచుండ నటనొక ద్వీపమునుగాంచి యందొక
శృంగారమేడనుచూచి దానిలోపలబోయి చూడగోరి తెగువతోనందుజొర
బడి కొంతసేపు సుఖనిద్ర ననుభవించిలేచి దానియందమును చుట్టిజూచి
వచ్చుచుండ దానిలో జీవముగల వస్తువు లొకటియు గనబడక పోవుటచే
యాశ్చర్యమునుబొంది ఇంకనెట్టి చిత్రములున్నవో చూతమని ఒక్కొక్క
గదిలోదూరి వచ్చుచుండ నొకసుందర మందిరంబున చంద్రునిబోలు ముఖ
మును విదియనాటి చంద్రుని యాకారముగల నెత్తియు కాటుకకొండతో స
మానమగు వెంట్రుకలును బంగారుకలశములవంటి స్తనములును పద్మము
లవంటికన్నులును చిగుళ్లవంటి పాదములును గలిగిన యవ్వనమగు దేవక
న్యయొకతె తనరెండు పాదములకు నినుపసంకెళ్లు వేయబడి బంగారుపట్టె
మంచముపై పండుకొని వెక్కివెక్కి ఏడ్చుచుండుటను సత్యవ్రతుండు
చూచి దానియొద్దకుపోయి గూర్చుండి ఓయువతిరత్నమా! ఈయవ్వనకా
లమందు చక్కనిపురుషునిగూడి సుఖించుటనువిడిచియీనిర్జనద్వీపమునందు

దుఃఖింపనేల కారణంబనియడుగ నాచిన్నది నీవెవరవు నీయూరెద్ది నీపేరేమి నానిమిత్తము నీవు వెదకుకొని వచ్చినట్టయిన శీఘ్రముగబోయి దాగికొనుము లేకపోయిన కత్తిచేనరుకబడి చత్తువని చెప్పుచున్న మాటలువిని యింతమాత్రంబునకు వెఱచువాడగానని తన నిజవృత్తాంతంబు నెఱుంగజెప్పిన నాచిన్నది సంతసించి మిగుల సంతోషంబునొంది తాననుభవించు చెఱను తప్పించిన సుఖింపవచ్చునని వానికిదెల్పి మరియు నిట్లనియె. ఓ ప్రాణనాయకా మాజనకాజ్ఞచే నన్ను నీనిర్జన దీపమున వదలివెళ్ళిరి అంత కొన్ని దినంబులకు నొకసన్న్యాసి ఇచటికివచ్చి నన్నుజూచి మోహించి బలాత్కారముగా గవయవచ్చిన నేనాతని ఒల్లనుసమ్మతింపక పోవుటచే మిక్కిలి సంకటములుపెట్టి యతిఘోరముగ బాధింపుచున్నాడు. నేటికిమీవలనంనాచెఱ వదలెననిన వాడందు ధైర్యంబుబూని నామందిరంబు ప్రవేశించి తనకు గావలయు నాయుధంబులు తీసుకొని నాచంద్రవదనిని చెఱవిడిపించి వెంటబెట్టుకొని తన నగరంబునకు వచ్చుచుండ నాచెలిని చెఱపెట్టిన సన్న్యాసి పిడుగువలె ధ్వనిజేయుచు ఎదుర్కొని వచ్చుచుండుటను చంద్రవదనచూచి గడగడ వణకుచు రాజపుత్రునిజూచి అయ్యో నాశత్రువు అదోవచ్చుచున్నాడు నీవతిజాగ్రత గలిగియుండుమనిన తోడనే వాడియైన ఆయుధంబుల తీసికొని ప్రళయకాళ మేఘమువలె గర్జించుచు వాని నెదుర్కొనిపోయి గొప్పకంఠధ్వనితో ఓ కపటవేషధారియగు నీచాధముడా నీవు నీకాలును ముందుబెట్టక వెనుకతిరిగిపొమ్ము నామాట అలక్ష్యముచేసి అతిక్రమించినయెడల ఇప్పుడే నిన్ను నాకత్తికెఱగా జేసెదనుఅని చెప్పునంతలో నాకపటవేషధారితననోటిని విశాలముల తెఱచి రంపమువంటి పండ్లనుచూపుచు నిదేమివింతగానున్నది. అని చెప్పుచు మీసముపై చెయివేసిమదపుటేనుగనుచిన్ననల్లచీమ ఎదురించినట్టును గండభేరుండము ఊరపిచ్చుక నెదిరించినట్టును ఈమనుష్యుడు నన్నెదిరించుచున్నాడు. అదిచూడ నాకులజ్జగానున్నది. ఈయోగను నాచేత నెట్టు విసరుదును నాబలకరమైనచేతితో నొకదెబ్బ కొట్టినట్టులైన పేగులు బయటపడును మహేంద్ర పర్వతమునుగూడ పిడికిటబట్టి ఎగరగొట్టునట్టి సామర్థ్యముగల నాకీమనుష్యుడెంతమాత్రము అని యనేకవిధముల తనసామర్థ్యమును బొగడుకొనుచు వానిజూచి మంచిదికానిమ్ము నావస్తువు నాచేతికిచ్చి నీత్రోవనుబొమ్ము. ఏలయనిన నాప్రాణసమానరాలగు నాకన్య యొకక్షణమెడబాయక నీటినెడబాయనితామరవలె మోహమున జిక్కియున్నానుగనుక దానివదలిపెట్టి పొమ్ము అని బెదరింప నారాజపుత్రుడుఓ తెలి

విహీనుడగు నీచాధముడా కొంచెమయిన నెనరులేక మిక్కిలి సుకుమారురాలగు నాకోమలాంగినిగూడి నీకుసుఖింపతగునా నీ బలసామర్థ్యములకాచిన్నది యెంతమాత్రము ఇదిచూడ పిచ్చుకపై బ్రహ్మాస్త్రముప్రయోగించునట్లున్నది దానివలన నీ వేమి సుఖమనుభవింప బోయెదవు ఇంతటిఘోరమైన పాపమునకు ఒడిగట్టి నిన్ను నూరక వదలుట ధర్మంబుగాదు నీనాలుకను తెగగోసినను తీరదు అని చెప్పగా నాకపటరాక్షసునకు కోపముగలిగి కండ్లెఱ్ఱచేసి పెదవులు తడబడ అత్యుగ్రమైన రోషావేశముతో నొకరాతి బండనెత్తిపై విసరెను అంత రాజపుత్రుడు అతిఘోరముగా నా రక్కసుని జూచి యో తెలివిమాలిన మూఢుడా యికనైన యిదివిడిచి పారిపొమ్ము లేనియెడల మీశరీరములు నలియగొట్టి తునుకలు చేసెదనని కండ్లెఱ్ఱజేసి నీ సైన్యములనున్ను, నిన్నును, నొకరికొకరు జూడకుండ జేసెదను. గాన నీవు సిగ్గులేక నోటికివచ్చినట్లు కూయుచున్నావు న్యాయముగా నాతో యుద్ధముజేసి యెడల మిమ్మందరిని చంపివేయగలను గనుక నీవు ఇటువంటి అధర్మకార్యములను జేయించి అధికప్రసంగముచేయుచున్నావు ఇకనుకూయకుండుము. అని పలువిధములైన నీతులను బోధించియు వినక క్రూర కృత్యములు జేయుచుండుటనుజూచి తనకుగలిగిన కోపావేశమువలన క్రూరములగుబాణములచే, దుత్తునియలవునట్లు గర్జించి భూమ్యాకాశములు గడగడవణకగ నా సన్యాసిపై దుమికి యాయుద్ధభూమియంతయు నెత్తురుకాలువలుగాను బీనుగుపెంటలుగాను జేసి జయించినవాడై యాచంద్రవదనిని దోట్కొని మిగులసంతోషంబుతో నిజపురంబు కేరి తాననుభవించిన కష్టంబులును తాబొందిన ఫలంబులను జననీజనకులకు నెరుంగజెప్పియొక్క సుముహూర్తంబున ముత్తైదువలు మంగళారతులివ్వ బ్రాహ్మణోత్తములు నాశీర్వాదింప చంద్రవదను సత్యవ్రతుండు బెండ్లాడి యువరాజుగా తండ్రిచెంగట మెలంగుచు సుఖంబుండెనని? జెప్పిన నాయంజనీపుత్రుండువిని ఆనందభరితుండై యాశ్రీరాముల పాదకమలములను తన నేత్రకమలములతో నద్దుకొని నమస్కరించి మహాత్మా! నిన్ను గీర్తింప నేనెంతటివాడ సమాధినిష్ఠయందున్ను ముఖ్యముగా కడతేరెదను చిత్తగింపుము. కాలాతీతంబయ్యె నిద్ర నేత్రములయందు తాండవమాడుచున్నది. నిద్రంతమురమ్మనిన జని నాయిరువురు సుఖనిద్రజెందిరి.

పంచమరాత్రికథ - సమాప్తము.

ఓమ్.

శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః.

# షష్ఠమ కథారత్నము.

ఆఱవదినము రాత్రి సీతా రామాంజనేయులు తాంబూలంబు సేయుచు సుగంధ పరిమళాదులం గూర్చిన చందనము నలదికొనుచు జల్లగావీచుచుండు మలయమారుతంబున కానందించుచు వాయునందనుం డాదశరథనందనుంజూచి దేవదేవోత్తమా యపవర్గ మార్గమైన వేదాంత సారములోని అంపిండ బ్రహ్మాండముల వివరము నాకు హృద్గోచరం బగునటుల నొక పుణ్యచరిత్రమునుజెప్పి పావనునిగా సేయుమని ప్రార్థించిన నాభగవంతుండు దేవదత్త మహారాజు చరిత్రమును వినుమని యిట్లనియె:—

## దేవదత్తమహారాజుకథ.

మున్నొకకాలంబున సింధుదేశంబున చిత్రవర్మండను రాజు చిత్రాంగుడను ప్రధానింగూడి రాజ్యంబు చేయుచు దనకు సంతానములేని కతంబు విచారగ్రస్త హృదయుండై తనరాజ్యం బంతయు ప్రధాని యధీనంబు చేసి భయంకరమగు నడవియందున్న ఋష్యాశ్రమంబు జేరి అందుండు ఋషీశ్వరునకు శుశ్రూషలు చేయుచుండ కొన్నిదినంబుల కాతపోధనుండానరేంద్రుపై గరుణించి ఓ రాజేంద్రా నీవెవ్వండవు ఇందుల కేలవచ్చితివి యనిన నృపుండిట్లనియె? ఓ స్వామీ నేను సింధుదేశం బేలెడిచిత్రవర్మండనురాజును నాకు సంతానంబు లేకయున్నది మిమ్ముగాంచి గృతార్థుండనైతి నాకు సంతానంబు దయచేయవలెనని యనేకవిధంబుల వేడగా నామునీంద్రుండు ప్రీతుండై ఓ నరేంద్రా యీ మామిడి చెట్టెక్కి రెండుపండ్లు కోసికొనిపోయి నీ భార్యకిమ్ము దానివలన నీకు సంతానముగల్గు బొమ్మనిన సర్వంసహా విభుండు సంతసిల్లి యా చూత వృక్షంబెక్కి తనయొడినిండుగా పండ్లుకోసికొని చెట్టుదిగి తనయొడి చూచుకొనగా మునీంద్రుడు చెప్పిన ప్రకారంబున రెండుపండ్లే యుండెను. అంత ఆ భూపాలుండు మనకు ప్రాప్తమింతయే యని ఆరెండుపండ్లు తీసికొని తన పట్టణంబునకు వచ్చి తనమంత్రియైన చిత్రాంగదునకు చెప్పిపంపించెను. అతండును భేరీ మృదంగాది వాద్యంబులతో పట్టపేనుగను శృంగారించుకొని భటులతోకూడ రాజునకు యెదురుగా వచ్చి పట్టణము లోనికి పిలుచుకొని పోయెను. మఱికొన్నిదినంబులకా రాజొక శుభదినంబు తనభార్యకు అభ్యంగస్నానము చేయించి

తాను తెచ్చిన పండ్లను ఇచ్చెను. ఆ వనితామణియు దానిని భక్షించగానే గర్భంబై నవమాసములుగడచి మన్మధునికన్న సౌందర్యవంతులగు నిరువురు పుత్రులంగనియె. అంత నా రాజపుత్రులకు శ్రీదత్తుండనియు దేవదత్తుండనియు పేరుబెట్టి సకలవిద్యలం జెప్పించుచుండగ నాయిరువురు యవ్వనంబు నొంది నొకనాడేకాంతంబున నిట్లనియోచించిరి. మనతండ్రి మనకు పట్టంబుగట్టుదురు. అటుపిమ్మట నెక్కడికిం బోవుటకు దుస్తరంబు కాన నిప్పుడే దేశాంతరములకు బోయి సకల దేశంబులజూచి వత్తమని యోచించి కావలసిన ద్రవ్యంబు లెత్తుకొని యుత్తమాశ్వంబు లెక్కి యొకనాటిరాత్రి నిశీథి సమయంబున పయనంబై యొక్క యరణ్యంబు ప్రవేశించి పోయి మఱు దినంబున అన్నపానాదులు లేక యలసి సొలసి జలంబును వెదకుచు కొంత దూరముపోయి అక్కడ నొక తామరకొలనుంగాంచి అందు జలంబులద్రావి యా సమీపమున వృక్షముక్రింద విశ్రమించి యుండెను అక్కడ ఒక ఎఱుకలవాడు వృక్షము మీద నుండు నొక పక్షినిం బట్టవలయునని యనేక దినములనుంచి ప్రయత్నంబుచేసి వలలొడ్డి కాచియుండె నాటిదినంబాపక్షి వలలోబడి చెట్టుక్రింద వుండు రాజకొమాళ్ళ మీదు పడగావారలు దానిని భద్రముచేసి యుంచిన పిమ్మట ఎరుకలవాడు చెట్టుదిగి వచ్చి వారలకు నమస్కారంబుచేసి ఓ రాజపుత్రులారా అనేకదినములనుంచి ఈ పక్షినిమిత్తమై కనిపెట్టి యున్నాను. నాకు దీని దయచేయుం డనిన వారలు చిఱునవ్వునవ్వి ఓ వెఱ్ఱివాడా ఈ పక్షి నీకేమి ఆహారమగుచున్నది. దీని నిమిత్తము అనేక దినములనుంచి కాచియుండనేల యనినవా డిట్లనియె. ఓస్వాములారా నేను దీనింగోరియుండుట నాకాహారంబుకై కాదు. దీనియందొక ప్రభావంబుకలదు దానింజెప్పెద వినుండు దీని శిరస్సునుతిన్నవారు నవ్వితే రత్నాలురాలును. నడుము తిన్నవాడికి నాలుగు రాజ్యముల ప్రభుత్వము గలుగును. తోకతిన్న వారికికైలాస పదప్రాప్తి గలుగును. కాబట్టి ఈ పక్షి నిమిత్తంబై ఇన్ని దినములు కనిపెట్టి యున్నానన వారిట్లనిరి. ఓ ఎఱుకలవాడా ఈపక్షికిమూడు ప్రభావంబులు చెప్పితివి. అందులో నీకు నేదికావలయునని యడిగిన నాతడందులకుకైలాసప్రాప్తి కావలెననికోరెను. అంతనా ఇరువురు నాపక్షితోకనుంగోసి యిచ్చిన నామెరుకలవాడు దానినిభక్షించుచుండ కైలాసంబునుండి విమానంబే తెంచె నంత నతండా విమానంబెక్కి బొందితో కైలాసంబునకుంజనియె నంత శ్రీదత్తుం డాపక్షియొక్క నడుమున్ను దేవదత్తుండు శిరమును భక్షించి అక్కడనుంచి ఆ యడవిలో బోవుచు నవరసాలంకారమను

నొక పట్టణంబు సమీపమున బావియుండగా దానియొద్ద నా ఇరువురుంగూ ర్చుండి నెమ్మతితో దేవదత్తుండు ఓయన్నా ఈబావి అగాధ జలముగానున్న యది నీవు ఈ బావిలో దిగలేవు, నేను దిగిపోయి నీళ్లు తెస్తున్నానని యొక దొన్నె కట్టుకొని యా బావిలో దిగి కావలసిన జలము త్రాగి తన అన్నకై దొన్నెనిండా నీళ్లుతీసుకొని ఎక్కివచ్చుచు ఊర్వశి మేనక తిలోత్తములకన్న మిక్కిలి చక్కదనముగా వ్రాసియుండెడు ఒకప్రతిమంగాంచి మూర్ఛనొంది కొంత సేపటికి తెలివి తెచ్చుకొని మాయన్న మోహనాకారుండగు శ్రీదత్తుం డుదీని చూచిన యిక్కడనే ప్రాణములు విడుచును. కాబట్టి అతండు చూడ కుండ ఆవల జరిగిపోవలెనని యెక్కివచ్చి తాను తెచ్చిన నీళ్ళను తన అన్నకు నిచ్చెను. ఆనీళ్లను శ్రీదత్తుండు త్రావి ఔరా యెక్కడ ఇటువంటి నీళ్లను చూడలేదు ఈ నీళ్లు ఇంత చక్కగా నున్నదే ఈ బావిలో నింకా ఏమివింత లున్నవో నేను దిగిచూచి వచ్చుచున్నానని ఆ బావిలోదిగి మరల కావలసిన మట్టుకునీరుత్రావి యెక్కివచ్చుచు ఆప్రతిమంగాంచి మూర్ఛపోయి కొంతసే పటికి దెలిసి యిటువంటిస్త్రీతో సంబంధించని జన్మంబేల ఈ స్త్రీ ఎక్కడయున్న దో దానిసాధించి వరించక యుంటినా నా ప్రాణంబులు విడిచెదనని ప్రతిజ్ఞ చేసినవరసాలంకారమను పట్టణమునకుబోయి యందొక పేదరాలిపెద్దమ్మ యిల్లుచేరి రెండువరహాలిచ్చి భోజనముచేసి ఆ బావిలోనున్న ప్రతిమసం గతి యేమనియడిగిన నామెయిట్లనియె. ఓ రాజపుత్రులారా కనకపురంబు నందు కనక పాలుండను రాజు రాజ్యంబుసేయుచు సంతానంబులేక యనేక దినంబులు తపంబుగావించిన నాతనికి దేవతాస్త్రీలకన్న సౌందర్యవతియగు నొకకన్యకగలిగెను. నాతండా కుమారిక రూపంబు పటమున వ్రాయించిన కలదేశములకుబంపి దానికిదగిన రాజకుమారుల రూపంబు లనేకంబులు ప టంబున వ్రాయించి తెప్పించి తనపుత్రికకుజూపిన నాకన్యామణియెవ్వకా నదయ్యె నానరేంద్రుండు తనకు పుత్రసంతానంబు లేకపోయినందున నా చిన్నదాని తగినవరునకిచ్చి వివాహముచేసి నాయల్లునికి రాజ్యంబివ్వవలెన నియెంచి యున్నాడు. ఇదివఱకనేక పటంబులు వ్రాసిపంపను నాకన్యతనకు ఈడుగాదని చెప్పుచున్నది. ఇప్పుడా నరేంద్రుడు తనపట్టపేనుగ శృంగా రించి పూలమాలికనిచ్చి యాయేనుగ ఆ మాలికను యెవరి మెడయందు వేయుచున్నదో వానికి నాకొమార్తెను రాజ్యంబును నిచ్చెదనని స్వయం వరముచాటించి యున్నాడందుకు నెలదినములు గడువున్నది. ఇక్కడికి ఆపట్టణంబు ఇరువదియామడల దూరంబుగలదుగాన ఒకకంసాలవాడా చిన్న

దానింజూచివచ్చి యూరివెంబడి బావిలో ప్రతిమగా నేర్పరచినాడు. అని
పేదరాలి పెద్దమ్మ చెప్పగా యిరువురున్ను ఆకనకపురంబునకు పోవలయునని
పోవుచు సమీపమున నందికేశ్వరంబను నొకగ్రామంబున నొకచావడీ యుం
డగా వీరునాటిరాత్రి యచ్చటపండుకొని నిద్రించిరి. ఆ చావడిలో నిత్యము నె
న్ను బాటసార్లు పండుకొనన వారల నొకనాగసర్పము కరచును. అందున
వారెల్ల చత్తురు. మరునాడుదయమున ఆచచ్చినవారినెల్ల లాలాయను ఒక
తురకతన మంత్రముచేత బ్రతికించుచు వచ్చును. ఇట్లుండ నారాజపుత్రులు
వర్తమానము తెలియక యాచావడియందు పండుకొని నాగసర్పము కరచి
చచ్చిరి. మరునాడుదయకాలంబున ఆలాలాతనమంత్రశక్తిచేత శ్రీదత్తుని
బ్రతికించి వానింబిలచి యిక్కడికి గడియదూరంబున గనకపురంబనునగరము
యున్నది. నీవక్కడికిపోయి వకడబ్బుకు పాలుతెస్తివా నీతమ్ముని బ్రతికిస్తాన
ని చెప్పగా నతండుమంచిదియని యాపట్టణంబునకు బోయెను. ఆపురంబేలె
డిరాజు సంతానంబులేక తపంబుగావించి రంభోర్వశులకన్నా చక్కనిదగు
కూతురినింగాంచె ఆకన్య యేదేశముల రాజకుమారులం దెచ్చినను సమా
ధాన పడనందున పట్టపేనుగను శృంగారించి పూలమాలికనిచ్చి ఈగజంబీ
మాలిక నెవరిమెడను వేయునో వారికీకన్యనిచ్చి పట్టంబుగట్టెదనని స్వయంవ
రంబుసాటించి యున్నందున సకలమైన రాజకుమారులువచ్చి కనిపెట్టియుం
డిరి. శ్రీదత్తుండా సమాచారంబువిని యాసభకుంబోవ యాగజంబాతనికం
ఠంబున నామాలికనైచి పైనెక్కించుకొని పోయెను. అంత కనకపాలుండా
మన్మథప్రతిముండగు శ్రీదత్తునింగాంచి యానందంబునొంది సుసందయనుత
నకొమార్తెభాగ్యంబు ఫలించెనని మనంబునం దలంచుచువానికిం బుత్రినిచ్చి
వివాహంబుచేసి తనరాజ్యంబతనికినిచ్చె నంత నాశ్రీదత్తుండును యాబాలా
మణినింగూడి సకలభోగముల ననుభవించుచు రాజ్యమువిచారించుచు తనత
మ్ముడు మృతుండైన సంగతిమరచిపోయె అక్కడ ఆలాలా శ్రీదత్తుండు ప
ట్టణంబునకుబోయి రానందున మరియొకరిని పంపించి పాలు తెప్పించిదేవద
త్తుని బ్రతికించె. ఆదేవదత్తుడును ఆనగరంబునకుబోయి తనయన్న సమాచార
మునువిని సంతోషపడుచు అన్నయున్న యంతఃపురంబునకుపోయి అన్నా
అన్నా యని మున్మారుపిలచె నంత శ్రీదత్తుండు రాజ్యమదము చేత తనత
మ్ముడని యెంచక మరచిపోయి వానిమెడబట్టి త్రోయించెను పిమ్మట దేవద
త్తుండు తనఅన్న యీప్రకారము చేయించెగదాయని కొంతసేపు దుఃఖప
డి నాగ్రహచార మీలాగయ్యెనని ఆపురములో గుగ్గిళ్లపోలిశెట్టికొమార్తె

బహుచక్కనిది పెనిమిటి దేశాంతరము పోయినందున ఆదేవదత్తునిమోహిం చివారుయిరువురు మన్మథక్రీడలదేలుచు సరససల్లాపములాడుచుండుటచేతదే వదత్తుండు నవ్వె నంత జల్లున రత్నాలురాలెను. అంతపోలిశెట్టికుమార్తె సంతోషమొంది నిత్యంబతని యనేకమార్లు నవ్వించు చుండెను. అంతపోలి శెట్టియింట అనేకంబులైన రత్నంబులు గలుగుచున్నందున అతండు భాగ్య వంతుడై గుగ్గిళ్ళ పోలిశెట్టియను పేరుబోయి రత్నాల పోలిశెట్టియనే పేరు గలిగి ఆరాజువద్ద పెద్దవర్తకుడాయెను. ఇట్లుండ ఒకానొక దినంబున తన కుమార్తెనుంబిలిచి ఓయమ్మా దేవదత్తుండునవ్వినంతట రత్నాలు రాలునది ఎందునిమిత్తమో ఆవైనము తెలుసుకొమ్మనిచెప్పగా మంచిదనియాచిన్నది సరససల్లాపములతో కేళీవిలాసములుగా నుండుసమయమున దేవదత్తునిమా య చేసి యడిగెను. దేవదత్తుడును ఆకన్యపైయుండు మోహముచేత ఓచిన్న దా! నేనునవ్వితే రత్నాలు రాలేసంగతి యావత్తు చెప్పెదననివిస్తారంబుచె ప్పెను. ఆకన్యక ఇవి యంతయువిని తండ్రియైనపోలిశెట్టికా తెరంగెరించెనా పోలిశెట్టియు ఆదేవదత్తుని మోసముచేసి వానికడుపులోనున్న వస్తువుతీయ వలెననియెంచివైద్యులంబిలుపనంపిఆరాజసూనునకుప్రవర్తికిమాత్రనిప్పించి వానికితెలియకుండా ఆ మందును పిండివంటయందిమిడ్చి ఇప్పించెను అంత అయిదారుదినములువిస్తరించి ప్రవర్తులైనందునవ్వితే రత్నాలురాలేపక్షి మాంసము ప్రవర్తిగుండా క్రిందపడెను. అదితీసుకొనికడిగిచూచిన్నదిభక్షిం చెను. పిమ్మటయాచిన్నదినవ్వినంతనప్పుడారత్నాలుపుట్టుచుండెను. ఈప్రకా రము దేవదత్తుండా కన్యతోతనమర్మంబు చెప్పినందున కడుపులోనున్న వస్తు వుపోయి నవ్వితే రత్నాలు రాలకపోయెను. అందున అతనికిపోలిశెట్టిఅన్న పానాదులు చక్కగా విచారించక వస్త్రంబు నివ్వక నీచముగా చూడడమే గాక అల్పమయిన పనులంతా చేయుచుండెను. అంత దేవదత్తుండు అయ్యో య్యో భగవంతుండు నాకీలాటివ్రాతవ్రాసెను. మాయన్న శ్రీదత్తుండీప ట్టణములోనే రాజ్యము చేయుచున్నాడు. నాకర్మంబీలాగయ్యెతల్లిదండ్రు లనుకూడా నెడబాసి వచ్చితిననియాని యనేకవిధముల విలపించుచుధైర్యంబు తెచ్చుకొని మనము తొందర పడకూడదనుచు ఈ పోలిశెట్టిగారి ఇంట్లోనే యుండి యతండుచెప్పిన పనులన్ని చేయుచుండెను. పిమ్మటయాశెట్టినా తనిపశువులమేపమని పంపగా నతండు మేపుచుండి ఒకనాడుసముద్రములో నుంచి ఒకచాప గట్టున పడివుండగ చూచి తిరుగ నీళ్ళలోకి తీసుకొనిపోయి లోతునవేసి తాను పశువుల మేపుకుంటూ యుండెను. పిమ్మట కొన్నిదినం

బులకు పోలిశెట్టి వాడ బేరమునకు బోవలెనని ఒకవాడ కట్టించి అందులో మాణిక్యములు కెంపులు ముత్యములు యింకా ప్రియమైన వస్తువుల నెల్ల నెక్కించుకొని రాజుచేత శెలవుతీసుకొని కొందరిమనుష్యులను వెంటబెట్టుకొని కాళ్లు గుద్దడమునకున్ను ఆకులు మడచిఇవ్వడమునకున్ను దేవదత్తుని కూడా ఓడమీద ఎక్కించుకొని పోయెను సముద్రములోకొంతదూరము పోగా ఒక దీవిగడ్డయందు మహేంద్రపురమను పట్టణము గనుపించినందున వాడ దిగుమతిచేసి ఆపట్టణమేలు సరసజ్ఞుడను రాజవద్దకుకొన్నిసరకులు తీసుకొనిపోయిచూపించెను. ఆ నరేంద్రుడు తనకు కావలసినమట్టుకుతీసుకొనెదమనిఆపోలిశెట్టితో చెప్పెను. అచ్చటఆరాజేంద్రునిపుత్రియైనసరసయనుచిన్నదితనమేడకు సమీపమునఒకకాలవత్రవ్వించిఅందులో తానుస్నానముచేసిన పసుపునీళ్లు పారుతూవుండేటట్టు నేర్పరచియాకాలువను యెవరుదాటుదురో వారిని నేను పెండ్లి చేసుకుంటానని ప్రతిజ్ఞ చేసియుండెను. అదివరకు అనేకులువచ్చి ఆ కాలువను ఎవరునుదాటలేకపోయిరి. అప్పుడు దేవదత్తుడున్ను ఇంకా కొందరున్ను ఆపట్టణంబులోని వైభవంబు చూచుచు సరసత్రవ్వించిన కాలువదగ్గరకుబోయి అందరు ఆ కాలువలోదిగిపోయిరి దేవదత్తుండు మాత్రము ఆడదాని పసుపునీళ్ళు కాలువలో దిగిపొయ్యేదాయనిదాటిబోయెను. అది సరస మేడమీదనుంచిచూచి దేవదత్తునిగుర్తుపెట్టుకొనియుండి తన తండ్రికిం జెప్పె, నానరేంద్రుండును పోలిశెట్టి మిక్కిలి సంతోషము నొందితన పరిజనులతోకూడా రాజసముఖమునకు పోవుచుండ సరసపసుపు కాలువలో అందరుదిగివచ్చిరికాని దేవదత్తుండే దాటెను, అప్పుడుసరసతన మేడమీదనుంచి చూస్తూయుండి ఇతండు ఏమి హేతువుచేతనో చిక్కియున్నాడు, ఇతను రాజపుత్రుడుగానున్నాడు, ఇతండుమహానుభావుండనితలంచుచుండగా పోలిశెట్టి కొలువు కూటమునకే తెంచి కూర్చుండె నప్పుడు రాజు దేవదత్తునిజూచి యితనికి నాకొమార్తెనిచ్చి వివాహము జేసెదనని బ్రాహ్మణునింబిలిపించి ముహూర్తమునిశ్చయించ నంతట పోలిశెట్టి నాకు వక్కాకు మడిచిచ్చేవానికి పెండ్లిచేయడమేమి వీడు కులములో బోయవాడు పెండ్లిచేయవలెననియుంటె నాకుచేయవలసినదేకాని వీనికి చెయ్యకూడదని చెప్పెను. అంత నరేంద్రుడు ఓపోలిశెట్టి నీకేపెండ్లి చేసేటందుకు నాకొమార్తె త్రవ్వించిన పసుపుకాలువ నీవుదాటలేదు దిగివచ్చితివివీడు దాటివచ్చెనుగాన అతనికే పెండ్లిచేయువలెనని చెప్పెను. అంతపోలిశెట్టి చింతాక్రాంతుండై దేవదత్తునిభాగ్యమేమనిచెప్పవచ్చును అయితేనుసమువిరక్తిచే

యకూడదని రాజుగారితో కానియ్యమని యోచించుచుండెనంత రాజు దేవదత్తునికి తనపుత్రికయైన సరసనిచ్చి పెండ్లి చేసెను దేవదత్తుడు తనభార్యతో గూడి కేళీవిలాసముగానుండి తనసమాచారం బెల్ల నెరిగించి పోలిశెట్టినన్ను మోసము చేసియున్నాడు ఇకమీదనన్ను సముద్రములోనత్రోసి నిన్న పహరించవలెనని యున్నాడు, అయితే పూర్వము నేను చాపకు సహాయము చేసియున్నాను అది నన్ను రక్షించును నాకు మరేమిభయము లేదు యెన్ని దినములకైనా నీవద్దకువచ్చి చేరుదును. అని యీప్రకారము దేవదత్తుండు చెప్పి మాటలన్ని జ్ఞాపకమునకు పూర్తిపరచియుండెను. అంతట పోలిశెట్టి రాజసముఖంబునకువచ్చి మా దేశంబునకు బోవలెనని చిన్నవానిని చిన్నదానిని పంపించమని వేడిన అతండు మంచిదని తనకొమార్తెను అల్లునికి అభ్యంగన స్నానము చేయించి వెలలేని సొమ్ములు మొదలైనవాటినిచ్చి యాపోలిశెట్టి వెంటపంపించెను. నతండు తాను తెచ్చిన సరకులనెల్ల విక్రయించుకొని తనదేశములో లేనివస్తువుల ఓడకు నెగుమతిచేసుకొని ఓడ యెక్కి సముద్రము మీదవచ్చుచు దోవలో ఆదేవదత్తుని సముద్రములో పడత్రోసి ఓచిన్నదానా నీమగండు సముద్రములో పడిచచ్చెనిక మీద నేను చెప్పినటుల వింటివా యనిన సరస ధైర్యంబు తెచ్చుకొని ఓపోలిశెట్టి నాపెనిమిటి సముద్రములో పడిపోయినాడుగదా ఇకమీదనాకు నీకంటె నెవరున్నారు అయితే నేను యేడు సంవత్సరముల వ్రతము పట్టియున్నాను అందుకు రెండు సంవత్సరములు అయినది వ్రతసమాప్తికాగా నే నీయాజ్ఞలో వుంటున్నాను ఇప్పుడు దినము ఒకటింటికి నాలుగు బంగారు చేటలు నలభై వేలవరహాలు బ్రాహ్మణులకును ముత్తైదువులకును దానము చేయవలసినది వ్రతసమాప్తి అయ్యేదినము విస్తారము రత్నములు, ముత్యములు, మాణిక్యములు, అధికముగా వరహాలు కావలసియున్నది. జాగ్రత్త చేయించుకొమ్మని చెప్పెను. అంతనాపోలిశెట్టి యుమహాసంతోషంబుచే భుజంబులుప్పొంగి తననగరమునకుపోయి ఒకమేడకట్టించి అందుసరసనుంచి నిత్యము వ్రతమునకు కావలసివస్తువులు యిచ్చుచుండె సరసయు తనపెనిమిటి ప్రాణములతో వుండి నాలుగైదు సంవత్సరములకైనా రాకబోతాడా యని ధైర్యముగానుండెను. అక్కడ సముద్రములో పడిన దేవదత్తుడు తనకు అపాయము వచ్చినదని చాపను తలచుకోగా అది వచ్చి తనపైన యెక్కించుకొని సముద్రపు గట్టున విడిపించిపోయెను అంతట దేవత్తుండు నరణ్యంబైన యడవిలో కొంతదూరముపోయి వకశృంగారవనంబున వకసుందరంబైన కొలను సమీపంబున గూర్చొనియుండెను అక్కడికి దేవకన్నియ లేడ్గురువచ్చి

వస్త్రములిప్పివేసి జలకమాడుతూ యుండగా నాదేవదత్తుండు ఆదేవకన్నియల చీరెలలో నొకదానినెత్తుకొని కొంతదూరము పోయినొక చెట్టుయెక్కియుండె దేవకన్నియలు జలకమాడి బైటికివచ్చి ఆఱుగురు చీరలుకట్టుకొని దేవలోకంబునకుబోయిరి, ఏడవకన్య తనచీరె యెవరోయెత్తుకొనిపోయినారని వెదకుచు దేవదత్తుండువున్న చెట్టుకిందికివచ్చి ఓచిన్నవాడానాచీరె నెందుకు తెస్తివి నామానంబేల చూచుచున్నావని యడిగెను. అంతదేవదత్తుండు ఓమోహనాంగి నీముఖారిమోహముచేత తీసుకున్నాను, నన్నువివాహము చేసుకోవలసినదని చెప్పెను. అంతనాకన్య సమ్మతించెనుపిమ్మట దేవదత్తుండాచీరెను దానికిచ్చి గాంధర్వవిధిని బెండ్లాడి సరససల్లాపంబులాడుచు కొంతసేపు సురతసౌఖ్యమున ఓచిన్నవాడా నేనుదేవలోకమునకు పోకపోతే మాటవస్తున్నది నేనుపోతున్నానని వకతంబురనిచ్చి నీకుకావలసినప్పుడు ఈతంబుర వాయించితే నేనువచ్చి నీమోహముతీర్చెదనని చెప్పిఆ దేవకన్యక దేవలోకమునకుపోయె నంత దేవదత్తుండా తంబురనుతీసుకొనివక గంగ గుడియొద్దకు పోయివుండె నాగుడిలో ప్రతిదినమున్ను వకదేవకన్యక వచ్చి ఓజగజ్జనని లోకమాతా నాకుందగినపురుషునిలభింపచేయుమనినిత్యమున్ను మ్రొక్కిపోవుచుండును. దేవదత్తుండదిచూచి మరుదినము దేవకన్యకవచ్చులోపల కాళికాదేవి వెనుక అగుపడకుండాయుండె దేవకన్యకవచ్చినమస్కారముచేయుచుండగా ఓచిన్నదానానిత్యమున్ను నన్ను పూజించుచున్నావు నీభక్తికిమెచ్చినాను రేపటిదినము నీవుయిక్కడికివచ్చేవరకునీకుతగినపురుషుడు ఈ దేవాలయములో వచ్చియుంటున్నాడు. చింతపడవద్దుపొమ్మని చెప్పగా దేవకన్యక చాలానంతోషపడితనయింటికిపోయెను. పిమ్మట దేవదత్తుండు కాళికాదేవిసంగూర్చి ధ్యానంబుచేసిన నాదేవి ప్రత్యక్షంబై ఓరాజకుమారుడానీభక్తిధైర్యమునకుమెచ్చితి నీవుకోరినవరంబిచ్చెదను నుడువుడీయనగా రాచపుత్రుండిట్లనియె! ఓదేవీ నాకేరూపము కావలెనంటె ఆరూపముగలిగేటట్లున్ను నిన్నెప్పుడు తలచితె అప్పుడు వచ్చిప్రత్యక్షంబై నాకుతగిన సహాయంబుచేసేటట్లున్ను వరంబొసగవలెననగా నాకాళికాదేవియునతనుకోరిన వరంబిచ్చెను. నంతనారాజసూనుండా దేవికిమ్రొక్కి నేగోరినవరంబులిచ్చితివి నందులకు సంతోషించితిని నాకొక సందేహంబుగలదు అదేమన పరబ్రహ్మస్వరూపమును గాంచినవాడు ముక్తుండని పెద్దలు చెప్పుదురుగానఆ పరబ్రహ్మము యెటువంటివస్తువో నాయందు దయయుంచి దెల్పుమనిన నాకాళికాదేవి యా రాజపుత్రున కిట్లనియె.

ఓ బాలకా! బాహ్యమునకు అండాండమనగా భూచక్రము పిండాండమనగా స్థావరాలు పర్వతాలు తరువులు మొదలైన చరాచరములెల్లను బ్రహ్మాండ మనగా ఆకాశము, అంతరానకు అండాండమనగా గుడ్డు పిండాండమనగా బిందువు అనునట్టి పాప బ్రహ్మాండము ఆ పాపమధ్య వెలిగేకళ ఆకళలోని నిష్కళే తానైన పరబ్రహ్మమని యెరుగుము. అక్కడ పంచభూతముల వివరము:— పృథివి అనగా చుట్టువుండె యెఱుపు. తెల్లగుడ్డువుదకము, పైనలుపు అగ్ని, అందులో సునీలమైన పాపే వాయువు, అందులోని కళయే ఆకాశము, ఆకళలోని నిష్కళే తానైన పరబ్రహ్మము?—

కాళికాదేవి దేవదత్తునకు పరబ్రహ్మ స్వరూపమును దెల్పుట.

త్రివేణులకు వివరము నలుపుగంగ, ఆనలుపులో సునీలమైన కుండలి అనేటిపాప యమున, ఆపాపే నీలతో యుదమధ్యస్తం, ఆపాప మధ్యమున వెలిగేవెలుగు సరస్వతి, అదేవిద్యుల్లేఖ, ఆవెలుగులోని నిష్కళే తానైన విరాట్స్వరూపము, ఆదే ముక్తికాంత. త్రిమూర్తులనగా చుట్టివుండే యెరుపు బ్రహ్మ, తెల్లగుడ్డు విష్ణువు, పైనల్లగుడ్డు రుద్రుడు, యిదే హృదయకమలము. యెఱుపుఅయిన బ్రహ్మకు అకారం మాతృక, తెలుపుఅయిన విష్ణుకు ఉకారము మాతృక, నలుపుఅయిన శివునకు మకారము మాతృక:- పంచశక్తుల వివరం. యెఱుపు క్రియాశక్తి నలుపు యిచ్ఛాశక్తి, సునీలమైన పాపే ఆదిశక్తి, ఆపాపమధ్యమున వెలుగు పరాశక్తి, ఆకళలోని నిష్కళే తానైన పరబ్రహ్మము. రేచకాదుల వివరము: పూరకం తెలుపు, కుంభకం నలుపు, రేచకం యెరుపు, సూచకం సునీలమైనపాప, ఆపాపమధ్యమున వెలిగేకళ, ఆకళలోనిష్కళే తానైన పరబ్రహ్మము. మండలత్రయముల వివరము. నలుపు అగ్ని మండలము, పాప సూర్యమండలము, సునీలమైన బిందువే చంద్రమండలము, అందు నిష్కళే సర్వప్రపంచమున్ను అగుపడును, అదే ధృవమండలము, ఆకళలోని నిష్కళే సర్వప్రపంచమున్ను తానై నయెఱుక, యెరుకమరపులు యెరిగే తత్స్వరూపము:- సత్త్వాదుల వివరము. తనలో వెలిగే దీప్తిసత్తు, బిందువు అనేపాప, బాహ్యమందు యెదుట అగుపడే వస్తువులన్ని చిత్తు. ఆజీవమయిన చిత్తు అనేటి బిందువు అనేటి పాపయందు నిరంతరమున్ను రెప్పపాటులేకుండా ఆ సత్తు అనేటికళయందు యెడతెగక ఆకళేనీవై దేహేంద్రియాది ప్రపంచమున్ను యెదుట అగుపడే పేరుగల వస్తువులన్ని మధ్యగదాయనినిష్కళజ్యోతి స్వరూపము నీవై యుండేది ఆనందము. తత్పదం ప్రకాశమయిన తేజస్సు, త్వంపదం ఆజీవితమైన బిందువు, అసిపదం బిందుపయందు మనస్సుస్థిర

పరచి ఆనిష్కళే తానగుట. నాదు బిందు కళ వివరం, పైనీలమునందునాదము,నీలములోని సునీలమైలపావే బిందువు,అందులో సత్కాంతేకళ,ఆకళలోని నిష్కళే తానైనపరబ్రహ్మము. ఇడయనగా యెడమభాగము, జీవస్థానము, కుడిభాగము పింగళ, కనుబొమలనడుమ సుషుమ్న యందురు యిదే నడినాళమందురు. యిదేభ్రూమియుగమందురు.ఇదికాక నిశ్చలమార్గము.పై నలుపుఇడ, ఆనలుపులోనునీలమయినబిందువుపింగళ, ఆనడుమ వరిముల్లువంటిసూక్ష్మరంధ్రిమున జగద్వ్యాపకమై సర్వపరిపూర్ణమై వెలుపల లోపల ప్రకాశింపుచున్న దేసుషుమ్న,యిదేనడినాళము, యిదేబ్రహ్మరంధ్రము,యిదే మేరుశిఖరమైనది, యిదేఅపోజ్యోతి, ఇదిఆత్మయందు కనవలెనని దెల్పిననా రాజసూనుండుసమ్మతించివినిమనసునందున యానందంబునొంది కాళికాదేవి పాదంబులకు నమస్కరించి ప్రార్థనసలుపుచుండెను. మరునాడు దేవకన్య వచ్చువరకు దేవదత్తుండు సకలాభరణంబుల ధరించుకొని దుకూలంబులైనవస్త్రంబులంగట్టి పున్నమచంద్రునికైనా అతిశయంబగు చక్కదనంబు గలవాడై యాశక్తి దేవళంబునకుపోయి అందులోనిలుచుండె నంతనాదేవకన్యయు సర్వాభరణభూషితురాలై కాళికాదేవి దగ్గరకువచ్చి యచ్చటనున్న దేవదత్తునింగాంచి మిక్కిలిసంతోషము జెంది యతనిరూపురేఖావిలాసంబులకుమెచ్చి నాకుందగిన పురుషుని యీదేవియిచ్చెనని సంతోషపడుచు నాదేవిసముఖంబున గాంధర్వవిధిని బెండ్లాడి నతనింబిలుచుకొని తనయింటికిబోయిఆదేవదత్తునింగూడి మన్మథ సంగరంబున దేలుచుండెను. దేవదత్తుండు రాత్రివేళ ప్రతిదినంబును తంబురవాయించగా నాదేవకన్యవచ్చు నంతనతండాయిరువురు కన్యలంగూడి మహావిలాసంబుగానుండి తనఅన్నసమాచారమును భార్యయైన సరసకష్టంబులును యెటులున్నవో కనుగొందమనినాయిరువురు దేవకన్యలందోడ్కొని బయాణంబై నాయడవిమార్గంబున వచ్చుచు నటతపంబుజేయుచున్న యొక మునీంద్రునింగాంచి తనసమాచారంబాద్యంతం బతని కెఱింగించిన నతండో రాజకుమారా నీకొకవస్తువునిచ్చెద నా కాతంబుర నివ్వుమని యడిగెను. దేవదత్తుండు మంచిదియని తంబురనిచ్చిన మునీంద్రుడు సంతోషించి లకడామార్ అనేకఱ్ఱను యిచ్చెను. నారాజపుత్రుండు దానింజేకొని దీనియందు ఏమిమహత్తుయున్నదనియడిగిన ఇది ఏపనిచెప్పితే ఆపనిచేయునని మునిచెప్పెను అంతటదానిని బుచ్చుకొని కొంతదూరంబరిగి ఓ లకడామారా నీవుపోయి ఆమునివద్దనుండే తంబురతీసుకొని రమ్మనిపంపెను. అదియామునీశ్వరునిం బిలచి ఓయీ గృహస్థుమా

గ్రముగా తంబురనిస్తావా నీతలపగులగొట్టుదునా అనిబలికిన మునిమోసము వచ్చెనని తలంచి తంబురనిచ్చె నాకఱ్ఱ ఆతంబురను తీసికొనివచ్చి దేవదత్తునికియిచ్చెను. నారాజసూనుండు మరికొంతదూరంబరిగి అక్కడనొకఋషినింగాంచి నమస్కారంబుచేసి తన సంగతియంతయు చెప్పగా నతండో చిన్నవాడా ఈతంబురను నాకిస్తివా నీకీభరణినిస్తాను ఇది ఎందరికి అన్నము పెట్టమంటె అందరికి పెట్టునని మహత్తుచెప్పగా నతండు విని తంబురనిచ్చి యాభరణినిని తీసుకొనికొంతదూరంబుజని లకడామారునుబిలిచినీవు మునివద్దికిబోయి తంబురతీసుకొని రమ్మనిచెప్పియంపెను. అదియు నామునివద్దకుబోయి ఓ యీగ్రృహస్తుమార్గముగా తంబురనిస్తివా సరే లేకపోతేనిన్నుపంపెదనని చెప్పగా నతండు భయపడి తంబురనిచ్చెను. దేవదత్తుండు తంబురనుతీసుకొని మరికొంతదూరముపోయి అక్కడ మరియొక మునిపుంగవుండు తపస్సుచేయుచుండుటంగని నాతనికి నమస్కరించి తనసంగతియంతయుచెప్పగా నతండో బాలుడా నాకీతంబురయిస్తివా నీకీపావుకోళ్లనిచ్చెదను. వీనిందొడుగుకొని ఎక్కడికి పోవలెనని తలచుకుంటె నక్కడికిచేర్చునని మహత్తుచెప్పిననిని తంబురనిచ్చి నాపావుకోళ్ల దీసుకొని కాళ్లకాదేపితనకునొసంగిన గుఱ్ఱమునెక్కికొని భార్యలవీట్కొని తనయన్న యుండే కనకపురంబునకు పోవలెననితలంచి యాక్షణంబ యాపురంబునకుపోయి అచ్చట నొకమహాలు యేర్పరచుకొని తన భార్యలతోగూడ కేళీవిలాసంబుగానుండి తనభార్యయైన సరస యేలాగున్నదో విచారించి రావలయునని మాయవేషము వేసుకొని సరసకు పువ్వులు కట్టియిచ్చే వారియింటికి పోయినాకుకొంచెము యన్నము పెట్టుండని యడిగెను. ఆయింటియాపె నేనుదొరసానికి పువ్వులుకట్టి తీసుకొనిపోవలె నాకుతీరదని చెప్పె. నంతట దేవదత్తుండు ఓయమ్మా నేనువింతగా చెండ్లుగట్టగలను నాకుకొంచె మన్నము పెట్టిన చెండ్లుకట్టెదనని కట్టి యందులో తాను వచ్చినసంగతి యావత్తున్ను వకచీటివ్రాసి యాచెండ్లలోపెట్టి తీసుకొనిపొమ్మని చెప్పియిచ్చెను. అదియాపూలచెండ్లు తీసుకొని యాసరసకు యివ్వగా నదియాచెండ్లను చూచి యీచెండ్లు యిన్నాళ్లవలె నుండలేదే మహాసొంపుగా నున్నవని విచ్చిచూచేవరకు అందులో దేవదత్తుండు వ్రాసియున్న చీటియుండగాచూచి నేటికాలంబునకు నామగడువచ్చెనని చాలసంతోషించి తిరుగా ఒకచీటివ్రాసి ఆచీటిని పూలచెండ్లలో పెట్టి యీచెండ్లు బాగాయుండలేదు కట్టినవారిముందర పారవేయుమని యిచ్చెను. అంత నాచెండ్లను తీసుకొని యాచిన్నది తనకు

మాటవచ్చెనని తిరుగాతీసుకొనిపోయి దేవదత్తుని చేతికివ్వగా నతండు దానిని విప్పి యందులోవున్న చీటినిచూచి చదువుకొని యారాత్రిఝాముఅయిన తర్వాత పావుకోళ్లను తొడగుకొని సరస మేడమీదికి పోవలెనని తక్షణమే అక్కడికి పోయి యారాత్రియంతయు ఆసరసయు తానున్ను కేళీవిలాసంబుగానుండి తెల్లవారుఝామున తానుండుచోటునకు తిరుగాచేరెను. మరునాడుదయకాలంబున యీసరస పోలిశెట్టినింబిలిచి వ్రతంబు సమాప్తియయ్యె రేపటిశుక్రవారంబు నాడారంభించి పండ్రెండు దినములు వ్రతోద్యాపనచేయువలయును అందుకు బంగారుచెంబులు బంగారుగిన్నెలు బంగారుపువ్వులు ననుకూలమైన వస్త్రములు రత్నములుమొహరీలు యిందుకుతగిన పసుపుమొదలైనవి దినమొకటింటికిపది వేలు మొహరీలుగావలయును యీప్రకారముపన్నెండుదినములు జాగ్రతచేయవలెను. మరిన్ని పన్నెండోదినమునకి బంగారుమంటపముకట్టించి యందులక్షగోవులు లక్షగుఱ్ఱములు లక్షయేనుగులు మొదలైనవి బ్రాహ్మణులకు ముత్తైదువల స్త్రీలకు నివ్వవలసినదిగాక దేశదేశపురాజులను యింకా నాలుగువర్ణములవారిని బిలిపించవలెను, నామేడదగ్గిర చలవపందిళ్లు వేయించి కావలసినబియ్యము పప్పువగైరా సామానులను జాగ్రతచేయవలెను. అని పట్టిరాసి యివ్వగా పోలిశెట్టిచూచుకొని తనదగ్గిరవున్న ఖజానా యావత్తుమొత్తి యివ్వగా నారుదినంబులకు సరిపోయె పిమ్మట తనయిల్లుమొదలైనవి భార్యకు కుమార్తెలకు గలిగిననగలు మొదలైనవానిని అమ్మగా నాలుగుదినములకువచ్చెను. పిమ్మటనాపోలిశెట్టితనకామితంబులేక ఆనగరమేలు శ్రీదత్తునివద్ద అప్పుతీసుకొని ఆపట్టిప్రకారము అన్నిజాగ్రతచేసి ఆరాజును యింకా అనేక పెద్దమనుష్యులను అనేకదేశపురాజులనుపిలువనంపి సకలమర్యాదలుచేసి చలవపందిళ్లలోయందరిని గూర్చుండబెట్టెను. పిమ్మట ఆసరసయు శుక్రవారమునాడు వ్రతోద్యాపనకు ఆరంభించి బ్రాహ్మణులు మొదలైనవారికంతా. అన్నపానాదులు అవ్వారిగా జంపి తానునుకొన్న ప్రకారము పన్నెండు దినములున్ను తక్కువలేకుండా వ్రతంబుసల్పి యీశ్రీదత్తునింబిలిచి అయ్యా నీవీ పట్టణమేలేరాజవుగనుక నావ్రతముముగిసినది యిప్పుడు తమరు పరిజనులందరికి తెలియునట్లుఒకకథచెప్పుతున్నాను, పరాకులేక వినుండని అందరిని గూర్చుండబెట్టి యీసభవారందరికి నమస్కారముచేసి తన పెనిమిటియైన దేవదత్తుడున్ను తన భావయైన శ్రీదత్తుడున్ను పుట్టినదిమొదలు తనపెనిమిటినిపోలిశెట్టి సముద్రములోత్రోసేవరకు జరిగినకథ చెప్పగా శ్రీదత్తుండువిని తనకథగా తెలుసుకొని తన

తమ్ముఁడు చనిపోయినాఁడని అయ్యో యయ్యో తమ్ముఁడా తమ్ముఁడాయని యేడ్వసా గెను. పోలిశెట్టియు యీకథవిని యీదినంబువరకు తనకాయుస్సు పరిపక్వ మైనదని దిగులుపడుచుండెను నంత శ్రీదత్తుండు కొంతసేపుఏడ్చి అటువంటి నా తమ్ముఁడు చచ్చిన వెనుక నే బ్రతుకనేలయని కత్తిదూసుకొని గొంతుకో సుకొనపోగా సరస జూచి రాజా మీరెందుకు వ్యసన పడుతారు మీతమ్ముని శెట్టిచేసిన యుపద్రవంబులను తప్పించుకొని బ్రతికియిప్పుడు దేవతాస్త్రీలతో కూడా దేదీప్య మానుండై వెలుంగుచు పదిహేను దినంబులనుండి ఈ పట్ట ణంబున జేరి సుఖముగా నున్నారని చెప్పిన వినిసంతోషించి యాక్షణంబుననే శ్రీదత్తుండు తనతమ్ముని చూచుటకై వాఁడున్న ప్రదేశంబునకుం బోవుచుండ దేవదత్తుండు తన యన్నవచ్చెనని సకల భూషణంబులు ధరించి తనభార్యల తోఁగూడ ఎదురుగొని పోయెను. శ్రీదత్తుండు తన తమ్ముని గౌగలించుకొని వానిభార్యలను వెంటబెట్టుకొని తన యంతఃపురంబునకు పోయెను. పిమ్మట దేవదత్తుండు తన సమాచారంబంతయు నన్న కెరిగించిన నతండును ప్రీతుండై పోలిశెట్టినిబిలిపించి నీవుదుర్మార్గుండవని వూరియందునిరాకరించి రాజ్యంబు సేయుచుండెను. దేవదత్తుండునుఆపోలిశెట్టి కొమార్తె పట్టబెట్టించి ఆకడు పులోనున్న తన క్రియనుదీసుకొని తన మంత్రప్రభావంబుచే దానిం బ్రతికించి దాని దనవద్దనుంచుకొని తనభార్యలు తానును గొంతకాలంబచ్చటనేయుండి తన్నయన్న యాజ్ఞానుసారంబుగా తల్లిదండ్రుల నగరంబునకుంజని తనసవిస్తా రంబంతయు వారికి తెల్లంబుగాదెల్పి వారి డెందంబానందంబు జేసెను.

పిమ్మట తన తల్లితండ్రులు పెద్దవారైనందున వారి రాజ్యంబునకు తాను పట్టాభిషి క్తుండై రాజ్యంబుచేసి తుదకు స్వర్గలోకంబు జెందెనని జెప్పినవిని మారుతాత్మజుండు స్వామీ లోకంబున ఇట్టి దుర్మార్గులు అతిశయంబుగాబోలు భగవదానుగ్రహంబు గల వారిని జెరప నోపినను వారిక కీడువాటిల్లునె ఈకథయతి మనోహరంబుగ నున్నది. పర బ్రహ్మ స్వరూపమును ఈ పుణ్యుని కథచే మనసార వింటిని కృతార్థుండనైతిని, చాలప్రొ ద్దాయెను. నిద్ర నేత్రంబుల తాండవమాడుచున్నది, నిద్రింతము లెమ్మని వేడిన నాభగ వంతుండును వల్లెయని సమ్మతించి యిరువురును శయనించి సుఖనిద్ర జెందిరి.

షష్ఠమరాత్రికథ - సమాప్తము.

ఓమ్.

# సప్తమకథారత్నము.

ఏడవనాటి రాత్రి యా సీతారాముల భోజన మజ్జనాదు లొనరించి తాంబూలంబు సేయుచుండు నవసరంబున ప్రియభక్తుండైన నాంజనేయుండు శ్రీరాములంజూచి సాష్టాంగనమస్కారములు సమర్పించి స్వామీ? భక్తజనరక్షకా హంసతత్వార్థ జ్ఞానము నాకుహృద్గోచరంబగునటుల నొకపుణ్యాచరిత్రమును బోధించి నన్ను కృతార్థునింగా జేయుడని ప్రార్థించిన నా భగవంతుడు కరుణారస హృదయుండై వాయునందనా ఛండ ప్రచండమహారాజు చరిత్ర మత్యద్భుతము నిర్మలచిత్తుండవై వినుమనియిట్లనియె:—

## ఛండప్రచండమహారాజుకథ.

మారుతాత్మజా! తొల్లి మగధదేశమును బాలించుచుండిన చంద్రసేన మహారాజునకు బిడ్డలులేక బహుతపములు గావించి పెక్కువ్రతములు సలిపెను. పిమ్మట దైవతంత్రమువలన తన పత్ని గర్భమునుదాల్చి మిగులసుందరుడైన పుత్రునింగనెను. ఆ నరేంద్రుండు కడుసంతసమున బుణ్యపురుషులకు వివిధదానములిచ్చి బిడ్డకు జాతకర్మాదిక్రియలు నెరవేర్చి ఛండప్రచండుడని పేరుబెట్టి యత్యంతప్రేమతో బెంచుచు నైదవ సంవత్సరమున విద్యాభ్యాసము చేయించెను. ఆ బాలుడు మిగుల గ్రాహ్యశక్తి గలవాడై మంత్రికుమారుడైన జయాంగదునితో కూడి విద్యలన్నియు నేర్చుకొనుచు బాల్యవినోదములసల్పుచు నీతిశాస్త్రము ధర్మశాస్త్ర వేదాంతశాస్త్రములనుగ్రహించి ధనుర్గురునివలన దివ్యాస్త్రప్రయోగములను వానియుపసంహార మంత్రములను తెలుసుకొని బాలసూర్యుని పగిది దినదిన మభివృద్ధిబొందుచు యౌవనమంకురించి మంత్రిపుత్రునితో నత్యంతస్నేహముగలిగి వివిధ వేడుకలుసలుపుచు నొక్క దినంబున యుత్తమాశ్వంబు నెక్కి పురివెలుపలకు దూరంబుగా వేటకుంజని వ్యాఘ్రభల్లూకాదులం దునిమి తిరిగివచ్చునంతలో సూర్యాస్తమయంబై గాఢమైన చీకటి క్రమ్మి దోవ తప్పి నొక పెద్దవృక్షంబు కడజేరి దీనుండై విధిందూరుచు వృక్షంబుక్రిందపరుండిన యడవిమృగంబువలనభీతిగలుగునని శంకించి నా చెట్టుపై నెక్కియుండెడు సమయంబున మేఘమంజరిపురంబున నరపాలుండను రాజు రాజ్యంబు సేయుచు భద్రకాళి వరమున నొక కూతురినింగని దానికి మోహనాంగియని నామంబిడి యతిగారాబంబులో పెంచుచూ తననగరి ఏనుగమీద వక అవుదా వేసి అందుమీద ఆ చిన్నదాని గూర్చుండబెట్టి ఆ పురమంతయు దినమును వూరేగింపుసేయుచుండెను. నిత్యప

కారము ప్రతిదినము ఉదయమున ఏనుగను శృంగారించి ఆచిన్నదానిని ఎక్కించి వీధినే తిరుగుచూ రాజభటులు పెద్దమనుష్యులు మొదలైన వాండ్లు వాకిండ్లలో రాజకొమార్తె వచ్చినదని చెప్పుదురు. వారందరున్ను అరటిపండ్లు మామిడిపండ్లు మొదలైనవన్ని ముంతమామిడిపప్పు చక్కెర మొదలైనవన్ని పునుగు జవ్వాజి పచ్చాకుమల్లెలు మొదలుగాగల సుగంధ ద్రవ్యములనున్ను కానుకలుగ తెచ్చి ఇత్తురు. ఆ ఏనుగయున్ను ప్రతిదినము ఝాము ప్రొద్దెక్కే వరకు నగరి చేరును. ఇట్లుండగా నారాజకన్య ప్రౌఢయైనందున నారాజు దాని యంతఃపురములో వుండవలసినదని దిట్టము చేసి ఏనుగను కట్టివేయించెను. పిమ్మట ఏనుగను కాపాడే మావటివాండ్లు రాజసముఖమునకువచ్చి మొక్కి- ఓరాజ మార్తాండ రాజతేజోనిధి పరాకు మన యమ్మణ్ణి ఏనుగపై ఎక్కించలేదని రెండు మూడు దినములనుంచి పూరి నీళ్ళు తాగకుండా కండ్లనీళ్ళు పెట్టుకుంటూ యున్నది. యింకా రెండు మూడు దినములు యిట్లావుంటే ఏనుగ బ్రతుకదని మనవిచేసిరి ఈమాటలు రాజువిని దీనుండై మనచిన్నది యంతఃపురములో వుండవలసిన దని ఇకమీద బయటికి యంపితే యపకీర్తి వచ్చును పంపకపోతే యనేక దినములనుంచియుండే పట్టపేనుగ చస్తున్నది యిందుకేమి సేయుదమని కొంతప్రొద్దు చింతించి తన ప్రధానికా తెరంగెల్ల నెరింగించిన నతం డిట్లనియె. ఓ నరేంద్రా యికమీద మన చిన్నది ప్రౌఢయైనందున బయట పంపకూడదు. ఇట్లా పంపినయెడ నపకీర్తివచ్చును, ఇందుకు ఏమాత్రము యోచన సేయవద్దు, ఇందు నిమిత్తము ఏనుగ చచ్చినయెడ ఇంకొకఏనుగను తెచ్చుకొనవచ్చునని ప్రధానిచెప్పగా రాజునకుకోపమువచ్చి ఏనుగ నిర్నిమిత్తముగా చస్తూయున్నది. ఇట్లా చేయకూడదు, మన చిన్నదాని నఖశిఖపర్యంతము ముసుకువేసి హవుదామీద కూర్చుండబెట్టితే ప్రతిదినము ఝాములోనగరుజేరును. గానఇట్లుచేయుడమే యుక్తముగాయున్నదని రాజు చెప్పగా ప్రధానియొకకథ జెప్పనారంభించెను. మాళవపట్టణమున విజయపతియనురాజు రాజ్యంబు సేయుచుండగా ఒకానొక దినము సిద్ధుండా రాజ సముఖంబునకు వచ్చి ఓ రాజా నీవు మహాత్ముండవు నీ పేరు భూలోక భువర్లోకాది సప్తలోకముల యందున్ను స్వర్గమందును బ్రహ్మలోక కైలాస వైకుంఠముల యందున్ను మహాకీర్తి కలిగియున్నది. నేననేక బ్రహ్మాండములచూచినాను, విష్ణులోకముశివలోకము మొదలైనలోకములెల్ల చూచినాను, విష్ణులోకములో శ్రీమన్నారాయణమూర్తి నీ భక్తికి మెచ్చుకొని భూలోకములో అనేక మహానుభావులున్నారు. ఇందుగలవారిలో ఈతండు

భూలోకంబుననుండతగినవాడు కాడు వైకుంఠమునందుయుండవలసినవాడు,
కాబట్టినీవుపోయి యతనిని శీఘ్రముగా వైకుంఠమునకు పిలుచుకొని రమ్మని
నన్ను పంపించినాడు యందుకు నేనువచ్చినాను నీభాగ్యమేమనిచెప్పవచ్చును.
నీవు శీఘ్రముగా వైకుంఠమునకు రావలసినదని ఇప్పుడు రేపటి శనివారము
నాలుగుకోట్లవరహాలున్ను లక్ష.గోవులనున్ను బ్రాహ్మణులకుదానమిచ్చినీవ
రాత్రికి వైకుంఠమునకు రావలసినదియని సిద్ధుడు చెప్పగా రాజు మహాప్రసా
దమని తనభుజములుపొంగి ఇక మనకేమి కావలయును. శ్రీవైకుంఠములో
శ్రీమన్నారాయణమూర్తి సన్నిధానమందున నుండవచ్చును మనకురాజ్య
మెందుకుసంసారమెందుకని బొక్కసదారునిపిలువనంపి లక్షగోవులు తెమ్మని
చెప్పె, నంత నాసిద్ధుండు రాజునుజూచి ఓ రాజా నేను వైకుంఠములో విష్ణు
సన్నిధాన ముందు వుండే వాడను. ఇవి యన్నియు నాకు వకడికే దానమిచ్చి
తివా చిరకాలము వైకుంఠములో నుండెదవని సిద్ధుడు చెప్పగా రాజు మహా
ప్రసాదమని యిట్లు చేయుటకు నొప్పుకొనెను. యప్పుడు ప్రధాని ఒకరహస్య
స్థలమునకు రాజును పిలుచుకొనిపోయి ఓరాజా వీడుసిద్ధుడనే పేరుపెట్టుకొని
వచ్చినాడు బహుమాయగాడువీనిమాటను నమ్మవద్దు వైకుంఠములో వున్న
మహాత్ములు భూలోకమునకు వత్తురా నరులు బొందితో వైకుంఠమునకు
పోదురా మహాతపస్సులకును పునర్జన్మము లేకుండా వైకుంఠమునకు పోవ
డము దుస్తరమయినది నదియునుంగాక నాలుగుకోట్ల వరహాలు లక్షగోవులు
తనకే యితండీవ్వమని చెప్పడమేమి వైకుంఠవాసుల కవియేల కాబట్టివీడు
మోసగాడు వీడు చెప్పిన ప్రకారము వింటిరా పోనివచ్చును రాజ్యముచెడి
పోయి ఖజానయంతయు క్షీణమవునని ప్రధాని యనేకవిధములుగాచెప్పినప్ప
టికిన్ని యారాజువిని కోపించి ఓయీ నామాటకు ఎదురుచెప్పతావా నాకు
రాజ్యము యెందుకు సంసారమెందుకు నేనీసిద్ధునితో కూడాపోతుయున్నాను
యితడుమాయగాడని నిందింపుచున్నావుగాన నీముఖంబికచూడరాదు నిన్ని
పుడు శిరచ్ఛేదము చేయవలసినది అయినప్పటికి యీతప్పుగాచితిని నాపురిలో
నుండక యెక్కడికైనా పొమ్మని తనభటులచే నతనినెడబట్టి త్రోయించిన
ప్రధానియు యీరాజునకు చెడిపొయ్యే కాలమువచ్చినది ఇకమనమేమిచేయ
వచ్చునని యెంచుచు మరియొక దేశంబునకుపోయె పిదప యారాజు మహా
సంతోషంబుగా ఖజానా పగుల గొట్టిచూచితే యందు మూడు కోట్ల
వరహాలుండె పిమ్మట నతండు ఒక కోటివరహాలు అప్పుతీసుకొని నాలుగు
కోట్ల వరహాలు లక్ష గోవులును సిద్ధునికి దానమిచ్చెను పిదప నాసిద్ధుండు

యేనుగలు పోంటెలువిూద నావరహాల నెత్తించుకొని గోవులందోలుకొని ఓ రాజా నేను రాత్రికి మూడు ఝూములమీద వస్తున్నాను. నేను వచ్చేలోగా నీవు యభ్యంగన స్నానముచేసి సకల భూషణంబుల ధరించుకొని భార్యతోకూడా సిద్ధముగా నుండుమని చెప్పిపోయెను. పిమ్మట రాజును సిద్ధుండు చెప్పిన ప్రకారము యారాత్రి మూడుఝూములవరకు కాచియుండి అతండు రాకపోయినందున ఓహో సిద్ధుండు మోసము చేసెను. నేను ప్రధాని చెప్పిన మాటలు వినక చెడితిని ఖజానా అంతయు కొల్లబోయెను. పశువులన్ని పోయెను. యిప్పులపాలైతిని ప్రధానియును దూరదేశస్థుడయ్యె ఇకనేనేమిసేయుదును యని విచారంబుచే గుందుచుండగా పరరాజులాసమాచారంబువిని యాపట్టణమును ముట్టడించి జయించి చేకొనిరి. ఈప్రకారంబా రాజేంద్రుడు మంత్రి చెప్పినమాటలు వినకచెడిపోయెను. కాబట్టి యోమహారాజా నామాటలువిని చిన్నదాన్ని యంతఃపురములోనుంచిపట్టపేనుగను కట్టివేయించుడని ప్రధాని యెంతదూరము చెప్పినావినక రాజుకోపముచేసి ఓయీ నామాటకు యెదురాడుచున్నావు నీమాటలు వినతగినవి కావు. యనేకదినములనుంచిమననగరములోయున్న పట్టపేనుగ చచ్చిపోతుందేలయ్యా యోయని మావటివానింబిలచిరేపే మన పట్టపేనుగను శృంగారించి నాకొమార్తెను యెక్కించుడీయని దిట్టముచేసెను. అంతప్రధాని రాజు నామాటవినక పోయెను. వెనుక యనుభవించగలడని యెంచుచుండెను. పిమ్మట మావటివాడును వుదయమునలేచి పట్టపేనుగను శృంగారించి ఆచిన్నదానినెక్కించెను. పిమ్మట నాయేనుగయు నాలుగు వీథులుతిరిగి పగలు రెండుఝాములైన తర్వాతవగచి కారణ్యమైన యడవిజొచ్చి ఆరాత్రికి పది యామడలదూరంబుపోయె. నంతట నక్కడనొక వనమున్ను కొలనును జూచి ఆకొలనులో కావలసిన నీళ్లుత్రాగిపండుకొని యాచిన్నదానిం దిగమనినీళ్ళు త్రావించి పండుఫలాదులు మొదలైనవి తనతొండముతోకోసికొనివచ్చి ఆ చిన్నదానికియిచ్చి తిరిగి తనవీపునయెక్కించుకొని యావనములోనున్న వక మర్రివృక్షముక్రింద యారాత్రిపండుకొని నిద్రపోయెను. ఇట్లాగజంబు ప్రతిదినంబును ఉదయకాలమున నాకొలనులో నీళ్ళుత్రాగుచుఆవనంబుననుండు ఫలాదులభక్షించియాచిన్నదానికిం దెచ్చియిచ్చుచుండెను. ఇట్లుండనొక దినంబున మగధభూపాలుని పుత్రుండగు ఛండప్రచండుడు వేటమార్గంబునకొచ్చి వేటాడి సాయంత్రము మగుడినిజపురంబునకరుగుచుండ గాఢాంధకారమైన చీకటులుగ్రమ్మి త్రోవందప్పి యాయేనుగనిలచియుండు మర్రి

చెట్టుకడకుంజేరి దానిపైనెక్కి కూర్చుండి తెల్లవారువరకు నిర్భీతిగానా రాత్రిగాచియుండు నవసరంబున నాయేనుగ నాచిన్నదాని నెక్కించుకొని యీచెట్టు క్రిందికేవచ్చి పరుండియుండెను చెట్టుపైనున్న రాజకుమారుండీ రాజపుత్రినింజూచి ఇదియేమి యాశ్చర్యముగానున్నది ఈయడవిలో నిట్లుండుటకారణమేమి ఇదిదేవకన్యయో లేక బ్రహ్మదేవుండు దీనినాకై నిర్మించి పంపించెనో నాభాగ్యముపండెను. ఈముద్దుగుమ్మను నెవ్విధంబున బరిగ్రహింతునని మనంబున దలచుచు యేనుగను గనిపెట్టియుండెను. ఆరాజపుత్రియు నతనింజూచి యితడెవ్వండో రాజకుమారుడుగానున్నాడు నాకొరకై వచ్చి యిచ్చటుండినట్టు తోచుచున్నది. అయ్యయ్యో యీగజంబితనిని జూచిన చంపును నేనేమిచేయుదు నాకర్మంబీలాగయ్యె మాతండ్రి ప్రథ ని మాటలు వినకనన్నీయడవిపాలుచేసెనని కన్నీరువిడచి వకచీటివ్రాసి నాచెట్టుక్రింద వేసిపోయెను మరునాడుదయంబున యారాజకుమారుండా చెట్టుదిగి యాచీటింజూడగాయందు ఓ రాజకుమారకా ఈయడవి కేలవచ్చితివి నాకొరకేలనున్నావు ఈ యేనుగ నిన్నుచూచినచంపును రాత్రి చెట్టుమీద యూరకయుంటివిగాని నాతోమాటడకుంటివి యెందుకునీకుపాయము గోచరించలేదా చెప్పెదవినుము నాల్గుమూలలకును మర్రికొమ్మను చుట్టునాటి వకత్రాడుగట్టి ఈయేనుగ నిద్రపొయ్యెసమయమున హావుదాలోకివిడిస్తె ఆకొమ్మనుహావుదాలోపెట్టి నేనాత్రాడుపట్టుకొనిసీతావుకువచ్చి యున్నియు మాట్లాడుతున్నానని వ్రాసియుండగాచూచి రాజకుమారుండా ఈప్రకారమే మర్రికొమ్మనుగొట్టి త్రాడుగట్టి సిద్ధముగానుంచుకొనియుండి యారాత్రిఆయేనుగ నిద్రపొయ్యె సమయంబుజూచి యాకొమ్మను తిన్నగా హావుదాలోకి విడిచెను. అంతనాచిన్నదియాకొమ్మనుహావుదాలోవుంచి యాత్రాడుపట్టుకొని మెల్లగా యారాజపుత్రుడున్న చోటికింబోయి యతనింగాంచి ఓయీ నీవువెరవవద్దు నీపేరేమి నీవిక్కడి కేలవచ్చితివనియడిగిన నతడిట్లనియె. ఓబాలామణీ నేను మగధరాజపుత్రుడను నాపేరు ఛండప్రచండుడని యందురు నేను వేటమార్గమువచ్చితిరిగి పురమార్గంబుబట్టి వచ్చుచుండ గాఢాంధకారంబగు చీకటులుగ్రమ్మి వర్షంబువచ్చిన నాసేనలు పలుదోవలంబారిపోయిరి. నేనును మార్గంబుదప్పి ఈచెట్టుకడం జేరియుండినిన్నుంగాంచితిని యిదినా సమాచారంబుయని దెల్పి నీతెరంగెరింగింపుమని నాకన్యక నారాజసూనునకిట్లనియె నేను మేఘమంజరిపురంబును పాలించు నరపాలుని కొమార్తెను మోహనాంగియనుదాని నేను చిన్ననాటనుండి ఈయేనుగ మీదనెక్కి

యూరేగుచుంటిని పిమ్మట నేను ప్రౌఢనైనతర్వాత ఈయేనుగమీద నెక్కించవలదని మంత్రి యెంతచెప్పిన మాతండ్రివినక ఏనుగమీది భ్రమచేతను నాయందుగలిగిన బంధరూపుచేతనున్ను నన్ను దీనిమీద నెక్కించెను. నిన్నటిదినంబీయేనుగయు యేకారణంబుననో నన్నీయరణ్యంబునకు తీసుకొనివచ్చెను నాకర్మంబీలాగయ్యె యిప్పుడు ఈయేనుగను సాధించి నన్ను పిలుచుకొనిపొయ్యే సామర్థ్యము నీకు గలిగియుంటే చూడుము. లేదా త్వరితంబుగా నీపట్టణంబునకు పొమ్మని మోహనాంగిచెప్పిన నారాజసూనుండువిని తనకేమియుందోచక ఓచిన్నదానా ఇందుకు దగినయుపాయంబు నీవేచెప్పుమనిన నదియిట్లనియె ఓరాజకుమారుడా నేనాడుదానను నీవుమగవాడవు నీకుండెలియని ఉపాయంబు నాకేలాగునం దెలుసు పూర్వకాలంబున నాగశర్మయను బ్రాహ్మణుండు రంభను వివాహంబై పిమ్మట శాపంబుచేత నారంభ యినుకదిబ్బయై పోయిననతండు తిరుగబోరాడి యారంభను కాపాడితేలేదాయనినవిని యారాజపుత్రుండా కథ నెరింగింపుమనిన మోహనాంగియిట్లని చెప్పెను. కమలాపురంబను యగ్రహారంబున బృహత్సేనుండను బ్రాహ్మణుడు సకలవిద్యలు శిష్యులకుపదేశించుచుండ నాగశర్మయను బ్రాహ్మణచిన్నవాడాతనివద్ద చదువుచుండి ఒకానొకదినంబున విస్తరాకులకై యడవికిపోయి యచ్చట ఒకకొలనులో దేవకన్యలు స్నానముచేయుచుండగా వారిం జూచుచుండి యాసమీపంబుననుండు ఒకమంటపంబున దేవకన్యకా ప్రతిమలతోండు రంభనుగాంచి దానిందనమనంబున దలంచుచుండె పిమ్మటనాతనితోడవెళ్లిన నాబాలులందరు నారంభాప్రతిమనునాతనికి వివాహంబుజేసి విస్తరకులు మొదలైనవి కోసుకొని వెళ్లిపోయిరి. పిమ్మట నాగశర్మయు వచ్చుచుండగా ఆరంభ నిజస్వరూపంబుగా వానింగూడి వానివద్దకు వచ్చుచు బోవుచుండెను. ఇట్లుండగా నాగశర్మగురువు నొకదినంబున రంభనుంగాంచి ఓహోహోహో వీనిభాగ్యమేమనిచెప్పవచ్చునని యోచించిఓనాగశర్మా నేను పుణ్యముచేసితినో పాపముచేసితినో నీవురంభనడిగి తెలుసుకొమ్మని చెప్పగా నతండారాత్రి రంభగాంచి మాగురువు పుణ్యముచేసెనా పాపముచేసెనాయని యడిగిన నది మీగురువు చేసినపాపము నాలుగుకొండలై పెరుగుచున్నదని చెప్పెనంత నానాగశర్మ తనగురువున కాతెరంగెల్లం నెరింగింప నతండును వోయీ నేటిదినంబున నీవు నాపాపంబెల్ల ఏలాగునపోవునో నత్తెరంగెల్ల విచారింపు మనిన నతండారాత్రి రంభంగాంచి మా గురువు పాపంబెట్లు నశించుననిన నది ఇట్లనియె. మీగురువు తనకామాత్రైకు పూని

బైట నొకఇల్లుకట్టించియందు దానినుంచి యక్కడికి అప్పుడప్పుడూ పోతూ వస్తూవుంటే మీగురువుపాపంబంతయు నివారణంబవునని జెప్పెనంత నాగ శర్మయు తన గురువుతో నాసమాచారం బెరింగించిన నతండు మంచిదని ఊరికిబైట వకఇల్లుగట్టించి యందుతనకొమార్తెనుంచి తాను అప్పుడప్పుడు వస్తూపోతూయుండెను. పిమ్మట నాయగ్రహారముసంగల జనులందరు ఈ బ్రాహ్మణుడు తెలిసినవాడైయుండియు తనకొమార్తె సహవాసంబుచే యుచున్నాడు. ఇంతపాపంబు కద్దాయని వాడుకొనుచుండిరి. యంత నతని పాపంబెల్లను పరిపాలయ్యెను. మరికొన్నిదినంబులకు దేవేంద్రుండీ సమా చారంబెల్ల యువిని రంభనుజూచి కోపించి నీవుఇక్కడిమర్త్యంబుల భూలోకం బునజెప్పితివిగానపడమటిసముద్రముదగ్గరనిసుకదిబ్బవై పోదువనిశపించెను. పిమ్మట నారంభయు తనకు శాపవిమోచనం బయ్యేటట్టు దయచేయుమని వేడగా పన్నెండుసంవత్సరములలోగా ఏదినంబునైనను యొకదినంబు లోగా నిన్ను పెండ్లియాడిన బ్రాహ్మణుండుసుసముద్రములోకియాదిబ్బను మోయిం చినట్లయిన నీకు శాపవిమోచనమౌనని చెప్పగా రంభ భూలోకంబునకువచ్చి యాసమాచారంబెల్ల నాగశర్మతోజెప్పి యాతనికాకలియు దాహంబును లేకనుండునట్లొక వుంగరంబిచ్చి తానిసుకదిబ్బయై పోయెను. పిమ్మట నాగశర్మ యీ యుంగరంబును ధరించినందున ఆకలి దప్పిలేక నిత్యంబును స్నానసంధ్యాదులం దీర్చుకొనుచుండెను. పిమ్మట కొన్నిదినంబుల కాయుం గరంబొకనాడు నీటిలో జారిపడినదాని నొకమీనంబుమ్రింగె దానికొందరు బెస్తలుపట్టి నారాయణపురంబేలు రాజునకు కానుకనివ్వగా నాతండుదానిం గోయించి అందున్న ఉంగరంబును తనకొమార్తెకిచ్చెను. నాకన్యయుదాని ధరించి నందున అన్న పానాదుల యందిచ్ఛ లేక యుండగా అనేక మంది వైద్యులువచ్చి యాజాడ్యంబును కుదర్చలేకపోయిరి. పిమ్మట నాగశర్మయు వుంగరముపోయినప్పటినుంచి ఆకలియాహారంబులచే పీడింబడి భిక్షంబెత్తు కొనుచు యానారాయణ పురంబు జేరి యాసంగతి యంతయు విని రాజుం గాంచి ఓమహారాజా నేనీజాడ్యంబుకుదిర్చెద నాకు వెయ్యివరహాలుఇప్పించి వలెనని చేతం దీసుకొని వక ఉంగరము జేయించి నారాజకొమార్తెతావుకు పోయి తెరచాటుననుంచి దాని చెయ్యిబట్టిచూస్తూ ముద్దుటుంగరమును తీసు కొని తాచేయించిన ఉంగరము వేయగా నాచిన్నదాని కాకలియథాప్రకార ముగా భోజనము చేయసాగెను. పిమ్మట నానృపాలుండు ప్రీతుండై ఓబ్రాహ్మ ణోత్తమా నీకేమికావలయునో నిచ్చెద వేడుమనిన విప్రుండు సంతోషించి

పశ్చిమ సముద్రము వద్దనున్న వక ఇసుక దిబ్బనునొకదినంబునసముద్రము లోకిమోయించవలెనని వేడిన నృపాలుండందులకు సంతసించిదగినవారల నియోగింప వారెల్లగూడి వక దినంబులోపల నాదిబ్బనెల్ల సముద్రములో గలిపిరంత రంభకు శాపవిమోచనమై తనస్వరూపముతో నేతెంచిఆవిప్రుని స్తొగలించి అనేకవిధంబులంబొగడి యదేచ్ఛంజనియె నంతనానరేంద్రుండా సమాచారంబెల్లవిని తన కుమార్తెను నాగశర్మకిచ్చి వివాహము చేసెను. వింటివా ఛండప్రచండమహారాజా ఆబ్రాహ్మణునిసామర్థ్యంబనుచుండు సమయంబున ఆపనుగనిద్రలేచి హావుడాలో రాజకుమార్తెలేనందున ఆచెట్టుప ద్దికివచ్చి తన తొండమునుసాచి వారిని బట్టబోవుసమయంబున ఛండప్రచండుడు భీతింబొందుచుండ మోహనాంగియాతనిచేతి వజ్రాయుధంబు తానందుకొనియాతొండమును తెగనరికివేయ యాగజంబరచుచు నేలంబడిప్రాణంబులు విడిచెను పిమ్మట నాఇరువురు వృక్షంబు దిగిరంత నారాజసూనుండా మోహనాంగిని గాంధర్వవిధినిం బరిగ్రహించి సురతక్రీడలందేలుచుండెను ఇట్లు సౌఖ్యంబునందేలి వనవిహారంబు సేయుచు నటకు గడియదూరంబున వెలయు నొక సరోవరంబును దానిగట్టున నొక యాలయముండుటంగాంచి సమీపంబునకుంజని యందు దేవకన్యలు జలకమాడుచుండ వారిలో పద్మాక్షియనుచిన్నదానిచీరెను రాజకొమారుండుగైకొని మెల్లగా తన భార్యతోడంగూడి దుర్గాదేవి యాలయంబుజొచ్చి దాగియుండెను నంత కొంతసేపటికి నాకన్నియలందరు గట్టుకువచ్చివారివారిచీరెలంధరించుకొనిరి. తర్వాత పద్మాక్షితనచీరెంగానక చిత్తచాంచల్యంబుగలిగియాదుర్గాలయంబునకొచ్చి తన సవిస్తారంబెల్లనెరింగించి రక్షించుమని ప్రార్థించినదేవిమరుగుజొచ్చియుండు నారాజచిన్నదినాకన్యకిట్లనియె, ఓకామినీనీవువస్త్రహీనవై నాకడకురాదగునా నీయందుమోహంబుదగిలి గదా నీచీరెను ఎత్తుకొనియుండుటగాన వారింబెండ్లాడిసుఖంబుండి యట్లింతువుగాని వేరుకోర్కె దలంపవదనిన నాచిన్నది ఓ యమ్మా నాకంతభాగ్యంబుగల్గునేని పరమసంతోషంబున బెండ్లాడిసుఖింతునని వాగ్దత్తముచేసెను. నంతనామాటలువినియారాజకుమారుండు నాదేవకన్యనుంజూచి చిన్నదానానీవుదుర్గియెదుట ప్రమాణంబుచేసితివి జెరుపనోపవుగదా నన్నుంబెండ్లాడిసుఖింపుమని దానిచీరెనువిసిరి వేసివెడలవచ్చినిలచెను. నాచిన్నది విభ్రాంతచిత్తయైతనమనంబునకొంతదడవువితర్కించి మంచిదని యారాజపుత్రునింబరిగ్రహించి మన్మథక్రీడలందేలి నొకకడియంబిచ్చి నీకు నాపై భ్రమను గలిగినప్పుడీయంబును ద్రిప్పించుము

నేనువచ్చిభ్రమతీర్చి పోదునని చెప్పి వెళ్లిపోయెను. నంత నా రాజపుత్రుండు దానిం గైకొని నిజభార్యతోడంగూడి దుర్గాలయంబు వెడలి యరణ్యంబున వచ్చుచు వకఎఱ్ఱని పుష్పంబుఁగోసి యాఘ్రాణించగా నతండు కోతియయ్యె పిమ్మట కొంత సేపటికి తన వెంటవచ్చు పురుషునింగానక వ్యసనంబునొంది మగుడి వెనుకకుంజని వెదకుచుపోయి వకప్రదేశంబున కోతియై యున్న పురుషునింగాంచి ఇతండీపుష్పం బాఘ్రాణించినందున కోతిఅయినాడని తెలుసుకొని మరియొక పుష్పంబు కోసితెచ్చి నాపుష్పంబును కోతినాసికమందుంచిన అతండుమరలతనస్వరూపంబునొంది ఆరెండుపుష్పంబులగుర్తుతీసుకొని నిజపురమార్గంబుబట్టివచ్చుచు నటకొంతదూరంబున గార్గవమునియాశ్రమంబునుంగని యందు ప్రవేశించి నమ్మునినిం గాంచి దండప్రణామంబులుసమర్పించి వారికి తన భార్యలతోడంగూడి శుశ్రూష చేయుచు నొక్కదినంబున మహాత్మా పాంచభౌతికమైన సాకారశరీరములకు వృద్ధిక్షీణంబులును జననమరణంబులును గలిగియున్నటుల పెద్దలవలనం వినియెదనిరాకారునితెరగంతయు వినిపించి నన్ను కృతార్థునిగాజేయుడని ప్రార్థించిన నా తపోధనుండా రాజసూనున కిట్లనియె.

గార్గవముని ఛండప్రచండునకు హంసతత్వంబు దెల్పుట.

ఓ రాజకుమారా నీవు దివిజుల కసాధ్యమైన ప్రశ్న జేసితివి, ఆహా నీవు మిగుల బుణ్యపురుషుండవు నీ యందలి ప్రేమచే నెరింగించెదను పిపీలికము మొదలుకొని త్రిమూర్తుల పర్యంతముగ గల శరీరములన్నియు సాకారములౌట సత్యమని యతనికి హంసపంచాక్షరీ మంత్రంబు బోధించి బిడ్డా అయమాత్మా బ్రహ్మయను శ్రుతిననుసరించి నామరూప క్రియాదులు లేని యాత్మారామ బ్రహ్మము సాకారశరీరములందు వాయువువిధంబున బ్రవేశించియుందంతర్బహిర్వ్యాపకత్వముగలిగి జాగరణ స్వప్న సుషుప్త్యవస్థలును రేయుబవళ్లును క్షుత్పిపాసలును ఆస్తితే, జాయతే, వర్థతే, పరిణమితే, అపక్షీయ్యతే యనుషడ్భావ వికారములునులేక కళాస్వరూపుడై సూత్రధారియసంబరగి అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయములను పంచకోశములకు వ్యతిరిక్తుడై తంతులవలె షట్చక్రములచుట్టుకొని రేచకపూరక కుంభకములచే నిడాపింగళ సుషుమ్న నాడులలో సంచరించుచుండు దానిని నారోహణ అవరోహణములను ప్రణవాత్మకద్వయమని పెద్దలు ధ్యానింతురు. అట్టి హంసుని నిరాకారుడనియును నతనిమహిమను గన

కాలమనియును త్రిమూర్తులు వచించిరి నామరూపంబులు లేకుండుటం జేసినిరాకారుడని చెప్పవలసివచ్చెను దీనికిమహావాక్యములు ప్రమాణములు ఇదియేచైతన్యము, ఇదియేసచ్చిదానందము దీనిచే కేవలాత్మయే పరిపూర్ణమును దర్శించిన నదియేశివనిభావము యిదియేవేదాంతము. వేదవాక్యము వేదీని మార్గములని యూసనాభ్యాస యోగవిధులచేతను నిడాపింగళనాడులు రెంటను సూర్యచంద్రుల సంచారత్రోవలు నాత్రోవలలో సంచరించుహంసను నజపకుండలిన్ని భేదించి సుషుమ్న నాళమునయెక్కిపోయి గంగాయమునలలో స్నానముచేసి యాజ్ఞేయమంటపములోనిలచియుచటనున్న దేవనాగరత్న కాంతులుగడచి సూర్యచంద్రులవెలుగు బయలులో జేర్చి బట్టబయలుగానిలిచియానందింపుము. కొందరువివేకశూన్యులుహంసునిమహిమయిట్టిదని గురుముఖంబున నెరుంగజాలక నది ప్రాణవాయువని చెప్పుదురు గుదంబున నపానవాయువును నాభియందున సమానవాయువునుహృదయంబున ప్రాణవాయువును వ్యానవాయువుశరీరమందంతటను వ్యాపించి యుండునని ప్రమాణములుండగా ప్రాణవాయువు తనస్థానమునువిడిచియు దానవాయువునుగడచి రేచకపూరకాదులు సేయుచున్నదని చెప్పుట విపర్యాసము ప్రాణవాయువు హృదయకమలమునుండి నీరుగుండెలో యంత్రమువగిది టక్కుటక్కున గొట్టుకొనుచుండునని సర్వంబునెరింగించి తనయాశ్రమంబున నిష్టాగరిష్ఠుండై యుండుమని చెప్పిన నాంజనేయుండు స్వామి నిరాకారభావంబు మిగుల శ్లాఘనీయముగా నున్నదని దానిమర్మములన్నియు తెలుసుకొని శ్రీరాములంగీర్తించి నాయనా యనంతరమా ఛండప్రచండమహారాజు వృత్తాంతమెటులయ్యె నెఱింగింపుడనిన నాభగవంతుడుదయారసుండై యారాజసూనున కిట్లని చెప్పందొడంగె.

మారుతాత్మజా! అవేతనప్పుడారాజచంద్రుండుయాశ్రమంబువదలి అవంతీశుడను ప్రభువు రాజ్యము సేయుచుండ ఆపట్టణంబునకుప్రతిదినంబును రాత్రులయందు వకసింహ్మమువచ్చితనకగుపడేవారినంతా చంపుచూడున్నందున నారాజుసింహ్మంబును నెవరుచంపుతారో వారికి చంద్రికామణి యనుపేరుగల తనకొమార్తెనిచ్చి వివాహముచేసి తనరాజ్యములో సగంబిచ్చెదనని సాటించె నాసమాచారంబు ఛండప్రచండుండువిని తనభార్యలనిరువురకోతులుగా జేసి తన మంత్రప్రభావంబుచే తాను ముసలివాడై ఆపట్టణమునకుబోయి ఆవీధియందుండ నారాత్రి రాజభటులు వచ్చి సింహము వచ్చును, ఎవరు బయటవుండవద్దు, వారివారిఇండ్లకుపొమ్మని చెప్పుచుఆముస

లివానింజూచి ఓరీ ఈరాత్రి నీవు ఇక్కడవుండవద్దు సింహ్వమువచ్చిచంపును మారాజు యాజ్ఞప్రకారము పట్టణములోకి పొమ్మని వారెంత చెప్పిన వినక అక్కడయాముసలివాడుండెను. మరికొంత సేపటికిసింహ్వము ఆర్భటించుచు రాగా మోసము వచ్చునని తక్షణంబునలేచి నారాజపుత్రుండుఆఘ్రాణిం చితే కోతి అయ్యే పుష్పము ముందు వేయగా నాసింహము ఆఘ్రాణించి కోతిఆయె నంత అతండు దానింజంపిప్రాణములు పొయ్యే సమయమందు మందిపుష్పమును యాఘ్రాణింపజేసిన సింహ్మమైచచ్చిపడె. మరునాడుద యకాలంబున రాజభటులువచ్చిచచ్చిపడియున్న సింహ్వమును అక్కడనున్న ముసలి వానిని ఆకోతులనుం జూచి యీసమాచారం బంతయు రాజునకు చెప్పినంతట రాజేంద్రుండాశ్చర్యంబునొంది యాముసలివాడుమహాప్రభా వంబు గలవాడై యున్నాడని యోచించుచు యాముసలివాని నొక పల్లకి నెక్కించుకొనిపోయి తనయొక్క ప్రదేశంబుననుంచి తనప్రధానినింగాంచి ఇట్లనియె. ఓయీ యితండు ముసలివాడుగానున్నాడు. ఇటువంటివానికిమిక్కిలి రూపవతియైన నాపుత్రిని నెట్లునిత్తును. ఆడిన మాట తప్పితే దేశంబులో నపకీర్తియవునని విచారపడుచుండగా నాచంద్రికామణియు యాసమాచా రంబెల్లవిని భద్రకాళికా దేవాలయంబునకుపోయి ఓలోకమాతా నిన్ననే కదినంబులనుంచి నాకుతగిన పురుషునిదయచేయుమని వేడుచుంటిని, ఇప్పుడు మాతండ్రి నన్నొక ముసలి వానికి నివ్వవలయునని ప్రయత్నము సేయుచు న్నాడు. ఆముసలివానిని పెండ్లిచేసుకొనుటకంటె చచ్చుటమేలనిధైర్యము చేసికత్తితీసుకొని హత్యజేసుకొనబోయెను. యప్పుడు భద్రకాళిప్రత్యక్షమై యాచిన్నదాని చెయిపట్టుకొని ఓచిన్నదానా నీకుదగిన పురుషుండు దొరకి నాడు, అతడు ముసలివాడుకాడు, నతండుమగధభూపాలుని పుత్రుండుచం డప్రచండుడను పేరుగలవాడు, బహుచక్కనివాడు, ఇంతకుమున్న ఇరువురు కన్యల బెండ్లాడియున్నాడు. మంత్రప్రభావంబున కతనికి వరూపము కావలె నంటే యారూపంబగును, నీవు వ్యసన పడవద్దని ఆరాజసూనుని ప్రభావం బెల్ల నెరింగించి మరల నిట్లనియె. ఇప్పుడు నీకొక యుపాయంబు చెప్పుచు న్నాను. అదివవరికిగాని చెప్పవద్దు, వక ఉంగరమును నీకు ఇస్తున్నాను ఈ ఉంగరమును బెట్టుకొంటివా, నీవువవరికండ్లకు అగుపడవు, రేపుసాయంత్ర మున నీఉంగరమును బెట్టుకొని ఆముసలివాడుండే చోటికిపోయివక మూల యుండుము. ఆసంగతి తెలుస్తున్నదనిచెప్పి వుంగరము పెట్టుకొని యాముసలి వానిదగ్గరకుబోయి అక్కడుండెను. అంతట రెండుఝాములైన తర్వాత

ముసలివాఁడు బహుచక్కనివాఁడయ్యె ఆకోఁతులు రెండు సుందరమైన స్త్రీల య్యెను వారు తెల్లవారేదాక కేళీవిలాసముగావుండి ఉదయకాలము కాగానే యెప్పటివలె ముసలివాఁడుగాను కోఁతులుగాను అయిరి. ఇది యంతయు చంద్రికామణిజూచి బహుసంతోషపడి తనతండ్రి దగ్గరకుబోయి ఓతండ్రి నీ వేలచింతపడియెదవని నాముసలివానికిచ్చి వివాహముచేయుము నీవంటి మానవులు మాటతప్పినట్టయితే లోకమునం దపకీర్తిగలుగు నతం డేజాతివాఁడైనను ఇచ్చితీరవలసినదని ఎన్నివిధంబులు జెప్పినను నతండు వినకబోయినందున తానురాత్రిజూచిన యాశ్చర్యంబంతయు రహస్యముగా తండ్రికి నెరింగించి అతండు బహుచక్కనివాఁడు యాకోఁతులురెండును సుందరులగు కన్యకలు నాభాగ్యంబుపండె నన్నాతనికిమ్మని యెంతచెప్పిన నా అవంతీశునకు నిజము లేకపోయినందున ఆచంద్రికామణి తనకు కాళికాదేవి యిచ్చిన ఉంగరమును తండ్రిచేతికిచ్చి దాని ప్రభావంబుజెప్పి నీవీరాత్రియందు నీ యుంగరముపెట్టుకొని యా ముసలివానిదగ్గరకు పోయిచూడుము. అక్కడ అన్నిసంగతులు తెలుసునని చెప్పగా నా అవంతీశుడు మంచిదని యారాత్రి నాయుంగరము పెట్టుకొని యా ముసలివాని దగ్గిరకుపోయి తన కొమార్తె చెప్పిన ప్రకారంబుండగాజూచి బహుసంతోషపడి మరునాఁడుదయంబున యాముసలివానిం బిలిపించి ఓయీ నీవిట్టి మాయవేషముతో నేలదిరిగెదవు నీనిజరూపంబు చూపుమని యనేక విధంబుల వేడిన ఛండప్రచండుడు సంతోషించి తన భార్యలతోకూడా నిజరూపంబులుజూపె నంత యావనేంద్రుండు సంతోషపడి తనకొమార్తెనిచ్చి వివాహముచేసె నంత నారాజపుత్రుండు ఆచంద్రికామణిసింగూడి సకలభోగము లనుభవించుచు కొన్ని దినంబులుండి తనమామతో నేను మాదేశంబునకుం బోవలయును నాభార్యను బంపుమని అడిగి దాని వెంటబెట్టుకొని మార్గంబునబోతూ అక్కడ తపముచేయుచున్న యొక మునిపుంగవునింగాంచి సాష్టాంగ దండప్రణామంబులుచేసి వివిధశుశ్రూషలుచేయుచు సంతోషపరిచిన నా మునీంద్రుడు కరుణార్ద్రహృదయుండై నారాజకుమారునకు నొకటోపినిచ్చి ఓయీ నీవు దీనిని ధరియించి ఎక్కడికి పోదలచినను అక్కడికి చేర్చునని దీని ప్రభావంబుచెప్పిన నతండు సంతసించి దానింగైకొని మాణిక్యపురంబు బోవలెనని

తలంచి తత్క్షణమే చేరి దేవకన్యను దేవలోకమునకుంబంపి నానిరువుర రాజకుమార్తెలను బొమ్మలుగాచేసి ఆపురంబున యొక భోగముదాని యింటికింబోయి వారి యరుగుమీద గూర్చుండె నప్పుడు దేవతాస్త్రీలకన్న సౌందర్యవతియైన పద్మావతియను వేశ్య యా చండప్రచండునింజూచి మోహించి కుర్చీలమీద గూర్చుండబెట్టి కాళ్లుగడిగి శైత్యోపచారములు చేసి మంజలాన్నంబుపెట్టె నతండు నాపద్మావతింజూచి మన్మథపరవశుండై దానింగూడి రతిసంభోగ సుఖంబు లనుభవించుచుండి తనమర్మంబాతయు నాపద్మావతితో జెప్పెను. పిమ్మట కొన్నిదినముల కాపద్మావతి తల్లికూతురిమీద కోపము చేసి వీనివదలకుండా యుండెదవు వదలితివా నరే లేనట్లయితే నేను ప్రాణములను విడుస్తున్నానని మూడుదినములు యన్నపానాదులు తినకుండా వుండెను పద్మావతియు వీడుపొయ్యేటట్లు వకవుపాయము చేయుచున్నాను. తొందరపడవలయునని దనతల్లికింజెప్పి ఛండప్రచండునితో నాకొక ప్రార్థనయున్నది యదితీరువరకు నాతల్లి కన్నపానాదులు లేవుగనుక మమ్మిద్దరిని యేడుసముద్రముల కావల వక కాళికాదేవి గుడియున్నది అక్కడికి బిలుచుకొనిపోయి యామ్రొక్కు చెల్లించి తిరుగాగలసుకొని రావలసినదని పద్మావతి చెప్పెను. ఛండప్రచండుడు మంచిదని యక్కడికి కావలసిన సామానులతీసుకొని దానిని దానితల్లిని పిలుచుకొని టోపీధరియించి యేడు సముద్రముల కావలయుండే కాళికాదేవిగుడి చేరవలెనని మనస్సున తలంచెను తత్క్షణంబున నాముగ్గురు యక్కడకిచేరిరి. పిమ్మట పొంగళ్లు పెట్టేసమయంబున ఛండప్రచండుడు తనటోపిని పద్మావతిచేతికింయిచ్చిన తాను ఇటునటు తిరుగుచుండె నాసమయంబున పద్మావతియున్ను దానితల్లిన్ని నారాజపుత్రుని మోసంబుచేసి టోపినిధరించి తమయింటికిపోవలెననితలంచి యాక్షణంబుననే తమయిల్లుజేరి సుఖంబుగానుండిరి. పిమ్మట కొంతసేపటికి ఛండప్రచండుడు పద్మావతింగానక మోసంబుజేసి పోయెగదాయని యాకాళికాదేవి గుడియొద్దయుండెను. కాళికాదేవి యాలయంబునకు చిత్రవర్మయను వకనాగకన్య నిత్యంబువచ్చి ఓతల్లి లోకమాతా యంబికా నాకుందగిన పురుషు నీలోకంబులోనుండే రాజును పెండ్లిచేసుకోవలెను దయచేయుమని నిత్యంబు వేడుచుండె నాసంగతి నాతండు తెలుసుకొని యానాగకన్యరాక

మునుపే యాదేవళంబులోకి వెళ్ళి యాదేవి వెనుక కూర్చునియుండగా నాగ
కన్యరాగానే ఓచిన్నదానా నీభక్తికి మెచ్చినాను నీకుతగిన పురుషుని రేపుపి
లుచుకొని వస్తున్నానని కాళికాదేవి చెప్పినట్లుగా చెప్పిననాచిన్నది చాల
సంతోషపడి తనయింటికిపోయెను మరునాడుదయకాలంబున ఖండప్రచం
డుడు సకలాభరణంబుల ధరించుకొని దేదీప్యమానుండై వెలుగుచు యాదే
వళంబుననుండ నాచిత్రవర్మయు యతనింజూచి యాశ్చర్యపడి భుజంబులు
పొంగి ఖండప్రచండునిం గౌగలించుకొని ఇంటికింబిలుచుకొని పోయివివా
హంబుచేసుకొని రతిక్రీడలు సలుపుచుండె నక్కడా రాజపుత్రుండు కొన్ని
దినంబులుండి కొన్నిక్రియలు నేర్చుకొని కాళికాదేవిని యనేకవిధంబుల
ప్రార్థించి తనసమాచారంబెల్లయు విన్నవించిన కాళికాదేవి పక్షిరాజునిం
బిలిచిచెప్పిన నాపక్షిరాజు యారాజపుత్రుని భుజంబులపై నెక్కించుకొని
సముద్రముగట్టున విడిచిపోయెను అంతరాజు పద్మావతియుండు పురంబుజేరి
దానినగరుజొచ్చినంజూచి యావేశ్య ఆశ్చర్యపడి ఇతనుమహానుభావుండని
యు తల్లిమాటలచే మోసంబుజేసితి నికమీఁద నితనివదలకూడదనియుండె
నతండును పద్మావతిపైగల మోహంబుచే కొన్నిదినంబు లక్కడయుండి దా
నికితన తెరంగ తయు నెరింగించి తనభార్యలతోడం పద్మావతినిం బిలుచుకొని
నిజపురంబునకరిగి పట్టాభిషిక్తుండై రాజ్యంబు సేయుచు సుఖంబుగానుండె
నని చెప్పినవిని అంజనీసుతుడు యానందభరితుండై శ్రీరాములంగొనియాడి
ఖండప్రచండునికథ బహురమ్యముగాయున్నది ఇతనికీపేరు జెల్లును ప్రొద్దా
యె నిద్రింతమురమ్మని మారుతాత్మజుండును భగవంతుని ప్రార్థించిననతం
డేయకొని సుఖనిద్రజెందిరి.

సప్తమరాత్రికథ - సమాప్తము.

ఓమ్.

శ్రీసద్గురుపరబ్రహ్మణేనమః.

# అష్టమకథారత్నము.

ఎనిమిదవనాటిరాత్రి సీతారాము లిరువురు లీలావినోదంబుగా తాంబూలంబు జేయుచు సుగంధ కుసుమముల యొక్కయు మాధుర్య ఫలముల యొక్కయు గాలి నాకర్షించుచు చల్లగావీచు మలయమారుతంబున కానందించుచుండు నవసరంబున పవనజుండు భగవంతునిం జూచి గాయత్రి ప్రభావంబు నా యందు పరిపూర్ణ దయయుంచి యొకచిత్రకథతో దెల్పుండని ప్రార్థించిన శ్రీరామ భగవానులు నా యాంజనేయుని బాలకా నీకిష్టార్థంబులు సమకూర్చు గాయత్రీ ప్రభావంబు దెల్పెద నందుకుసాదృశ్యంబుగా నీలవర్ణ మహారాజుకథ వినుమని యిట్లనియె:—

## నీలవర్ణమహారాజుకథ.

కేశవర్మాయనున్న కొంకణ దేశమును బాలించుచుండిన అవ్యయ ప్రధ మహారాజునకు సునందిని మేఘమంజరియను నిద్దరుభార్యలుగలరు, వారిలో చిన్న భార్యకు కృతవర్ముడను పుత్రుడును కృతవర్మి యనుపుత్రియుజన్మించెను. పట్టపుదేవియైన సునందిని సంతానవిహీనయైచవతిబిడ్డలనుతనబిడ్డలుగా భావించి వారిని యత్యంతప్రేమతో పెంచుచుకొన్నిదినములకు దానునుగర్భముదాల్చి సుందరమైనపుత్రునిగనెను ఆనరేంద్రుండుపొంగిపుత్రునకుజాతకర్మాది క్రియలుగావించి నీలవర్ణుడనిపేరుపెట్టి యత్యంతప్రేమతో పెంచుచు నైదవసంవత్సరమున విద్యాభ్యాసము చేయించెను. ఆబాలుడు దినదినమభివృద్ధినొందుచు మిగుల జాణుకుతనము గలిగివిద్యలన్నియు నేర్చుకొనుచుండెను. ఆమేఘమంజరియోర్వజాలక తనప్రియమైన చెలికత్తెలనుచూచిప్రాణసఖీ నాకుగలిగిన మనోదుఃఖమునీకేమని చెప్పుదును. నాబిడ్డతండ్రిసింహాసనమెక్కునని యోచించుచుంటిని. నాసవతికి మగబిడ్డపుట్టెను, వాడు అన్నివిషయముల నేర్పరితన మేమని జెప్పవచ్చునని యడిగిన యా కపటాత్మురాలు మేఘమంజరికి కొన్నికుయుక్తులు తెలిపెను. ఆదురాత్మురాలు తనపుత్రునకు రాజ్యాలసుఖించుననియు నీలవర్ణుని నడవిపాలు జేతుననియు యోచించిమణి మంత్రములచేత భర్తను స్వాధీనంబు జేసుకొని పెద్దభార్యకడకుంబోనీకనీలవర్ణుని తండ్రియొద్దకు రానీక తన సంతానంబును ప్రభువు యొద్దనిలుపుచు నొకనాడు తనకు శిరోభారము గలిగినటుల తలకు పట్టువేసుకొని భర్తనుం

జూచి ప్రాణనాథా నాకు బలీయమైన శిరోభారంబుదగిలి బాధించుచున్నది, నాకు పులిపాలు తెచ్చియిచ్చి నన్ను బ్రతికించుకొండనిన నతండు పులిపాలు తెచ్చుటకసాధ్యంబుగదా, ఎవరునోపజాలరని చెప్పిన నామేఘమంజరి నాథునింజూచి నీపుత్రులలో నెవరు పులిపాలుదెత్తురో వారికి నీరాజ్యంబిత్తునని పాటింపుము. నీ కొమారులు మహా శూరులని దెల్పిన నతడట్లుచేసె, నా మాటలనీలవర్ణుండువిని తండ్రియొద్దకువచ్చి నాయనా పులిపాలు నేను దెత్తును. ఎంతమాత్రము మీరు చింతింపకుడని దెల్పి తల్లికడకుంజని యీసవిస్తారంబెల్ల దెల్పి దీవెనలం గొని శస్త్రాస్త్రపాణియై వెడలి నొక్క మహారణ్యంబు జొచ్చి కొంతదూరంబు జనిచని నొక దేవకన్య యచ్చట పూలుగోయుచుండుటంగాంచి దానింజూచి మనంబు వికలంబై దానిచేతం జేరి యనేక విధంబుల గొనియాడి సురతి కేళికిం నోడంబరచి తాను గాంధర్వవిధిని స్వీకరించి పూర్వాదరింప కేళీవినోదంబులుసల్పి కొంతకాలంబునకు నారాజపుత్రుండా దేవకన్యతో కూడా దేవలోకంబున కరిగెను. ఇట్లుండ నొకదినంబున యా చిన్నదానింజూచి నారాజపుత్రుండు నేను మిక్కిలి సుందరముగా మృదంగంబు మ్రోయించగలను. నీవు దేవసభకు నాట్యంబు నేయబోవు నపుడు నన్ను నీతోడ గొనిపొమ్ము, దేవేంద్రుని సంతోషంబు గావించెదనని దెల్పిన నాకన్యవల్లెయని నొకదినంబున నతనిందనతో కూడా దేవసభకు వెంటబెట్టుకొనిబోయెను. నతండు తనరాక నితరాదులకు దెలియకుండగ నొకమూల నొదిగికొని యానాట్యంబు చూచుచుండ మృదంగము మ్రోయించు దేవతవార్ధక్యముగ నుండుటచే నాట్యమునకు శబ్దమునకును సరిపోగక వికారముగనుండుటను నీలవర్ణుడుచూచి యోచించి నామునలివాని చెంతకుచేరి ఓయీ నీవు వాయించెడి వాద్యము వలన ఈనాట్యరసము చెడి ఈసభరంజింపకున్నది. గనుక నేనామృదంగమును కొంతనేపునాశక్తికొలది వాయించి సభను రంజింపజేసెద, దయచేసి ఇప్పింపుముని నీలవర్ణుండు వేడిన నతండు దానికి సమ్మతించి వాని చేతికిచ్చెను. ఆసమయమున యీరాజకుమారుని గాంధర్వవిథిని బెండ్లాడిన నానాగకన్య అతిసుందరముగా నాట్యముచేయుచుండెను. ఆరాజపుత్రుడును తనసామర్థ్యము నంతయుజూచి తాళమతిక్రమింపక వాయింప ఆసభలోనివారందరు ఆశ్చర్యమును బొంది సంతోషించిరి. నాసమయంబున అమరనాయకుండు ముందెన్న డెరుగని ఆనందమునుబొంది అతిసంతోషాతిశయముతో తాను కంఠమునధరించిన ముత్యాలహారమును ఆమద్దెలగాని చేతికిచ్చి యాదేవకన్యంజూచి మనోరంజనీ నీనాట్యంబును

మెచ్చితి, నీవు దేనిని కోరుచున్నావో నడుగుము, తప్పకదాని నిత్తునని జెప్ప నా కాంతాలలామణి మిక్కిలియుప్పొంగిఓమహాప్రభో తమయాశ్రితులమగు మాకుసకలైశ్వర్యములున్ను కొఱతలేకున్నది యైనప్పటికిన్ని ఇప్పుడిచ్చట నుండు మద్దెలగానియందు కోరికతప్ప వేరొక దానియందపేక్షగలుగలేదు. గనుక వానిజీవమున కేదియుతక్కువలేక యుండునట్లుఅనుగ్రహించవలయు నని ప్రార్థించగా నమరనాయకుడదివిని పట్టగూడనియాగ్రహముతో మృదంగమువాయించునట్టి రాజపుత్రునిజూచి యతికఠినములైన మాటలతో ఓరీ భూలోకము నందు జనించిన మానవాధముడా నీవిప్పుడు మాలోకగౌరవము నెరుగక దేవసంబంధమగు దేవకన్యకామణుల పొందగోరుటనుజూడక ముందామనోరంజనినికూడే రుచిమెరిగియు అది నిపొందగోరి రుచివెరిగినట్టున్నది. గనుక ఒకరిపైనొకరు మిగులబద్ధానురాగులై యున్నారని చీవాట్లుపెట్టి నీవాచిన్నదానిని భూలోకమునకు తలక్రిందుగాత్రోసికొని పోయి సహింపరాని బాధలననుభవించి తుదకావిశేషముచే దుఃఖింతురుగాక యని శపించి మనోరంజనినింజూచి ఓసి కులభ్రష్టీ నీప్రవర్తనజూడ నాకసహ్యమగుచున్నది నీనాట్య చతురతకుమెచ్చి మేలుచేయ దలంచి వుండుటంబట్టి నా తలంపునకు భంగము గాకుండుటకై ఇప్పుడు మన్నించెద, అయినను నా శాపము వ్యర్థముకాక ఇదిమొదలు పండ్రెండుసంవత్సరముల వరకునీకాళ్లు రెండునుశిలామయమ్మైయుండితుదకునిజరూపమునుబొందిసుఖింపబడుదునని తీర్మానించెను. ఈ శాపకార్యమును నీలవర్ణుండు విని అయ్యో మనోరంజని నావలన ఇంతదుఃఖమునునుభవింపవలసి వచ్చెనుగదా, దేవుడిట్లుకూడవిధించునా దైవమా, ఓ ఆదిమధ్యాంత రహితా దీనుడనగు నాప్రార్థన యాలకించి రక్షించి కృతార్థునిగా జేయుటకు నీవెకాని నితరుల నమ్మలేదని పలు తెరంగుల ప్రార్థించుచుండెను.

అంత మనోరంజని యింద్రుని శాపమువలన రెండుకాళ్లును శిలామయములై అచ్చోటనుండుటను రాజకుమారుని క్రిందికిత్రోయబడి మరిగిపోయెనంతనానీలవర్ణుండు తనప్రియురాలి నిజస్థితినియెంచి తామరాకున నీళ్లు తత్తరలించునట్లు మనోనిశ్చయంబు చేయజాలక బొరలిబొరలి యేడ్చుచుండనట్చోటనున్న భూతమొకటివీనినెత్తి భూలోకమున బడద్రోయగా ఒకటిన్ని తెలియక తలక్రిందుగాబడి మూర్ఛనొంది కన్నులు మూతబడి నాలవ దినమున ప్రజ్ఞగలవాడై కన్నులు తెరచిచూడ తానొంటరియైయుండెను. అది యెరిగి తటాలునలేచి నలుదిక్కులు పరికించిచూచుచు అచ్చటచ్చటనుండు

చెట్లపై నెక్కుచు పిచ్చిపట్టినవానివలె తిరుగుచుండెను. ఈరీతిగ ఆవనమంతయు సంచరించుచుండగా నొకనాడు నవరత్నతీరములుగల శిరస్సరయొకటి కనబడెను. దానిచేత నానా విధములైన ఫలవృక్షములు గలిగి శోభాయమానముండుటనుగని యాశ్చర్యపడి కొంతసేపు అక్కడ విశ్రమించి బడలిక దీర్చుకొని కొంతసేపటికి మైమరచి నిద్రపోయెను. ఆసమయమునందు కొందరు దేవకన్యలచ్చటికివచ్చి యాగుంటలో స్నానముచేసి గట్టుపై గూర్చుని తలలార్చుకొనుచుండ అందొకకన్యనిద్రించుచున్న నీలవర్ణునింజూచికూడనుండువారితో చెలికత్తెలారా అల్లదిగో ఆచెట్టుక్రింద పరుండి నిద్రించుచున్న రాజపుత్రుడే మనోరంజనియొక్క నాట్యములకు మద్దెలవాయించిన వాడని చెప్పెను. ఆమాటలధ్వనివానిచెవినిసోకగా నేత్రాలునకన్ను తెరచి యాదేవకన్యలనుచూచి అమ్మయ్యా మనోరంజని వృత్తాంతమేదియైన మీకు తెలియునాయనియడిగెను అదివినియాదేవకన్యలుమిక్కిలిదుఃఖముతోదయగలవారై నామెనుచూడలేదు మాకున్ను ఆమెకనబడ లేదనిచింతించి అయినప్పటికిన్ని మాదివ్యదృష్టిచే చూచిచెప్పెదమని దృష్టించి తెలుసుకొని వానితో అయ్యాయిచ్చటికిచాలదూరమున నొకద్వీపముకలదుయాద్వీపముతోచేరినదేశమునందొకదేవాలయముపగలంతయుమూయబడిరాత్రియంతయు తెరవబడియుండు దానిలో మనోరంజని పాదములు శిలామయమై నడువజాలకయున్నది. యనిచెప్పిరి. అదివినివాడు వారితో యాచోటిచ్చటి కేదిక్కునన్నది. దాసికరుణించి చెప్పుమనిప్రార్థింప వారునీయాయుస్సు వరకున్న నడచినప్పటికిన్ని ఆచోటుచేరజాలవనిచెప్పిరి అదివినిఆయాశపడి యికయీజన్మమేలయింతటితో యీప్రాణముపోగొట్టుకొనినబాగుండునని రాతిపై తలనుమోపిపగులగొట్టనారంభింప యాదేవకన్యలదిచూచిమిక్కిలి పశ్చాత్తాపముగలవారై అయ్యో వీడన్యాయముగ ప్రాణము పోగొట్టుకొను చున్నాడనితెచ్చుకొని యందరు నొకటిగాగూడి ఆలోచించుకొని వీనినచ్చటికి గొనిపోయి విడిచిపెట్టుదమని నిశ్చయించినవారై వానినొకక్షణములో మనోరంజనియుండుచోటునకుగొనిపోయివదలిపెట్టి తమత్రోవను తాముపోయిరి. అంతరాజపుత్రుండు సూర్యకాంతిచే ప్రకాశింపబడి తనదుఃఖమునంతయు చల్లార్చుకొని చుట్టుపరికించిచూడ నచ్చటసుందరమైన పట్టణమొకటి కనబడెను. ఆపట్టణము నలుప్రక్కల మధురమైన ఫలములతోను సువాసనగల పుష్పములతోను గూడిన గొప్పవృక్షముల తోపులును మిక్కిలి విశాలమైనయంతఃపుర మేడలును ఆమేడలయందు చక్కని యాకారముగల పురుషులు

కూడి యానందించుచుండెను. అట్టినగరముయొక్క రమణీయ్యతనుచూచిమె చ్చుకొనుచు ఆపట్టణమంతయుచుట్టు చూచుకొనుచు అంగడివీధి ప్రక్కబో వుచుండ నొకబీదబ్రాహ్మణుడు కనబడెను. వానిజూచి అయ్యా యీపట్టణ మునకుపేరేమి యీపట్టణపురాజుపేరేమి నీపేరేమి నీయుద్యోగమేదిదయ చేసి చెప్పుమని ప్రార్థింపనతడు ఇది చెంగల్వదీపము యీపట్టణము చిత్రాప తుడను రాజుచే యేలబడుచుండును. నాపేరు పూజకుడను నేనీపట్టణమున నుండు దేవాలయమునకు నిత్యమున్ను పూజచేయువాడని చెప్పెను. అది విని ఈపట్టణమందిక నెన్ని దేవాలయములున్నవి వానిలో ముఖ్యమైయుండిన వెన్ని ప్రసిద్ధములుగ నుండునవెన్నియని రాజపుత్రుండడుగ దానిబ్రాహ్మ ణుడు అయ్యా ఈసముద్రముగట్టువెంబడి నొకదేవాలయమున్నది. అదిపగ లంతయు మూయబడి రాత్రియంతయు తెరచి పెట్టబడియుండును అందెవ్వ రునుపోవు వారులేరని చెప్పెను. అదివిని కొంత నెమ్మదిపొంది తోడనే సము ద్రము గట్టునకుపోయి ఆదేవాలయముచేరి తలుపుమూసి యుండుటజూచి యాద్వారమున గూర్చునియుండ కొంతసేపటికి సూర్యాస్తమై చీకటిగప్పు కొనన నంతలో యాతలుపులకు వేసియుండిన బీగము తటాలునతనకుదానే తెఱచుకొని యుండుట నతండందుజొచ్చి చుట్టుప్రాకారపు మనోరంజని యొక్క అర్ధాంగము శిలాయమై నిలువశక్తిలేక యాగర్భగృహ గోడయం దు ఆనుకొని గూర్చుండుటంజూచి దరిలేని వ్యసనము ననుభవించుచుండగా యీలలితాంగి వానిజూచి వోనాప్రియుడా యిట్టినిర్జన ప్రదేశమున కెట్టువ చ్చితివని యడుగ తానువచ్చిన వృత్తాంతమంతయు సవిస్తారముగా జెప్పుచు యారాత్రిగడపెను అంత తెల్లవారునట్టి సమయమునుగని రాజపుత్రుని చూచి ఓ నాప్రియచెలికాడా యిక నీవిచ్చోటువిడిచి బయిటపొమ్ము లేకఈ పొద్దంతయు నీవిచ్చటనే గడపిన నీవున్ను నావలె అర్ధాంగము శిలారూప ముగానగుచు అనిచెప్పి తానుధరించిన పెద్దయాణిముత్యముతీసి వానిచేతికి చ్చి దీనినెత్తుకొనిపోయి విక్రయించి యాద్రవ్యముతో కొంతకాలమునెమ్మ దిగా నొకపూటకూళ్ళ దానియింట సుఖముగానుండి పగలంతయు సజ్జనస హవాసముచే గడుపుచుండు మని చెప్పి యంపెను. వాడదిపుచ్చుకొని తన తొడనుంజించి యాముత్యమును అందుపొదిగియుంచెను. తనవద్దనున్నము త్యాలహారమును ఆనగరవర్తకులకుఅమ్మి పదివేలరూపాయలు బుచ్చుకొని నొకపూట కూలిదానియింటికింపోయి భుజించుచు సజ్జనులసహవాసముచేప గలంతయు గడపుచు అస్తమయంబైన తోడనే దేవాలయమునకువచ్చి మ

నోరంజనితోఁగూడి ముచ్చటలాడుచు బ్రొద్దుగడుపుచుండ కొన్ని దినములకు ఆపట్టణమందనేకులు స్నేహితులైరి అంత తనస్నేహితులతోఁగూడి సరససల్లాపములాడుచూ తిరుగుచుండగా విటకాండ్లు కొందరొకచోట కూర్చొని మిక్కిలి వెలపొడుగగు వస్త్రాభరణాదులదాల్చి ఒకరిపైనొకరు చేతులువేసికొని సంతోషంబు జేయుటనుచూచి తనచెలికాండ్రతో ఆహా వీరలుముందుచూడ బీదవాండ్రుగానుండిరి. ఇప్పుడు జూడ రాజపుత్రులవలె గనపడుచున్నారు. ఇదిచూడ నామనసునకు చాలఆశ్చర్యంబును మోదంబును కలుగుచున్నది. వీరలీలాగునుండుటకు కారణంబేమనియడుగ నాచెలికాండ్రు యారాజపుత్రునింజూచి అయ్యా వీరుగొప్పకులమునందు బుట్టిన రాజకుమారులయ్యును తమఇంద్రియాదులను యథేచ్ఛగావిడిచి కామాతురులై మన్మథతాపంబుచే ఈపట్టణపు రాజపుత్రిపై మోహమాయా శక్తిగలవారై రాత్రింబగళ్లును అదేతలంపుచె వెర్రిపట్టి నాపువ్వుబోణిని జూచి యిదిమన్మథచిలకయో మోహినీదేవతయో దేవలోకరంభయో యనిభ్రమజెంది ఉన్మత్తులై సంచరించుచున్నారని దెల్పిన చెలికాండ్రను జూచి రాజపుత్రుండు ఓప్రియస్నేహితులారా యారాజపుత్రింజూచి వీరలింత మోహతాపంబుజెందుటకు నాచెలియందుగల యతిశయోక్తి నెరింగింపుమని వేడిన నీలవర్ణమహారాజునకుయిట్లనిరి. మిత్రుడా ఈరాజుకొమార్తె తనను పెండ్లియాడవచ్చిన రాజపుత్రులు తనకును గుణ్యమైన ఇంపుగలవారు కానిమొదల వారియందులేనిపోని మిషలుబెట్టి దూరంబుగా పారదోలించును అదియునుంగాక తనయొద్ద ఘటనాఘటన సామర్థ్యముగల చెలికత్తెలిద్దరుందురు వారినొకతెకు చమత్కారియనిపేరు అతిధైర్య స్థైర్య సాహసంబులుగలిగి సర్వవిషయంబుల కపటోపాయంబులచే నారాజపుత్రికను తోడ్పడుచుండును. రెండవదిచిత్రాంగియనుపేరుగలది అది కాలపాశదరుని మోసపుచ్చునట్టి సామర్థ్యంబుగలది ఇట్టివారలు నాచెలినెడబాయక జూదంబులాడుచు దానివలనవచ్చినవారినెల్ల నవహాసించుచు కాలంబు గడుపుచుందురు ఎట్టి చక్రవర్తులువచ్చినను వారికెంతగొప్పైనను లక్ష్యముసేయక నవమానించుచుండునని ఇట్లారాజకన్యంగోరి యనేకులువచ్చి నవమానంబుజెంది పోయిరేకాని ఒకరినైనను యింతవరకు సమ్మతించి పెండ్లియాడినదిలేదు ఒకవేళ నారాజపుత్రి యిష్టపడినను వెంటనుండు చెలికత్తెలు నడిపడగొట్ట జూచుచుండుదురు అనిచెప్పిరి. అదివిని యానీలవర్ణుండు నేమియు బదులు పలుకక నూరకుండి ఒకనాడు రాజపుత్రియగు సౌరంభనుజూడగోరి యామేడసమీపంబునకు బోవుచుండ

యచ్చటకొందరు విటకాండ్రు గుంపులుకూడి పిచ్చివాండ్లవలె మోహాతాపంబునజిక్కి నోటికివచ్చినట్లును యారాజకన్య మనస్సునకు సిగ్గుతోచునట్లును పలువిధంబుల భాషించుచుండిరి అచ్చటికా రాజపుత్రుండు పోయి వారు పడుపాటులనుగాంచుచు వారితో వేడుకగామాటలాడుచు ప్రొద్దుపుచ్చుచుండెను అంత కొంతసేపటి కాసారంభ తనమేడకు వెలుపలనుండు రాజపుత్రుల కామపరవశములగు పాటల వేడుకనుజూడ కిటికీప్రక్కనిలిచి వీథిప్రక్కజూడ పున్నమ చంద్రునింబోలు నీలవర్ణుని నక్షత్రంబుల నడుమనున్నశశాంకుని పగిదిగాజూచి బుద్ధిభ్రమసి క్రిందబడి మూర్ఛపోయె కొంతసేపటికి తెలివితెచ్చుకొని తనచెలికత్తెలంజూచి ఓనాప్రియమైన చెలికత్తెలారా నాప్రాణనాథుండగువాడు నాకండ్లబడి నామనస్సు చలించి కంటికి నిదురరాక వానియందుపోయిన మనస్సును మరలించుకొనుటకు శక్తిజాలక తొందరపాటు జెందుచున్నదిగాన మీరుబోయి వానిందోడితెచ్చి నాముందువిడువకున్న నాప్రాణంబు లొకనిమిషంబుగూడ నిలువజాలవు అనిపలుతెరంగుల పలుకరించుచునున్న రాజపుత్రికనుయెత్తి రొమ్ముతో నణచుకొని మొగంబున పన్నీరుచల్లి చల్లనిచంద్రకాంతమణులచేనెత్తి కొంతబడలికతీర్చి నెమ్మది పరచి ఓ కలకంఠీ నీవిదివరకు ఇట్టిమన్మథతాపంబు పొందకుండె ఇప్పుడు నీకిట్లుగలుగుటకు కారణము నెరుగ జెప్పుమనినడుగ యాసారంభ తనమనస్సున నుండుగుట్టు ఇతరులకు దోపనీయక బలుకకుండె నంత నాచెలికత్తెలా కోమలాంగినిజూచి నిట్టిదురవస్థ చెందినదో దాసి కనుగొనగోరి నిరుప్రక్కలం బరికించిచూడ నావీథివైపున పూర్ణచంద్రునింబోలు పురుషుడొకడు కన్నుల మిఱుమిట్లు గలుగజేయునట్లగుపడెను. అదిజూచి ఓహో ఈ చిన్నది వీనిజూచియే నిట్లు మోహావరవశయైనదనితలంచి తోడనేయారాజపుత్రికనుజూచి నీ విప్పుడు పొందుచున్న విరహతాపము జూడ నాకాశ్చర్యముగనున్నది, నీవీయల్పంబునకోర్చక ఆతురపడినట్లులైన నీగౌరవమునకు తగినవికాదు, నీవిట్టిమూర్ఛను బొందనేల, నీ వట్టిపురుషుని యాసించియుండు విధమును మాకెరిగించినట్లులైన మేమతని యతిశీఘ్రమునగొనివచ్చి విడిచెదము, నీతల్లిదండ్రులు తోడనే బెండ్లిచేయుదురు. అందులకై నీవు చింతింపబనిలేదు, భయపడకుమని ఓదార్చి యామెచేఫలానివాడనిగురుతెరింగివానికి దగిన యుపాయముయోచించి యంతఃపురము విడచి హంసనడతవలె వయ్యారముతో నీలవర్ణునికడకువచ్చి యిట్లనిరి, ఓబాలకా నీవెచ్చటనుండి వచ్చితివి. నీవు వసించు చోటెద్ది, నీవంశమెద్ది, మాకెరిగింపుమని నిర్బంధించి అడుగనా

రాజపుత్రుండువిని దానిమాటల నాలోచించి ఓహో ఇది యెవరో పంపిన దూతగా నుండవచ్చునని యోచించి ఓకలకంఠీ నీవేల నిట్లు తియ్యనిమాటల నన్నడిగెదవు, నామనస్సుమన్మథాగ్ని చే తపించుచున్నది, నీవుఇుందు నాతో చెప్పినమాటలు నా చెవులకు ముల్కులగుచున్నవి. ఇట్లు నన్నేల బాధింపవలయును నాపటణంబున నొకసారి నాపేరు విన్నమాత్రమున కిరీటాధిపతులు భీతిజెందెదరు, అట్టివాడగు నేనుయాత్రార్థముగవచ్చినవాడనుగనుక నీవిప్పుడు చెప్పిన తుచ్ఛభోగములను రోసియుండుటచే నా కిట్టితలంపులు గలుగనీయ లేదని చెప్పెను. అంత నా దూతిక యా వృత్తాంత మంతయువిని నితండు కొంకణ దేశాధీశుండని యెరింగి సౌరంభ యను రాజకొమార్తెదగ్గరకుంబోయి ఆమె కెరింగించెను. నదివిన్నదినంబు మొదలు దిన మొక యేడుగా గడుపుచు మన్మథతాపంబుచే జిక్కియుండ కొన్నిదినంబుల కాగుట్టు బయట బడెను. దాని తల్లిదండ్రులా విషయము నెరింగి తమ పుత్రికను అనేక శైత్యోప చారములుచేసి నెమ్మది పరచి యా రాజపుత్రుని గూర్చ యోచించి వాని చెంతకుబోయి తనపుత్రికను వివాహమాడుటకు నెన్నివిధంబులబోధించినను కొనసాగకబోయెను. అంత నారాజు కొండనుగూడ గరగించునట్టి సామర్థ్య ముగల శంభుమూర్తియను యాస్థానపండితుని యతనివశపరచుకొని వచ్చునట్లుయోచించి పంపగా వాడా నీలవర్ణుని వద్దకేగి తమ రాజు గుణాతిశయ ములును బలపరాక్రమాదులును ఐశ్వర్యాదులనువర్ణించిచెప్పి పిమ్మట సౌరంభ యొక్క రూపసౌందర్యాతిశయములు మొదలగు గుణాధిక్యములను వాని మనస్సు ఉప్పొంగునట్లు పొగడుచుండెను. నీలవర్ణుండదివిని యా దూతను జూచి నీవుపొమ్ము నా మనవిని తెలియపరచునట్లు సమ్మతిపరచి ఇట్లు జెప్పసాగెను. నేను రాజ్యభ్రష్టుడనై తల్లిదండ్రులను స్నేహితులనువదలి చెందరాని కష్టముల ననుభవించి భూసంచారము చేయు నాకు వివాహము చేయ యత్నించుటనుచూడగానీళ్లుగట్టిన మూటవలె నిష్ప్రయోజకమవునని యెరింగిపుమ్ము నిన యా దూత అట్లే కానిమ్మని ప్రభువు సముఖమునకుపోయి మిక్కిలి వినయముతో యా రాజసూనుడు చెప్పిన తెరంగంతయు విన్నవించెను. అది యారాజువిని మిక్కిలి వ్యసనముగలవాడై మంత్రిని పిలిపించి యా సంగతి నెరింగించెను. మంత్రి యదివిని ఇదేమి వింతగా నున్నది. రాజుల కోరికలను మంత్రు లెరిగి నెరవేర్చుట నైజము గనుక ఈ కార్యము నేవిధముననైనా సాధించెద, తా మిందులకు చింతింప బనిలేదు, అనిచెప్పెను. అంత రాజు మంత్రియొక్క బుద్ధి చమత్కారమునకు సంతోషింపుచుండెను. ఇట్లుండ

నీలవర్ణుండు తన చేతనున్న ద్రవ్యము ఖర్చుఅయిపోవుటచే కొంత దూరము
మోచించి తనతొడలోనున్న మాణిక్యమును తీసికొని దానిని విక్రయింప
వర్తకులయొద్దకుబోయి ఒకవర్తకునిచేతి కారత్నంబునివ్వ వాడదిపుచ్చుకొని
దాని ప్రకాశంబున కాశ్చర్యపడుచు మంత్రికడకుబోయి వానిచేతికిచ్చిదాని
వివరముకు తెలియు పరచెను. మంత్రియు తన భటులనుబంపి రాజపుత్రుని
దోడ్కొనివచ్చునట్లుత్తరువుచేయ వారుపోయి వానింబట్టుకొనివచ్చి చెరబెట్టి
మున్ను రాజుకోరిన నీలవర్ణుండతని యామంత్రికాభటులు తెలుప నతండు
రాజుకడకుంజని మహాప్రభూ తాముకోరినశ్రీమంతపురుషుడు బలాత్కారము
గవచ్చి మనచేతంజిక్కువడి చెరలోనుంచబడియున్నాడు యికవాని నేవిధము
న చేసినను చేయవచ్చును గనుక తమఅభిప్రాయమును తెలియజేయుడని
ప్రార్థించెను. అంత నా రాజు తనపుత్రికను యానీలవర్ణునకిచ్చి వివాహము
చేయనుత్నించి చెరలోనున్నవానివలె యతనింకష్టపెట్టక విచ్చలవిడిగాదిరు
గునట్లు నుత్తరవుచేసి భద్రపరచి వుంచెను. ఆరాజపుత్రుడు బయటరాకలో
పలనేయుండి తన ప్రాణనాయకియైన దేవకన్యను గూర్చి చింతించుచుత
లనుగోడకానించి తనకర్మనుదలచుకొనుచు చేతికివచ్చిన లాభమునుపోగొ
ట్టుకొంటినిగదాయని పలువిధముల పలువరించుచుండుటను చెరసాలనున్న
కావలివారు వినుచుంబోయి మహాప్రభూ చెరనుండు రాజపుత్రుండు విరహ
వేదనచే దుఃఖించుచు నిద్రాహారమువిడిచి క్రిందబడిపొరలుచుండుటజూడ కొన్ని
దినంబులలోనే తన ప్రాణమును పోగొట్టుకొనునట్లు తోచుచున్నదియని
చెప్పిన తనకొమార్తెనుం బిలిపించి అమ్మా నీవిప్పుడు చెరసాలకుంజని నీప్రి
యుని నీయందనురాగంబు నొందునట్లు నీయుపాయంబుచే వశపరచుకొమ్మ
నతండు మోహంబునజిక్కి పలువరించుచు కొన్నిదినంబులలోనే ప్రా
ణంబులు పోగొట్టుకొనునట్లు తోచుచున్నదని చెప్పిన నాసారంభ శృంగా
రించుకొని తనచెలికత్తియలంగూడి చెరసాలకుంజని యతనింజేరి యెన్నివిధం
బులసరససల్లాపంబులాడినను తానువూరకయుండుటంజూచితనచెలికత్తెలతో
అమ్మో వీడెంతగట్టిగుండె గలవాడు యెన్నితెరంగుల ప్రార్థించినను కన్నె
త్తిచూడకయుండె నాపాపంబనునది యిట్లుండుటయ్యేనా యని దానియె
దుటనే క్రిందపడి పొరలినేడ్చుచు బాణంబుచే గొట్టబడినమృగంబు చందం
బున త్రుళ్ళుచుండుటను రాజపుత్రుండుచూచి మిక్కిలి పశ్చాత్తాపంబుగల
వాడై అమ్మో పాపము ఈచిన్నది మనలంగూర్చి యిట్లు బాధపడుచున్నది.
ఇకనేనేమిసేయుదును దీనిని తృప్తిపరచకయుండిన ఈచెరలోబడి దుఃఖింప

వలసి వచ్చునని యోచించి తటాలున లేచి యాకన్యనెత్తిలాలించి ముఖముతో ముఖమును జేర్చి ముద్దాడి తృప్తిపరచి యాకన్యను పెండ్లియాడసమ్మతించెను. అంతనాచెలికత్తెలు మిక్కిలి సంతోషించి రాజుకడకుంజని ఈ సవిస్తారంబెల్లయు దెల్పిన నతండు తనపుత్రికకోర్కె సఫలంబాయెనని మోదంబుజెంది తత్క్షణంబున వివాహముహూర్తము నిశ్చయించి రాజాధిరాజులకెల్లను శుభలేఖనములువ్రాసి రప్పించి యాశుభదినంబున తనకూతురను యానీలవర్ణునకొసగి వివాహంబుచేసి యారాత్రి చంద్రకాంతమణులచేనమర్చబడిన సుందరమందిరంబున హంసతూలికాతల్పంబునలంకరించి యాదంపతులనందు ప్రవేశింపజేసిరి యంతనా రాజపుత్రుండు పడకటిల్లుజొచ్చి నిశ్చేష్టితుడై యేమియుపలుకక వున్మత్తునివలె యూరకుండి యాదేవకన్యపై భ్రమగలిగి తనప్రక్కనున్న సౌరంభ నిద్రించగానే దేవకన్యయుండుఆలయంబునకువెళ్ళెను అట యాదేవకన్య రాజపుత్రుడు రెండురోజులుగా తనవద్దకురాకుండుటచే పిచ్చిపట్టినదానివలె తలను గోడకుమోదుకొని పలువరించుచుమిక్కిలి దుఃఖముతోనుండి రాజపుత్రుని రాకనుగని సంతోషించి వానియభిప్రాయంబు నెరింగి మిక్కిలి కోపంబుతో కండ్లెఱ్రబోవ నాప్రియమునోనాయకుడా మీరిట్లు సంకట కార్యములందు చిక్కుకొని మిక్కిలి బడలికపొంది కళతప్పి శరీరము చిక్కివచ్చితివి గదా యని సంతసించుచు యింతకాల మెచ్చటనుండి యెవరిచే జిక్కుపడితివి నాటినుండి నిన్ను జూడక నామనస్సు బాధపడి దినమొక యేడుగా దుఃఖతాపమున మునిగి కుడితిలోబడు నెలుకచందంబునదాగుచు నాబంధుమిత్రాదులతలంపక యింద్రుని శాపంబుచే నలుగుచుయున్న నన్ను విడనాడియుండుట తగునాయని అనేకవిధములుగా పలువరించుచు పొరలి పొరలి యేడ్చుచున్న కన్యనుంజూచి యారాజపుత్రుండు మిక్కిలి దీనదయాళుండై తానువలచున్న సౌరంభనుబెండ్లియాడుటకు దగిన కష్టముల నెరుకపరచి నేనింక నాచిన్నదాని కడకుంజనను దానికి నాకు సంబంధంబులేదు నిన్నుంగాచుకొని యుండెద నెంతమాత్రంబు చింతింపకుమని బలుకుచు రాజపుత్రునకు యాచెలియిట్లనియె.

దేవకన్య నీలవర్ణునకు గాయత్రి ప్రభావంబు జెప్పుట.

ఓ రాజకుమారా? ఈదేహంబు సత్వరజస్తమోగుణములచే తొలిత త్రిశక్తులుగతోచి ఆవెనుక త్రిగుణ పరస్పర సమ్మేళనమువలన నవవిధములై పిదప ఆనవవిధాన్యోన్య సమ్మిళితముచేత సప్తవింశతి విధములై తెల్లనివస్త్ర



మున చిత్రములు కల్పితమైనట్లు శుద్ధపరబ్రహ్మమందు ఇరువది యేడు భేదములుగల సృష్టిని యట్లు గనబరచెను మఱియు వేదపురుషుడు ఈ ఇరువది యేడు భేదములుగల్గిసృష్టికి కారణమైన ప్రకృతిమయమగు గాయత్రిమూడు పాదములుగ భూర్భువస్సుయను వ్యాహృతి త్రయముతోడ ఇరుపది యేడ క్షరములు గలదని చెప్పి దాని ద్విజాతులగు బ్రహ్మ క్షత్రియ వైశ్యులకు తారతమ్యముచేత నుపాస్యముగ నిర్ణయించెను. మరియాగాయత్రికి మూఱు రూపమగు యజ్ఞోపవీతమును మూడు సూత్రములుగలది. అందొక్కసూత్ర మునకు మూడేసి అంతర సూత్రములు గలవు. అయాంతర సూత్రములం దొక్కొక్కటికి మూడు పోగులు గలవు గాన మూడు పెద్దపోగులు గల ఆ యజ్ఞోపవీతము ఇరువదియేడు పోగులుగలదయ్యెను ఆతంతులే ఇరువదియేడు భేదములు గల జగత్తు, ఆ జగద్రూపమగు యజ్ఞోపవీతమునే గాయత్రియని ద్విజాతులుధరించిన పరబ్రహ్మమునుద్దేసించి సర్వకర్మంబులు చేయవలయు ననియు వానిధరించుదాక కర్మకాండ ననుష్టింపవలయుననియు వెనుకసద్గురు కరుణ చేత విజ్ఞానము గలిగి గాయత్రి యజ్ఞోపవీత ప్రపంచ విచారణ చేసి యజ్ఞోపవీతమందలి మూడు తంతువులకు కూటస్థానమైన ముడియే బ్రహ్మ ముడియనియు అదియే అమలసత్వ ప్రధానమగు గుణసామ్యావస్థ యనియు తెలిసి ఆ యజ్ఞోపవీతమును పరిత్యజించుటే సన్యాస మనియు బ్రహ్మకాండ మనుష్టించిననాడనియు దెలిపి ఈ యజ్ఞోపవీతముగల ఇరువదియేడుపోగులు చంద్రుని భార్యలనియు వీనికి కూటస్థానమగు బ్రహ్మముడి చంద్రుడనియు ఆ చంద్రుని వల్లనే కామోద్రేకంబు బొందును, అనియు దాని త్యజించిన సన్యాసి యగుననియు వేరొండు మార్గంబు విన్నవించి యారాజసూనుతో మరియు నిట్లనియె; నీ వాకన్నియను అగ్నిసాక్షిగ పెండ్లియాడి నీవు జంధె

మునుధరించి ఇపుడు దానినిడుచుటవలన నీవుజనదూష్యుడ వగుటయేగాక
పతివ్రతను వదలినందున మహాపాతకంబు గలుగు గావున నీయజ్ఞోపవీతం
బును దృష్టియందునిల్పి మూలార్థమునుసాధించి గ్రహింపుము, కృతార్థుండ
వయ్యెదవు, తెల్లవారవచ్చినది, నీవతిరయంబున ఈదేవాలయంబునువిడిచి వెడ
లుము. యా సౌరంభతో కేళీవిలాసంబులాడుచు సుఖంబుగనుండుము, ప్రతి
రాత్రియుతప్పకవచ్చి నన్నుజూచిపొమ్ము, నీభార్యనువదలినీయజ్ఞోపవీతంబును
తీసివేసి నంతనే సన్యాసివి కానేరవు, వుభయభ్రష్టత్వము గలుగునని దెల్పిన
విని నంతసించి నా రాజపుత్రుండు చెలి నీయిష్టప్రకారంబున నాచెలినెడ
బాయకుండెదనని యెంతమాత్రంబు నాలోచింపకుమని ప్రతిదినంబు నీకడకు
వచ్చి పోవుచుండెదనని చెప్పి నా రాజపుత్రుండా స్థానంబు విడిచి తనభార్య
యగు సౌరంభ ప్రక్కకు వచ్చి యేమియు నెరుగని వానివలె నిద్రించెను.
ఈరీతిగ రాత్రియంతయు దేవకన్యయగు మనోరంజని చెంతను పగలంతయు
సౌరంభ చెంతను జేరి ఆటపాటలతో కథలుజెప్పుచు కాలంబు గడుపుచుండె
ను. ఇట్లుకొంతకాలము జరుగ నాసౌరంభ తనమనస్సున తానుచింతించి
అయ్యోదైవమా యెన్నివిధంబులను కష్టించి యితని నావలలోచిక్కించు
కొనియు కొంచెమైనను వానికి నాపై ఆశలేకయున్నది. యిద్దరమున్న వకే
గృహమునవసించిన్ని సుఖలీల ననుభవింపకుండుటను జూడ మిక్కిలి వింతగా
నున్నదియని దుఃఖించి తనతండ్రియొద్దకుబోయి పాదములపైబడి దండము
బెట్టితనమగనియొక్క కపటకృత్యంబువిడునక జెప్పెను అంత నారాజువానియొ
క్క కపటవ్యాపారము నెరుంగ తలంపుగలవాడై వానికిదెలియక కొందరిసే
వకులను బిలచి వారితో మీరు నీలవర్ణుని పడకగదిచెంత మఱుగున దాగియుం
డివానివెంబడించిపోయి యతనికి దెలియకుండ నాచోటెరింగిరండని యెరిం
గింప వారాయాజ్ఞ ప్రకారము మఱుగునదాగి దాగి వాని పోకను కని
పెట్టియుండ యానీలవర్ణుడు వాడుకప్రకారము బయలుదేరి సముద్రముగ
ట్టుననుండు ఆలయంబునకుబోయి తెల్లవారేవరకు మనోరంజనితో మా
ట్లాడి యథాప్రకారమువచ్చి నిద్రించెను అంత నాసేవకులదియెరిగి యాస
విస్తారంబంతయు రాజున కెరింగింప మరునాడుదయంబున కొందరు సేవకుల
బిలువనంపి యాఆలయమును పడగొట్టి సముద్రమునత్రోసిరండని వుత్తరవు
చేయువారుతత్క్షణమే ఆగుడినిపడగొట్టి సముద్రమునత్రోసి భూమియెత్తునకు
సరిగాచేసివచ్చిరి నాటిరాత్రి యానీలవర్ణుండు తనవాడుక ప్రకారముబోయి దే
వాలయము నెరుగజాలక దానిగుర్తులేమియు కనబడక పోవుటచే మిక్కిలిదుః

ఖమునకు నిగి ఇక నేసిట్టి లతాంగిని నెట్లు సంపాదింతుననియు కన్నీరు వెల్లువ
లై పార దుఃఖించి తుదకు నిరాసగలవాఁడై సౌరంభయొక్క ప్రక్కఁజేరి పరుం
డి యుండగా నప్పుడతని భార్య నాతని మంచి మాటలచే పొగడుచు
మోహాకృత్యములైన మాటలతో సరసములాడుచు నష్టైశ్వర్యము తనకు
లభించినట్లు వానితోఁగూడి సుఖభోగముల ననుభవించుచుండెను. ఇట్లుండ
నొక కాపువాఁడు ఆదేవాలయమును పడగొట్టిన చోటును వెలకుతీసి యందును
వ్వులనాటించి పంటపెట్టగా నానేలలో నొకటి పెకుపురంగుగా పెరిగియుండెను.
నంతనీలవర్ణుండా మనోరంజనిపై ప్రేమచే నాసముద్రము గట్టునకుబోయి యా
చోటును చూచుకొని కొంతదుఃఖము నాశ్చకొనుచు యాపంటయొక్క మనో
హరమును జూచి సంతోషించుచు మనోరంజనిపై తలంపుగలిగి నప్పుడెల్ల
నిట్లూర్పులిడుచు కొన్ని వేళలయందు మనసితాపంబునకు వృద్ధినొందిపువ్వు
బుట్టి కాయగాచి ముదిరిపక్వమై యుండుటను పంటకాపరియగు కాపుచూచి
దానింగోసి తెచ్చి గింజలు రాల్చి గానుగలో బెట్టి యాడి నూనెదించెను తదనం
తర మాకాపువాని భార్య యానువ్వులపిప్పిని కొంచెముగా నెత్తి భక్షించె
నంత దైవానుగ్రహముచే గర్భంబుధరించినదై తొమ్మిదినెలలుగడిపి పదియ
వమాసంబున మిక్కిలి సుందరమైన యాడబిడ్డను గనెను ఆబిడ్డయు నానాటవృ
ద్ధిబొంది జనులందరు కాపువానియింట పుట్టని సుందరమైన బిడ్డకలిగియు
న్నదనియు దానికాంతి సూర్యునిగూడ పరిహాసించుననియు దానియందంబు
నకు మన్మథరతీదేవులుకూడా సిడుగారననియు ఆకటకంబున ప్రసిద్ధముగ వాడు
కొనుచుండిరి. ఆమాటలు నీలవర్ణుండువిని కాపువానియింట ఇట్టిసుందరమైన
బిడ్డజనించుటకు ఆదేవాలయమున్న ప్రదేశమందు పైరుచేయబడిన నువ్వు
లుభక్షించినందువల్ల నిట్లుండ వచ్చునని తలంచి యాకాపువానితో గూడ
యాబిడ్డను యెత్తుకొని వచ్చునట్లు తనభటులకు త్తరువు చేయువారుపోయి
యాబిడ్డతో గూడ వానిని దెచ్చి నీలవర్ణుని సముఖమునకు విడిచిరి. అంత
నారాజపుత్రుండా బిడ్డను గనుగొని దానియందు తన ప్రాణనాయకి యగు
మనోరంజని రూపు రేఖవిలాసంబు లుండుటంగని సంతోషించి యా మనో
రంజనియే ఇట్లు వేరొక జన్మమునెత్తెనని నిశ్చయించుకొని యాకాపువానిం
జూచి ఓయీ నీకు కావలసినంత ధనంబిచ్చెద, యీబిడ్డను నతిజాగ్రతతో
బెంచుచుండుమని యుత్తరువుచేయ నా కాపువాఁడు నాటి దినము మొదలు
నాబిడ్డను నతిగారాబంబుతో బెంచుచుండ పంద్రెండు సంవత్సరంబులుగడచె,

తర్వాత షోడశకళా పరిపూర్ణుడగు శశాంకునివలె పరిపూర్ణ వయస్సు గలిగి యొక్క శుభలగ్నంబున రజస్వలయాయెను. నీలవర్ణుండదిగు రెరింగి యాకాపువానియింటి కొకదూతనంపి వానితో నాకన్యను తనకిచ్చి పెండ్లి చేయునట్లు చెప్పిరమ్మనిన వాడదివిని శీఘ్రముగబోయి యాకాపువానింజూచి రాజపుత్రుని యభిప్రాయంబు దెల్పెను అదివిని వాడు గడగడ వణకుచు మనస్సు తడబడ ఓహో మనరాజుగారి యల్లునికి మనకూతురనిచ్చి అల్లునిగా చేసికొనుట యెట్లుసాగునని చింతించుచుండ నాబిడ్డ యాకాపువానింజూచి నాయనా నేను మనోరంజనియను దేవకన్యను ఇంద్రుని శాపంబుచే పడరాని నిడుముల ననుభవించినీవంశంబునబుట్టితి యెంతమాత్రము సంకోచింపకుము నేనతనిభార్య నని చెప్పి యతనింబిలుచుకొనిపోయి తానుపాతిపుంచిన ద్రవ్యంబును యాకాపువానికిం జూపి నీ జీవితకాలంబు వరకు ననుభవించుమని చెప్పి తాను దేవతాస్త్రీలుగొలువ పుష్పకవిమానంబెక్కి సౌరంభపురంబు మేడకుంజని తనమనోకాంతునింజూచి దండప్రణామంబుచేసి పునర్వివాహంబాడి తననిజవృత్తాంతంబంతయు యాసౌరంభకుం జెప్పి యందుసుఖంబుండిరంత నీలవర్ణుండు తననిజదేశంబున కరుగదలంచి యత్తమామలచే ననుజ్ఞగైకొని చతురంగ బలంబులుంగొలువ ప్రయాణంబై నిజపురంబు జేరి తండ్రివద్దకువచ్చి సాష్టాంగ నమస్కారంబులుచేసి తన వృత్తాంతం బంతయు వినవక చెల్పి తనకు బులిపాలు చెప్పుటకు సాధ్యపడ లేదని విన్నవించెను. ఇట్లుండ కొంతకాలంబునకు తన తండ్రికి ముసలి తనము వచ్చినందున యాదేశంబునకు తానాధిపత్యంబు నొంది సత్యంబు దప్పక చిరకాలంబు రాజ్యంబుచేసి పిమ్మట దేవలోకంబు జేరెనని జెప్పిన మారుతాత్మజుండువిని సంతసించి స్వామీ నీ చిత్రకథవల్ల నామనంబు నానందంబునొందినది, పరమపావనంబగు గాయత్రి మహాత్మ్యంబు గంటిని, సర్వపాపంబులకు నిషేధుండనై కృతార్థుండనైతి, నేడు చాలప్రొద్దాయె, నిద్రింతముర మ్మని ప్రార్థించిన నాభగవంతుండు సంతసించి శయనస్థలంబున కరిగి యిరువురును సుఖనిద్రజెందిరి.

అష్టమరాత్రికథ - సమాప్తము.

ఓమ్.

శ్రీ సద్గురుపరబ్రహ్మణేనమః.

# న వ ను క థా ర త్న ము.

తొమ్మిదవ నాటిరాత్రి యా సీతారాములు భోజనమజ్జనాదులొనరించి తాంబూలంబు సేయుచుండు నవసరంబున ప్రియభక్తుండగు నంజనీపుత్రుండు శ్రీరాములంజూచి సాష్టాంగ దండప్రణామంబు లర్పించి భక్తజనరక్షకా నింకొక వేదరహస్యంబు బోధించి నన్ను కృతార్థునిగ జేయుడని ప్రార్థించిన పరిపూర్ణ కరుణాకటాక్ష వీక్షణుండై నాభగవంతుం డిట్లనియె.

## మ హా సే న మ హా రా జు క థ

ఆంజనేయా? ఈపృథివికి అలంకృతిసుగుణములచే నూర్చబడినయశేషరత్నములతో నిండినఉజ్జయినియను పురిగలదందు గుణప్రియుడు కరుణైకనిలయుడు సూర్యేందూభయరూపధరుడునగు మహాసేనుడను రాజు యేలుచుండెను. అతనికిముల్లోకములసాటిలేనిరూపవతియగుప్రాణప్రియయశోకవతియనుదేవియుండెను. ఆమెతోగూడ రాజ్యమేలుచున్న యామహాసేనునివద్ద గుణశర్మయను నొక బ్రాహ్మణుండగు మాన్యుడుండెను. అగడుశూరుడు, అతిసుందరుడు, వేదవిద్యాపారంగతుడు, యౌవనవంతుడు కళాశాస్త్రవిదుడునై ఆ రాజునెప్పుడు గొలుచుచుండును. ఒకనాడు అంతఃపురమందు నృత్యప్రస్తావమున రాజునురాణియు ప్రక్కనున్న గుణశర్మనుజూచి నీవుసర్వజ్ఞుడవు, గాన మాకుకుతూహలముగా నర్తింపనేర్చువేయుని దయచేసిమాకు నీకౌశలమును జూపుమనిరి. గుణశర్మనవ్వుచు నర్తింతునుగాని ఆనృత్యముసభకు పనికిరాదు, అది బహుశోకనవ్వు పుట్టించునట్టి మూఢనృత్యముగా శాస్త్రసందిగ్ధముగా నుండును. గాన రాజుయెదుటను రాణియెదుటను జరుపుటకు ఎంతలజ్జ అనెను. రాణికుతూహలముచే ప్రేమింపగా రాజుదీనిని రంగభూమియొక్క నృత్యముగాదు, అది పురుషునికి లజ్జాకరము గాని వేరుకాదు, ఇది ఏకాంతమందు మిత్రగోష్ఠిలో తననేర్పుచూపుటచే నేనునీకు రాజైనను నాకునీవుస్వతంత్రుడవు, నాచెలికాడవునీనృత్యకౌతుకముచూడక ఈదినము నేనుఅన్నముభుజింపనెను. ఇట్లురాజుపట్టుపట్టగా ఆబ్రాహ్మణుడుఅంగీకరించెను. ఇటువంటివాత్సల్యమైనదొరమాట సభృత్యులు నెట్లుమీరగలరు అంతట ఆపడుచువాడు గుణశర్మ అవయవములతో నాడినదెల్ల రసాభాసము చేత

రాజును రాణియు మనస్సులలో నక్లైఆడుచుండిరి, దానిచివరను రాజు గుణశర్మ చేతికివీణనిచ్చి వాయింపుమనెను. గుణశర్మ సారణనుమీటి రాజుతో దేవా ఈవీణపనికిరాదు, మరియొకటి తెప్పింపుము; దీనితంత్రిలో కుక్కవెంట్రుక యున్నది, తంత్రీఝంకారలక్షణములచేత దీనిని నేనెఱుగుదును. అనిపలికి ఆవీణను తొడమీదనుండి తొలగపెట్టెను. అంతట ఆరాజు ఆతంత్రినితడిపివిప్పి చూడగా దానికడుపునుండి కుక్కవెంట్రుక బయటవచ్చినది, అందులకాశ్చర్యపడుచు, అతని సర్వజ్ఞతను కొనియాడుచు రాజు మరియొకవీణను తెప్పించెను, విప్రుడును త్రిమార్గయు ఓఘశుభగయు కర్ణపావన నిస్వనయునైన గంగనుంబోలియావీణను వాయించుచు పాడెను తర్వాత ఆశ్చర్యమగ్నులైన రాజునకును రాణికిని అతడుపిమ్మటవరుసగా శస్త్రాస్త్రవిద్యాకౌశలమునుకూడ చూపెను. రాజు అతనిని బాహుయుద్ధమెఱుగుదువాయని చేత ఆయుధములేక ఒక బంధకరణమును చూపుమని యడిగెను. దేవా శస్త్రములుచేత బూనుము, నన్ను వరుసగా కొట్టుము చూపెదను బంధకరణము అని గుణశర్మ చెప్పెను. పిమ్మట రాజు ఏఖడ్గాద్యాయుధమును గైకొని ప్రహరించుచుండెనో వానినెల్ల బంధకరణంబుచే నపహరించి యుపహరించి గుణశర్మ తాను గాయపడక రాజుయొక్క చేతినిన్ని దేహమున్ను కట్టివేసెను. అంతవాడు సర్వాతిశాయియైన యాద్విజోత్తముని తనకు రాజ్యనిర్వాహకమందు తోడ్పడగలవానినిగాదలంచి స్తుతించి బహుమానించెను. రాణియగు నశోకవతి అతని యసదృశరూపమును అతనిగుణములను చూచి అతనిపై మనసులుకొని ఇతనినిపొందకున్న నాజీవితమున కేమిఫలము అని యాలోచించి యుక్తిచేసి రాజుతో నిట్లనియె. ఆర్యపుత్రా దయచేసి గుణశర్మను నాకు వీణనేర్పుమని యాజ్ఞాపింపుము ఇతని ఈవీణాగానకౌశలమును చూడగా నాకును ఆకళయందు ప్రాణాధిక ప్రియమైన కుతూహలము పొడముచున్నదియని ప్రార్థించిన విని రాజుగుణశర్మను తప్పకుండ దేవికివీణాగానము నేర్పుదువని నియమించెను. తను యాజ్ఞ ప్రకారము మంచిదినము చూచుకొని ఆరంభించెదనని గుణశర్మ సెలవుపుచ్చుకొని ఇంటికిపోయెను. రాణియొక్క చూపు వేరువిధముగానుండుటంగని వికడగునని శంకించి యాగుణశర్మ అనేకదినములు వీణారంభము చేయక యే కాలయాపన చేయుచుండెను. ఒకనాడు మహాసేన రాజు భోజనము చేయుచుండగా చెంతనుండి గుణశర్మ కూర వడ్డించుచున్న వంటవానిని వలదు వలదని నివారించెను. ఏమని రాజడుగగా దేవా ఈకూరలో విషమున్నది, లక్షణముల చేత నాకు తెలిసినది, వీడు దీనినివడ్డించునపుడు భయముచే వణకుచునాము

ఖము దిక్కునసే చూచినాడు, ఎవరికైన దీనిని పెట్టినయెడల ఇప్పుడే ఈవిషయము బయటపడును, నేను ఆవిషదోషమును పోగొట్టెదనని చెప్పెను. అంతటరాజు ఆవంటవానిచేతనే యాకూరనుతినిపించెను. వాడువెంటనేమూర్ఛతుడాయెను. గుణశర్మ మంత్రములచే వానిని విషమును పోగొట్టగా రాజు అతనింగూర్చి దీనియందు విషంబు చేరుటకు కారణంబేమనియడుగ నాసూపకారుడు ఉన్నదున్నట్లు ఇట్లుచెప్పెను. దేవానన్ను గౌడరాజగు మీవైరి మీకు విషముపెట్టుమని ఇచటికి బంపినాడు, నేను పరదేశిని వంటనేర్పరినై నన్ను ఏలినవారికి తెలుపుకొని బానసమ్మున కొలువుంటిని, ఇపుడు కూరలో విషము పొదిగితనకు పెట్టుచుండగా ఈమహాత్ముండు కనిపెట్టినాడు, పైసంగతి తమకే విశదము, ఇట్లుపలికిన సూదుని దండించి రాజు ప్రాణదాతయైన గుణశర్మకు ప్రీతితో వేయి గ్రామాదుల నిచ్చెను. మరునాడు మరల రాణి నిర్బంధముచేయగా రాజు గుణశర్మచే వీణాగానశిక్షను ఆరంభించెను. గుణశర్మ వీణనేర్పుచుండగా నశోకవతి సదావిలాస హాసాదులు కావించుచుండెను. ఒకనాడు ఆమె మదనాతురయై ఏకాంతమున అతనిని మాటిమాటికి గోరులతో బొడుచుచు వాయించుచున్న యాధీరునితో చెలువుడా వీణాగానమిషచేత సుందరుడని నిన్ను నేను కవయగోరితి, నీపైపట్టరాని మోహమున బడలుచున్న దాననన్నుస్వీకరింపుము అనివేడుకొనెను, ఇట్లు చెప్పకుమని నాకు నీవుప్రభువుభార్యవు నాబోటివాడు ప్రభువుద్రోహము నేయడు ఈసాహసము మానుము, అని గుణశర్మ బలికెను. ఓరి నీరసుడా ఈనీరూపము కళావైదగ్ధ్యము నిష్ఫలములేగదా, అనురక్తయైనట్టి నన్ను ఉపేక్షించుచున్నావు, అని రాణిపలికెను. గుణశర్మ చక్కగా జెప్పితివి, పరదారాపహరణముచే అపకీర్తిమలీనములై ఇహపరముల నరకపాతమును కలిగించునో ఆరూపవైదగ్ధ్యములకు ఏమిఫలము అని యుపహసించెను. అంతటరాణి అలిగినదియుంబోలె, నామాటఆలకించవేని నాకునీకుచావు నిక్కముకనుక అవమానితనైన నేనుముందు నిన్నుచంపించి పిమ్మట నేనేచచ్చెదను అనెను. భళి అట్లే అగును గాక ధర్మబద్ధమైన జీవితము క్షణకాలమైనను మేలు. అధర్మముతోటి కల్పకోటిశతములైనను మేలుగావు పాపముచేసి రాజదండన నొందుటకన్న పాపముచేయక శ్లాఘ్యుడనైన నామరణము మేలు, అని గుణశర్మ వాక్రుచ్చెను. దానినివినియు రాణి చెలువుడా నీకును నాకును ద్రోహము లేకచింతతో చెప్పెద వినుము, రాజునామాటను అశక్యమైనను దాటనేరడు, అతనితో జెప్పి నీకు నేశము లిప్పించెదను. సామంతులనందరిని నీకు ననుచరులుగా చేయించె

దను. అట్లు గుణోజ్జ్వలుడవైన నీవే రాజగుదువు. అంతట నీకేమి భయము లేదు. ఎవడు నిన్నెట్లు అవమానింపగలడు, గనుక నన్ను రక్షిసల్పుడు, ఇటు చేయనియెడ యికను దవని హెచ్చరించెను. ఆరాజాంగన వదలక ఇట్లు నిర్బంధించుటగని ఆసమయమునకు తప్పించుకొనువాడై గుణశర్మ యుక్తిగా దేవీ నినిర్బంధము నీమాట నెరవేర్చెదను, అయినను రహస్యము బయటపడునని భయమగుచున్నది, కనుక అవసరపడరాదు, కొద్ది దినములు ఓర్పుడు నామాటను నమ్ముము, సర్వనాశము చేయునదియైన నీవిరోధము నాకేల యని ఆమెను ఆశగొల్పి ఒప్పించి అచటనుండి వెలువడి ఊఅడిల్లి ఇంటికిబోయెను. పిమ్మట మహాసేనమహారాజు సోమకేశ్వరుని కోటను ముట్టడించెను. గౌడనాథుని విక్రమశక్తి వచ్చి మహాసేనుని ముట్టడించెను. అంత మహాసేనుడు గుణశర్మతో ఒకనిని ముట్టడించియున్న మనము మరియొకనిచే ముట్టడినొందితిమి, ఇప్పుడు ఇద్దరితో పోరమనమెట్లు చాలుదుము, యుద్ధము చేయక ముట్టడిలో ఎంతకాలముందుము, సంకటము వచ్చినది, ఏమియుపాయము అని యడుగగా దేవా! ఉపాయము చెప్పెదను ధైర్యముగా నుండుము, ఆ యుపాయమున ఈ సంకటము తప్పించుకొనుటయేగాక కార్యమును కూడ సాధించెదము, అని ఉత్సాహపరచి గుణశర్మ కన్నులకు అంతర్ధానాంజనము పెట్టుకొని విక్రమశక్తిని లేపి రాజా వినుము నేను దేవదూతను, ఈరాత్రి మహాసేన మహారాజుతో సంధిజేసుకొని వెడలిపొమ్ము అట్లు చేయవేని నీకు సైన్యములతో గూడ నిశ్చయముగా నాశనము గలుగును. నీవు సంధికై అతనికడకు దూతను పంపిన అతడు అంగీకరించును అని నీకు తెలుపుమని విష్ణుదేవుడు నన్ను బంపినాడు, నీవు భక్తుడవు ఆయన భక్తుల యోగక్షేమమును చూచుకొను వాడుగదా; అని చెప్పెను. దానిని విని విక్రమశక్తి నిశ్చయముగా ఇది సత్యము; కాదేని ఇచటికి ఎవడు రాగలడు, ఇది మనుష్యోచితమయిన యాకృతిగాదు, అని యాలోచించుకొని గుణశర్మతో ధన్యుడనైతిని, దేవుడు నాకు సందేశము పంపునంత పుణ్యము నాకు గల్గినది, దేవుని యాజ్ఞప్రకారము చేసెదను అనెను. అంతట గుణశర్మ రాజునకు నమ్మిక గలిగించువాడై అంతర్ధానాంజనప్రభావముచేత అంతర్హితుడై వెడలిపోయెను. తర్వాత తాను చేసినది మహాసేనునికి తెలియబరచెను, ప్రాణరాజ్యప్రదుడైన ఆగుణశర్మను కంఠాలింగనంబు జేసుకొని మహాసేనుడు సంతోషించెను. అట్లు విక్రమశక్తియు నానాడు దూతముఖముగా మహాసేనునితో సంధిజేసుకొని దండుతో తరలిపోయెను. ఇట్లు మహాసేనుడు గుణశర్మప్రభావముచే సోమకుని గెల్చి ఏనుగులను గుఱ్ఱములను గైకొని యుజ్జయినిపోయెను. అచట నదిస్నాన

మందు మొసలినుండియు ఉపవనవిహారమందు పాముకాటువిషము నుండియు గుణశర్మ రాజునురక్షించెను. కొన్నిదినములకుతరువాతఆరాజు బలయుక్తుడై తనవైరియైనవిక్రమశక్తిమీఁదికి దాడివెడలెను. అతఁడుఇతనితో పోరుటకై తన నగరు వెలువడివచ్చెను ఉభయులకును ఘోరసంగ్రామము ప్రారంభ మాయెను. రాజులిద్దరు సక్రమముగా ద్వంద్వయుద్ధమారంభించి విరథీకృతులై ఒండాలులను కత్తిదీసుకొని పైకొనుచుండగా ఆతొట్రుపాటుచే మహాసేనుండు నేలపడెను పడినయతనికత్తిచే పొడుచుచున్న విక్రమశక్తిభుజమును గుణశర్మ చక్రాయుధముతో ఖండించి పరిఘముతో వక్షమునగొట్టినవానిని నేలంగూల్చెను. మహాసేనరాజులేచి సంతోషించి ఏమి చెప్పుదును మహావీరుడా ఈప్రాణములు నీవిపుడు ఐదవమారు నాకిచ్చినవి అనిగుణశర్మను మాటిమాటికి పొగడుచుండెను. ఇట్లుగుణశర్మచే నిహతుఁడైన విక్రమశక్తియొక్క సైన్యమును రాష్ట్రమును మహాసేనుఁడు ఆక్రమించెను. గుణశర్మయొక్క తోడ్పాటుచే ఇతరరాజులను కూడజయించి ఉజ్జయినికివచ్చి సుఖముండెను.

అశోకవతియు గుణశర్మకై ఉవ్విళ్లూరుచుండి వచ్చినపిమ్మట నతనిని రేయుంబగలు ప్రార్థించుచుండెనుగాని తనకార్యమునకు అతండెట్లును ఒప్పడాయెను. సజ్జనులు దేహమునైన వదలుదురుగాని అవినయ మాచరింపరు అశోకవతి వానినిశ్చయమెరిగి కపటదుఃఖమును నటించుచు ఏడ్పుముఖముగా నుండెను మహాసేనుఁడువచ్చి ఆరీతినున్న యామెనుజూచి ప్రియురాలఏమిఇది ఎవడునీకుకోపము గలిగించెను చెప్పుము వానిధనమును ప్రాణమును యిప్పుడే హరించెదను అనిపలుకగా ఎట్టకేలకు రాణినాకు అపకారము చేసిన వానిని నీవు దండింప శక్తుడవుగావు అతడు నీకు లొంగువాఁడుకాఁడు కనుక నాదుఃఖమును వృథాగాబయలుపుచ్చనేల యనెను. రాజునిర్బంధింపగా యారాణి ఇట్లు అబద్ధములు పలికెను ఆర్యపుత్రా అతినిర్బంధము చేసెదవు చెప్పెదను వినుము గౌడేశ్వరునివలన ధనముగోరి యాగుణశర్మ నిన్ను జంపుటకు నతనితో ఒడంబడువాఁడై తనకు ధనముపంపుమని రహస్యముగా అతనియొద్దకు దూతను పంపెను. అచట ఆదూతనుజూచి రాజునకాప్తుడైన ఒకవంటవాఁడు దేవా ఈకార్యము నేను సాధించెదను ధననాశనము ఏలచేసెదవు అనిచెప్పి గుణశర్మ దూతను ఖైదుచేయించి మంత్రము బయలు పడకుండ ఇచటికివిషము ప్రయోగించుటకువచ్చెను యీలోపల గుణశర్మదూతఖైదునుండి తప్పించుకొని పరారియైవచ్చి గుణశర్మకు యావృత్తాంతమును తెలిపి మనవంటవాని వీనినిచూపించెను ఆరీతినిఆవంటవాని విషప్రయోగము నెరింగి

నీకుచెప్పిన బ్రాహ్మణాధముడైన యీగుణశర్మ వానినిచంపించెను. ఈదినము ఆకపటుని తల్లియు భార్యయు తమ్ముఁడును వానిని వెదుకుకొని రాఁగా బుద్ధిమంతుఁడైన గుణశర్మకనిపెట్టి అతని తల్లినిన్ని భార్యనున్ను చంపివేసినాను తమ్ముఁడు పలాయితుఁడై దైవవశమున నానగరుజొచ్చి నన్ను శరణందిఈ వృత్తాంతమంతయు చెప్పుచుండగా గుణశర్మ నా పడక యిల్లుచేరెను. అతనినిచూచియు పేరువినియు ఆసూదభ్రాత భయముచే పలాయితుఁడాయెను. గానయెచ్చటికిపోయెనో తెలియదాయెను.తనభృత్యులుముందుచూపగావానినిగుణశర్మచూచి నివ్వెరబోయి యేమో ఆలోచించువానివలె కొంతసేపుండెను గుణశర్మ యేమియీదినము వేరువిధముగానున్నావు అనినేను జిజ్ఞాసచే ఏకాంతముననడిగితిని అంతట అతడునన్నుగవయగోరి బయలుపడునను భయముతో నాతో దేవీ నీపైవలపును నగ్నిచే నేను కాలిపోయితిని నన్ను అనుగ్రహింపుము అట్లుకాదేని నేను బ్రతుకను నాకు ప్రాణదానము చేయుము అని యీహాస్యవాచకముందునాపాదములపై బ్రాలెను. నేనుపాదములులాగుకొని తొట్రుపడుచు లేచునంతలో వాడునులేచి నన్నుబలాత్కారముగ కౌగలించెను ఆక్షణమందు నాచేడియయను పల్లవికవచ్చి దానినింజూచినందునగుణశర్మపారిపోయెను. పల్లవికఆక్షణమందురాదేని ఆక్రూరాత్ముఁడునిశ్చయముగా నన్నుచెరిపియేయుండును ఇట్లునాకుసంభవించినది అనికల్పించిచెప్పి ముగించి ఆరాణియేడ్చుచుండెను. ముందు అసత్యభాషణము పిమ్మట చెడిపెనుగదా యనిపుట్టినవారు దానినివిని రాజుకోపము చేముంచిపడెను స్త్రీలమాటయందలి నమ్మకము మహాత్ములకును ఆలోచన పోగొట్టునని రాజుతన కాంతతోనిట్లనియె ప్రాణనాయకీ చింతిల్లకుము ఆద్రోహికి నిశ్చయముగా మరణ దండన విధించెదనుకాని వానిని యుక్తిచేత చంపవలెను లేనిచో అపకీర్తికలుగును. వాడు నాకయిదుమారులు ప్రాణమిచ్చుటప్రఖ్యాతముగదా నిన్నుపైగొనిన విషయము లోకములో జెప్పదగినదికాదు ప్రాణేశ్వరా అట్లైన ఈదోషము చెప్పరాదేని నిన్నుచంపుటకు గౌడరాజుతో వీడుచేసిన యొడంబడిక నుప్రకటింపగూడదా అనిరాణియడిగెను సరే అట్లు చేయవచ్చునని పలికి రాజు ఆస్థానమునకు బోయెను. రాజదర్శనమునకు రాజులును రాజపుత్రులునుమంత్రులును సామంతులును అందరు యేకమై గుణశర్మ వివాహమునకువచ్చుచుండగా దారిలో పెక్కు దుర్నిమిత్తములాయెను కాకి ఎడమకుబోయెను. కుక్క ఎడమనుండి కుడికి పోయెను. కుడినుండి పాము ఎడమకు బోయెను.

శాపాలున్న భుజశిరముతో గూడ అదరెను. ఈయునిమిత్తములు నిశ్చయముగా నాకశుభమును జూపించుచున్నవి ఏమైనను నాకగునుగాక నాదొరయైనరాజునకుబుద్ధి చెడునుకలుగకుండునుగాక దివాణములో విరుద్ధమేమియునుకలుగకుండునుగాకయని యిట్లుతలపోయుచు గుణశర్మ రాజస్థానానికి వచ్చెను. తర్వాత ప్రణమిల్లి కూర్చున్న యాతనిని రాజు మునుపటివలె గౌరవింపక క్రోధకషాయవీక్షణములు క్రూరచూపులు చూచుచుండెను. ఏమియిది గుణశర్మ శంకించుచుండగా రాజు సింహాసనమునుండి లేచి అతనిమీదికి దుమికి మెడమీదగూర్చుండెను తర్వాత ఆశ్చర్యమగ్నులైన సభ్యులతో రాజు నాకును గుణశర్మకును గలన్యాయమును వినుడని చెప్పనారంభించెను. గుణశర్మ విన్నవించెను నేను నౌకరను మీరు ప్రభువులరు మనకు సమానులకుం బోలె వ్యవహార మెట్లు ఘటించును సింహాసనమందు కూర్చుండుము పిమ్మట ఇచ్చవచ్చినది ఆనతిత్తువుగాక ఇట్లు ధీరుడు గుణశర్మ పలుకగా మంత్రులు బోధింపగా రాజు మరల ఆసనగతుడైన సభ్యులతో నిట్లనియె, మీరలు ఎరుగుదురుగదా, క్రమాగతులైన మంత్రులను అతిక్రమించి ఈగుణశర్మను నాతో సమానముగా చేసితిని వినుడు, పీనదూతలను బంపి నాశత్రువునితో నొడంబడి నన్ను చెరగట్టుటకు యత్నించినాడు, ఇట్లని రాజు తాను రాణివలన విన్నకల్ప నాకథ నెల్లవారికి తెల్పినాడు, తన్ను చెరవనవచ్చినాడని యామె చెప్పినదానిని జనులను బయటికిపొమ్మని అప్పులకు తెలియ జేసినాడు, దేవా యిది ఎల్లనా వ్రాతనా నీ కెవరు చెప్పినారు, ఆకాశములో ప్రతిమలు ఎవరు వ్రాసినారు అని గుణశర్మ పలికెను పాపాత్ముడా యిది నిజముగాదని కూరతిపెలలోనున్న విషముసీకెట్లు తెలిసినదని యని రాజు అడిగెను.

## గుణశర్మ మహాసేనునికి ఈశ్వర ప్రణిధానము దెల్పుట.

దేవా! విషము యాసమాచారంబుగనుట యెంతమాత్రంబు దానికొరక యుపాయంబు దెల్పుదునన నిజంబు పట్టుకుండెనేని యాజ్ఞానుసారంబుగ మెలంగెదనని యిట్లనియె —

సీ॥ కరణంబులన్నిలోప కరణంబులునుగాగ ప్రాణంబు లుపచార భటులు
గాగ। గంగా ప్రముఖనాడి కలుబలంబులు గాగ షట్కమలమ్ము పుష్పము
లుగాగ। జఠరాగ్ని హోత్రముల్ జ్వాలధూపములుగాగ బటుజీవకళలు దీపం
బుగాగ। నందితానందంబు నైవేద్యములుగాగ రవిశశి జ్యోతులారతులు
గాగ।నంగదేవాలయమున సహస్రకమల।పీఠమున శాంతజనకజోపేతుడగుచు।
వెలుగుపరమాత్మ రాముసర్చించుచుంట। తత్వవిధులీశ్వర ప్రణిధానమంత్రము॥

తా॥ జ్ఞానేంద్రియంబులును కర్మేంద్రియంబులును అంతరింద్రియంబులను పూజాపాత్రములుగాను, దశవిధ ప్రాణములు పరివారములుగాను, గంగాయమునా సరస్వత్యాది నామములుగల యిడపింగళ సుషుమ్న మొదలగు నాడులు అభిషేకార్థ జలములుగాను, ఆధారాదిషట్కమలములు పుష్పములుగాను, జఠరాగ్ని ధూపములుగాను, చిత్కళలు దీపములుగాను, బ్రహ్మానందము నైవేద్యములుగాను, సూర్యచంద్రమండలజ్యోతు లారతులుగాను, శరీరమనెడి దేవాలయమందలి సహస్రారకమలమనెడి సింహాసనమున శాంతియను సీతతోఁగూడిన పరబ్రహ్మమగు శ్రీరాముని నెల్లప్పుడు పూజించి నిజంబుగాంచిన వారలు ప్రాజ్ఞులనబడెదరు. యీ విషయంబంతయు ప్రజ్ఞచే గ్రహించితినిగాని మఱిం చెంతమాత్రంబులేదు యని గుణశర్మ చెప్పగా అది యసాధ్యమని గుణశర్మకు ద్వేషులైన మంత్రులు పలికిరి. దేవా నిజమును విచారించక యిట్లుపలుకుట యుచితంబుగాదు ప్రభువట విచారహీనుడట దీనిని నీతిజ్ఞులు నిందింతురు. అని మరలగుణశర్మ పలుకగా ఓరిదుష్టుడా అని పిలుచుచు వానిని రాజు సూరకత్తిచే పొడిచెను. ఆపోటును కరణప్రయోగముచేత అతడు తప్పించుకోగా రాజానుచరులు యితరులును వానిని కత్తులతోఁ గొట్టిరి. అతడును కరణములచేత ఆ క్రూర బాణములదప్పించుకొని వారినందరిన్ని వకరిజుట్టు ఒకరికి తెలియక ముళ్లు వేసి ఆ రాజసభనుండి వెడలిపోయెను. తర్వాత వెంటదరిమిన యోధులను నూర్గురునిమడియించెను వస్త్రమందుముడుచుకొనియున్న యీ యదృశ్యాంజనమును నేత్రములబెట్టుకొని అదృశ్యుడై తక్షణకి ఆదేశమువదలిపోయెను, దక్షిణదిశకుబోవుచు దారిలో పైవర్తమానముల నిట్లు తలపోసె. నిజముగా ఆయశోకవతి యీనామాధముని ప్రేరేపించినదీరక్త మాంసితలైన స్త్రీలవిషమునకన్న వీరలు క్రూరులుసుమా! ఆహా నిజముచూడని రాజులు సాధుసేవ్యులుగాదుగదా! ఇట్లు తలపోయుచుపోయి గుణశర్మ వకగ్రామమున మఱ్ఱిచెట్టుక్రింద శిష్యులకు అధ్యయనము చెప్పుచున్న యొక బ్రాహ్మణునిగాంచి నమస్కరించెను ఆ బ్రాహ్మణుడును ఇతనికి అతిథి సత్కారము జేసి ఓ బ్రాహ్మణా నీవు ఏశాఖ గలవాడవని చెప్పుమనెను ఓ విప్రోత్తమా నేను పంద్రెండు శాఖలు చెప్పగలను సామవేదములు రెండు ఋగ్వేదములు రెండు యజుస్సువియేళ్లు అధ్వరణము ఒకటి అనిగుణశర్మ చెప్పెను. అట్లయిన నీవుదేవుడవు అని ఆ బ్రాహ్మణుడు ఆకారముచేత నేకధతిప్రభావుడైన గుణశర్మను వినయము దోపనడిగెను నీజన్మముచే నలంకరింపబడిన దేశమును వంశమును యేది యింతనీ వెట్లు చదివితివి యనియడుగ గుణశర్మ చెప్పుచున్నాడు ఉజ్జ

యునీపురమందు ఆదిత్యశర్మయను యొక బ్రాహ్మణకుమారుడుండెను బాల్యమందే వానితండ్రి మృతినొందెను తల్లిసహగమనము చేసెను అంతనా బాలుడు అత్తమామండే మామయింట పెరుగుచు వేదములును విద్యలను కళలను నేర్చుచుండెను. విద్యాగ్రహణము ముగిసినంతట ఇతనికి ఒకపరివ్రాజకునితో సౌఖ్యము సంభవించినది ఆదిత్యశర్మతో గూడిపోయి పరివ్రాజకుడు శ్మశానములో యక్షిణీ సిద్ధికొరకు హోమము చేసెను అందుండి బంగారువిమానమున పరకన్యాపరివృతయై స్వలంకృతయై యొకదివ్యకన్య యావిర్భవించి మధురవాక్యతో ఓసన్యాసీ నేను యక్షిణిని నాపేరు విద్యున్మాల ఈయితరులు యక్షిణులు ఈనా పరివారమునుండి ఒకతెను నీకిష్టమైనదానిని పుచ్చుకొమ్ము ఈనిమంత్ర సాధనముచే నీకుయింతే సిద్ధించినది నామంత్రసాధనమును పూర్ణముగా నెరుగవైతివి అందుచే నేనునీకు సిద్ధింపనైతి వృధాగా క్లేశపడకుమని దెలిపెను యక్షిణియిట్లు చెప్పగా సన్యాసివొప్పుకొని తత్పరివారమునుండి ఒక యక్షిణిని స్వీకరించెను విద్యున్మాల యంతర్ధానమాయెను పరివ్రాజకునికిసిద్ధించిన యక్షిణిని ఆదిత్యశర్మ విద్యున్మాలకంటె ఉత్తమురాలు యక్షిణికలదా అనియడిగెను సుందరుడా కలదు విద్యున్మాలయు చంద్రరేఖయు మాండవవిభాగులోచనయు యక్షిణులలో ఉత్తములు వీరిలోన సులోచన ఉత్కృష్టురాలు అనిచెప్పి ఆయక్షిణి యంతర్ధానమై రూపులేక అచ్చటికి పోయెను సన్యాసి ఆదిత్యశర్మతో గూడి వానియింటికిపోయెను. అచటదినదినమును ప్రీతియైన యాయక్షిణీ కాలమునకువచ్చి యాపరివ్రాజకునికి ఇష్టభోగముల నిచ్చుచుండెను ఆదిత్యశర్మ పరివ్రాజకముఖముగా ఆ సులోచనామంత్ర విధిని ఎవరెరుగుదురని ప్రశ్నవేసెను యక్షిణియు పరివ్రాజకముఖముగా ఇతనికిట్లు దెలిపెను దక్షిణదిక్కునందు తుంబవనమను స్థానము కలదు, అందు వేణీసరస్సునందు విష్ణుగుప్తుడను పరివ్రాజకుడు భదంతశ్రేష్ఠుడునివసించుచున్నాడు, అతడు ఆమంత్రమును సవిస్తరముగా నెరుంగునని దెలుప ఈరహస్యము తెలిసికొని ఉద్యుక్తుడై ఆదిత్యశర్మ చెలికాడైన పరివ్రాజకుడు ప్రీతితో గూడి రాగా ఆ దేశమునకు బోయెను. తర్వాత వెదకి వెదకి ఆభదంతుని కనిపెట్టి అతనికి మూడుసంవత్సరములు భక్తితో పరిచర్యచేసెను. పరివ్రాజకునికిసిద్ధించిన యా యక్షిణీ తెచ్చిన యమానుష భోగములను భదంతుండు ఆదిత్య శర్మకు ప్రార్థితమైన సులోచనా మంత్రమును విధానపూర్వకముగా నుపదేశించెను. ఆదిత్యశర్మ ఆమంత్రమునుపొంది పునశ్చరణసమాప్తి నొందించి ఏకాంతమున యథావిధిగా సంపూర్ణముగా హోమము

చేసెను. అంతవిమానస్థురాలై యా యక్షిణి సులోచనా జగదాశ్చర్య కారిణియగు రూపముతో ప్రత్యక్షమై ఆవిర్భవించి ఇతనిని రారమ్ము నీకునేను సిద్ధించితిని కాని నావలన మహావీరుడు బుద్ధిపాత్రము సర్వజ్ఞకల్పుడు అపరాజితుడగు తనయుండు జనింపఁగోరుదు వేని ఆరు మాసములు నా కన్యాత్వమును పోగొట్టకుము అని యనెను. ఇతడును అంగీకరింపగా ఇతనిని విమానమున అలంకాపురికి కొనిపోయెను. అచట నాదిత్యశర్మ అమెను సదా చూచుచు ఆరుమాసములు అసిధారావ్రతమును అనుసరించెను. అందులకు తుష్టుడు కుబేరుడు స్వయముగా దివ్యవిమానముతో సులోచనను యతనికిచ్చెను. ఆబ్రాహ్మణునికిని యా సులోచనయందు గలిగిన కుమారుడను నేను, మంచిగుణములనుబట్టి నాకుమా తండ్రి యే గుణశర్మ యని పేరు పెట్టినాడు, నేను క్రమముగా నచట నే యక్షాధిపతియైన మణిభద్రునివలన వేదములను విద్యలను కళలను నేర్చితిని, ఒకనాడు పలకో ఇంద్రుడు కుబేరుని యొద్దకువచ్చెను అతని చూచుచునే అచటివారలెల్ల లేచినిలిచిరి, నాతండ్రి ఆదిత్యశర్మ ఆ సమయమున దైవవశమున పరధ్యానముగానుండి తొట్రుపాటుచే లేవడాయెను. అంతట ఇంద్రుండు కోపించి అతనిని భీమార్హుడా మనుష్యలోకమున కేగుమ్ము నీవిచటికి తగవు అనిశపించెను. సులోచన ప్రణమిల్లి ప్రార్థింపగా నట్లైన ఇతడు స్వయముగా మర్త్యలోకమునకు పోవలదు యితని పుత్రుడు పోవునుగాక యని శపించినప్పుడు తన పుత్రుడు ఆత్మ యగదాయని చెప్పుచు నా పలుకు వ్యర్థము కాకుండుగాక అని పలికి ఇంద్రుండు సంతుష్టుడాయెను అంతట నాతండ్రి నన్ను కొనివచ్చి ఈ యునియందు తన మేనమామ ఇంటవిడిచెను. రావలసినది ఎవడు తప్పించుకొనగలడు. దైవయోగమున అచట రాజుతో నాకు సఖ్యము కలిగినది, పిమ్మట జరిగిన దానినెల్ల చెప్పెదను వినుము. అనిపలికి గుణశర్మ అమూలముగా నశోకవతి చేసిన దానిని రాజుచేసిన చేతనమును యుద్ధమును కూడ వర్ణించి చెప్పి మరియు నిట్లనెను.

బ్రాహ్మణా ఇట్లు నేను సంచారియై దేశాంతరముపోవుచు దారిలో నిన్ను చూచితిని యనిన ఆబ్రాహ్మణుడు ఇవియెల్ల విని గుణశర్మతో ఓ ప్రభూ నేను ధన్యుడను నాయింటికి రమ్ము నా పేరు అగ్నిదత్తుడు ఈగ్రామమున నాయగ్రహారమున్నది అందు సుఖముండుమని పలికి అతనిని సర్వసమృద్ధితో తన్ను వైభవించి ఆతిథ్యోపచారములు చేసి తన యింటికి గొనిపోయెను. అచట అగ్నిదత్తుడు అయతిథిని స్నానాంగరాగములతోను వస్త్రాభరణములతోను వివిధ భోజనములతోను సత్కరించెను. దేవతలు కూడ కామింపదగిన రూపవతి

యగు తన సుందరికన్యను లక్షణములు చూపించెదు మిషచేత అగ్నిదత్తుడు
గుణశర్మకు చూపించెను. ఆకన్యసమరూపమైన యాకన్యనుచూచి గుణశర్మ
అగ్నిదత్తునితో ఈమెకుసవతులుండురు, నాసికయందు ఈమెకుమచ్చయున్నది.
దానినిబట్టి చెప్పితిని, వక్షమున రెండవమచ్చ యున్నది, దానిఫల మిదియని
దాచకచెప్పెను. అంతటఆమెయున్నతండ్రి యానతిని ఆమెవక్షంబును పైట
యెత్తిచూడగా మచ్చ అగపడెను. అంతట అగ్నిదత్తుడు ఆశ్చర్యపడి గుణశ
ర్మతో అయ్యానీవుసర్వజ్ఞుడవు, ఈమెయొక్క తిలకములు అశుభములుగావు,
సాధారణముగా లోకములో భర్త శ్రీమంతుడైన సవతు లనేకమంది వుం
దురు. దరిద్రుడు ఒకదానినే పోషింపలేడు, పెక్కండ్రు నెట్లుపోషించును
అనెను. గుణశర్మఆమాటవినిఇట్లుబదులు చెప్పెను. ఔనయ్యానీవుచెప్పినది.
పరియే సులక్షణమైన ఈయాకృతికి అశుభమెక్కడిది, ఆప్రసంగమున అగ్ని
దత్తుడడుగగా గుణశర్మ ప్రతిఅవయమందును తిలకాదుల ఫలమును స్త్రీపు
రుషులకు వేరువేరుగా వర్ణించెను. సుందరిగుణశర్మను చూచినమాత్రమున
ఉత్సుకురాలై చకోర చంద్రుసంబోలె గాన నేత్రానందమైనది. అంతట
అగ్నిదత్తుడు ఏకాంతమున గుణశర్మతో మహానుభావా ఈకన్యక సుందరి
నినీకిచ్చెదను, విదేశమునకు పోకుము నాయింటసుఖముగా నుండుమనెను
సత్యము ఇట్లుచేసిన నాకేమి సౌఖ్యము తక్కువ? అయినను మిథ్యారాజావ
మానాగ్ని తప్తునకైన అదిప్రీతికరము కాదు కాంతాచంద్రోదయముపీడా
చమన్వరము అనునివి సుఖితులను ఆనందపెట్టునవి దుఃఖితులను వెతలబె
ట్టునుగాన వెలిపచ్చ చేనసురక్తమైనభార్యను వ్యయపరచరు అస్వతంత్రమై
తండ్రిఇచ్చినది అశోకవతివలె వ్యభిచారిణియగును ఉజ్జయినీనగరము ఈ
గ్రామమునకు సమీపమాపమీ? రాజరిగనేని నాకొకవేళ యుపద్రవముచే
యును. కావునతీర్థభ్రమణముచేసి ఆజన్మసంచిత కల్మషమును కడిగించి ఈదే
హమునువదలిసుఖితుడనయ్యెదనని గుణశర్మపలికెనుఆప్రతివచనమునకుఅగ్ని
దత్తుడనియె నీకును ఇట్టియజ్ఞానముండగా యితరులకుమాట చెప్పవలయునా శు
ద్ధహృదయుడవైననీకు తెలివిలేనివానివలన యవమానమునకుదుఃఖమున్నా
యుమా ఆకాశమున మెరిగించినవస్తువ దానినెత్తిమీదనేపడునుగాన ఆజా
త్యరిలోనేవి శేషమెరుగ నందులఫలమునుబొందును మోహాంధుడు [illegible] నకి
యునగువానిని చిరకాలము సిరిసేవింపదు అశోకవతినిచూచి స్త్రీలయందె
ల్లవైరాగ్యము పూనితివేని పతివ్రతలనుచూచి వారియందు శ్రద్ధవేలపూన
వుగాన లక్షణంబులు నెరుగుదువుగ దాఉజ్జయినీసమీపమందున్న [illegible]

యిచటనున్న నిన్నెవ్వరును మోసగకుండునట్లు చేసెదను తీర్థయాత్రనఖిల ప్రింతుపేనిఅతియథావిధిపై దికకర్మ సంపత్తియెవనికిలేదో వానికిచెప్పబడినది దేవపిత్రాగ్ని క్రియావ్రత జపాదులవలన గృహమందునివ్సన్న మగువున్యా మార్గభ్రిమణమును ఎట్లుకలుగును. భుజముతలగడవాడునేలబరుండువాడు భిక్షాశనుడు ధనహీనుడునై మునితుల్యుండయ్యు మార్గస్థుడు క్లేశములు మాత్రము పోగొట్టనేరడు, దేహత్యాగమువలన సుఖమునెనుకచూచెదవు పట్టిభ్రిమ ఆత్మఘాతుకునకిక్కడికన్నమునుదుఃఖము పరమందుగలుగును. పడుచువాడవును విద్వాంసుడవును అగునీకు ఈయజ్ఞానమున దుస్వేఆలోచించుకొనుము అనశ్యముమనాపూటతీసివేయుకునుమీకుయిచటఎవరికి తెలియునీయక గొప్పయందమైన అంతస్థు చేయించెదను సుందరిని పెండ్లిఅయి అందుయెవరికిని తెలియక యథేచ్ఛముగా నుండుము అని యగ్నిదత్తుడు బోధించెను అందులకు బుద్ధితిరిగి గుణశర్మ వల్లెయని ఇట్లనియె నీమాటనే నొప్పితిని మొండుసుందరియగు భార్యనువదలకుగానివదలిననేను కృతకృత్యుడనుగాక ఈసినుకమవివాహమాడవసయుమునుచేసికొని యెవనినేసెయొక దేవుని ఆరాధించితత్ప్రిసాదబలమున అకృతఘ్ను రాజుపైపగతీర్చుకొనెదను యనిన అగ్నిదత్తుడు అలరెను. ఆరాత్రిగుణశర్మ అచటసుఖముగావిశ్రమించెనుమరునాడు అగ్నిదత్తుండు గుణశర్మకుసౌఖ్యముగాపాతాళవసతియును పేరనొకనేల మాళ్యనుకావించెను అందుప్రవేశించి గుణశర్మ అయ్యాచెప్పుము ఇచటయేదేవునిభక్తితో వ్రతానుష్ఠానపూర్వకముగా యేమంత్రముచేనారాధింతును అనియడిగెను. ఆతనిరుసీలికిఅగ్నిదత్తుడిట్లనియె, నాకుకుమారస్వామిమంత్రముగురూపదిష్టమైనది తెలుసియున్నది. శత్రుపీడితులైన దేవతలుయీవనిపుట్టువుగోరివంపగా నీశ్వరునిచేదగ్ధుడయ్యును, కాముండుమునలసంకల్పజన్ముడుచేయబడెనోమహేశ్వరునివలనను అగ్ని గుండమువలనను శరణ్యమువలననుకృత్తికలవలనను యనినిపుట్టుకనుచెప్పుచున్నారో అట్లుపుట్టినమాత్రముననేయెవడు దుష్ప్రవర్తనమైన తేజస్సుచే సర్వలోకములకుఆనంద పెట్టెనుకనునితారకాసురుని సంహరించెనోఆనీశ్వరుం ఆరాధింపుము. ఆమంత్రమునావలనగోయుము, ఇట్లని యగ్నిదత్తుడు మంత్రము నుగుణశర్మకుఇచ్చెను గుణశర్మ భూగృహమందు సుందరిని పతివ్రతయై ఉపచారములు సేయుచుండగానా మంత్రముచేత కుమారస్వామిని ఆరాధించుచుండెను. అంతటషణ్ముఖ దేవు [illegible] తిని. వ్రాలివర మడుగుము అనెను. నాయుఅయ్య

కోశము వలయును. నేనుమహాసేన నరపతిని జయింప వలయును, అనిగుణ శర్మ వేడెను పుత్రా నీవు అక్షయకోశుండవై నిరంకుశముగా పృథ్వీరాజ్యము చేయుదువు అని వరమిచ్చి అంతర్హితుడాయెను. గుణశర్మయు అక్షయకోశ సంపన్నుడాయెను. తన మహిమకుదగిన సంపదతో గుణశర్మదినదినాధికాను రక్తయైన సుందరియగురూపవతింభావ్యార్థసిద్ధినింబోలె, వివాహమైఅక్షయ కోశ ప్రభావము చేత లెక్కలేని గజతురంగపదాతి సైన్యములను సంపాదించి తన దానశక్తిచేగలిగి కొనిన రాజుల బలములచే భూమినాక్రమించుచు ఉజ్జ యినికి దాడి వెడలెను. అందు ప్రజల యెదుట అశోక పతియొక్క దుశ్శీల మును ప్రకటించి మహాసేనరాజును యుద్ధములోనోడ్చి రాజ్యమునుండి వెడ లగొట్టించి తానే అచట రాజయ్యెను. ఆ గుణశర్మ సార్వభౌముడు పలు వురు రాజకన్యలుగూడవివాహమై ఆ సముద్రా ప్రతిహతభాగ్యుడయిన సుం దరీ సహితుండై చిరకాలము యథేష్టభోగముల ననుభవించి పిమ్మట గైవ ల్యప్రాప్తి జెందెనని చెప్పి విని కపివరుండు శ్రీరాముల భగవత్పాద సరసీ రుహంబులకు ప్రణమిల్లి ఈ చిత్రమైన కథాశ్రవణము చేచాలప్రొద్దయ్యెను. నిద్రింతము లెమ్మని ప్రార్థించిన నా భగవంతుండును సమ్మతించివారిరువురు సుఖలీలం నిద్రించిరి.

నవమరాత్రికథ - సమాప్తము.

ఓమ్.

# దశమకథారత్నము.

---

పదియవనాటిరాత్రి శ్రీసీతారాములు భోజన మజ్జలొనరించి తాంబూలంబు సేయుచు చల్లగావీచు మందమారుతంబున కానందించుచుండ నవసరంబున అంజనీసూనుండు శ్రీరాముల పాదంబులకు ప్రణమిల్లి ఆశ్రితకల్పభూజ ఉపమార్గమైన వేదాంత సారంబున నొక్కసూత్రంబు నాకుహృద్గోచరంబగు నటుల శైల వొసంగి నన్ను మోక్షార్హునిగా జేయుండని వేడిన భక్తపరాధీనుండగు రాముండు వినుమని విక్రమసింహ్మా మహారాజుకథ ఇట్లని చెప్పదొడంగెను:—

## విక్రమసింహ్వా మహారాజుకథ.

పూర్వము మాళవ దేశములో యజ్ఞసేనుడను బ్రాహ్మణుడొకడుండెను. ఆ సజ్జనుని జనప్రియులైన ఇద్దరు కుమారులుండిరి. వారిలో ఒకని పేరు కాలనేమి, రెండవ వానిపేరు విగతభయుడు, తండ్రి కైకల్య ప్రాప్తి చెందగానే ఆయన్నదమ్ములు బాల్యము దాటినవారై విద్యార్థమునకై పాటలీపుత్ర నగరమునకు పోయిరి అచ్చట వారికిసకల విద్యలునుముగియగానే ఉపాధ్యాయుడు వారిద్దరినిగని తన యిద్దరుకొమార్తెలను మూర్తీభవించిన విద్యలనుంబోలి, కుమార్తెలనిచ్చి వివాహముచేసెను కొన్నాటకాలనేమిధనికులైన ఇతరగృహస్థులనుచూచి ఈర్ష్యపూని తానువ్రతముచేసిహోమములచే శ్రీలక్ష్మీప్రత్యక్షముచేసికొనెను. శ్రీదేవియుసంతోషించిఅతనికిట్లని వరమిచ్చెను, నీకుధనము విస్తారము గలుగును. రాజగు నట్టి కొమారుకొకడునీకు పుట్టునుకాని చిట్టచివర నీకు దొంగచావు సంభవించును ఎందుచేతననగా నీవు ఓర్వలేమిచే కలుషమైన మనస్సుతో హోమము చేసితివని ఇట్లుచెప్పి యాదేవి అంతర్హితురాలాయెను. కొన్నిదినములకుపుత్రుడుకలిగెనుతర్వాత జాతకర్మంబులు వ్రాయించి విక్రమసింహ్వుడని పేరుపెట్టెనుక్రమముగాఆ విక్రమసింహ్వుడు వృద్ధిపొంది బ్రాహ్మణుడయ్యునుఅస్త్రములయందునుమల్లయుద్ధమునందును లోకములో యీడులేనివాడాయెను. కాలనేమియనుతమ్ముడువిగతభయుడు తనభార్య పాముచేకరవబడిమృతినొందగావైరాగ్యము చేత తీర్థయాత్రాభిలాషియై దేశాంతరముపోయెను. గుణగ్రహణ పరాయణుడైన వల్లభశక్తియును రాజువిక్రమసింహ్వుని తనకుమారుడగువిక్రమశ

త్రికి చెలికాన్నిగా జేసెను, మానియు బలియునైనయావిక్రమసింహునికిబా ల్యమునందే దుర్యోధనునితో భీమసేనునిబోలె ఆరాజకుమారునితో సహ వాసముకలిగెను. ఈబ్రాహ్మణకుమారునికి బహుశాలియువజ్రముష్టియు ననువారిద్దరు క్షత్రియకుమారులు అవంతిదేశస్థులు మిత్రములైరి బాహు యుద్ధములో అతనిచే నోడిపోయిన గుణగ్రాహులు రాక్షసమాతాతను విష్ణువు శాశ్వితముగా ఖైదుచేసినాడు మాతండ్రినివిష్ణువే బాహుయుద్ధములోచం పిమాపట్టణముననుండి మమ్ము వెడలగొట్టి మేము మరల ప్రవేశించకుండుట కు అందొక సింహము నుంచినాడు ఆయానగరమును సింహము మాహృద యమును దుఃఖమును ఆక్రమించియున్నవి అసింహముకు బేరునిశాపముచేత ఆరూపమునుబొందిన యొకానొక యక్షుడు మేము మానగరము ప్రవేసిం చుటకుఉపాయము చెప్పుమని విష్ణువును వేడుకొనగామనుష్యునిచేత నోడిపో వుటయే ఆయక్షునికి శాపాంతమని దేవుడు సెలవిచ్చినాడు కనుక ఆయాశ త్రువును నీవుజయింపవలయును అందులకే నిన్నుయిక్కడికి తీసుకొనివచ్చి తిని వానిని గెలిచిన నీకువానివలన మృగాంకమను కత్తిదొరకును దానిప్ర భావముచేత భూమినంతయు జయించి రాజువగుదువు.



భరద్వాజముని విక్రమసింహునికి ముత్తికంచకము తెల్పుట.

ఆమాటకు సంతోషించివిక్రమసింహుడు ఆదినమక్కడగడపిమరు నాడు దైత్యకన్యలను ముందుంచుకొని పట్టణమునకుబోయి బాహుయుద్ధ ములో సింహమును ఓడగొట్టెను. అంతట సింహము శాపముతీరి పురుష రూపముధరించి తనయాశాపమునుతీర్చిన విక్రమసింహునికి సంతోషము తోతనఖడ్గమిచ్చి అసురకన్యల దుఃఖముతోకూడా అంతర్ధానముపొందెను అంతవిక్రమసింహుండు విద్యుత్ప్రభతోను ఆమెచెల్లెండ్రతోను ఆనగరో

త్రమును ప్రవేసించెను. అతనికి విద్యుత్ప్రభ విషహరమయినయుంగరమొకటియిచ్చెను విక్రమసింహుండు నక్కడనేయుండి ఆచిన్నదానియందభిలాషవడెను. ఆమె యాయభిప్రాయమెరిగి అతనిని అక్కడిభావిలో స్నానముచేసిరమ్మనియు ఆకత్తితో నేమునిగిన మొసలిభయముండదనియు చెప్పెను. ఆప్రకారమే విక్రమసింహుఁడు భావిలోమునిగి మొదటతాను ఎక్కడనుండి గంగలోదిగెనో అక్కడికే తిరిగివచ్చిచేరెను.

అతడట్లు పాతాళపట్టణమునుంచిలేచి కత్తియుఉంగరమును చూచుకొని "మోసముచేసినదిగదా అసురకన్య అనిచింతించుచు" ఆశ్చర్యపడుచు తనమిత్రులను వెదకుకొనుచు తనయింటికిబోవుచు దారిలోనొక్క మహామునిపుంగవునింగాంచి నమస్కరించి తనవిస్తారంబెల్ల తెల్లంబుగాదెల్పి యామునిపుంగవునికి వివిధశుశ్రూషలుగావించుచుండ నొక్కనాడా విక్రమసింహుని మునిచంద్రుండు దగ్గరంజేరంబిలచి యిట్లనియె.

ఓ రాజకులరత్నమా మానవజన్మమునకు సాలోక్యమనియు, సారూప్యమనియు, సామీప్యమనియు, సాష్టిఁత్వమనియు, కైవల్యమనియు, ముక్తిమార్గంబులైదువిధంబులు సామీప్యమనగా, ఉపాసనవల్ల బ్రహ్మలోకంబునకుబోయి బ్రహ్మదేవునియొక్క సముఖంబులేకనే ఒకప్రదేశమందుండి సమస్తభోగంబు లనుభవించుట సామీప్యముక్తి యనంబడును. బ్రహ్మదేవునికియేరూపంబుగలదో ఆరూపమునుబొంది సమస్తభోగంబు లనుభవించుటసారూప్యముక్తి, బ్రహ్మదేవునికి యేయైశ్వర్యంబుగలదో నాయైశ్వర్యంబుగలిగి సమస్తభోగంబు లనుభవించుట సాష్టిఁత్వముక్తి, బ్రహ్మదేవునియొక్క సమీపమందుఁజేరి ఆయన యెట్టివంటి భోగంబు లనుభవించునో అట్టిభోగంబు లనుబొంది యాబ్రహ్మదేవుని నెల్లప్పుడు చూచుచుండుట సాలోక్యముక్తి, యీనలుగురికి ముక్తియేకరూపమై యున్నప్పటికిన్ని ఉపాసనా తారతమ్యంబువల్ల నవాంతరఫల తారతమ్యంబు గలదు, కైవల్యమనగా ముముక్షువులైనవారు శమదమాదులతో గూడుకొని గురువులయొద్ద శ్రవణమననాదులనుచేసి జ్ఞానంబును సంపాదించి సచ్చిదానందస్వరూపుడైన యాత్మనేననియెరిగిన తర్వాత స్వరూపమాత్రంబుగానుండి విచారంబువలన పుట్టిన జ్ఞానంబుచేత కైవల్యప్రాప్తి రావలెను. కర్మోపాసనా యోగంబులచేత వచ్చునట్టిది కాదు. అటుగనుక బ్రహ్మలోకమున నుండెడివారును బ్రహ్మదేవునియొద్ద విచారంబుచేసి జ్ఞానంబునుసంపాదించి బ్రహ్మదేవునితోడ ముక్తినొందుదురు. గాన జ్ఞానంబుసంపాదించి ముక్తిపదవి

జెందుము. ఈలాటి భ్రమ తలంజిక్కి శ్రీమన్నారాయణ స్మరణంబువిడిచి యుండుటను యెంతబేలతనము అనిదెలిపి నిష్టాగరిష్ఠుండై యుండెననిజెప్పిన మారుతాత్మజుండు స్వామీ ముక్తిమార్గంబుదెలిపితిరి. యీమార్గంబులెంతో శ్లాఘనీయంబై యున్నవి యనిగీర్తించి తదనంతరమా విక్రమసింహునిసవిస్తారంబును దెల్పుమనివేడిన దయారసహృదయుండై శ్రీరాములు యేమనుచున్నారు, భక్తశిరోమణీ వినుము! నంతటారాజచంద్రుండు నాయాశ్రమంబు వదలిపోవుమార్గంబున విమలుండును వానినిచూచెను నాతండును విక్రమసింహునిజూచి నమస్కరించిన ఏకాంతంబునకుగొనిపోయి అతనిస్వజన వృత్తాంతమడుగగా నిట్లుచెప్పెను. నీవట్లు గంగలో మునుగగానే నిన్నుబహుదినములువెతకి ఎక్కడనుగానక దుఃఖితులమై మాతలలను ఛేదించుకొనుట కుద్యమించితిమి అంతనాకాశవాణి ఓబాలులారా సాహసముచేయకుడు మీచెలికాడుబ్రతికియేయున్నాడు మరలమిమ్ము కలుసుకొనును అనిపలికి మాప్రయత్నమును మాన్పెను. అంతమేము నీతండ్రివద్దకు పోవుచుండగా దారిలో నొకపురుషుడు ఎదురుపడి ఇట్లుచెప్పెను. ఇప్పుడుమీరు యీపట్నములోకి పోగూడదు. ఎందుచేతననగా మనప్రభువగు నల్లభశక్తి చనిపోయినాడు. మంత్రులు విక్రమశక్తికి పట్టాభిషేకముచేసినారు రాజ్యముగాగానే అతడు కాలనేమి యింటికిపోయి నీకుమారుడు విక్రమసింహుడెక్కడున్నాడని పట్టరానికోపముతో అడిగినాడు అందుకాయన తానెరుగనన్నాడు అంత విక్రమశక్తి కుమారుని దాచిననేరమునకై కాలనేమినిదొంగగాభావించి కొఱతవేయించినాడు ఆఘోరదండనకు ఆయనభార్యగుండెలుపగిలి చచ్చినది. క్రూరులుచేయు పాపము ఎప్పుడును మరియొకపాపమునుకూడ తెచ్చుచుండునుగదా ఇప్పుడు విక్రమశక్తికి మిమ్మందరిని వెదకించుచున్నాడు గనుక మీరు ఇప్పుడు యింటికివచ్చుటకు సమయముకాదు. తిరిగి మరొకచోటికివెళ్లుడని తెలిపిననతండు మనచెలికాండ్రు దుఃఖితులైచేరజేకొని నీకీవృత్తాంతమును జెప్పుటకై నన్నిక్కడదాచియుంచి ఉజ్జయినికి పోయినారు అక్కడికివెళ్లుదము రమ్మనిన నతండువిని తల్లిదండ్రులగతికిశోకించి పగదీర్చుకోరికనుబూనె దృష్టినిమాటిమాటికి ఖడ్గముసారించెను.

అంత విక్రమసింహుడు మంచికాలము నెదురుచూచువాడై విమలునితోగూడ మిత్రులను చూచుటకు. ఉజ్జయినికి బయలుదేరెను. తానుగంగలోమునుగుట మొదలుగా భావిలోమునుగుటతుదిగా తనవృత్తాంతమునువిమలునికిచెప్పుచూ నడుచుచూ దారిలోయొకచోట ఒకస్త్రీయేడ్చుచుండ

గాచూచి యేలయేడ్చెదవు అనియడిగి ఆమె నేను మాళవముపోవుచూ దారి తప్పితిని అనిచెప్పగా కరుణించి ఆమెనుకూడ వెంటబెట్టుకొనిపోయెను. ఆమె దూరము నడువలేదను దయచేత ఆమెతోకూడ సమీపమందొక పాడుపట్టణములో బసచేసెను. అచ్చట రాత్రి అకస్మికముగా అతడు మెలకువ గలిగి చూడగా ఆస్త్రీ విమలునిచంపి వాని మాంసమును తినుచుండెను అంతనతడు ఆకత్తినిచేతబూనిలేచెను. ఆమెయు ఘోరమైన తనరాక్షసి రూపము దాల్చెను. అతడా రాక్షసిని చంపుటకు జుట్టు బట్టుకొని వంగదీసెను. ఆక్షణమే ఆమెదివ్యరూపమునుపొంది యతనితో నిట్లనియె ఓమహానుభావా నన్నుచంపక వదలుము నేను రాక్షసినిగాను, నాకు కౌసికమునివలన ఈశాపముకలిగినది. పూర్వము ఆయనకుబేరునిపదవినిగోరి తపస్సు చేయుచుండగా తద్విఘ్నార్థమునకై నన్నుకుబేరుడుపంపినాడు, అంతనేను సౌందర్యముచేత ఆయనను వలపించుటకు అసమర్థనై అవమానపడి భయపెట్టి చూతమని భయంకరమైన రూపమును దాల్చితిని, దానినిచూచి ఆముని ఓపాపాత్మురాలా నీవు రాక్షసివిగమ్ము మనుష్యులనుతినుము, అనిశపించిరి. గాన నీవు నాసిగబట్టుకొనగా నేనాశాపముతీరునని యనుగ్రహించినాడు ఈప్రకారమునాకీరాక్షసీభావము సంప్రాప్తమైనది, చిరకాలమునుండి ఈనగరమునంతయు నేనేభక్షించితిని నీవల్లనాకు శాపముతీరినది, గనుక వరమునుగుము ఇచ్చెదనని ఆమెచెప్పగా విక్రమసింహుడు సాదరముగా వేరువరము నాకేల ఈ నాచెలికాడు జీవించుగాకయని అడిగెను. ఆమెఅట్లేఅగుగాకయని వరమిచ్చి మాయమైపోయెను. విమలుడుఅక్షతశరీరుడై బ్రతికిలేచెను. విక్రమసింహుడు సంతోషించియాశ్చర్యపడి అతనితోకూడ మరునాడుప్రాతఃకాలమునబయలుదేరి క్రమముగా ఉజ్జయినిచేరి తన్నెదురు చూచుచున్న చెలికాండ్రను మేఘుడు నెమళ్లనుంబోలె తనదర్శనముచేత ఆనందపరిచెను వారికి తనవృత్తాంతమంతయుచెప్పి బాహుశాలిఇంట అతిథ్యముగ్రహించెను. అక్కడ బాహుశాలితల్లిదండ్రులు తనకుఆదరముతో ఉపచారములు చేయుచుండగా చెలికాండ్రతోగూడ స్వగృహమందు ఉండునవలె స్వతంత్రముగా నుండెను.

ఒకానొకప్పుడు విక్రమసింహుడు వసంతమహోత్సవములో ఉద్యానవనమున చెలికాండ్రతోగూడ యాత్రచూచుటకుపోయి అక్కడ దేహధారిణియైన వసంతలక్ష్మియెయున్నదానగు శ్రీబింబకియను రాజకుమార్తెను జూచెను, ఆమెపేరు మృగాంకవతి తన్ను చూడగానే వికసించిన విక్రమసింహుని నేత్రములద్వారా దారిజేసుకొన్నదా యెనుగాన ఆమె వెంటనే

అతని హృదయములో ప్రవేశించినది, ఆమెదృష్టియు ప్రథమానురాగమును తెలుపుచూ ఆమెపంపిన దూతికవలెనాయన అతనివైపు రాజపోకలు సేయుచుండెను. చెట్లచాటుచే ఆమె అగుపడక పోగానే విక్రమసింహునికి ఏమియుతోచక దిక్కులుకూడ తెలియకపోయెను. మిత్రమా నీ మనస్సునాకు తెలిసినది, నాయొద్ద దాపకుము, రాజపుత్రి యెక్కడికిపోయినదో అక్కడికి పోదమురమ్ము అని ఇంకితజ్ఞుడైన బాహుశాలిచెప్పగా విక్రమ సింహుడు అతనితోగూడ రాజకన్యయున్న చోటికిపోయెను. ఆ క్షణములో అయ్యో! అయ్యో! రాజపుత్రిని పాముకరిచినది, అని గొప్పయాక్రందనధ్వని విక్రమసింహునికి హృదయజ్వరముకలుగజేయుచున్నదై వినబడెను. బాహుశాలి పోయి కంచుకితో నాచెలికానియొద్ద విషహారమైన యుంగరమును మంత్రములుకలవు అనిచెప్పెను. వెంటనే కంచుకి విక్రమసింహుని పాదములకు మ్రొక్కి అతనినిరాజకుమారికయొద్దికి కొనిపోయెను. శ్రీయుతుడునుంబోలు యావిక్రమసింహుడు ఆమెవ్రేలికి అతనియుంగరమును పెట్టి మంత్రమును జపించెను, ఆమెయుబ్రతికెను. అందరునుసంతోషించి విక్రమసింహుని స్తుతియించుచుండగా బింబకిరాజుఆవృత్తాంతమునువిని అక్కడికివచ్చెను. అంతట విక్రమసింహుడు తనయుంగరమును పుచ్చుకొనకయే చెలికాండ్రతోకూడ బాహుశాలియింటికివచ్చి అక్కడికిబింబకిసంతోషించి పంపినస్వర్ణాదికము నంతయు బాహుశాలి తండ్రికి నమస్కారపూర్వకముగా సమర్పించెను.

అక్కడ ఆకన్యనే సదాచింతించుచు విక్రమసింహుడు అనుభవించుచున్న పరితాపముచేత చెలికాండ్రు ఏమిచేయనుతోచక చింతించుచుండగా భావనికయనునొక రాజపుత్రితన సఖిఉంగరమును ఇచ్చివేయుటకనెడు మిషచేత అచ్చటికివచ్చి విక్రమసింహునితో అయ్యో అందగాడా నాచెలికి ఇప్పుడు కలిగినయవస్థవినుము. ప్రాణమిచ్చినసీవుభర్తవు కావేనిమరణముతప్పదుఅనిచెప్పెను. భావనికయిట్లుచెప్పగానే విక్రమసింహుడుఅదియుబాహుశాలియుకడమచెలికాండ్రునుఅందరునుగూడిఇట్లాలోచనచేసిరి. రాజకన్యను రహస్యముగా మనముఇక్కడినుండి అపహరించుకొనిపోయిఇక్కడివారికి తెలియకుండ మధురాపురములో నివసింతము ఇట్లునిశ్చయించి కార్యసిద్ధికొరకు పరస్పరము ఏర్పాటులు చేసికొనిరి. అంతభావనికరాజకన్యయొద్దికిపోయెను.

మఱునాడు బాహుశాలి ముగ్గురు చెలికాండ్రతో వర్తకమునకనిమిషపెట్టి మధురకు పయనమైపోయి దారిపొడుగునను పదేపదే రాజకన్యక పాఱిపోయివచ్చుటకు గూఢముగా చతురములైన గుఱ్ఱములను అడ్డముం

చెను. విక్రమసింహుఁడు ఒకానొకస్త్రీని దానికొమారితతో కూడ సారా యిత్రాగించి రాజకన్యయొక్క పడకగదిలో రాత్రియుండెను. అంతభావనికదీపోద్దేశమున పడకటింట నెప్పుపెట్టి మృగాంకవతితో కూడ యెవరికిని తెలియకుండ పరారైవచ్చి వెలుపల కనిపెట్టుకొనియున్న విక్రమసింహునికలసికొనెను. అతడును ఇద్దరుమిత్రులను భావనికను తోడిచ్చి రాజకన్యను ముందుపోయియున్న బాహుశాలియొద్దకుపంపను పడకటింటయున్న యాస్త్రీ కొమారితతో కూడుకొనిపోయినది కాలిపోయిన యాయిద్దరిబుగ్గిని చూచి జనులు భావనికను రాజసుతయు కాలిపోయినారని తలచినారు మరునాడుదయమున విక్రమసింహుడు ఆపట్నములోనే యథాప్రకారముగా అందరికిని అగుపడి రెండవరాత్రి మృగాంకమును చేతగొన్నవాడై ముందుపోయియున్న ప్రియురాలిని కలుసుకొనుటకై బయలువెడలి ఆరాత్రియే ఉత్సుకతచే చాల దూరముపోయి మరునాడు ఝాముప్రొద్దెక్కునంతలో వింధ్యారణ్యముప్రవేశించెను అక్కడనతనికిఅపశకునములైనవి అంతలో మిత్రులందరును భావనికయు అగుపడిరి మిత్రులందరు దెబ్బలుతిని నలిగియుండిరి ఆయవస్థలోనున్న తమ్ముజూచి యేమియుతోపక దిగులుపడియున్న విక్రమసింహునితో వారు మిత్రమా యిక్కడ మమ్ము గుఱ్ఱపుదండుకొట్టి దోచుకున్నది మేము దెబ్బలు తిని యీయవస్థలోయుండగా భయాకులతయైన రాజకన్యను ఒకరౌతుగుఱ్ఱముమీద ఎక్కించుకొని పోయినాడు దూరము కొనిపోకముందే యీవాదిక్కునపొమ్ము యామెయొద్దనుండదుము. అనిఅన్నివిధములచేతఆమెసంగతిముఖ్యముఅనిచెప్పి అతనినిపంపిరి విక్రమసింహుండు వారినిపలుమారు వెనుకకుతిరిగిచూచుచుపోయిత్వరలో ఆగుఱ్ఱపుదండునుకలసికొనిఅందులోనడుమ ఆమెను కొనిపోవుచున్న క్షత్రియుకొమారునిచూచిఅతనియొద్దకుపోయిమంచిమాటలతో అడుగగా అతడుఆమెనీయకుండునఅతనినికాలితోతన్నిగుఱ్ఱమునుండి క్రిందికిలాగి ఒకరాతిమీద వేసికొట్టి చూర్ణముచేసెను. వెంటనే గుఱ్ఱము పైనెక్కి తనమీదికికోపించి ధవుడుతీసిన రౌతులనేకుల సంహరించెనుహతశేషులు ఆవీరుని యద్భుతపరాక్రమమునకు భయపడి పారిపోయిరి. అంతట విక్రమసింహుఁడు మృగాంకవతితో గూడ గుఱ్ఱమెక్కి చెలికాండ్రయొద్దకుపోవుచు కొంచెము దూరముపోయి భార్యతోగూడ దిగగానే యుద్ధములో గాయములు తగిలియున్న యాగుఱ్ఱము నేలబడి కాలధర్మము నొందెను ఆసమయమున మృగాంకవతి యుద్ధములోకలిగినభయాయాసములచేత మిగులదప్పిగొన్నదాయెను. ఆమెనక్కడనొకచోటనుంచినీళ్లు వెదుకు

మూవిక్రమసింహుడు చాలదూరముపోయెను. యింతలో సూర్యాస్తమయమాయెను. అక్కడంతట నీళ్లుదొరికినను చీకటిలో దారితప్పిచక్రవాకము వలె విలపించుచు ఆరాత్రియెల్ల నడవిలో తిరుగుచుండెను తెల్లవారుగానే చచ్చిపడియున్న గుఱ్ఱపుగుర్తుచేత ఆచోటికిపోయినాడుగాని రాజపుత్రిమాత్రము అగుపడలేదు అంతనతడు పొరపాటుచేత మృగాంకమును భూమిమీద వేసి ఆమెను నలుదిక్కుల వెదుకుటకు చెట్టుకొనకెక్కినాడు అక్షణములో ఆదారిని ఎవరో చెంచునాయకుడువచ్చి చెట్టుక్రిందనున్న యామృగాంకమును పుచ్చుకొనెను. వానినిజూచి విక్రమసింహుడు చెట్టుదిగి అతిదుఃఖముతో ప్రియురాలి వార్తనడిగెను. చెంచుదొర యిక్కడినుండి నాపల్లెకు పోయి నీప్రియురాలు నక్కడయున్నది, నేనును అక్కడికేవచ్చెదను. వచ్చి నీకత్తి నీకిచ్చెదను అనిచెప్పెను విక్రమసింహుడును కాంతాదర్శనోత్సుకుడై ఆచెంచుదొరయొక్క పరిజనులతోకూడ ఆపల్లెకుపోయి రవంత సేపు అలపు తీర్చుకొమ్మని చెప్పగా నతండు చెంచుదొర ఇంటపరుండి క్షణములో నిద్రలో మునిగిపోయెను. తర్వాత మేల్కొనిచూడగానే కాంతనువెదుకుటకు యత్నించినవాడై ఆమె యున్నచోటికి పోనేరకుండునట్లు నతని పాదముల రెంటికిని సంకెళ్లుపడియుండెను. అంత నతడు క్షణము సుఖమును క్షణము దుఃఖమును ఇచ్చునట్టి దైవగతిని నంటిదైయున్న ప్రియురాలినే తలపోసివగచుచు అక్కడనే పడియుండెను.

ఒకనాడు మోచనికయనుచేడియ అతనికడకువచ్చి ఇట్లనియె. ఓమహానుభావుడా అయ్యో ఇక్కడికేల వచ్చినాడవు. ఇక్కడనీకుమృత్యువుతప్పదు, ఈశంబరాధిపుడు ఏదోఒకపనిమీద పోయియున్నాడు, వచ్చినవెంటనేనిన్ను అమ్మవారికిబలివేయును. ఇందునిమిత్తమే నిన్ను వింధ్యారణ్యమునుండి ఇక్కడికి తెచ్చి ఖయిదులో వేసినాడు, అమ్మవారిబలికి వుద్దేశించినట్లుగనే నీకుమంచి వస్త్రములుఇచ్చి భోజనములు పెట్టి యుపచరించుచున్నాడు. తప్పించుకొనుటకు నీకు నకటే యుపాయ మున్నది. నీవు అంగీకరింతు వేని అతనికిసుందరి యనుకూతురొకతె యున్నది. ఆమెనిన్ను చూచినగడియ మొదలుకొని అత్యంత మదనాతురయై యున్నదిగాన యూ చెలినికూడుము, అందువలన నీకు మేలు కలుగును. యని చెప్పిన నతండా చెలిని గాంధర్వవిధిని రహస్యముగా స్వీకరించెను. ఆమె ప్రతిరాత్రియు అతని సంకెళ్లను తీసివేయు చుండెను. కొద్దిదినములలోనే ఆమెకుగర్భమాయెను. అంతట ఆవృత్తాంతమునంతయు చెలికత్తెవలన ఆమెతల్లివిని విక్రమసింహునివద్దకు అల్లుడను ప్రేమచేతపోయిస్వతం

త్రముగా నతనితో నాయనా యీసుందరితండ్రిమహాకోపి వీనిపేరు శ్రీచంద్రుడని సార్థక నామమువిన్న నతడు క్షమింపడు, ఇక్కడనుండిపారిపొమ్ము, సుందరిమాత్రము మరువకుము, అనిబల్కి బంధనము ను విడదీసెను.

అంత విక్రమసింహుడు సుందరితో శ్రీచంద్రునిచేతనుండు ఖడ్గము తనదనిచెప్పి అక్కడనుండి బయలువెడలి మరల మృగాంకవతిపోయినగతినే తెలుసుకొనుటకై ఆ మొదటివింధ్యారణ్యమునే ప్రవేశించి శుభశకునములు కాగా ఎక్కడగుఱ్ఱము చచ్చిపడియుండెనో ఎక్కడఆమెఅగుపడక పోయెనో ఆ చోటికేపోయి అక్కడ ఎదురు పడిన యొక బోయవానిని ఆతురముగాతని వార్తయడిగెను. నంత నా బోయవాడు నీవేమి విక్రమసింహుడవాయని అడిగెను. ఔను ఆమందభాగ్యుడనేనేను అని నిట్టూర్పు విగుడించుచువిక్రమసింహుడుబలికెను, అంత నాబోయయిట్లనియె. ఓమిత్రుడా నీప్రియురాలు నిన్నయిట నలువైపులను వెదకుచు ఏడ్చుచుండగా నేను చూచి కరుణించి నాపల్లెకు కొనిపోయి అక్కడనున్న కోడెగాండ్రకు ఆమె భయపడి దిగులు పడగా మథురాపురమువద్ద నాగస్థలమను గ్రామములో విశ్వదత్తుడనువృద్ధ బ్రాహ్మణునియింట గౌరవముగా ఇల్లలకయుంచి ఆమెవలన నీపేరు తెలుసుకొని ఇచ్చటికి వచ్చినాడను, నాగస్థలమునకు వెంటనేపొమ్ము, అక్కడఆమెను చూడగలవని బోయవాడు చెప్పెను.

విక్రమసింహుడు వెంటనెబయలుదేరి ఆరాత్రియే నాగస్థలముజేరి విశ్వదత్తుని ఇంటికి బోయి అయ్యా నీయొద్ద బోయవాడుంచిన నాభార్యను ఇమ్ము అని యడిగెను. అందులకు విశ్వదత్తుడు మథురలో నాస్నేహితుడు గుణవంతులకు ప్రియుడగు ఒకబ్రాహ్మణుడు కలడు, ఆయనశూరసేనమహారాజునకు ఉపాధ్యాయుడును మంత్రియు నీప్రియురాలినిఆయనచేతిలో ఒప్పగించియున్నాడను, ఇదియొక నిర్జనగ్రామమైనందున, ఇక్కడ ఆమెను కాపాడుటనెళవుకాదు నీవుఈవేళ ఇక్కడవిశ్రమించి రేపు ఆమెయొద్దకుపొమ్మనెను అంత విక్రమసింహుడా రాత్రియక్కడవిశ్రమించి తెల్లవారగానేబయలుదేరి మరునాడు మథురచేరెను. బహుదూరము నడచినందున ఆకలిచే ఆహారము లేనివాడై బడలికతీరుటకు అక్కడ పూరివెలుపల వకనిర్మలమైనదిగుడు భావిలో స్నానముచేసి అందుయెవరో దొంగలు కొంగున హారమొకటిముడిచిపడవేసియున్న యొకవస్త్రమును చూచి హారవుముడినిమాత్రముచూడక యే యేమియుసందేహము తోపక దానినిచేతపుచ్చుకొని ప్రియురాలిని చూడగోరి మథురాపురములోప్రవేశించెను అక్కడతలాదులు ఆవస్త్రమును

ఆనవాలుగాబట్టి హారముకూడ కనిపెట్టి వానిని దొంగయనిపట్టుకొనిపోయి కొత్వాలు నెదుట బెట్టిరి. కొత్వాలు రాజునకు తెలిపెను. రాజు అతనికి ఉరి కాజ్ఞయిచ్చెను. తలారులు వెనుక డిండిమము వాయించుచు ఇతనిని వధ్యభూమికి తీసుకొనిపోవుచుండగా మృగాంకవతి దూరమునుండి చూచి వెంటనేపోయి తొట్రుపాటుతో ఇదిగో నా భర్తను వధ్యభూమికి ఉరితీయుటకు కొనిపోవుచున్నారు.

అని యెవరియింట తానుండెనో ఆమంత్రి ముఖ్యునితో చెప్పగానెను అంత నాతడు తలవరులను నివారించి రాజుతో విన్నవించి విక్రమసింహుని ఉరినుండి తప్పించి యింటికి తీసుకొనివచ్చెను ఏమి నా పినతండ్రి విగతభయుండు పూర్వము దేశాంతరము పోయినవాడు దైవయోగమున ఇక్కడ మంత్రియైయున్నాడు, గాన విక్రమసింహుడు పినతండ్రిని గురుతుపట్టి పరమానందభరితుండై మెడకౌగలించుకొని తనవృత్తాంతమంతయు నడిగెను. విక్రమసింహుడు తన పినతండ్రికి కలిగిన వధ మొదలుకొని ఆసాంతముగా తెలియజేసెను. అంత విగతభయుండు ఏకాంతమందు విక్రమసింహునితో నాయనా నేనొక యక్షిణిని సాధించినాడను. పుత్రహీనుడనైన నాకు ఆమె అయిదువేల గుఱ్ఱములు అయిదుకోట్ల వరహాలు యిచ్చినది ఆ ధనమంతయు నీదే అని చెప్పి విక్రమసింహునికి ఆప్రియురాలినివప్పగించెను. ఆవిభవమెల్ల గ్రహించి నతండామెను వివాహమాడి అక్కడనే గాత్రితో కలువకొలనుం బోలి ఆపెతో కూడి నివసించియుండెను. అతనికి సంపదలు పూర్ణమైయుననుచంద్రునికి కళంకమువలె బాహుశాల్యాదుల చింత హృదయమునకు సదామాలిన్యమును కలుగజేయుచునేయుండెను.

ఒకనాడు పినతండ్రి విక్రమ సింహునితో ఏకాంతమున నిట్లనియె. ఈసూరసేన మహారాజునకు వక కూతురు కలదు. ఆమెను సేను అతనియాజ్ఞచేత అవంతి దేశములో ఇచ్చుటకు తీసుకొని పోవలసియున్నది. గనుక ఆమిపచేతనే ఆమెను హరించి నీకిచ్చెదను. అంత దానితో వచ్చు సైన్యమును నా సైన్యమును నీకుండగా ఇదివరకు నీకు శ్రీదేవి చెప్పినట్టి రాజ్యము క్షణములో లభించును. ఇట్లు నిశ్చయించి ఆకన్యను తోడ్కొని అక్కడి నుండి విక్రమసింహుడును అతని పినతండ్రియు సైన్యములతోను భార్యలతోనుపోయి వింధ్యారణ్యము ప్రవేశించిరి. అంతలో నాకస్మికముగాగొప్పదొంగ దండువారిని ముట్టడించి పాషాణవర్షము గురియింపసాగెను. విక్రమసింహుని దండంతయు గాయపడి అతడును దెబ్బలుతిని మూర్ఛపోగా దొంగలు సకల ధనమును గైకొని అతనినికట్టి తమపల్లెకు కొనిపోయి అందు ఘంటానాదములచే మృత్యువు నన్ను పిల్చుచున్నదో యనునట్లు భయంకరమైన చండికాగృహములో నిలిపిరి. అక్కడికి అమ్మవారి దర్శనమునకు బాలపుత్రునితో కూడవచ్చి సుందరి అతనిని చూచి ఆనందపూర్ణయైన దుమనున్న దొంగలను అవతలికిపొమ్మని అతనిని యింటికి పిలుచుకొనిపోయెను. శ్రీచండుడు పుత్రులులేనివాడై సుందరికి తన రాజ్యమునిచ్చి లోకాంతర గతుడాయెను. దానికి ఇప్పుడు విక్రమసింహుడు ప్రభువాయెను. మరియు దొంగలనుండి పినతండ్రిని విడిపించి వారుకొల్లగొనిన ధనమంతయును ఆమృగాంకఖడ్గమును మరల పొందినవాడై అక్కడనే శూరసేనుని కూతురిని వివాహమాడి ఏకచ్ఛత్రాధిపత్యముగా నీతి దప్పక రాజ్యంబుచేసి భగవత్సన్నిధి జెందునని జెప్పిన విని యానందభరితుండై శ్రీరాములం గొనియాడి విక్రమసింహుని కథ బహురమ్యముగా యున్నది, ఇతనికి పేరు సార్థక నామమైనది, ప్రొద్దయ్యె నిద్రింతము రమ్మనిన వల్లెయని భగవంతుడూ సమ్మతించి వారిరువురు సుఖనిద్ర జెందిరి.

దశమరాత్రికథ - సమాప్తము

ఓమ్.

శ్రీసద్గురుపరబ్రహ్మణేనమః.

# ఏకాదశకథారత్నము.

పదునొకండవదినము రాత్రి శ్రీసీతారాములిద్దరున్ను లీలావినోదంబై కేళీవిలాసంబులాడుచు జల్లగా వీచుచుండెడు మలయమారుతంబునకు ఆనందంబొంది ముచ్చటలాడుచుండు సమయంబున వాయుపుత్రుడైన ఆంజనేయుండు శ్రీరాములకు నమస్కరించి స్వామీ! దేవరహస్యంబులలో నొకటైన విభూతియోగము యెట్లు పుట్టించవలయునో అవియున్నియు సాంగోపాంగమై యున్నట్లొక్క చరిత్రంబును జెప్పి నన్ను మోక్షాధికారిగా జేయుమని ప్రార్థించగా భగవంతుడు యీవాక్యంబును విని సంతోషంబు జెంది ఆంజనేయుని జూచి ఓరీ వాయుపుత్రా నీవడిగినటుల జెప్పెదను శ్రద్ధాభక్తుండవై వినుమని భగవంతుడు జెప్పనారంభించెను, ఎట్లనగా?

## ప్రతాపచంద్రమహారాజుకథ.

పూర్వ మొకప్పుడు పుష్పకాంతి దేశంబును నొక రాజ్యమును పాలించుచుండిన పుష్పాంగధమహారాజు యొకసమయంబున మంత్రిప్రధానులతో గూడి గొలువుకూటంబున యున్నట్టియుండు సమయంబున పుష్పాంగధమహారాజు తనమంత్రినిజూచి ఓమంత్రివర్యా! నేను ఈ రాజ్యంబును పరిపాలించియు అనేకధనకనకభూషణంబులుండియు ప్రయోజనంబేమి నిదియునుంగాక నా రాజ్యంబున అనేకదేవాలయములున్ను అతిథులకు పూజాపునస్కారాది అన్నదానము భూదానము గోదానము స్వర్ణదానంబులున్ను జేసి పుత్రభాగ్యంబు లేకనిర్భాగ్యుండనై భూమిపై యుండుకంటె మరణముబొందుట సౌఖ్యంబైనామనంబెంచుచున్నదియని చెప్పగా నాలుగుకులపిన్న మంత్రి రాజునింగాంచి దేవా! తాము జెప్పిన వాక్యంబులు వినగా వ్యాకూలం బధికరించెను. స్వామీ! జన్మాంతరంబునగలుగు సఫలితంబు యెవరికి యెప్పుడున్ను గలుగబోదు ఎట్లనగా! (శ్లో॥ ఋణానుబంధ రూపేణాం । పశుపత్నిసుతాలయా । ఋణక్షయే క్షయంయాంతి । ఘంతత్రపరివేదనః॥] యీవాక్యంబులాగు ఋణానుబంధంబు గలిగియున్న యెడల లభించునుగాని ఋణానుబంధంబు లేనియెడలయెప్పుడున్ను కలుగదు. ఇదియునుంగాక ముందు పెద్దలు రాజ్యంబువదలి నాయకీనాయకులున్ను కాషాయంబుధరించి కాయగసురులుతినుచు అడవియందు ఘోరతపంబుజేసి పుత్రభాగ్యంబులు జెందియున్నారని అనేక శాస్త్రంబులలో జదివియున్నాము గనుక తాము యీరీతిగా తపంబుజేసిన యెడలభ

గవంతుని సంకల్పము యొక్క కృపాకటాక్షంబువల్ల పుత్రభాగ్యంబు లభించు నని చెప్పినమాత్రంబున పుష్పాంగధమహారాజుగారు సంతోష సముద్రంబున మునిగి మంత్రిం జూచి ఓరీ మంత్రివర్యా! ఈ రాజ్యంబును నీవు నేను వచ్చువరకు పరిపాలించుచుండుము నీ వాక్యంబులాగు ఆపరబ్రహ్మనుగూర్చి తపంబుచేసి పుత్రభాగ్యంబులు జెందివచ్చెదనని చెప్పి ఆ రాజ్యంబును యొప్పగించి తటుక్కున లేచి అంతఃపురంబునకుంబోయి మంత్రి చెప్పినవన్నియు తన భార్యయైన గుణావతికి చెప్పగా తానును సమ్మతించి యిరువురున్ను కాషాయంబుధరించి అడవికిబోయి తమనిజమును గూర్చి ఘోరతపంబు చేయ నారంభించిరి. యిట్లు తపంబు చేయుచున్న కాలంబున సచ్చిదానందస్వరూపంబైన శివశంకరమూర్తి వీరితపంబునకు సంతోషించి పార్వతీసమేతుండై వీరి ముందుగా వచ్చి ఓరీ భక్తులారా! మీరు చేయునట్టి తపంబునకు మెచ్చితిని. మీకు కావలసిన వరంబేదియో నాకెరిగింపుడనగా పుష్పాంగధ మహారాజున్ను వాని భార్యయున్ను నేత్రంబులు దెరచి శంకరమూర్తిని జూచి సాష్టాంగనమస్కారంబులుచేసి స్వామీ! మీ కృపాకటాక్షంబువల్ల నాకనేక ద్రవ్యంబుండియు పుత్రభాగ్యంబు లేమి దుఃఖమే యధికంబై యున్నదిగాన నాదుఃఖంబును దీర్చ నాదరించవలెను స్వామీ యనిబతిమాలగా ఈమాటలన్ని శంభమూర్తివిని చిరునగవు నగుచు ఓరాజోత్తమా! నీవు కోరినట్టి పుత్రభాగ్యంబిచ్చుటకు సందేహంబులేదు. అయినప్పటికిన్ని నా పలుకుల నాలకింపుము. ఎట్లనగా; నీ గర్భంబున అతిసుందరుండైన నొకపుత్రుండుజనించు, వానితోగూడ యొకచంద్రాయుధమున్ను బుట్టును, వీడు జనించిన మూడవమాసంబున రాజ్యంబు పరులపాలై మీరున్ను చాలా కష్టంబు జెందుదురు గనుక పుత్రభాగ్యంబు లేక యేమైన వరంబడుగుము. యనిచెప్పగా ఆపలుకులు విన్నమాత్రమున రాజు కన్నీరుగారుచు స్వామీ! నా రాజ్యంబు పరులపాలైననుగాని లేక నేనున్ను నాభార్యయున్ను మరణంబు జెందినను సరి పుత్రుడు పుట్టి సంతోషకరంబుగా యున్నయెడల అదియే అధికఖ్యాతి గలుగును. యనిచెప్పగా ఈశ్వరుడు మనఃపూర్తిగా సంతోషంబుజెంది పుత్రభాగ్యంబును ఇచ్చెను. అట్టిసమయంబున పుష్పాంగధ మహారాజు భగవంతుని జూచి స్వామీ? పుత్రభాగ్యంబిచ్చినది బద్దదిగాదు, ఆపుత్రునితో చంద్రాయుధము బుట్టునని చెప్పితిరి ఆకారణం బేమో నా కెరింగింపుము యనిబతిమాలగా భగవంతుడు ఆరాజును చూచి ఓరాజోత్తమా! వానితోగూడబుట్టునట్టి చంద్రాయుధము యెన్నటికి నలువుతిరుగు

చున్నదో ఆట్టిసమయంబున వాని ప్రాణంబుఁబోవునని చెప్పి మఱిగెను, ఇదివిని రాజున్ను వానిభార్యయున్ను ఆనంద సముద్రంబునమునిగి రాజ్యంబునకుం వచ్చి అంతఃపురంబున భార్యను విడిచిపెట్టి తానును కొలువుకూటంబునకు బోయి మంత్రిని గాంచి ఓరి మంత్రివర్యా నీవుచెప్పిన రీతిగా తపంబు చేయ భగవంతుండు సుప్రసన్నుండై కోరినవరం బిచ్చెనని చెప్పి రాజ్యకార్యంబులు జూచుకొని యుండెను.

ఇటుండగా! అంతఃపురమందున్న గుణావతికి గర్భం బధికరించి దశమాసంబులు పూర్తిజెంది ప్రసవవేదనఁబడి దివ్యవారంబున సుకృతనక్షత్రంబును గూడిన దినంబునందు సూర్యకిరణంబులాగున మహాప్రభువికి నమైన తేజంబుగల్గు యొక పుత్రుని గనెను, ఈయుక్క సంగతియెల్ల రాజునకెఱింగించుటకై దాదులు బోయి చెప్పఁగా రాజువినఁగానే సంతోష మధికరించి రాజ్యము తయిరు అలంకరించి బంధుజనుల నెల్లరనురప్పించి విందులుచేయించి సంతోషసముద్రమునందోలలాడుచు బాలునకు నామకరణంబుఁజేసి ప్రతాపచంద్రుఁడని నామంబడసి బాలుని దినమొకదినంబుగా పెంచుచూవచ్చునను యంబున ఈ బాలునికి మూఁడవ మాసము పూర్తిగలిగెను. అట్టి సమయంబున వసంతపురి చక్రవర్తియైన వసంతేశ్వరుడు రధగజతురగపదాతులతోను పుష్పాంగుని మీఁదను యుద్ధసన్నద్ధుఁడైవచ్చి బలాబలముతోను యుద్ధంబు చేసి పుష్పాంగునియొక్క రాజ్యమెల్ల అపహరించుకొనఁగానే పుష్పాంగధ మహారాజు చింతాక్రాంతుఁడైన నాయకినిబిలుచుకొని చంటిబాలుని భుజంబుపై యుంచుకొని అడవిమార్గంబుగా వెడలెను.

ఇట్లు ఘోరమైన అడవులందాటిపోవు మార్గంబున నాయకియైన గుణావతి నాధునిజూచి ఓప్రాణనాయకా! మీరు ఇట్టి కష్టదశయందు నడచుటకు బ్రహ్మ యిట్లుగను లభింపఁజేయుచున్నా, ఎవరికి మనము ఏమిఅపకారము చేసితిమోయని చింతించగానే పుష్పాంగుడు తన నాయకినిచూచి ఓప్రాణనాయకీ! నీవు ఇటుల శోకించుటకు తగుబాటిది గాదు, ముందుబ్రహ్మ ఏయేకాలంబునను మేమిఅనుభవించవలెనంచు వ్రాసెనో అవియన్నియు అనుభవించియే తీరవలెను. గనుక నీకు కష్టంబు తోచిన యెడల మీతల్లిగారింటికిబోయి సుఖంబుగా యుండుము. నాకష్టంబు తీరిన తర్వాత నిన్ను బిలుచుకొని వచ్చెదనని చెప్పగా ఆపలుకులువిన్న గుణావతి కన్నీరుగారుచు ఓనాయకా! ఎన్నడు నా చిటికెనవ్రేళ్ళుబట్టితిరో అన్నటిమీఁద స్వాధీనురాలుగదా, కాబట్టితమకు యెట్టికష్టంబువచ్చినను దానిని నేనున్ను అనుభవించక సుఖముగోరిన యెడలనా

కుసరకము లభించునుగాని మోక్షము లభించదనుగనుకమిమ్మువిడచి అరనిమి
షమైనను ఎడబాసి యుండజాలను యనిచెప్పగానే పుష్పాంగద మహారాజు
లభించిన వ్రాతను మనంబున యెంచక ఇరువురున్ను అడవిమార్గంబు విడిచి
బహుదూరంబున కావల (కంగుంది గ్రామము) దొకటికనబడెను. ఆ గ్రామ
మందున్న గొల్లవారిల్లు జేరి నిలువగానే వారు వీరిని జూచి అయ్యా మీ
దేవూరు యిటుల నీవు బాలింతురాలుతో వెంబడి వచ్చుటకు కారణం
బేమి మా కెరింగింపు మనగా యీ పలుకులు విన్న రాజు అమ్మా మాది
పుష్పాంగద పురియను పట్టణము ఆరాజ్యంబునకు క్షామకాలంబు రాగానే
నారాజున్ను పరిజనులున్ను దేశాంతరము వెళ్ళిరి కడపట మేము మువ్వురున్ను
యీదేశంబు గోరివచ్చినాము మాకేమైనా బ్రతుకుటకు మార్గంబు చూపి
నయెడల మీకు అధికభాగ్యంబు లభించునని వేడుకొనగానే ఆదేశపుగొల్ల
భామలు వీరినిజూచి అక్కలారా వీరిరువురిన్ని చూడగానే రాజ రూపంబు
గనుబడుచున్నది వీరుమనరాజ్యంబున యేమిపూడిగము చేయుదురు యేమి
యు తెలియదు అయినప్పటికిన్ని వారికి చెప్పిచూచెదము సమ్మతించిన యెడల
మనయింటిలోనే పూడిగము చేయుటకు బెట్టుకొందామని గొల్లభామ
లందరున్ను యోచించి అయ్యా యీరాజ్యంబున రాజులెవరును లేరు మే
మందరున్ను వడ్లుదంచి బ్రతుకుచున్నాముగాని మరిపని యేమియు లేదు మీరు
న్ను యిట్లు వడ్లుదంచుటకు పూనుకున్న యెడల మీకు పనియిచ్చెదము
అని చెప్పగానే యీ పలుకులు విన్న గుణావతి నాయకునిచూచి ఓనాయకా
యేకచక్రాధిపతిగా రాజ్యపరిపాలనంబు చేసి యిట్టిరాజ్యంబున వడ్లుదంచు
టకు బ్రహ్మ వ్రాత వ్రాసియుంచెను గదాయని శోకించగానే పుష్పాంగ
దుండు భార్యనుచూచి నాయకీ నీవిటుల శోకించుట న్యాయంబుగాదు ఎట్ల
నగా(శ్లో॥ హరిణాపీ హరేణాపీ బ్రహ్మణాపి సురైరపి । లలాటలిఖితా రేఖా
పరిమార్ష్టుంనశక్యతే) యను వాక్యంబులాగు నొసట బ్రహ్మ వ్రాసిన
వ్రాతను హరిహరాదులైనను మరపి వ్రాయుటకు వలవిగాదు యీమానవ
జన్మలకు యెట్లు సాధ్యబడును దీనియోచించక నీవుశోకమొందవచ్చునామ
నము యెన్నడు యెట్టికార్యంబులు చేయవలయునో అట్టికార్యంబులు చేయ
కనొసటవ్రాసిన వ్రాలుమానదు మనము ముందున్నట్టి సుఖమునకైనా యిప్పు
డనుభవించునట్టి అసుఖంబె సుఖంబు యని యెంచి కాలంబును గుర్తెరిగి
నడవవలెను యని యిరువురున్ను ధైర్యంబు జెంది గొల్లభామలతో
అమ్మా! యిట్టికష్టకాలంబున యెట్టి పూడిగమైనను చేయవలసినదేగాని

వ్వారికి యున్నయెడల కత్తిపాతంబు గలిగెదిమెట్లు యిదియుంగాక యీ
బాలునకు పాలుకైనను యొకగుల్లగాను లేక చింతించుచున్నాము గాన
వారి నీసమయంబున పనియిచ్చి కాపాడినయెడల వీరే నాకు దైవంబని
నామనంబెంచుము అని యనేకవిధంబుల వారిని పొగడి బల్కుసమయం
బున వారిమనస్సు నీరుగాకరిగి వీరికి యొకతూము వడ్లు యిచ్చి దంచుమని
చెప్పగా పుష్పాంగదమహారాజు యివిపుచ్చుకొని సంతోషంబుతో రోకలిని
కరంబునబట్టి వడ్లుదంచి త్రోయుగా వీరిభార్యయైన గుణవతికరంబున చాట
బట్టి దంచినవడ్లను చెరిగి పుచుక తవుడు నూకలు వేరుబరచి బియ్యంబెత్తి
వారికి గొలిచియివ్వగానే వారు అవి పుచ్చుకొని వీరిరువురికిన్ని అరపడిబి
య్యము కూలియిచ్చుచూవచ్చిరి. ఈరీతిగా బాలునకు పదహారుసంవత్సరం
బులుగడచువరకు ఈకష్టంబు ననుభవించుచువచ్చిరి యీయుండగా ఈకష్టం
బుతోను బాలునకు సకలమైన విద్యలు గరపించిరి. ఈబాలుడు విద్యయందు
ప్రవీణుండై ప్రసిద్ధిజెందెను ఇట్లుకాలంబు గడుపుచూరాగా యొకసమయం
బున ఈబాలుడు వేటమార్గంబు బోవాలనియెంచి తల్లినిగాంచి అమ్మా!
నేను వేటమార్గంబుబోయి ఏదైన పక్షిజాతులను బట్టుక వచ్చెదను వాటిని
వంటకముచేసి తినవచ్చును అనిచెప్పగా గుణావతి ఈపలుకులువిని ఓరి
నాయనా! నీవు యిదివరలో అడవిమార్గంబు బోయెరుగవు యొంటరిగా
బోయినయెడల పులుల సింహ్వములజూచి భయపడుదువు అచ్చోట నిన్ను
గాపాడువారెవరని చెప్పగా ప్రతాపచంద్రుండు యిదివిని అమ్మా! నేనునీదు
గర్భంబున యున్నప్పుడు నన్ను యెవరు గాపాడినారో వారే అడవియందు
నువారు నన్ను గాపాడుదురు అని తల్లికి ధైర్యమాటలు బలికి అస్త్రశస్త్రం
బుల భుజంబునగట్టి కరంబునధనస్సుబూని వేటమార్గంబుబోయివచ్చెదనని
తల్లికి ధైర్యంబుచెప్పి వేటాడుటకై అడవిమార్గంబు బోయెను.

ఈ ప్రతాప చంద్రుండు అనేక కొండలు నదులందాటి ఘోరమైన
అడవిజూచి వీటియందు మనకు కావలసిన పక్షులుచిక్కునని సంతోషంబు
జెందినలుదిక్కులం బారి వేటాడుటకై నిలచెను అట్టిసమయంబున స్వర్ణమయం
బుగా యొకజింక తనయెదుటరాగా వాటినిజూచి ఆ! హా! యింతటిజింకను
మనమెన్నడును చూచినది లేదు దీనింబట్టక విడువరాదని మనంబెంచిధనస్సు
వంచి బాణమును గుణాధ్వనిచేసి విడిచెను ఈశబ్దంబు విన్న తోడనే ఆజింక
దెబ్బను తప్పించుకొని పారిపోయెను యివిజూచి ప్రతాపచంద్రుండు శోకా
క్రాంతంబుజెంది ఆజింకను వెతకుచూబోయెను అట్టిసమయంబున ఆఘోర

సమయంబున ప్రతాపచంద్రుండు చంద్రవదనినిజూచి ఓ సుందరాంగీ! ఇక ప్రొద్దు గ్రుంకు సమయం బాయెను. రాక్షసుండు వచ్చుకాలంబు సమీపించెను. ఇక నేనేమిచేయుదును యని దుఃఖాక్రాంతంబుగా బలుకుచున్నట్టి మాటలను చంద్రవదనివిని ఓనాయకా! నీవేలనిటుల శోకించెదవు, ధైర్యము విడ. బోకుము, నేనేనిన్ను ఆకనొన్నందుకు నిన్ను రాక్షసునికి జూపించివేసి నేనేమి చేయుదును, యొకప్పటన్ను అట్లుచేయుదునని యోచించ బోకుము. నిన్ను ముత్యాలహారంబుగా చేసి నా కంఠంబున ధరించుకొని రాత్రిపూట యొక యామంబుగా గడిపి ఉదయమైన పిమ్మట రాక్షసుని అడవికి తరుమగొట్టి నీ సుఖాసుఖంబులను గోరుట గాంచియున్నాడను యని చెప్పగా ఈపలుకులువిన్న ప్రతాప చంద్రుడు చాలా సంతోషించి ఓ కలికివధూ! నాముద్దుల సుందరాంగీ! నీశృంగార వాక్యంబులకు ఆనందం బొందినాను, అయినప్పటికిన్ని నేనొక ఉపాయంబు చెప్పెదను, దానిని అంగీకరించవలెననగా చంద్రవదన యోచించి నాయకా మీపలుకులనువినక ఇక యెవరిపలుకులను వినబోవుచున్నాను, మీ కిష్టంబేనయెడా అట్టి పలుకులను అవలంబించిన యెడల శ్రవణానందంబునాకినుటకున్ను ఆరీతిగా నడచుటకున్న గాచి యున్నాను యని చెప్పగా ప్రతాపచంద్రుండు నాయకినిజూచి ఓ కామవనా? రాత్రి దినంబున రాక్షసుండువచ్చి భోజనకృత్యంబులు తీర్చి నిద్రించుసమయంబున వానికి సంతోషంబు గలుగునటుల వాక్యంబులు బలికి అయ్యా మీరునన్ను యొంటరిగా విడచిపెట్టి అడవికిబోయెదరు, అట్టిసమయంబున నన్ను అడవియందు ఎవరైనను హింసజేసిన యెడల నా కెవరు దిక్కు యని యడుగుము వాటికి ఆ రాక్షసుండు ఏమిబలుకుచున్నాడో అవిచక్కగావినుకొని నాకెరిగించినయెడల వానినిజంపివేసి అపుల సంతోష సముద్రంబున మునిగియుండ వచ్చునుయని చెప్పగా ఆపలుకులకు సమ్మతించి నిలువగా సూర్యుడు పడమటి దిక్కునకుం బోయిమరిగెను. ఇవి దెలిసినాయకునిబిలచి నాయకా కొంతసేపు నీదు రెండు నేత్రంబులను మూసుకొనుమని చెప్పగా ప్రతాపచంద్రుండు నాయకిమాట రీతిగా రెండు నేత్రంబులు మూసికొని నిలచెను. ఇంతలో చంద్రవదన తన మంత్రబలంబువల్ల నాయకునిముత్యాలహారంబుగాచేసి తనకంఠంబున ధరించుకొని రాక్షసుండు అండచరాచరంబెల్ల అదరిబడునట్లుగర్జించి ఘోరస్వరూపంబుతో గృహంబునకువచ్చి ఓ చంద్రవదనా? నా కాకలి అధికరించుచున్నది. గనుక శీఘ్రంబుగా నా కన్నంబుబెట్టుమని యడుగగా చంద్రవదన ఇన్ని దినంబులకైన మిక్కిలిసంతోషకరంబుగా వానికన్నంబువడ్డించి తీసిన

తర్వాత పడకటింటికిజొచ్చి రాక్షసుండు శయనించగా వాని కాళ్ళయొద్ద గూర్చుండికాళ్లుపిసుకుచు అయ్యా! మీరునన్నుయొంటరిగావిడచిబెట్టి అడవికిబోయెదరు. అట్టి ఘోరఅడవియందు నన్ను ఎవరైనాచంపినయెడల నాకెవరు దిక్కుయని కన్నీరు గార్చుచు వక్కాణింపగా యీబాలచంద్రవదన కన్నీరు రాక్షసునిపాదమ్ములపైబడగా తటక్కున లేచి దాని నేత్రంబులను తుడిచి ఓసుందరాంగి నీవేలఇటుల శోకంబుజెందెదవు, యొకప్పుడున్ను నీవు భయంబు జెందబోకుము ఏలనగా హరిహరాదిబ్రహ్మ వచ్చినప్పటికిన్ని నా ప్రాణంబు తీయజాలరు ఎందుకనగా నాప్రాణంబు యిచ్చోటలేదు మూడు సముద్రంబులకావల ఒకకారడవియున్నది యీఅడవియందు ఒకకాళికాదేవి గుడియున్నది ఆగుడి గోపురంబుపై యేడడుగుల దొంతియున్నది ఆదొంతి యెవరుదించి కడపటికుండను శోధించినను వాటిలోబంగారుడబ్బివకటున్నది అందులో తెంచిచూడగా వాటిలోస్వర్ణమయంబగు వకకుమ్మరపురుగున్నది ఆకుమ్మరపురుగునుబట్టి యెవడుచంపుచున్నాడో నాటికినాప్రాణంబు పోవునుగాని ఈమధ్యలో నాప్రాణంబు పోజాలదు యనిచెప్పి రాక్షసుండు నిదురించెను. ఇంతలో ఆమె యీపలుకులు వినగానే సంతోషముప్పొంగి సూర్యుండు తూర్పుదిశయందుదయించినాడు యివి తెలసిరాక్షసుండు లేచి దినకృత్యంబులనుదీర్చుకొని అడవికిపోయెను. అటుపిమ్మటచంద్రవదన తనకంఠమందున్న ముత్యాలహారంబెత్తిభూమిపైబెట్టి వుదకంబుజల్లి మంత్రకొయ్యతో మంత్రించగా ప్రతాపచంద్రుండు నిదురించిన వానివలె యెదుటనున్న చంద్రవదనను కౌగలించుకొని ఓనాయకీ నేచెప్పిన వన్నియు నీవడిగి తెలుసుకొన్నావా యనియడుగగా యీపలుకులు విన్న చంద్రవదన నాయకునిజూచి ఓనాయకా నేను నేటిరాత్రిదినంబున రాక్షసునియడిగినందుకువానిసవిస్తారంబెల్ల తెల్లంబై ఆనందముతో బల్కినాడని చెప్పినవన్నియు నాయకునికిచెప్పగానే యివియన్నియు విని ఓనాయకీ తక్షణమే ఆకుమ్మర పురుగును తెచ్చెదను యనిచెప్పెను. చంద్రవదన శోకంబుజెంది నాయకా మూడుసముద్రంబుల నెటులదాటుదురు అటు దాటిపోయినను అడవియందుండు కాళికాదేవిని యెట్లుజయింతురు యనిచెప్పి నిన్నువిడచి నేనెట్లు ఆహారంబుజ్జగింతునని దుఃఖించిన ప్రతాపచంద్రుండు చంద్రవదనకు ధైర్యంబుబలికినేను ఒక వారంబులో వచ్చిచేరెదనుయని బలికి తాను ఆయొక్కపహాడిని విడిచి వెలువడివచ్చు సమయంబున ఆచోట ముందు నమస్కరించి పోయిన కాళికాదేవిసన్నిధికి యెదుటవచ్చినిలువగా కాళికాదేవిసుప్రసన్నంబై ఈబాలుని

జూచి ఓరి పుత్రరత్నమా నీవిచటికి వచ్చిన కార్యంబేది నాకెరిగింపుమన ప్రతాపచంద్రుండు ఈబలుకులువిని ఓపరదేవి నాకుహితోపదేశంబు చేయవలెను నేనుకోరినకార్యంబునాకనుకూలంబుగావలెను యనియడిగిననా కాళికాదేవి ఈ పలుకులనువిని ఓరిబాలకా నేజెప్పునట్టి వాక్యంబుల విని ఆవల నీయిష్టంబై జరుగుము అది యేమన యిప్పుడు విభూతియోగంబును బోధించెదను వినుమని జెప్పందొడంగెను.

ప్రతాపచంద్రునకు కాళికాదేవి విభూతియోగ సాంఖ్యంబు దెల్పుట.

ఓరిబాలకా! దేవతలందరున్ను మహామహాఋషులున్ను నాప్రభావం బెరుగనేరరు అటువంటిది దేవతలకు నేనేకారణరహితంబై ఈమానవులయందు మోహరహితంబై సకలపాపంబులయందున్బవిల్లిము క్తుడగునీబుద్ధియుంద జ్ఞానంబును మోహంబును లేక క్షమయును దమంబును శమంబును సుఖంబును దుఃఖంబును జననంబును జననరాహిత్యంబునుభయంబును భయరాహిత్యంబును అహింసయు సమత్వంబును సంతోషంబును తపంబును దానంబును శక్తియు యిటువంటి మొదలైన యనేక భావంబులు భూతంబులకు నావల్లగలిగెను. సమస్త మహామునులున్ను వారలకు పూర్వీకులగు నలుగురు మహామునులున్ను చతుర్దశమనువులున్ను మాయసంభూతులై హిరణ్యగర్భభూతుండైన నామనఃసంకల్పమువల్ల జనించిరి వారలవలన నీప్రపంచంబుగలిగెను నావిభూతియోగమహాత్వంబును యథార్థంబుగా ఎవ్వడు తెలియంజాలిన నతండు అచంచలంబైన నాయందలి ధ్యానయోగంబడయు యిందు నకుసందేహంబులేదు సకల ప్రపంచంబునకు నుత్పత్తికారణుండెవడో వాని వలన విశ్వంబు ప్రవర్తించుచున్నయది యిట్లుతలంచి వివేకులగువారలు ప్రీతిపూర్వకంబుగా నన్ను బూజింతురు యిటుల బూజించునట్టి శరీరక్రియ నెరుగకకాలంబు గడుపుటకు సుఖంబుగాదు యిటువంటి శరీరంబును మోక్షదాయకంబునకు కొనితెచ్చుమార్గంబు తెలుసుకొనవలెను దుర్విషయంబులందుబ్రవర్తించక ఈ సూక్ష్మబుద్ధిని అ ఉ మ యను ఈ మూడింటి ఒకటిగా యనుసరించి ఓం యను ప్రణవస్వరూపంబుగానాటి అండచరాచరంబులై యుండునట్టి విశాలంబైన చోటునందు సూక్ష్మస్వరూపంబుతో నిల్పి బ్రహ్మజ్ఞానంబుజెంది షట్కల్మషంబులను పోగొట్టి యెవడు శుద్ధంబుగా యుంటున్నాడో వాడే ఈవిభూతియోగంబు యనుసరించుమనగాని యితరమైనవారు ఒకప్పుడున్ను యనుసరింపజాలరు యనిచెప్పగా యివిన్న వాయుసూతుండు సంతోష సముద్రంబున మునిగి రామమూర్తినిచూచి స్వామీ

యిక యీరాజుచరిత్రం బేదియో అవినాకెరింగింపు మనగా రామమూర్తి ఈపలుకులువిని ఓరి భర్తృహరి చెప్పెద వినుమని చెప్పనారంభించెను.

ఓరి అంజనేయా! ఆప్రతాపచంద్రుండు కాళికాదేవియొద్ద కావలసినవరంబులు పుచ్చుకొని అడవిమార్గంబుగా పోవుసమయంబున ఒకరాక్షసుండు ఆహారనిమిత్తమై ఆయడవియంతయు చుట్టుతిరిగిజూచియు యెచటయున్న యేయొక్క ఆహారంబు చిక్కనందువలన బహుకష్టంబులం జెందివచ్చు సమయంబులో ఈప్రతాపచంద్రునిజూచి ఆ! హా! మంకు అధికరుచికరంబైన పదార్థంబు చిక్కెనని తలంచి యెదుటవచ్చి ఓరీ బాలుడా నీదియేదేశంబు యిచటికి రాను కారణం బేది యని యడుగుటను ప్రతాపచంద్రుండుదానిని జూచి అయ్యో దైవమా నేను నేటిదినంబు ఈరాక్షసునికి ఆహారమైతిమి గదాయని చింతించి వానినింజూచి అయ్యా నేనుండెడను ఈరాజ్యంబునకు ఉత్తరభాగంబై నారాజ్యమున తల్లిదండ్రులు నిరుపేదలైనందువలన యిట్లు అడవి పాలైతిని యనిచెప్పగా రాక్షసుండు ఆబాలుని జూచి అబ్బా నీవు చెప్పిన పలుకులు వినగానే నాకాకలి యెచటనో మరిగెను అయినప్పటికిన్ని సంతోషము నేనున్ను నీగతివాడనై యున్నానుగాని మరి యేమియులేదు మనమిద్దరున్ను అన్నతమ్ములమై జెలగి స్నేహంబొంది కాలము గడుపుదమన్నా మనగా ప్రతాపచంద్రుండున్ను ఆపలుకునకుసమ్మతించి రెండు దినంబులు వానితోయుండి తానువచ్చిన కార్యంబెల్ల దెల్పి ఓరి నాస్నేహితుడ! నేను కొంతదూరంబుపోయి నాకార్యంబు సమకూర్చుకొని వచ్చునమయంబున నిన్నుజూచి కొద్దిసంగతులను చెప్పెదను అనిచెప్పి వానియుత్తరువు బుచ్చుకొని వెడత్రాయ యిటుల కొంతదూరంబుపోగానే యింకొక అడవియందు ఒకరాక్షసుండు తనకు తగుబాటి స్నేహితుండెవడు చిక్కునో యని తపంబుచేయుచుండెను అప్పుడు నారాజకుమారుడు వానివద్దకుంజని అబ్బా రాక్షసుడా అడవియందు త్రాగుటకు నీళ్లు చిక్కునాయనియడుగ ఆపలుకులువిని రాక్షసుండు ప్రతాపచంద్రునిచూచి ఓరిబాలకా! నిన్నుజూడగా రాజపుత్రునిగా యుంటున్నావు నీవు యిటులఒంటరిగా యిట్టిఘోరమైన అడవికిరాను కారణంబేమని యడుగగ ప్రతాపచంద్రుండు యీపలుకులువిని అయ్యా నేనొకకార్యార్థంబుగాబోవుచున్నాను యీయడవియందునడచి బడలికగలిగి దాహమధికరించి నీళ్ళుగానక యెచ్చటను నీళ్ళుగనబడనందున కడపట మిమ్ములజూడనైతిని మీరుకృపయుంచి నాకుజలముండుచోటుజూపి నయెడల మీరేతలిదండ్రులని నమ్మెదను యిట్టి యడవియందు మిమ్ముగాన

యితరులెవ్వరులేరునన్నుగావసమయమయ్యా యునిదయాపూర్తితో యడుగు
వసమయంబున ఆ రాక్షసయోగి ఓరి రాజోత్తమా నీకు కావలసిన జలంబు
యిచ్చెదనుగాని నీతోడ యందుండు చెంద్రాయుధ ప్రభావంబేమని యడు
గగా ప్రతాపచంద్రుండు ఆలకించి తనపుట్టుపూర్వోత్తరంబెల్ల తెల్లంబుగా
వుల్లముప్పొంగిచెప్పెను ఆపలుకునువినగానె రాక్షసుండు నిజరూపంబుదాల్చి
యెదుటవచ్చి ఓరి బాలకా నేననేక దినంబులనుండి తపంబుచేయుచున్నాను
నాతపంబునకు సమ్మతించి యీశ్వరుండు ప్రశన్నుండై ఖడ్గంబుతోగూడ
యొకబాలుండు రాజపుత్రుండై బట్టి యీయడవిమార్గంబుగానచ్చును అట్టి
సమయంబున నీపాపంబు విమోచనంబగును యని చెప్పి మీ రిరువరున్ను
మిత్రులుగాయుందురని వరమిచ్చి వెళ్లిరి అదిమొదలుకొని నిన్నుజూచుచుం
టిని నేడు నాభాగ్యంబు పూర్తిగలిగెనుయని యిరువురున్ను ఆలింగనంబుచే
నుకొని ప్రతాపచంద్రుని తనగృహంబునకు బిలచుకొనిపోయి తగుబాటివిం
దులు సలిపియిటుల రెండు మూడుదినంబులు యున్నసమయంబున ప్రతాప
చంద్రుండు చంద్రవదనిపై మోహామధికరించి రాక్షసునిచూచి ఓరిమిత్రమా!
నేనొచ్చిన కార్యంబు పూర్తిగావలెను గనుక తమరు వుత్తరువు యిచ్చిన
నేనుపోయి నాకార్యంబు పూర్తి చేసుకొని కొద్దిదినంబులలో వచ్చిచేరెద
నని చెప్పగా అంతలో ప్రతాపచంద్రుండు వెడలి అడవి కొండలు నదులు
మొదలైనవాటిని దాటిపోవుమార్గంబున తనకు నడచుటకు శక్తిలేక అచ్చో
టయుండిన కొలనిలో దాహముదీర్చుకొని యొక విశాలంబైన మఱ్ఱిచెట్టు
క్రిందశయునించెదమని మనంబెంచి తనచంద్రాయుధము తలక్రిందుగాబెట్టి
శమునించెను ఇట్లుండగా ఆమఱ్ఱిచెట్టుపై గండభేరుండపక్షి పిల్లలుచేసి ఆ పి
ల్లలకు అహారనిమిత్తార్థంబుగా అడవికిపోయి యుండెను అట్టిసమయంబున
అయిదు శిరంబులుగల నాగేశ్వరుండు ఆ చెట్టెక్కి పిల్లలతినుటకై బో
యెను ఆ నాగేశ్వరుని ప్రతాప చంద్రుండు చూచి ఆ! హా! ఈ సర్పము
యీచెట్టుపై యుండునట్టి పిల్లలతినుటకు ప్రాకుచున్నదిగదా దీనినిచంపక విడ
చిన యెడల క్షత్రియకులంబులకు ధర్మంబుగాదని మనంబెంచి తనచంద్రా
యుధంబెత్తి ఆసర్పంబును తునక తునకలై నరికివేలి దాను యెప్పటివలెనె
శయనించి నిద్రించెను యింతలో అడవికి బోయి యుండిన గండ భేరుండప
క్షులు ఆహారంబెత్తుకొని గూటికి సమీపంబున రాగా అపిల్లలు కూతలు వే
యక మౌనముగాయుండెను యిట్లుండగా ఆడపక్షి పిల్లలనుజూచి ఓనాథా
నా! ఏలయిట్టిమౌనంబు ధరించియున్నారు మీకాకలిశి ఆహారంబు గొనిరా

లేదని కోపమూ లేక ఏమికోపము గలిగెను మాకెరింగింపుమని యడుగగా పిల్లలుతల్లినిచూచి అమ్మా! నిమ్మా ప్రాణంబుపోయి యున్న యెడలఎవరికిఆహారమిత్తురో తెలియునై నదిగాన అదిగోదిగువశయనించియుండుపుణ్యాత్మునివల్లమా ప్రాణంబునిలిచెను యిదిగోచూడుముతునకతునకలై బడియున్ననాగసర్పము మమ్ముల మ్రింగవచ్చెనుఅవి యెగిరి వారిచంద్రాయుధంబువల్ల జంపిరిగనుకవారు ఏమికార్యంబుగా వచ్చినారో అవివిచారించి వారికార్యంబు పూర్తిచేసివచ్చిన పిమ్మటమేము ఆహారనిమిత్తమై ఆరగింతుముగాని యిట్టిసమయంబున మీరుగొనివచ్చిన ఆహారంబుయొకప్పుడున్ను తినజాలమయని చెప్పగా చాలాసంతోషంబు జెంది రెండుపక్షులున్ను ప్రతాపచంద్రుని యొద్దకువచ్చి ఓపుణ్యపురుషా నీవల్లగదా నాబిడ్డల ప్రాణంబునిలిచెను మాకులదేవులై వచ్చితిరి మమ్ములను గాపాడితిరి మీకృపాకటాక్షము మాపై యుంచితిరి మేముధన్యులమైతిమి మీరిపుడు ఏకార్యంబుగా యిచ్చోటికి వచ్చితిరిమాకెరిగింపుమని యడుగగా ప్రతాపచంద్రుండు యీపలుకులనువిని ఓపక్షులారా మిమ్ములనునన్నుగాపాడుటకుపరమాత్ముండొక్కడై యున్నననుజ్ఞ నావల్లగలిగినదని యెంచకుము అయితే నేనిప్పుడు యీమూడు సముద్రంబులున్ను దాటి ఆవలయుండు పాలవనముసకుంబోవలెను యని చెప్పగా ఈపలుకులువిని పక్షులుఅయ్యా మీరూపుచూడగా రాజపురుషులై యున్నారు. మీరుఅచ్చోటికి బోయినయెడల నితములేని తుమ్మెదలు మిమ్ముల తరుమగొట్టును అనిచెప్పగా ప్రతాపచంద్రుండుపక్షులనుజూచి ఓపక్షులారా మీరు నావల్లపై లేనియెడ నాకెవరు దిక్కు యని చెప్పగా ఆపక్షులు సంతోషించి తనభుజంబుపై నెక్కించుకొని గగనమార్గం బెగిరి మూడు సముద్రంబులున్ను దాటి అవలయున్నట్టి పాలడవియందు కొనిపోయి విడిచెను, విడువగానే ఆరాక్షసుండు చెప్పిన కాళికాదేవిగుడి గోపురం బెక్కి ఏడవకుండ యుంచున్నట్టి బంగారుడబ్బి నెత్తుకొని తటుక్కున పక్షులయెదుటవచ్చి నిలిచెను. అంతట ఆపక్షులు వానినిచూచి ఆశ్చర్యంబునొంది వానిని తనభుజంబుపై నెక్కించుకొని తానుండు చోటికి వచ్చిచేరెను. ఇంతలో పిల్లను తల్లినిచూచి అమ్మా వారికార్యంబుపూర్తిగలిగెనాయని యడుగగా ఓకుమారులా వారికార్యానుగుణ్యమైమహాసంతోషంబుంజెందిరనిచెప్పిపిల్లలకు పండ్లుఫలాదులతినుమని చెప్పిసంతోషకరంబుగారాజునుబొమ్మనిజెప్పిపంపెను. అంతటప్రతాపచంద్రుండుసంతోషసముద్రంబునమునిగినవాడై రెండవస్నేహితునిఇంటికి వచ్చినడచినసంగతులనియువానికిజెల్పి ఓమిత్రుడా నేనుబోయెదను. ఇదినీకు

చిహ్నము బెట్టెదనుయని వానిగోడపైగంధపుముద్దనుగొట్టి నాప్రాణంబుబో
యినయెడల ఈగంధంబుదిగువంబడును, అవిజూచితక్షణంబు బారివచ్చి ఈచెం
ద్రాయుధమును చక్కగానూరు వగలుగు నటుల త్రోమిన యెడ నాప్రా
ణంబు వచ్చునని చెప్పి ఆచోటువిడిచి మొదటి స్నేహితుని ఇంటికొచ్చెను.
ఆస్నేహితుండున్న సంతోషంబుజెంది పోయిన కార్యంబెల్ల విచారించెను.
ఆప్రతాప చంద్రుని వద్ద జరిగిన దంత నిశ్చయంబుల చెప్పి పిదప వానిని
చూచిఓ రాజసమిత్రుడా నేనొచ్చి బహుదినంబులాయెను నేనాచోటికిం
బోయెదను నీకు యొక గురుతు జెట్టెదను. అవి ఏమనగా ఇదిగో ఈమల్లి
పూలచెట్టు బెట్టితిని, ఇవి ఎన్నటికి క్రుంగుచున్నదో ఆదినమునకు నా ప్రా
ణంబు బోయెనునని యెంచి త్వరగా వచ్చి ఈచెంద్రాయుధంబుతోమిన
యెడల నాప్రాణంబు నాకు వచ్చునని చెప్పి ప్రయాణంబై అడవి కొండ
నదులు ఏర్లు ఇవి యంతయును దాటి రాక్షసునియుహాడిసమీపంబుగాబోయి
అగడ్తయందున్న గిడ్డిద్వారపు మార్గంబుగాపోయి చంద్రవదనియెదుటనిల
చియుండు సమయంబునరాక్షసుండు మహా గోష్టంబుతో అట్టహాసంబు
చేసుకొని యింటికి బారివచ్చెను. యింతలో చంద్రవదని నాయకుని చూచి
నాయకా మన మిద్దరున్న రాక్షసునికివిందుగావించెదను, మనప్రాణంబు
నేటిదినంబె హాతమై బోయెనుయని శోకించగా ప్రతాపచంద్రుండు ఈపలు
కులువిని నాయకీ నీవేల భయంబు జెందెదవు, ఇదిగో చూచితివా వానిప్రా
ణంబు నాచేతియందున్నదియని డబ్బి తెరచి ఆనాలపురుగును చూపి దాని
కాళ్లను త్రుంచెను. అట్టె సమయంబున రాక్షసుండు నేలంబడి బొరలుచు
పీనియొద్దకువచ్చి ఓరిదుష్టుడా నన్ను చంపబోకుమునిన్నునేమిచేసితివి, యని
చెప్పునంతలో ఆపురుగు తలనుద్రుంచెను, అప్పుడే వానిప్రాణంబు బొత్తిగా
పోయెను, అంతలో వారిరువరున్న వానినెత్తి దహనంబుచేసి ఆవలసంతో
షసముద్రంబున మునిగి మన్మధ కేళీవిలాసంబులాడుచు మారుతంబునుదూ
రుచు మనస్సు వచ్చినట్లు లీలా వినోదంబులు సలుపుచు కాలంబు గడుపు
చుండిరి. ఇట్లుండగాయొకానొకదినంబున ఇరువరున్న సంతోషంబుగాఅలం
కృతంబుచేసుకొని కోటముఖద్వారంబునవచ్చివీధియందంబుచూచుచుండిరి.
అట్టిసమయంబున విచిత్రపురిని పరిపాలించునట్టి విచిత్రమహారాజు వేట
కుంబోయి వేటయాడి అమార్గంబుగావచ్చునట్టి రాజునుచూచిఇరువరున్న
ను నాయూసమైలోపలపోయిరి అట్టికాలంబునచంద్రవదనికాలియందుధరించి
యున్నట్టి పాదరక్ష యొకటి నీళ్లయందుబడెను. అవి జూడక అంతఃపురం

బుపోయి కిటికి బంధనంబు చేసుకొనెను. ఆమార్గంబుగావచ్చు రాజుదాని రూపలావణ్యంబుజూచిఆశ్చర్యంబుజెంది ఆకిటికీవద్దకుపోయి జూడగానాపాద రక్ష జిక్కెను అవియెత్తుకొని కనుల నొత్తుకొని తన రాజ్యంబైన విచిత్ర పురికింబోయి జేరి అన్నహారంబు లేక శోకాక్రాంతుండై మంచము మీదు శయనించి రేయుంబగళ్లు ఆసుందరాంగి చింతనేగాని మరియేమియుతోచక రాజ్యనీతులనుమరచి సుందరీ సుందరీయనుచింతనే మేలిమిగా యుండెనుఇ ట్లుదినదినమున్ను శోకంబుజెంది దేహంబు శుష్కించియున్న రాజునుమం త్రిజూచి అయ్యో యిదేమిఅపవాదంబు యిటులరాజు శుష్కించుటకు కారణంబేమో విచారించెదమని రాజువద్దకు వచ్చి రాజోత్తమా మీరు యిటుల శోకంబుజెందుటకు కారణంబేమో నాకెరిగింపుము యనియడు గగా రాజుమంత్రినిజూచి ఓమంత్రివర్యా నేను వేటకుపోయి యున్నసమ యంబున ఆయడవియందు ఒకవిచిత్రమేడను జూచినాను ఆచోటున నొక సుందరినిజూచి భ్రమజెందినాను దానియొక్కకుడిపాదంబునధరించు కొను నట్టి పాదరక్ష యిదిగోజూచితివా యీపాదరక్షనే యింతటి యందంబై యుండగా దానియందంబెట్లు యుండవచ్చును నాకావనితను తెచ్చి యిచ్చి నయెడల నా ప్రాణంబు నిలచునుగాని లేనియెడల ప్రాణంబునిలువంజాలదు యనిచెప్పగానే మంత్రి యివియంతయు యోచించి మీయిష్టప్రకారము కొనివచ్చి యిచ్చెదను శోకంబువిడచి యుండుమని చెప్పి రాజ్యమునకు పోయి టక్కుల మారియైన ఒక ముసలిదానికి ఈసవిస్తారంబెల్ల చెప్పగా నేనుకొనివచ్చెదను యనిధైర్యంబుచెప్పి తన యింటికిపోయి ఒక గంపనిండు బూడిదెనెత్తుకొని ఆమహాడవి యెదుటపోయి కొష్టంబులాగుబూడిదనుపేల్చి ఆబూడిదయందు పొరలి యేడ్చుచు అయ్యో కూతురా నన్నుఒంటరిగావిడ చిపెట్టి యిటుల మరణమొందుటకు కాలంబుగలిగెనాయని పెద్దధ్వనియెత్తి యేడ్వసాగెను అట్టి సమయంబున ప్రతాప చంద్రుడున్ను చంద్రవదనియు యిరువురున్ను ఉల్లాసంబుగామహాడవిచుట్టివచ్చునసమయంబునఈకంఠధ్వనివిని తననాయకుని జూచి ఓనాయకా ఎవతో నావంటి స్త్రీజన్మంబు అధికశోక ముగా యేడ్చుచున్నది అచ్చోటికి పోయిదానిసవిస్తారంబెల్లవిచారించివచ్చె దనని చెప్పగా ప్రతాప చంద్రుండు తన నాయకినిజూచి నాయకీ(స్త్రీబుద్ధిః ప్ర ళయాంతకః) యను వాక్యమునకనుసరించిన స్త్రీబుద్ధిప్రళయాంతగతమౌనని విరక్తితో యెచ్చోట నైనను పిచ్చల విడియై యుండుటయుచితంబని తనకు దానెగుండుచు భార్యకు తననిజస్థితియందుండులోపములనువెలిబుచ్చి ఖండి

తముగా ఆపద సంభవించియే తీరును పోబోకుమని తర్కింపగా చంద్రవదని ఈపలుకులను విని నాయకునిపై కోపమధికరించి నాయకా స్త్రీలకందరికిన్ని అల్పచిత్తంబేగాని మరి యేమియులేదు ఎట్టి ఆపదనో విచారించి దానిని ఆపదను తీర్చకపోయినయెడల రాజకులమునకు అందంబగునాయని తర్కించి చెప్పగా ప్రతాప చంద్రుండు నాయకీ నీవుపోయినయెడల యేమైన ఆపద సంభవించును వెనుకచింతింపబోకుము యని చెప్పి పొమ్మనెను అంతట చంద్రవదని నాయకునివద్ద యుత్తరువుజెంది ఆముసలిదాని వద్దకుంజని అమ్మా నీవెవరు యిటుల దుఃఖించుటకు కారణం బేమని యడుగగా ఈపలుకులను ముసలిది విని ముఖమెత్తి చంద్రవదనను జూచి అమ్మా! నన్నుగన్నతల్లి నన్నువిడనాడి ఎటులమరచియుంటివని చాలమాటలుబల్కి మరల ఓఅమ్మా నాపుత్రికయున్న నీరూపమై యుండును ఆ చిన్నది మరణమొంది నేటికి రెండుదినములాయెను యిపుడు నీముఖముజూడగా నామనస్సు చల్లారెను అని చెప్పగా చంద్రవదని ముసలిదానినిజూచి అమ్మా నీకెవరు లేదా యనియడుగగా వ్రాయమ్మా నేనున్ను నాపుత్రియు యిద్దరేగాని మరి యెవరున్నులేదు నేనొంటరిగా నుండుటకైనను యిచ్చటని మరణమొందిన యెడలఖ్యాతిగలుగును నాకెవరుదిక్కున్నారు నన్ను గారాబముతో చూచువారెవరని చెప్పెను తర్వాత చంద్రవదని మనస్సుకరిగి అమ్మా నావద్దయుండుము నీవుమరణమొందిన యెడలనిన్ను దహనముచేసెదనుయని ధైర్యము చెప్పితన వెంటబిలచుకొని అంతఃపురముపోయెను యివి తెలసి ప్రతాపచంద్రుండుతననాయకినిజూచి వోసుందరీ యిటులబిలచుకొని వచ్చినావే ఏమిమోసము జరుగునో తెలియదు నీమనస్సునకు కొరతను చెప్ప జాలను అయినప్పటికిన్ని నీవు మాత్రము బహు జాగ్రతగా యుండవలెను యని చెప్పి భోజనకృత్యములు తీర్చుకొని శయన గృహముజేరి మన్మధ రతికేళి జరిపి కాలము గడుపుచుండిరి.

ఇట్లుండగా నొక్కదినమున ఆముసలిది చంద్రవదనిని జూచి అమ్మా మనము మువ్వురు మాత్రము ఈ రాజ్యమున యుండుటకు ధర్మంబా ఇతరమైనవారువచ్చి నీనాయకుని చంపిన యెడల మనకేమిగతి యనియడుగగా ఈ పలుకువిన్న చంద్రవదని ముసలిదానినిజూచి అమ్మా నానాయకునియితరులు చంపుటకు సాధ్యబడ జాలదు, ఏలనగా వారిచేతయున్న చంద్రాయుధంబెన్నడు నలువుతిరుగుతున్నదో ఆనాటికి వారిప్రాణము పోవును, ఈరహస్యము ఇతరులెవరికి తెలియదు యని చెప్పగా ఈపలుకులువిన్న ముసలిది సరేయని సమ్మతించి వారితోగూడియుండి కాలము గడిపెను. ఇట్లుండగా యొకసమ

యమున చంద్రవదనయు ప్రతాపచంద్రుడున్ను యిరువురుభోజనకృత్యంబులు తీర్చుకొని శయనాగృహమున నిద్రించు సమయమున ముసలిది రాత్రి పండ్రెండుఘడియలకు లేచి పిడకలనుపేర్చి ప్రతాపచంద్రుండుప్రక్కనయున్నట్టి చంద్రాయుధంబెత్తి ఆపిడకలయందుంచి నిప్పుబెట్టెను అవికాల్చిన వాసనె వరికిన్ని తెలియదు. అటులకాల్చినపిమ్మట చంద్రాయుధమువల్లనైపోనందున ప్రతాపచంద్రుండు మరణమునకు సమమైన మూర్ఛజెందెను. ఇంతలో సూర్యుండు పూర్వదిక్కున వుదయించిరాగానే చంద్రవదనలేచినాయకుని కదలింపగా, ప్రతాపచంద్రుండుగతించియుండుట యుండగాజూచి అయ్యో నాయకా నన్ను ఇట్టిగతిచేయుటకు యెన్నిదినంబు లెంచియుంటిరి. నిన్నుగొని పోయిన హత్యకి నన్నుగొని పోవక విడచినాడే యని చింతాక్రాంతురాలై యేడ్చుచు శోకించగా యా ముసలిది చంద్రవదనను జూచి అమ్మా ఏల చింతించెదవు. నేను ముందేచెప్పలేదా పురుషులను నమ్మరాదు. మనముముందు జాగ్రతగా యుండవలెనని బల్కితినే, నామాటను జవదాటి నడిచితివే, ఇక ఏమి చేయువచ్చును. ఇచట యొంటరిగా మనమున్న యెడల మనప్రాణము పోవును. గనుక నీనాయకుండు బ్రతికివచ్చువరకు నాయింటికిపోయి యుందా మురమ్మనిబిలవగానేచంద్రవదనయునిశ్చయంబని మనంబుంచి తననాయకుని ఒకపెట్టెలో పరిమళగంధములుబూసి అందు నాయకునివుంచి పెట్టెనుమూసి ఆపెట్టెపైఒక కాగితంబునంటించుటకుయత్నించిఅయ్యా నానాయకుని యెవరైనా లేపినయెడలవారునానాయకునితోడ్కొని విచిత్రపురపట్టణమునకువచ్చి నన్ను బిలచుకవత్తురనిఆకాగితముపైవ్రాసిపెట్టకునంటించి వేసి కోటకు బీగంబు వేసి ముసలిదానితో గూడబోయెను. అప్పుడు మోసము జేయువలెననితలంచిగదా యిట్టికార్యముచేసినది యీసందర్భంబు చంద్రవదనికి యెరుకతో తెలియదు అంతలో ఆముసలిది విచిత్రపురియుం జేరి వనితను విచిత్రమహారాజుగారి సముఖమునకు గొనిపోయి విడిచెను. అప్పుడుచంద్రవదని అయ్యో దైవమా ముందునాయకుండు చెప్పిన పలుకులు వినక యీముసలిని బిలముందుజేర్చినందున యిట్టి కష్టంబులభించెను. అయినప్పటికిన్ని సంతోషముయుని తన మనంబెంచి యుండగా విచిత్రమహారాజు చంద్రవదనినిజూడగానే మోహతాపం బధికరించి ఓసుందరాంగి యని మంచమువిడచి ఆలింగనముచేయుటకుంబోయెను. అట్టిసమయంబున చంద్రవదని దూరముగానిలచి అయ్యా యింతటివరితాపంబు పురుషులకుగూడదు చేతచిక్కిన తర్వాతతినుటకు ఒకకష్టంబా నిదానించుము. తమబలాఢ్యం బెరిగిగదా యిటువ

ఛ్చినాను నేను అచ్చోటనే ఒకవ్రతమనుష్టించియుంటి ఆవ్రతము తీరుటకు యింక ఆరునెలలున్నది అదివరకు యోర్చి యుండుము యనిచెప్పగా విచిత్ర మహారాజు నిదానించి నీయిష్టంబుగా చేయుముయని సమ్మతించి యుం డెను యిచట యిట్లుండగా ప్రతాపచంద్రుండు మరణమూర్ఛ జెందినపిమ్మ టఆస్నేహితులైన రాక్షసుల యిండ్లయందు బెట్టివచ్చిన చిహ్నములు నేలంబడెను యివిచూచి యిరువరున్ను వెడలి ప్రతాపచంద్రుని వెతకుచువ చ్చుసమయంబునఆకోటకనబడెను ఆకోటచూడగానేచుట్టుజలమునిండియుం డెను. అంతట రాక్షసులు జలంబునదుమికి నాలుగు ప్రక్కలు వెతకుచూవ చ్చుసమయంబున చిన్నగది నగుపడెను అవిచూచి కాలితోతన్నగానేఆగది రెండు తునుకలాయెను అంతలో యిరువరున్ను లోపలప్రవేశించి యొక్కొ క్క గదియున్ను శోధించుచువచ్చు సమయంబున యొక గదియందుఆపెట్ట యుండెను ఆపెట్టకుపైగా వ్రాసి యున్నదానిని చదివి జూచి పెట్టనుతెరచి ప్రతాపచంద్రునిజూచి కంఠనీళ్ళుజారి వ్యసనాక్రాంతులై వారి దుఃఖమును వారెనెమ్మదించుకొని పిమ్మటమనముయిటులుండుటతగుబాటిగాదు వీని చెం ద్రాయుధంబెక్కడయున్నది చూతామని వెతకుచూ పోవుసమయంబునపెర టియందు పుటముబెట్టి చల్లారకయుండు పుటములో రగులుటను జూచి నా నిప్పును చల్లార్చి చెంద్రాయుధంబెత్తి ఆరబెట్టి పిమ్మట యిటిక రాయి పొడితోరుద్ది పైబట్టియున్న నలుపంతయు శుద్ధిచేయగా ప్రతాపచంద్రుం డునిదురలేచినవానివలెలేచినాయకీయనిధ్వనియెత్తి బిలచినలుప్రక్కలున్ను జూడగాయటనిలచియున్న స్నేహితులనుజూచి వారివలనసంగతులనెరిగిపిమ్మ టముప్పురున్ను వెడలి చంద్రవతియుండు రాజ్యంబునయొకముసలి దానియింటి కింబోయిముప్పురికిన్ని అన్నంబు బెట్టుమని యడుగగాఅవ్వా బాలకులారా నేను రాజుగారింటికి పుష్పంబులు గట్టుచున్నాను. నావల్ల సాధ్యబడజాలదు యనిచెప్పెనుగాన నాముసలివల్ల సంగతులంతయువినుకొని అవ్వా ఆపుష్ప హారంబు నేనుగట్టి యిచ్చెదను మాకన్నంబు చేయుమనిచెప్పగా ముసలిదిన మ్మతించి అన్నంబు చేయుటకుం బోయెను యింటిలో ప్రతాపచంద్రుండు తనసందర్భమెల్లను కాగితంబునవ్రాసివాటితో నాయకీ యికనోముతీరిందని చెప్పి వానిని అయిదు అంతిస్తుల రధముజోడించి వాటియందుమనమున్ను రధముచేసినవారున్ను యెక్కి రాజ్యప్రదక్షిణంబువచ్చి సంతోషంబుజెంద వచ్చునని చెప్పి రధముచేయుటకు యత్నింపుమని వ్రాసి ఆపుష్పహారంబు నబెట్టి ముసలిదాని చేతనిచ్చి పంపిరి. ఆముసలిది పుష్పహారంబెత్తుకొనియతి

వేగంబుగాపోయి చంద్రవదనియొద్ద పుష్పహారం బిచ్చెను అంతట చంద్రవదని పుష్పహారంబిప్పిజూడగా వాటిలో కాగితముండెను ఆకాగితము విప్పి చూచి తననాయకుని కాగితంబని కన్నులయందు నొత్తుకొనిసంగతులన్నియు చదువుకొని మర్మంబుగా యుండెను. నాటిదినము మధ్యాహ్నకాలంబున చిత్రవర్మ మహారాజు భోజనముచేసుకొని చంద్రవదన యెదుటవచ్చి నాయకీ యిక యెన్నిదినంబులు కాలహారణంబుచే నామనస్సు చంచలచిత్తంబై విలుకాచున్నది. నాతాపంబును తీర్చుటకు నీమనస్సు పొంగలేదా యని చింతించగా చంద్రవదన చిరునవ్వునగచు రాజోత్తమా నేటితో వ్రతము పూర్తి ఆయెను. రేపుమీరు నాపై దయయుంచి నన్నువరించనుమనోభీష్టయంబున్న యెడల అయిదుఅంతస్తులుగలరథ మొకటిఅలంకరించివాటిపైమన మున్ను నన్నుబిలచుకొనివచ్చిన ముసలిదియు ఈరథముచేసినవారును యెక్కి రాజ్యవలయంబువచ్చి ఆవల సంతోష మొందవచ్చును యని చెప్పగాచిత్రవర్మ మహారాజు సమ్మతించి రథముచేయుటకై మంత్రికియుత్తరువుచేయగా మంత్రివెడలి రాజ్యమంతయుచుట్టితిరిగి వడ్లవారు చిక్కక చిక్కులబడి తిరిగి వచ్చు సమయంబున యీముప్వురున్ను వడ్లవారివలె వేషంబు దాల్చి వీధియందు నిలచి యుండిరి. అట్టి సమయంబున మంత్రి నాలుగు వీధుల వెతకి యెవరున్ను గానక వచ్చుచుండు సమయంబున వీరినిచూచి ఎవరని విచారించగా అయ్యా మేమువడ్లపనిచేయు వారని చెప్పగానే వారిని బిలచుకొని పోయి రథముచేయుమని చెప్పిరి. యిట్లు చెప్పగానే వర్లివారలు సమ్మతించి ఆ రథమును నిమిషంబులలో సూక్ష్మ అంతస్తులు బెట్టిజోడించి రాజునకు చెప్పగారాజు అలంకారంబుచేసుకొని రాగానే మొదటిఅంతస్తునందు ముసలిదానియున్ను రెండవ అంతస్తునందు రాజును మూడవ అంతస్తు నందు చంద్రవదనియున్ను నాల్గవ అంతస్తునందు ప్రతాపచంద్రుడున్ను అయిదవ అంతస్తుయందు రాతనులు యిద్దరున్ను గూర్చుండుకొని రథము నడపిరి. అంతలో పై రెండు అంతస్తులున్ను తటక్కున గగనమార్గం బెగిరి భూమియందుబడి వారిరువరున్ను ప్రాణహత్యంజెందిరి. అంతట ప్రతాపచంద్రుండు తనభార్యయున్ను స్నేహితులున్ను దోడ్కొని తన తల్లితండ్రుల యొద్దకుంబోయి వీరి సుఖాసుఖంబులను జెప్పి పిమ్మట ముందు తండ్రిపరిపాలించిన రాజ్యంబునుబట్టుకొని రాజ్యపట్టాభిషేకంబునొంది ప్రతాపచంద్రుడున్ను వానిస్నేహితులున్ను సుఖానుభవ మొందిరి యనిచెప్పగా ఆండనేయుండు ఈ పలుకులు విని సంతోషంబుజెంది స్వామీ, ఇకమనము నిద్రించెదమురండని సుఖనిద్రం జెందిరి. ఏకాదశరాత్రికథ-సమాప్తం.

ఓమ్.

శ్రీ గురుభ్యోనమః.

# ద్వాదశకథారత్నము.

పన్నెండవదినము రాత్రి శ్రీ సీతారాములిరువురున్ను లీలావినోదం బులాడుచు జల్లగా వీచుచుండెడు మలయమారుతంబునకు ఆనందించుచు సుఖేచ్ఛంబొంది యుచ్చటాడు సమయంబున వాయుపుత్రుండైన ఆంజనేయుండు శ్రీరాములకు పాదార్చనఁజేయుచుస్వామీ॥తమరుయిదివరకు బోధించిన చరిత్రంబులంబోలి నేను పరమపావనుండనైతిని గాన యిప్పుడుదేవరహాస్యంబై చిరకాలము జీవించియుండుటంబట్టికారణసూక్ష్మమైన నొకచరిత్రంబును జెప్పుమని ప్రార్థించగా భగవంతుండు ఈ వాక్యంబులవిని ఆనందపరవశత్వంబొంది ఆంజనేయునిజూచి వాయుపుత్రా! నీవడిగినటుల జెప్పెద వినుమని భగవంతుడు జెప్పనారంభించెను.

## భగీరథమహారాజుకథ.

చిరకాలమునకుముందు భాగీరథియను దేశమును భాణవల్లభుడను రాజు పరిపాలించుచుండె. వారిభార్యయగు శరణాంబికయనుదేవితనకుగల పురుషభక్తిని తదేకముతో పురుషునికంటెఅన్యదైవములులోకములోలేదని ఏకచింతలో స్మరించుచు తనభర్తకు అర్ఘ్యపాద్యాదు లిచ్చుచు భక్తితో పూజించుచుశిరఃసాష్టాంగనమస్కారంబులుచేయుచుండుటంజూచి తనభర్త యగు భాణవల్లభుడు తనభార్యయగుశరణాంబికను యాలింగనంబు జేశి నీ భక్త్యాతిశయమునకు మెచ్చితి; యని యిప్పటిల్లుసమయంబున ఆకాశము నుండి యొకధ్వని వినబడెను. అప్పుడు భార్యాభర్తలు తమ వుత్సాహము చే ధ్వనిశబ్దించుటకు కారణంబేమని వూహించు సమయంబున నేనాకాశవాణిని! నేనాకాశవాణిని!! నేనాకాశవాణిని!!! యని ముమ్మారు పలుకుచు తమ ఏకమత్యమగు పాతివ్రత్యమునకు మెచ్చితినని లోకమంతయుప్రళయకాలరుద్రునివలె ప్రకాశించునట్లు నొకపుత్రుని వడయుదురు వానివలన స్వర్గమునకు ప్రాప్తులవుదురని యెప్పటివలె ఆకాశవాణి నదృశ్యమాయెను.

ఇట్లు భార్యాభర్తలు నైకమత్యముతో సురతసౌఖ్యములం జెంది దేవేంద్రపదవింబోలినిత్యనైమిత్తిక శైత్యోపచారంబులఁగలిగికులధర్మముల యందును, రాజ్యధర్మముల యందును, ధర్మరాజునుంబోలిప్రకాశించుచుం డెను. గాన, మంత్రి ప్రధానవర్యులగు లోకులకు యిటువంటి ధర్మశీలురగు రాజుకు రాజ్యమును పరిపాలించు పుత్రుడులేదని చింతిల్లుచున్నరోదన రాజు

నకు తనబంటువల్ల వెల్లడియైనందున, రాజుతన భార్యయగు దేవికి తననగ
రిలోని వర్తమానమును విశదీకరించి చింతాక్రాంతులై యుండిరి. అప్పుడు
మంత్రి యధాప్రకారము కొలువుకూటమునకువచ్చి రాజకార్యముల నవలం
బించి యోచించు నప్పుడు రాజుతనకార్య క్రమముల నవలంబించి చింతా
క్రాంతులై యుండు తేజస్సును మంత్రిగుర్తెరిగి, రాజునుజూచి తమరు సం
తోషచిత్తులై యుండక, చింతతో యుండుటకు గారణంబేమని వందనం బిడి
యోచించియడుగు నప్పుడు రాజుగారు మంత్రినిజూచి మనలోనిచింత మన
నగరి యంతయు చింతాక్రాంతులవు చున్నందున నేనున్ను వెతలచే చిం
తిల్లుచున్నానని మంత్రితో నుడివెను. అప్పుడు నామంత్రియాలోచించితన
వర్తమానమును జెప్పందొడంగెను. పూర్వము యింద్రతీర్థమందు దేవేం
ద్రుండు నూరుయజ్ఞములు చేసి శతక్రతువనెడి పేరంబరగి గొప్ప స్థానముడ
పొందెనుగాన అటువంటితీర్థమునకు సైన్యపరివారముతో బోయిగొప్పయజ్ఞ
మునుజేసి బ్రాహ్మణులకు తదితరులకు అన్నదానము, భూదానము, గోదా
నము, రత్నదానము, వస్త్రదానములు జేసి వారివలన దీవెనలు పొందిన యెడ
ల మనము రాజ్యమునకు తగినపుత్రుల బడయుదుమని జెప్పిన యదేప్రకా
రము భూణవల్లభుడను రాజుతన భార్యం జేరి సైన్యపరివారముతో బోయియజ్ఞ
యాగాదులు జేసి బ్రాహ్మణులకు తదితరులకు దానములు జేసి రాజ్యమునకు
వచ్చి పుత్రవాత్సల్యముతో యున్నప్పుడు తటస్థరూపముతో యీశ్వరుడు
సన్యాశిరూపమై యా రాజమందిరంబుం జేరి రాజునుగాంచి భిక్షాందేహి
యని ముమ్మారు బలుకునప్పుడు రాజు భిక్షుకునిజూచి ఆనందముతో స్వామీ
తమ పాదధూళివలన మాజన్మము సఫలంబైనది గాన మా మనోభీష్టమును
నెరవేర్చు యీశ్వరులైవేంచేసినట్లున్నదిగనుక భోజనకృత్యములు సర్వసిద్ధ
మైనది వేంచేయుడని జెప్పిన నప్పుడు భిక్షుకివీరిభక్తికి ఆనందపరవశులై వి
భూతిని మంత్రించి సుఖీభవయని రాజునకు బీజాక్షరమంత్రముల నుపదేశించి
భార్యనుంబిలిచి వీరిపాదములకుఅర్ఘ్యపాద్యార్చనాది అభిషేకంబుం జేయిం
చుమని తానున్ను శిశ్రూష చేయుచుండెను. అప్పుడుభగవంతుడగు భిక్షుకివారి
మనోభీష్టంబును నెరవేర్చుటకు వారియిష్టానుసారమైతృప్తితో నవరసాన్న
మగు అన్నమును భుజించి ఆకాశవాణి జెప్పినట్లు తానున్ను జెప్పియదృ
శ్యమాయెను. తోడనేవారున్ను యీశ్వరునిదర్శనంబునకుప్పతిల్లితదేకధ్యా
నముతో సురతక్రీడలం దేలునప్పుడు నా నెలయందు గర్భంబు వృద్ధింందేలి
ఈశ్వర నియమకాలోచిత ధర్మంబై వెనుక దశమాంతర శుభదినంబున

పూర్ణశశిసేఖరునింబోలిన పుత్రుకుజననమయ్యె. తర్వాతఆకాశవాణి యీగు ర్తునునవలంబించినేనాకాశవాణిని నేనాకాశవాణినియనిభీకరధ్వనితోశబ్ధించ గానగరమంతయుదిగ్భ్రమలంజెందిగగనములోశబ్ధించుచున్నదనియందరున్ను మైమరచియోచించునప్పుడు నేడురాజునకుజన్మించినపుత్రుడుభగీరధుడు, భగీ రథుడు, భగీరధుడు, యనినామంబిడి నదృశ్యమైపోయెను. నప్పుడునగరమంత యునధికసంతోషమును బొందియున్నకొంతసేపటికి దేవతలు పుష్పవర్షంబు లుగురిపించి తమతమ స్థానంబునకుంబోయి జేరిరి. ఇట్లుండు సమయంబున నారాజు తన మనోభీష్టము చేకూరెనని యుప్పొంగుచు తన మంత్రిప్రధా నులతో సంతోషవార్తలం దేలుచు పుత్రునికి జాతకర్మాదికార్యములంసలిపి సకలదానములున్ను జేసి తనరాజ్యకార్యములందేలి యెప్పటివలె రాజ్యభార మునువహించి పుత్రుడుకలిగెననినందరునుపరితపిల్లుచు ఆనందసముద్రమున నోలలాడుచుండిరి నప్పుడుబాలచంద్రునివలె పుత్రుడు దినదినము భివృద్ధి పొం దుచుండుటంజూచి ఐదేండ్లవాడు కాగానే వానికి విద్యాభ్యాసము జేయించ వలెనని బ్రాహ్మణులరప్పించి యోచించి సుదినమును జూడుమని జెప్పిన న్నదే ప్రకారము సుదినమునుజూచి విద్యాభ్యాసమునకు దినమును గుర్తించి ఆదినమందేవిద్యనుగఆవుటకు ప్రారంభించి విద్యనుజెప్పింప రాజపుత్రుడదే ప్రకారము ఉపాధ్యాయులు నుచ్ఛరించునట్లునుచ్ఛరించుచు నానాటికివృద్ధిం జేలుచు సకలవిద్యలను పున్నదున్నట్లుగా నేర్చుకొనుచు కాలమును వ్యర్ధ పుచ్చక అభ్యాసోన్ముఖుడై ఉపాధ్యాయుల మాటను జవదాటకయు, తల్లి తండ్రుల మాటను జవదాటకయు, పారమార్ధికదశయందే చింతంబొంది నుల్లంఘించుచు యుండెను.

ఇట్లుండు సమయంబున ఆపుత్రుని విద్యాకౌశలత్వంబునకున్ను ధను ర్విద్యకున్ను సకలలోక రాజులున్ను మెచ్చి నాపుత్రికకు సరియైనవరుడౌనని వారివారి తనభటులచేశుభలేఖలంబంపుచు సర్వసంపదలందలచుచు ఒక్కొ క్కరున్ను నెమ్మతియైనోరాడక వర్ణించియెదురుజూచుచుండిరి. అంతటభగీరథ రాజపుత్రునితండ్రి ఈశుభలేఖలకు యేమని బదులువ్రాయుదునని మంత్రితో నాలోచించునప్పుడు పుత్రునింకౌశలమునకునందరును మెచ్చియుచ్ఛగించుచు న్నట్లున్నది కానవీనిబలఘనధైర్యసాహసమునకుయీశ్వరాదులున్ను నోడిపో దురు. యీ పుత్రుని మనోభిప్రాయము యేలాగున్నదో తెలియదు. మన యిష్టప్రకారముయిచ్చవచ్చినట్లుమాట్లాడుటనైజంబుకాదని బాలునిరప్పించి రహస్య వచనంబులతో డెల్పినీమనోభీష్టముయేలాగున్నదని వక్కాణించెను.

ఇందుకు భగీరథుడు నాయనోభీష్టమై చెప్పెడి వచనంబులు తమకు నరిబోల్పంజాలదు గనుక నాకు పారమార్థిక విద్య పరిసమాప్తి గాక నేనొల్లను. యిందుగురించి తమ చిత్తవైకల్యమునకు నేభ్రమించినను నేఖ్లోమెద నని తన విద్యాశాలకుంజెంది కుశలమయ్యెను. ఇట్లుండగా రాజు తనపుత్రుని యత్యంతాభిప్రాయంబునకు మెచ్చుచు, ఆయా రాజులకుయింకాకొన్ని దినములైన తత్కాలశుభలేఖలంపుదుమనివారివారికిందగినట్లు నుత్తరములవ్రాసి పంపడమైనది. అంతట ఈరాజకుమారుడు తనయభిప్రాయమునకు యిచ్చట సరియైన అనుకూలము లేనందున తానుతననగరివిడిచినరణ్యమైన కారడవింజెంది మహాత్ములందర్శించి నాకోరికను పూర్తిజేశికొందునని నిష్కారణమై దలచుచు, ఒక దినమందు స్థిరతదెచ్చుకొని యెవ్వరికిందెలియకతన దారింబట్టుకొని తనయిష్టమైన ప్రకారము నడవినింజొరబడిబోవుచు అన్నపానాదులులేక కాయగసురులందినుచు చెట్లనీడలంబరుండి విశ్రాంతింజెందుచు, తన కోరికను జ్ఞప్తికిం దెచ్చుకొని బయలుదేరిపోవుచు నచ్చటచ్చట విసుకులేక మహారణ్యమైన కారడవింజేరి విశ్రమించుచుండెను. ఇట్లుండభానువల్లభుడను రాజు తనపుత్రునంగానక సకల దేశములకు తన నిజవార్తందెలిపియు జాడలేక అసంతోషులై విశ్రమించి యుండిరి. యింతట ఈరాజపుత్రుడు తాను వచ్చిన దారియు పోవుదారియు దెలియక మృగములచే తొట్రుపడియీశ్వరుని నైజస్వరూపమును చింతించుచు బాలసన్యాశియై తనకు యిష్టమైన చోటికింబోవుచు కాయగనురులందినుచు విశ్రమించుచు నొకభైరవాంతపురపు అడవినిం జొరబడినందు దూరదృష్టితోజూచుచు దారింగడచుచు తన వైకల్యంబునకు జింతించుచు నొక్కముని యాశ్రమంబుంజేరి నందుండు మణిస్థంభుడను మహర్షిని గని నేత్రానందముతోజూచి వారినుజ్ఞంగైకొని వారికిశిరఃసాష్టాంగ నమస్కారంబులుజేశి నేత్రానందబాష్పములతోమైమరచి దిక్కులేని ధీనుదీవలె వాత్రుచ్చక యిరుచేతులను శిరస్సాంతముంజేరంజేర్చి నిలిచెను.

యిట్లుండు సమయంబున మణిస్థంభుడువీనినింజూచి నిర్జనుష్యమైన యడవింజొరబడువారుయిదివరకెవ్వరుంగానముగాన, యితనుబాలసన్యాసివలె నగుపడుచున్నాడు వీని పూర్వోత్తరంబు నెరుంగంజాలము గనుక నమ్మతియై విచారింతమని అబ్బాకూర్చుండుము, చింతనువదలుము. సుఖప్రాప్తింజెందగలవని మందలించెను. అంతట నా యాశ్రమము మిక్కిలివిచిత్రముగయుండుటంబట్టియు మణిస్థంభుల మనోభిప్రాయము చల్లదనంబై యుండుటం

బట్టియు నా బాలసన్యాసియగు రాజపుత్రుడు వీరియందసూయ లేకమౌనము నవలంబించి వారిమాటలయందెమనస్సునిలిపి బాహ్యవికారములను వదలి నిశ్చేష్టితుడై యుండె నంతట నామణిస్థంభులు వీనిపరాక్రమధైర్యస్థైర్యము లను చిత్తపరిపాకమునకును మెచ్చియాశ్చర్యపడి మిక్కిలియాదరముతో తన స్థితిగతులగురించివిచారించుచుండిరి. గనుక నామణిస్థంభులువీనిపూర్వోత్తర సంగతులన్నియు తనకుచక్కగ విశదపడినందున వీని నామము భగీరథుండని తెలిసి వానికి కావలసినట్లుభక్ష్యభోజ్య చోష్యాన్నపానములిడితనకుంగావల సిన శిష్యునిగా పరిచారకత్వమై నొడంబడినందుండి చిరకాలమునకు తర్వాత తనకోరిక కొనసాగనందుకై చింతాక్రాంతత్వంబునొంది యోచించుచున్నయం బున, మణిస్థంభులు వీనినిజాభిప్రాయంబును సూక్ష్మమున తెలుసుకొని శిల ప్రశ్నచే వ్యవహారార్ణవమైన విషయమును బోధపడునట్లు తెల్లంబుగ ఉప దేశమున క్రమముగు మోక్షమును పొందునట్టినిర్వాణప్రకరణమును జెప్పె దను వినుమని, మణిస్థంభులు చెప్పట కారంభించెను.

మణిస్థంభుడను సిద్ధుడు భగీరథ మహారాజునకు
తన నిజాభిప్రాయమంతయు తేటతెల్లంబుగ జెప్పుట.

ఓరి బాల సన్యాసియగు భగీరథ మహారాజా నేజెప్పువాక్యంబుల నిశ్చలభక్తితో ఏకీభవించి వినుమని చెప్పందొడంగె. ఏమనగా; దివసవ్యవ హారమందు లక్ష్యమై ఖరింజేసుకొని తననిజమును తన తెలివియం దైక్యపరచి ఇదియుచితంబు, యుచితంబు గాదని యెరిగి సత్వగుణమై నాలోచించివ్యవ హారస్థితియందుండు కేసమభావత్వమైన వ్యవహారార్ణవం బనంబడు. ఇందు చిత్తవిశ్రాంతిని గలిగించి నీనిజత్వమైన మోక్షస్థితినిం జెందుటకు కారణనిరు పాధికమైన నిర్వాణప్రకరణమునందే జరిల్లుచు బ్రహ్మైక్య ప్రతిపాదనమందు చిత్తైక్యమునుభావించిమోహమహిమాభివర్ణనమందేజరిల్లుచుఅవిద్యోత్పత్తి ప్రకారమునుగుర్తెరిగి నిశ్చయతత్వజ్ఞానముచే చిత్స్వరూపానుసంధానమగు ప్రాణాయామముచేత వాసనను క్షయించి జిజ్ఞాసచేసిద్ధిమై అనేకయుగాదు లుండిమరణములేక మృత్యుబాధంబోగొట్టుకొని చిత్తసమాధివిషయిక ప్రాణ వస్తువును నిరూపించి ప్రాణాయామక్రమముచే ఆత్మానుసంధానము జేసి చిర కాలముజీవించియుండుటకు కారణంబై నసదవినింబోలిన విషయమును ప్రా ణాయామమగు సమాధిచేత నిర్మలత్వమైన పరమాత్మయందు చిత్తవిశ్రాం తినేనవలంబించి భూతభవిష్యత్తులయోచించక మరి సదృశ్యభావ ప్రవృత్తికా





లానుగుణ్యమై జరుగుచున్న ప్రాణాయామ కార్యమని దృష్టితో నవలం
బించి యాత్మరూపుండ నున్నాననిన్ని సుందరమైనపదార్థమును పొందితిన
నిన్ని ఈపదార్థమునుపొందలేదనిన్ని ఏవిధమగు వ్యాధులులేనివాడనై సుఖ
జీవిగా యున్నాననిన్ని ఆత్మరూపముకంటె వేఱగునది లేకపోవుటచేత నేను
ఏవస్తువును నిందించుట పొగడుటలేదనిన్ని రోగరహితుఁడై జీవించుచున్నాన
నిన్ని నామనస్సు శుభాశుభములు సంభవించునపుడు వ్యసనములు పొందు
చుండ లేదనిన్ని సర్వోత్తమమైన త్యాగబుద్ధి నవలంబించి జీవితము మొదలుగా
గల సర్వమును నాచే విడువబడినదనిన్ని నామనస్సు వర్తమానేష్ట వస్తుదర్శన
కుతూహలరహితమైన యిష్టవస్తువనుసరించిన పరితాపంబులేదనిన్ని భవిష్య
ద్దిష్ట వస్తువులందు వాంఛ లేదనిన్ని వీఁడు బంధువు వీఁడుపరుఁడు వీఁడునావాఁడు
వీఁడు నితరునివాఁడు అనునట్టి తలంపు నాకెన్నఁడు లేదనిన్ని సమాహితుఁడనై
ఆశాపాశముల శాఖారూపమైనచిత్తవృత్తికి నంతఃకరణ సమావేశంబు కలుగ
లేదనిన్ని సకల భూతములు సుఖాసుఖములై నున్నప్పుడు సుఖదుఃఖము
లగు సర్వభూతములకు మిత్రుఁడై యున్నాఁడనిన్ని నేను ఆపదలయందు పర్వ
తమువలె ధీరత్వమైన వాఁడనిన్ని సర్వభూతములకు సంపద కలిగినపుడు
పరమానందము గలవాఁడనిన్ని ఇవి భావరూప పదార్థము ఇవి యభావరూప
పదార్థములనిన్ని నియమిత భావ మభావములేక యెవరు నీ యాజ్ఞ నవలం
బించి యుందురో వారున్ను నేనున్ను ప్రత్యక్షానుభవమై యున్నందున చిర
కాలము రోగరహితుఁడనై యున్నవారము; గాన యోగిజ్ఞానపారగుఁడైన
బాలకా! నీకారణమునుంబట్టి నీయాజ్ఞ నవలంబించి చెప్పితినని విని యారాజ
కుమారుండు శిరఃసాష్టాంగదండప్రణామంబు లాచరించి సిద్ధత్వంబునొందితి;

దేవదేవోత్తమా! వేదసమ్మతమగు వృత్తాంతము నుచెవులకింపగునట్లు జెప్పి
తిరి, ఇంతియేగాక యాత్మోపాయంబగు మర్మంబులం దెలిపితిరి, నాజన్మంబు
సఫలంబైనవియనిన మణిస్థంభుడనుసిద్ధుడు పక్షివలె నెగిరి గగనమందంత
ర్ధానమై ఓరి బాలకా యింకా కొన్ని రహస్యంబులున్నవి తిరిగి వచ్చువఱకు
నేనుడివినట్లు అభ్యాసోచిత ప్రకారంబుండుడని జెప్పిన ఆదేశ ప్రకారము తదా
కారమై స్వస్వరూప స్థితితో యుండుసప్పుడు మణిస్థంబుడను సిద్ధుడు యెప్పటి
వలె తనతావుంజేరి బాలునిజూచి చేరంబిలచి ఓరిబాలకా! నేనుడివినవన్నియు
చక్కగా గుర్తెరిగి స్వబోధయందార్తింబొంది వున్మత్తునివలె వున్నదున్నట్టు
దెలిసి నిత్యనైమిత్తిక కర్మంబులం దగిలిదగలక యుండునట్లుండి తమ కార్య
ములయందాసక్తిలేక సదా నీవునీవై యుండుడని బోధించి రాజపుత్రుని
జూచి సకల లోకకర్తవవుదువని దీవించిన రాజు సమ్మతియై గురువాజ్ఞవడసి
తన నిజస్థానమునకు బయలుదేరెను.

ఇట్లుసిద్ధునివల్ల యనుజ్ఞపొంది వనాంతరము లన్నియుగడచి తన
యోగబలముచే సంతృప్తినొంది నిరాహారుడై జను సమయంబున నొక బ్రహ్మ
రక్షసి తనకాహారములేక నొక పర్వతశిఖరము మీదు నిలచి తనమాయా
బలముచే యవ్వనస్త్రీరూపమగు దేవరూపము నుదాల్చి బాలసన్యాసివచ్చు
మార్గముగా యెదుటంజని సరసవాక్యము లాడుచు బహుప్రీతితో నమస్క
రించి అయ్యా గురుపుత్రుడా తమ రెవ్వరు, తమనామమేద్ది, తమరుండు చో
ట్యేద్ది,అని వడుగుసమయంబున రాజకుమారుడు తనయోగబలముచే యా స్త్రీ
బ్రహ్మరక్షసియని దెలిసి గుట్టుదెలియకుండునట్లు తనలో తాను సమ్మతియై
మారు బలుకక ఓపికతో తినదారింబోవుచుండెను. అప్పుడు బ్రహ్మరక్షసి
వీడు నిశ్చలీయుడని మర్మంబెరుగక తన ఘోరరూపమునుదాల్చి వానింబట్టి
నులిమి భీకరంబు జేసి బహునవస్థలంగల్పించి వెతలుబెట్టు సమయంబున నా
రాజకుమారుండు తన యోగబలిమిదృష్టిచే నా రాక్షసి బలమంతయు
భూమికి జారునట్టుజూచి బ్రహ్మరక్షసికిం దెలియక సిద్ధరూపంబును దాల్చి గగ
నాంతర మయ్యెను.

ఇట్లు గగనాంతరమై నొక ప్రదేశంబుజని నచ్చట తన బడలికం దీర్చి
నెలరోజులుండందలంచి నొక్క వేదరాలి పెద్దమ్మయింటికింబోయి అమ్మా
నేను నాదేశమువిడిచి అన్నపానాదులు లేక బడలికతో నీయింటికి విశ్రమిం
చితి, నాకాహారంబు బెట్టుడు; ఇందుకుతగినట్టు తమకే మియ్యవలెనో తెలి

యుం జేయుడు, ముందుగా చెల్లించెద ననిన; నా పెద్దమ్మ నట్లే సమ్మతించి కొంత ధనమును బుచ్చుకొని తనకాహారం బిచ్చుచుండెను. ఇట్లుండు సమయంబున నా పేదరాలి పెద్దమ్మ ఓ బాలుడా నీరాజ్యమందొక విచిత్రముగలదుగాన నిందుగలనీసవిస్తరంబు తేటదెల్లంబుగ వక్కాణించెద వినుమని జెప్పనారంభించెను; ఓరి బాలకా నావృత్తాంతమును విననుత్సహించవలెను ఏమనిన నీపురియోనూన్నయోనగరంబు నిందునివసించు రాణి, లయోధనియను పేరంబడసి యచ్యుతుని రూపరేఖావిలాసనై లక్ష్మినారాయణాను గ్రహముచే నీనగరమును పరిపాలించుచున్నదిగాన, లయోధనిచర్యలు నిత్యాత్మకమై సరసోదయమగు వాక్యమునుంబోలి లోకమెల్లెడల తన నిజాభిప్రాయమును వెదజల్లి మనోభీష్టప్రాద్గుణ్యమగు ప్రశ్నలకుబదులెవ్వరాడుదురో వారికి నేనిష్టానుసంభూతురాలనని లగ్నపత్రికలంబంపి నగర్యాలంకారమగు స్థాప్యమునుచాటించియున్నందున్న సకలలోకరాజులున్ను శుభలేఖలను జూచి రథారూఢులై వేంచేసి యున్నారుగాన తమరున్ను యీసమయమందు నగరి అలంకారమున్ను రాజచర్యలున్ను జూచిరావలయునని పేదరాలి పెద్దమ్మ వినయముతో జెప్పగా నాపుత్రుడు సమ్మతించి బాలసన్యాసి రూపమును ధరించి యాజానుబాహుడై వెడలి నాకార్యక్రమమునకుంజేరి నిరీక్షించుచుండెను. అప్పుడు సకల లోకరాజులున్ను భేరీమృదంగ వాద్యంబులంబోలి ధగద్ధగాయమానంబై యుండు సమయంబున లయోధనియను రాజకన్యకతన చెలికత్తెలతో నటనకన్యకలు నాట్యమాడుస్థళమునంజేరి ఓపికరై సందడిలేక నిలిచిప్రశ్నల జెప్పనారంభించెను, ఏమనగా;

మొదటిప్రశ్న.

సకల లోకములున్ను నీలోనిలీనమై కర్తాంశమై సకల కార్యములకు నిర్మాతువై నాజానుజంఘున లత్యస్వరూపమై గానంబనుసర్వంకుశ నిరయువపుడెవ్వడు? యనిన్ని,

రెండవప్రశ్న.

స్వస్వరూపమైన తెలివివిసింగానక చిత్తకారమును పొంది ఏవస్తువును జూచిన నందు తానారోపితమైయుండుటు కారణమేమి? యనిన్ని,

మూడవప్రశ్న.

తాను దేహేంద్రియాది ప్రపంచమునందిమిడి మరుగై భ్రమించిచిత్సుఖమున కైక్యపడి, స్వతః ఆనందపరిశుద్ధత్వము లేక భ్రాంతియుం దిచ్ఛ పుట్టుటెట్లుయునియీనాడు ప్రశ్నలనవనీలగాబలికినావదానచిత్తయైజూచుచుండె,

ఇట్లుజెప్పగ నంతట రాజులందరు మూడుప్రశ్నలకు మదోన్మత్తులై పకపకనవ్వుచు మీసములందువ్వుచు కాకిగంతులు వేయుచు సూక్ష్మబుద్ధిలేక మందత్వమై వెఱగందిమాఱుమాటలేక ప్రశ్నలకుత్తరువుకై దిరుగురాజకన్య నుంజూచి చిన్నబోయితలవంచి వారివారివిడుదులకుం జనుసమయంబునభాగీరథిదేశమున కధిపతియైనభాణవల్లభుడను రాజపుత్రుడగుభగీరథమహారాజు బాలసన్యాసివలె నిలిచినీవిచ్చిన ప్రశ్నలకు నేనుత్తరము జెప్పగలవాడనని భీకరధ్వనిని జేయుచు ఓపికతో జెప్పెను.

మొదటిప్రశ్న.

సకలలోకములున్ను నీలోవిలీనమై కర్తాంశమై సకల కార్యములకు నిర్హేతువై నాజానుజంఘున లక్ష్యస్వరూపమైగానంబడు సర్వాంకుశ నిరయవవు డెవ్వడు యనిన;

ఉత్తరము. అనగా, అన్నిటియందుఏకమైకర్తృత్వభోక్తృత్వ మను నదిలేక స్వస్వరూపమై నిత్యానందమై నిరవయవమై యుండునది తెలివియే;

రెండవప్రశ్న.

స్వస్వరూపమైన తెలివింగాన చిత్తవికారమును పొంది ఏవస్తువును జూచిన నందు తానారోపితమైయుండుట కారణమేమి యనిన;

ఉత్తరము. తన్ను యిట్టివాడని గ్రహించక యితర వస్తువులయందిచ్ఛ గలిగి (కొలనియందు తనరూపునుజూచి తలక్రిందులైనట్లు) ప్రతిబింబదృష్టిచే దేహేంద్రియ సంబంధులైనందున భ్రమకారణమైయున్నది.

మూడవ ప్రశ్న. తాను దేహేంద్రియాది ప్రపంచమునం దిమిడి మరుగై భ్రమించి చిత్సుఖమునకైక్యపడి, స్వతఃఆనందపరిశుద్ధత్వము లేక భ్రాంతియం దిచ్ఛపుట్టు టెట్లు యనిన.

ఉత్తరము. పుట్టంధువై దృష్టిలేక మనస్సుగుమాయచే యిదేతన నిజేచ్ఛయని కల్పించునట్లు స్వతః నేత్రములం గలిగి పరిజ్ఞానము లేక మనస్సగుమాయచే పరేచ్ఛలంబొంది యంధుడై స్వరూప దృష్టిలేక అన్యమునుజూచి భ్రమించునదే భ్రాంతికి కారణములవుచున్నది.

యని మూడుప్రశ్నలకుత్తరవుం బలికిన రాజకన్యక బాలసన్యాశియైన రాజకుమారునికి అంజలీబద్ధయై వీరు యోగసిద్ధులనియెంచి పుష్పమాలికను మెడయందిడి నమస్కరించితనతావుంజేరి వివాహకార్యములకు యెదురుజూచుచుండె. నింతలో సకలలోకరాజులున్ను జరిగినవర్తమానములం జూచి

సంతోషాంత భరితులై తనతన విడిదికిం జేరిరి. అంతట యామ్నాయనగర పురాజగు లయోధనితండ్రి తననగరమున జరిగిన ప్రశ్నలకు సంతోషపడి వివాహప్రయత్నమునకు బ్రాహ్మణులరప్పించి శుభదినంబును జూచుండనినియ మించి సకలదేశపు రాజులకున్న బాలసన్యాశియైన భగీరథుని తండ్రియగు బాణవల్లభునకున్ను తన బంధు సపరివారములతో వేంచేయవలయుండని శుభ లేఖలను పంపి విచ్చలవిడియై స్వకార్యప్రయత్నములం జేయు నప్పుడు సకల దేశపు రాజులును తన సంబంధులగు బాణవల్లభ రాజున్న వివాహకార్యము నకు వచ్చి భగీరథమహారాజుకున్న లయోధనియను రాజకన్యకకున్ను శుభల గ్నమందు వివాహమును జరిపి సకలదేశపు రాజులున్ను తమతమ రాజ్యమున కుం జేరి సుఖంబ భవించుచుండిరి తర్వాత, భగీరథమహారాజు తనతం డ్రికి వెలిబుచ్చిన ప్రశ్నలకుత్తరంబిచ్చి నందుకై పూర్వమునతనకుగలిగిన విప త్తులందేలి సిద్ధత్వంబై గురుకరుణవడసి నీరాజ్యంబునకభిషిక్తుయైనందున తన తండ్రి సంతోషసముద్రమున నోలలాడి కుమారునిం గోడలినిం కౌగలించి భార్యాభర్తలతో సపరివారంబుగా తననిజనగరంబుజేరి పుత్రునికితన రాజ్యం బును పట్టంబుగట్టి సకలానుభోగంబులంబొంది పరమార్థచింతయుండై క్యమై రాజ్యకార్యముల యందితరులకు కష్టములేక ధర్మశీలుండన పేరంబరగియు న్నాడనిన, వాయునందనుండు ఆనందభరితుండై శ్రీసీతారాములకు నమ స్కరించి నాజన్మము సఫలంబైనవి నిద్రింతమురండని సుఖనిద్రం జెందిరి.

ద్వాదశరాత్రికథసమాప్తము.

ఓమ్.

శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః.

# త్ర యో ద శ క థా ర త్న ము.

పదుమూడవ దినము రాత్రి శ్రీసీతారాములిరువరున్ను కేళీవిలాసంబై చల్లగా వీచుచుండెడు మలయమారుతంబున కుప్పొంగి లీలావిగ్రహరూపంబై మెచ్చటాడు సమయంబున వాయుపుత్రుండైన ఆంజనేయుండు శ్రీరాములకు నమస్కరించి స్వామీ తమ కృపాకటాక్షంబు వలన సిద్ధరూపంబగు మోక్షరసంబైన కథను విని నా మనంబుప్పొంగి సంతసించితిగాన, నేటిదినంబు నుదినంబు గనుక స్వస్వరూపాను సంధానమైన నొక చరిత్రంబును జెప్పి నన్ను కృతార్థుని జేయుడని ప్రార్థించగా భగవంతుండు వాయునందనుని భక్తితో వినుమని జెప్పనారంభించె

## శశివర్ణమహారాజు కథ.

శృంగారపురమను ప్రసిద్ధంబైన యొక పట్టణముగలదు. నందు శశివర్ణుడను రాజు తన భార్యతో సరసోక్తులాడుచు కేళీవిలాసంబై నుద్యానవనంబునకుంజేరి ఆనందభరితుడై పండ్లు ఫలాదులను భక్షించుచు వినోదంబుల జూచునప్పుడు, రాజ్యకార్యములయందనూయచే మనసు యెల్లప్పుడిట్లెడుములబడుచు దేహాస్పదమైన చిత్సుఖంబులం జేయుచుండుటంబట్టి నాకసూయయగుచున్నదనిన, నప్పుడు తన భార్యయగు వేదవతియను రాజకన్యకవీరికిందగినట్లు శాస్త్రోక్త వివరంబులం దిచ్ఛపుట్టునట్లు దేహము యొన్నటికైననస్వరంబని తెల్లంబై నుడివినందున నా రాజు భార్యను యాలింగనంబు జేసి నా మనోనాయకీ నిప్పుడు నీయం దిచ్ఛపుట్టి తల్లడిల్లుచున్నదిగాన నీమనోభీష్టమగు వివరమును జెప్పంబగిన దానవని నడిగిన వేదవతి ఆత్మతత్వమును నిరూపించి సాధనోపాయంబులతో నొక విన్నమును గుర్తించి తాజేయుకార్యంబులయం దభిన్నము లేక సాక్షియై కారణకార్యములతో నడవడికంగలిగి వర్తించుట మంచిదియని వాక్రుచ్చెను.

నప్పుడు రాజా మాటలను సంతసించి భార్యయం దిచ్ఛగలిగి తాజెప్పినట్లు ప్రవర్తించ దొడగెను. తర్వాత నారాజు నదే ప్రకారము నిత్యనైమిత్తిక కార్యంబులయం దసూయలేక సాక్షిత్వంబుచే రాజకార్యంబుల జరిపించుచు వేదశాస్త్ర పురాణాది చతుర్దశవిద్యల నేర్చిన బ్రాహ్మణులను రప్పించి సకల శాస్త్రములనున్ను పరిశీలించి అందందుగల విషయములను

దెలిసి దేవ, బ్రాహ్మణ, వైశ్య, శూద్రులయందు విశ్వాసముగలిగి ఆయా వంశములకు తగినటుల దేవాలయములను కట్టించి పూజ పునస్కారాన్నదానములతో బ్రకాశించుచు రాజ్యమున్నేలుచుండెను. ఇట్లుండగా కొన్నిదివంబుల కంతయు దేవానుగ్రహపూర్వ కర్మంబువలన నొక పుత్రునింబడసి బ్రాహ్మణులరప్పించి వానికి సుదర్శనుండను నామంబిడి సకల శాస్త్రపురాణాది చతుర్దశ వేదపారంగతిమైన సకలవిద్యలనున్ను ధనుర్విద్యలనున్ను నేర్పించిన నతఁడు బలపరాక్రమవంతుడై పరాక్రమమున కుమారస్వామితోను, బుద్ధియందు బృహస్పతితోను, ధైర్యంబున హిమవంతునితోను, దాతృత్వమునందు శిబికర్ణదధీచులతోను, సమానుడై జగంబున బ్రసిద్ధికెక్కియుండె.

అంతట నాపుత్రుని కుశలత్వమునుజూచి యువరాజ్యపట్టాభిషేకంబు జేయించి తన రాజకార్యములంతయు యువరాజగు సుదర్శనునిచే నిరవేర్చుటకు తీర్మానించి తాను పైసింహాసనమందు సాక్షిమాత్రమై యుండి వీక్షించి జూచుచుండెను. ఇంతలో నాయూరి ప్రజలంతయు విద్వాంసుడును ధార్మికుడును కానికొడుకులు వేనవేలు పుట్టుటేల, చూడిపాడి లేనిగోవులంబెట్టుకొననేల నని సంతోషించి వంశమునకున్ను రాజరికమునకును గీర్తితెచ్చుకొమారుడగు సుదర్శనుడను రాజపుత్రుడొక్కడే చాలును, రూపమును ధనమును బలమును శాస్త్రజ్ఞాన పరిచయమును గల నిటువంటి పుత్రుడై పుట్టి ధీరుండై ధర్మాత్ముండై తల్లిదండ్రులమాటను జవదాటనివాడై సర్వజనులకు హితుండై విద్వాంసుండై సమర్థుండై న్యాయాన్యాయములను తెలిశినవాడై ఇతరులు జేసిన మేలును మరవనివాడై ఆడితప్పనివాడై యుండుపుత్రుని తల్లి దండ్రుల పుణ్యమేమనవచ్చునని వేయి నోళ్ల కీర్తించుచు రాజానుగ్రహంబున సర్వసుఖంబుల ననుభవించుచు, సకలలోకంబున కంతయు వెల్లడించి కీర్తించు చుండిరి.

ఇట్లుండగా సకల రాజులున్ను శృంగారపురపురాజపుత్రుని కీర్తియందభిలషమై వారివారి పుత్రులయందసూయతో నిందించి దేవబ్రాహ్మణులను రప్పించి పుత్రుల ప్రవర్తనలం దెలిపి అసంతోషులై యుండ నప్పుడు యో మహారాజా! మీరీలాగు చింతించ వలసిన పనిలేదు. మీరెంచిన పనినిచక్కజేయుట కెంతమాత్రమునే నీ పుత్రులనందఱిని ఆఱునెలలలో సకల నీతిశాస్త్రములన్నిటిని తెలిశిన వారిగజేసి మీకు సమర్పింతునని రాజనుజ్ఞవడసి బహుమతులనుపొంది రాజపుత్రులతో బయలుదేరి ఒకమహారణ్యముంజేరి సకలనీతిశాస్త్ర ధనుర్విద్యలు గఱపుచు కాలమును సరిబుచ్చుచు

రాజపుత్రులయెడ నసూయ లేక సత్ప్రవర్తనులగువర కరణ్యమందుండి తర్వాత వారివారి పుత్రుల నాయానగరపురాజులకడ జేర్పించి బుద్ధిమంతులని పేరంబరగి సంతోష సముద్రమున నోలలాడుచుండిరి.

గాన, నిట్లు నీరాజకుమారులు వారివారి స్వరాజ్యముంజేరక అరణ్యము నందుండు సమయమున నొక మునిపుంగవుండు నీరాజకుమారులం గని మీలో బలపరాక్రమవంతు లెవ్వరని యడిగిన నప్పుడు నీరాజకుమారులు జడిసి స్వామీ మేము స్వల్పధైర్యులము మావల్ల నేకార్యమున్ను కొనసాగదు. గాన నీయరణ్యమునకు పడమట శృంగారపురియను నగరమున్నది నందు నాపురి యొక్క రాజపుత్రుడు సుదర్శనుడను నామంబై సకల కార్యములకు ధైర్యసాహస బలపరాక్రమవంతుడై యున్నవాడనిన నాపుంగవుండు తన కార్యమును కొనసాగింపవచ్చునని దలచి నాపురింజేరి రాజభవనంబుడిగ్గి శృంగారపురవు యువరాజగు సుదర్శనుడును మంత్రులును, పురోహితులును, విద్వజ్జనంబులును, సామంతరాజులును, బంధువులును, మిత్రులును, బరివేష్టించి నిండుకొలువై యుండు సమయంబున నామహాత్ముడు రాక్షసబాధలకోర్వక సుదర్శనుని గుణాతిశయములను జూచి వీరి సాన్నిధ్యంబున పరమార్థత్వమైన విషయంబుల బోధించుటకెంచి రాజసముఖంబుంజేరి, ఓ మహాప్రభో, రాజమార్తాండా, అని కేకలు వేయుచు నిలిచి స్తుతించ నప్పుడా రాజకుమారుడు లేచి శిరఃసాష్టాంగ నమస్కారందీర్ఘదండంబులిడి, అంజలీబద్ధుండై లేచి నిలిచి మహాత్మునియం దభిమగలిగి వారిని తన సింహాసనమునందమర్చి శుశ్రూషంజేయుచు దీక్షుండై పరాకులేక ప్రవర్తించుచుండె.

నింతలో నారాజపుత్రుని తనతండ్రియైన శశివర్మ మహారాజు రప్పించి మహాత్మునియెడ కరుణను దెలిపి వారియనుగ్రహమును పొందవలయునని తండ్రికి షోడశోపచారములతో జెప్పితానూరకుండె. నప్పుడు శృంగారపురవు రాజగు శశివర్ముడు యోగికి నమస్కరించి తమయభిప్రాయమును వెల్లడించుడని శిరసావహించి బద్ధుడై నిలిచె తర్వాత నామునిపుంగవుండు రాజును జూచి ఓరాజా నీకును నీపురజనులకును నీపుత్రపౌత్రులకును బంధువులకును దేశములకును ధనములకును కుశలమాయని యడిగెను. నప్పుడు మహాత్మా తమయొక్క క్షేమాతిశయానుగ్రహమున కుశలమైయున్నామనిన మహాత్ముడుప్పొంగి యుండజేనిం గూర్చుండ నియోగించి నామనోభీష్టంబున నొకకోరికంగలదు దానిందప్పక నెరవేర్చెద మనిన, ప్రీతితోడం

జెప్పి వారుబుచ్చి సంతసంబై తోడనే నారాజు తమ యిష్టప్రకారము నెర
వేర్చెదనని బలికినూరార్చి జెప్పుమనినడిగెను. తక్షణమే నామహాత్ముని దయొడ
లుప్పొంగి శ్రేష్ఠులైన రాజమాన్యమాజ పూజితులగు శశివర్ణ శేఖరా నీమా
టలనాలకించితి మారుమాటలేకుండపలెను తప్పరాదుయని పలుమారు బుజ్జ
గించుచు ధన్యుడై తినని గీర్తించి రాజు భక్తితోడ నిష్పాదే మడిగిన నిష్ప్రద
సంతోషముతో వేడుమసిన నాముని నీవు గురుపుత్రుడవు పాపములేని వాడ
వు మిక్కిలి సత్యమేధనముగాగలవాడవు చంద్రవంశమునందు బుట్టినవాడవు
గనుక నిటకు నేనువచ్చితి నాకోరిక నీడేర్పుము యని రాక్షసబాధల వెలి
బుచ్చి నాతపము యెప్పుడు పూర్తియవునని మాటమాటకు జెప్పుచు కొన్ని
దినములలో రాక్షసబాధలేకుండునట్లకై తమయాజ్ఞనుపొందవచ్చియున్నానని
చింతాక్రాంతుడై నోరాడక మైమరచి చప్పుడు చేయకుండెను. తోడనే
రాజు స్వామీ తమరు భీతిజెందకుడు నాపుత్రుడగు సుదర్శనుని బంపి తను
యజ్ఞకార్యముల భిన్నములేకుండ రాక్షసులం దునుము నట్లుత్తరువుజేసెద
నమ్ముము నమ్ముము యనినూరార్చగా నామునిహృదయసంతసం బుప్పొంగి
మైమరచెను. తర్వాత పుంగవులకు తగినసామగ్రులతో తనకుమారునినరణ్య
మునకు బంపుటకై యత్నించి నవరసాన్నములగు భోజనములను పుత్రునికిన్ని
మునిపుంగవులకున్ను నిడి దండప్రణామంబు లాచరించి అర్ఘ్యపాద్యోపచార
ములు జేసి తాంబూలాదులనిచ్చి దనయొక్క భార్యయుం దానును పుత్రుని
శిరమును మూర్కొని దీవించి మోదముతో పుంగవుని జేతికందిచ్చి పోయి
రండనినమస్కరించిపంపించెను. ఆమునిపుంగవుండు శృంగారపురపు రాజదంప
తులసమాధానపరచి సుదర్శనుని దోడ్కొని దారింబోవుచు వ్యాఘ్రభ
ల్లూకాదులదునుముచు నెక్కయాశ్రమముం జేరి సమీపమైన కొలనియందు
దేహాలంపటయు శ్రమ ఆకలి దాహము దీర్చుకొని విశ్రమించి కొంతసేపటికి
సుదర్శనునికి ధనుర్విద్యల నుపదేసించి నీవు దీనిని జపించుచుండిన రాక్ష
సులయొక్క మృత్యుబాధచే ఆపదలు నెడబాసి పోవునని విద్యలయొక్క విశే
షములంతయుజెప్ప నారాజపుత్రుడుసంతసిల్లి గొప్పలగునావిద్యలబొందినవా
డై తేజమొప్పశరత్కాలమునందుదయించుచంద్రునివలె ప్రకాశించెతర్వాత
నారాత్రినచ్చటనిద్రపోయిలేచి స్నానపానసంధ్యానుష్ఠానములుజేసి తనదా
రింబోవుచు బయలుదేరెను. నంతట కొండగుహాలు యేరులందాటిపోవుచు
గురువులయడచేయునట్టి శుశ్రూషలం జేయుచు నచట నువాశినియనునది
యం దలనటతీర్చియుండు నప్పుడు దేవతలయొక్క గద్గదస్వరములను విని

సంతసంబుప్పొంగి యజ్ఞయాగాదులం జేయుటకుద్యమించి యజ్ఞశాలను సిద్ధపరచి రాజోత్తమా! నీరాక్షసులవిచారమై నిన్నుకొనియాడి నీస్థైర్యధైర్యత్వ మునుజూచి రాబట్టుకొనివచ్చినదేగాని వేరొండు కాదని నిమిత్త వచనంబులతో మాయారాక్షసుల క్రూరత్వములను జెప్పనారంభించెను. ఏమనగా నీయడవికొంత కాలమునకుముందు చంద్రవంశనగరము నియ్యాది సకలరాజులచే కొనియాడబడి వన్నెకెక్కి మన్మథపురినింబోలి నట్లుండి రాక్షసులబాధచే నిర్మానుష్యమైన కారడవియై జంతుజాలంబుల నివాస్థలంబు జేయుచు మహాత్ములం బాధంబెట్టుచు ద్రోవనడ్డగించి మనుష్యులనుంజంపి పాపకృత్యములంజేయుచున్న రాక్షసులను దునుమాడి ఎప్పటివలె చంద్రవంశనగరమై సకలరాజులున్ను పొగడబడి వన్నెకెక్కి నిర్ధారణపూర్వకమైయెంచి జరిపించవలశిన భారము నీదేయనిజెప్పి పుంగవుడు తనకార్యార్థమై సమస్తసామగ్రులుస్వీకరించి యజ్ఞయాగాదులు పూర్తిజేయుటకు నిర్మలమై జపించుచుండె. నింతలో పుంగవునాజ్ఞాప్రకారము ధనుర్బాణములజాగ్రతపరచి యజ్ఞశాలనుగాచి నలుదిక్కులంజూచుచు జాగ్రత్తపరుండైయుండె నంతరాక్షసులుయిది వరకెన్నడు యిట్టి కృత్యములేక నిర్మానుష్యమైన యడవియం దిద్దరుపురుషులుండుటంజూచి సంతోషచిత్తులై నరమాంసాహారప్రాప్తమైనదని తన ఘోరరూపంబులంజూపి ఘర్జనంబులతో సమీపించి యజ్ఞశాలకెదురై నిలిచి కర్ణకఠోరంబులతో గొప్పలగు పాదములయొక్క మోపుటలచేత భూమికదలగా దగ్గరకు సమీపించి ఆపవగ్లుసమీపంబున సుదర్శనుండను రాజవల్లభుండు ప్రయత్నపూర్వకమైయున్న తనభుజబలపరాక్రమము యొక్క వేడుకను మిక్కిలివ్యాపింపజేశి నారిని మ్రోయించి దిక్కులయొక్క యంతమందుండు గజములువణక ఆకాశముపిక్కటిల్ల కొండలు నిర్ధూళి కాగ గుహాలమధ్యంబునుండి జొఱబడిన శార్దూలములవలె బాణముల ప్రయోగించి క్రిక్కిరిసి బోవునట్లు రాక్షసులందునుమాడి గోపముతో బడబాగ్నినిపుట్టించి అన్నిటినిం దహించి దిక్కులెల్ల బగులు నట్లుబొబ్బలిడుచు రాక్షసుల భయంకరంబునుజూచి వేనవేలై వచ్చుచున్న గొప్ప శరీరాంకృతులగు రాక్షసులం జయించ శక్తిలేక గురునాజ్ఞం జ్ఞప్తికి దెచ్చుకొని వారిచ్చిన మంత్రంబుల నుచ్చరించుచు బాణంబులచే భిన్నభిన్నంబులౌనట్లుయెంచి సంధించి సంహరించుచుండుసమయంబున అన్నిటికింగొప్పదియగు మహాపెనుభూతరాక్షసి ఆకాశమున పొగవలె బాణంబులందునను మాడి నిజరూపియై యెదుటనిలచి రాజకుమారా నేనుముసలిదానను నన్ను

జంపంజనదు నీయాజ్ఞందప్పను మన్నించుడీ మన్నించుడీయని కాళ్ల మీదంబడి యేడ్చుచు చపలచిత్తయై లేచినిలిచి భయభ్రాంతితో చేతులను జోడించి నమస్కరించె. నింతలో ఈ రాక్షసులయుద్ధము వారమురోజులు అన్నపానాదులులేక జరుగుచున్నందున రాజకుమారునికి మనస్సుకించిదుపకారియై విశ్రాంతి చెచ్చుకొందమని కుడిచేతితో రాక్షసిని మందలించి కూర్చుండని తానును కూర్చుండె.

నంతలో నాతపోధనుండు తనకార్యమంతయు పూర్తిజేసి నేత్రములనుదెఱచి యెదుటకూర్చున్న శిష్యునిపొగడి నాయాగము భిన్నము లేకుండుటంబట్టి నీజన్మముసఫలంబై మోహభ్రాంతిందహించి స్వస్వరూపం బవుదువని పూర్ణదయతో వరంబిచ్చి లేచి నలుదిక్కులంజూచి భ్రమించి అబ్బా యింతటి సామర్థ్యుండనిన్ని యింతటి రాక్షసులం జయించి దునుమాడి యెట్లుపోరితివనిన్ని బోరగిలంబడితన్మయత్వంబొంది నిశ్చేష్టితయైనూరకుండె. తర్వాత మందస్మితయై స్ఫురింపుగలిగి రాజపుత్రుని కౌగలించి చంద్రవంశబునం దుద్భవించిన సుదర్శనా నాయాజ్ఞం దప్పక జరిగిన కార్యమునకు నేనేమని కొనియాడి పొగడుదునని తొడపైన కూర్చుండనియమించి తనకుంజెలిసిన మర్మంబుల మరుపులేక యెరిగించి నగరప్రాకృతంబును దలచుచు ముసలిరాక్షసినింగని నెమ్మతితో రాజకుమారుని విచారించుచుండె అయ్యా రాజకుమారా యింకారాక్షసనమూహంబున్నట్లున్నది యీముసలి రాక్షసి యెవ్వరు, దీని వర్తమానం బేమని యడిగిన నారాజకుమారుండు అంజలీబద్ధుండై నిలిచి, యీముసలిరాక్షసి విషయమై నాకేమియుం దెలియదు, తమరే విచారించుడీయని మరుగుం జొచ్చియున్నప్పుడు నాముసలి రాక్షసి నా పుంగవునికి తన రాకం దెలిపి నమస్కరించి చంద్రవంశ నగరపు రాజకన్యక నా వశంబై యున్నదనోన్ముఖరూపరేఖా విలాసంబై యున్నందున నీరాజకుమారుని చర్యలచే నావంశమంతయు క్రిక్కిరిసి నేలపాలై దునుమాడినందువలన నేనున్ను భయపడి నీపుత్రునికి నమస్కరించి నాపుత్రికను వారికి సమర్పించి పాపలయునను నామనంబుప్పొంగి యున్నదానననని విశదంబంతయు జెప్పిన నాపుంగవు డత్యాశ్చర్యంబై రాజపుత్రునియం దభిలషగలిగి ముసలి రాక్షసిని బంటుగాజేసి అడవిని యెప్పటివలె చంద్రవంశ నగరమానట్లు తన తపోబలంబు వలన నిర్ధారణజేసి ముసలి రాక్షసిని మానుషరూపమానట్లు దీవించి దీనిజేతం సకలరాజులకున్ను శుభలేకలబంపి యెప్పటివలె చంద్రవంశనగరము వుద్భవించియున్నట్లు తండా రావేయించమని తెలియుం

జేసి చంద్రవంశపురాజ కన్యకనుం దెప్పించి పుంగవుండు కన్యకభయమును నివాగించి సకల వైభవంబులతో నుండునప్పుడు సకల దేశపురాజులున్ను రాజపుత్రుని తల్లిదండ్రులున్ను సైన్యపరివారంబులతో చంద్రవంశ నగరముంజేరి నొక్క శుభదినంబున బ్రాహ్మణులం బిలిచి వివాహ ప్రయత్న కార్యంబుల నెరవేర్చి నానగరమును సుదర్శనుండను రాజపుత్రునికి పట్టంబుగట్టి యెప్పటివలె రాజ్యకార్యంబులం దభిలషగలిగి సత్ప్రవర్తనలం దేజరిల్లుచు భార్యాభర్తానుగుణ్యమై సరసోక్తులాడుచు తనవైభవంబులం దేజరిల్లుచు సుఖంబనుభవించుచుండిరి. ఇంతలో తన తల్లిదండ్రులు సుదర్శనుని చర్యలంబోలిన బలఘున శౌర్యత్వమునకు సంతోషించి పుత్రునివద్ద శెలవుబుచ్చుకొని తననగరింజేరిరి. నంత పుంగవుండును కొన్ని దినములుండి రాజకుమారునికి కొన్ని నీతులంజెప్పి స్వరూపైక్యమును జూపించి విదేహకైవల్యపదప్రాప్తింజెందినందున సుదర్శనమహారాజు పుంగవుని కర్మకార్యములం జరిపి సాధుసమాగంబులగు వారికిందగినట్లు మహితాన్నదానంబుల జరిపిన గైకొని వారివారి నెలవులకుంజేరిరి. నప్పుడు తననగరి లోకులందరు రాజును పొగడి శాతువుల భయములేక యెల్లయెడలం దిరుగుచు యితరదేశములకు జని వ్యాపారంబులంజేయుచు యెప్పటివలె సుఖంబులంజెంది స్వవృత్తులం దనివి నుదనోన్ముఖులై రాజునకు స్వల్పపన్నులం జెల్లించి కష్టములేక జీవించుచు భగవంతునియెడ ప్రార్థనలసల్పుచు నిత్యనైమిత్తిక కార్యానుకూలమై భార్యాపుత్రమిత్రసమేతులై నోపికంగలిగి ఐక్యమత్యమగు రాజాశ్రమసేవితులని యితర రాజులవల్ల పొగడబడుచు ధర్మాత్ముడనిన్ని బ్రహ్మైక్యసేవాధురంధరుడనిన్ని పేరంబరగుచు సుదర్శన నామంబును గీర్తించుచు యెల్ల యెడల దయాసత్యుడని నోరారజెప్పుచు సుఖానందంబుప్పొంగి యుండిరి. గాన తల్లిదండ్రులకు తన ముదిమికాలము సమీపించినందున మనోకష్టములతో పుత్రుండు సమీపమున లేడని చింతగలిగి నప్పుడప్పుడు వేదనలంజెంది రాజ్యకార్యములం దలచక వ్యాకులచిత్తులై నందున మంత్రులు నీనడతలనుజూచి ఈ రాజకుమారుడగు సుదర్శనరాజునకు తన బంటులవల్ల తన తల్లిదండ్రుల వ్యాకులమును తెలియంజేసి లేఖనువ్రాసి బంపించి అతిశీఘ్రమున బయలుదేరి దంపతిసమేతమై రావలయునని హెచ్చరికతో వ్రాసినందున సుదర్శనరాజు బంటులు దెచ్చిన లేఖనుంజూచి వ్యసనముప్పొంగి దంపతిసమేత సైన్యసామగ్రులం దాయత్తపరచి రథారూఢులై జని శృంగాదపురముంజేరి తలిదండ్రులకు నమస్కరించి నిత్యోత్సాహపరులై యుండిరి.

గాన తల్లి పుత్రుని జూచి నాయనా నాకండ్లార నిన్ను దర్శించి నావశంబుంచుకొనుటకు ప్రాప్తము సంభవించలేదని చెప్పిన తల్లీ నేనున్ను యిట్లే చింతించుచు తి మస్కాణయుందేయుండి నారాజ్యకార్యములంతయు మంత్రులను జూడుమని సెలవిచ్చి వచ్చినాను గనుక మీమనోభీష్టంబులకు వ్యాకూలంబులేక సర్వదా స్వరూపదృష్టియందుండుటంజేసి నెమ్మతిపరచి తమయనుజ్ఞంగైకొని బోయెదనని ధైర్యంబును బలికి నిట్లనియె.

## సుదర్శనమహారాజు తనతల్లికి స్వస్వరూపంబును బోధించుట.

తల్లీ నామాటలకాలకించి సావధానచిత్తులరై యుండి మీ సన్నునయితే తరవిషయంబులంజోరబడక ఏకీభవించియుండుడని బోధించందొడగెను. ఏమనగా, ఈకనుపించుచున్న ప్రపంచమంతయు యెక్కడ పుట్టినదో దానిని చెప్పెద వినుము. సృష్టికంటె నాశము లేనట్టియు చలనము లేనట్టియు వికారము లేనట్టియు కాలత్రయమునందు బాధింపబడనట్టియు సృష్టికి అభిముఖమైనట్టియు స్వస్వరూపమైనట్టియొక బ్రహ్మము గలదు. దానియందు అదిలేనిదై నిరాకారమైనదై సృష్టిని జేయుటకు సమర్థమైనదై నీ పేరంబరగియున్న ప్రకృతియొకటి కలదు. నా ప్రకృతియందు పైని జెప్పబడిన నిర్వికారాదాది బ్రహ్మమును గలసి ఈశ్వరుడనిన్ని అవ్యాకృతుడనిన్ని వ్యవహారిక నామములచే ఆ ఈశ్వరుని యందు సకలమహత్తులందుద్భవించి సత్వరజస్తమోగుణాదులంగల విభాగములయ్యెగాన యీ సత్వరజస్తమోగుణాదుల వలన జ్ఞానేంద్రియకర్మేంద్రియ విషయ సమాగమమై క్రమముగ పైజెప్పంబడిన వానివన్నిటికిని సదాశివుడు, ఈశ్వరుడు, రుద్రుడు. విష్ణువు, బ్రహ్మ వీరందరు అదిదేవతలై పంచమహాభూతములో గలసి సూక్ష్మసృష్టిని బుట్టించి స్థూలసృష్టికొరకై నొక్కొక్క భూతమున్ను తక్కిన భూతములో కలసినప్పుడు పంచీకరణమాయెను. యెట్లనగా ఆకాశము రెండుభాగములు జేసి అందులో నొకభాగమును సమష్టిభాగముగాను రెండవభాగమును వ్యష్టిగాను భాగించి ఈవిధము ప్రతిభూతమును విడదీసి పంచి ఆకాశముయొక్క సమష్టిభాగములో జేరి జ్ఞాతయై వ్యష్టిభాగమును నాల్గు భాగములు జేసి వాయువుతో జేరి మనస్సై అగ్నితో జేరి బుద్ధియై జలముతో జేరి చిత్తమై భూమితో జేరి అహంకారమైయుండి పైన జెప్పిన వానిలో మరి రెండు భాగంబులదై దైదులై సమష్టివ్యష్టి భాగంబులుగ పుట్టి ఇరువదియైదు తత్వములయొక్క సృష్టిసందెలిపి సందేహముల విడదీసి నిర్గుణా, నిర్వికార, నిరంజన, సత్యజ్ఞాన స్వస్వరూపబ్రహ్మ పదంబును బోధించిన తల్లి ఆనందబాష్పకణంబులొలికి, నేత్రానందభరితయై విశ్రాంతినొంది కొంతపురికొల్పి పుత్రుని కౌగలించి

వత్సా నేజేసినపుణ్యామే పుణ్యమని నమస్కరించిన పుత్రుడుజేతులం బట్టుకొనితల్లిపూర్ణ దృష్టితోజూచి విస్మయంబొంది దీవించివారివారి నెలవులకుంజేరి మరునాడుదయమునతల్లి దండ్రులకుప్రీతింబుట్టించి సెలవుబుచ్చుకొని సైన్యపరివారముతో చంద్రవంశనగరంబుజేరి తనివిదీరసుఖభోగంబు లనుభవించుచు రాజ్యమును పరిపాలించుచుండెనని జెప్పిన విని ఆంజనేయుండు శ్రీసీతారాములకు నమస్కరించి నాభాగ్యమే భాగ్యమని పరమానంద భరితుడై భ్రాంతినిబాసి సఫలితుడై పూర్ణానందమున నోలలాడుచు సుఖనిద్రంజెందిరి.

త్రయోదశకథారత్నము సమాప్తము.

ఓమ్.

శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః.

చ తు ర్ద శ క థా ర త్న ము.

పదునాల్గువదినము రాత్రి శ్రీసీతారాములిరువురున్ను,జలకంబులాడి స్నానాన్నపానంబులుంజేసి తాంబూలంబు లలదుచు జల్లగావీచుచుండెడి మలయమారుతంబునకు నానందించుచున్న సమయంబున వాయుపుత్రుం డైన ఆంజనేయుండు శ్రీరాములకు నమస్కరించి స్వామీ మీవలన నాజన్మరహితంబై స్వస్వరూపైక్య సంధానంబును విని పావనంబైతినిగాన, నేడు సమరసైక్యమైన నొక చరిత్రంబుచు జెప్పి విమోచనముగునట్లు జేయు మని ప్రార్థించగా, భగవంతుడు యీవాక్యంబుల సంతసించి ఓరీ వాయు పుత్రా నీవడిగినటుల నుడివెద వినుమని భగవంతుండుజెప్పనారంభించెను.

# చంద్రవిరలేశ్వరచక్రవర్తికథ.

ఈ భూమండలంబున నిషధయను పట్టణ మొకటిగలదు. నందు వేద వేత్తలైన విప్రోత్తములచేతను. ధైర్యధుర్యులైన రాజన్యులచేతను,మహా భాగ్యవంతులైన వైశ్యులచేతను, ధర్మచింతయు భూసుర భక్తియుగల శూద్రులచేత నొప్పియుండు నాపురంబు చంద్రవిరలేశ్వరుడను చక్రవర్తి యేలుచుండు నాతండు గుణరత్నాకరుండును, మేరుమహీధరసమానధీరుం డును, నవార్య బాహుబలుండును, సకల శాస్త్రవిద్యాపారంగతుండునాదా రుండును, సజ్జనోపకారుండును, దుర్జనవినాశకుండును, మణిహారవిభూషణుం డును, దిగంతవ్యాపిత యశోభాసుండునునై లోకంబున పొగడ నెగడె. నా సార్వభౌముం డొక్కనాడు కొలువుకూటంబున వంది మాగధు లనేక విధంబుల స్తోత్రంబులుసేయ సామంతులును, మంత్రులును,బాంధవులును,

పౌరాణికులును, కవీశ్వరులును, విద్వాంసులును, తన్ను పరివేష్టించికొలిచి యుండఁగా సుధర్మాసనమునుండి అఖండునివలె నిండుకొలువై యున్న సమయంబున నాతని పురోహితుండు ప్రత్యుత్పన్నమతియను భూసురసత్తముండు వచ్చి స్వస్తివచనపూర్వకంబుగా నారాజోత్తము నాశీర్వదించి పంచాంగము వినిపించి యుచితపీఠంబున కూర్చుండియున్న రాజునుం గాంచి భూసురోత్తముఁడు సుఖముగా కాలయాపనముచే స్త్రీచర్యలవినుటవలన సుఖంబుకలుగనేరదుగాన తాము అట్టికథలు వినుటవలన తెలివినిం బాసి చేయరానిదుర్వర్తనలం దిమిడి వికారస్వరూపానంద లవుదురనిన రాజు శిరసావహించి భూసురోత్తమా తమ చిత్తం బాలకించితి ననిన విప్రోత్తంసుడు రాజును దీవించి వినుమని చెప్పందొడంగె. యోరాజచంద్రా మున్ను పార్వతీ దేవికి పరమేశ్వరుండానతిచ్చిన సమరసైక్య ప్రభావమైన నీతివంతుల చరిత్రమును నిరుపమానోత్తంశముగ నొక చరిత్రంబును జెప్పెద వినుమని యానతిచ్చి యిందుగల సమరసైక్యమును పొంది రాజ్యకార్యములయందను రాగమున్ను లోభత్వమైన వివాదంబులుం బొందక తెలివియందైక్యమై సకల రాజులున్ను తమ సమ్మతి నవలంబించునట్లు సాక్షీమాత్రమైయుండిన సమరస భావమును పొందంగలవని వక్కాణించెను. ఏమనిన, ఉజ్జయినియను నొక పురంబుగలదు నిది యాకసంబు నొరయు ప్రాకారములచేతను రత్నఖచితంబులైన గోడలచేతను సముద్రమును బోల్పందగిన యగడ్తలచేతను అనేక విధంబులగు వృక్షంబులచే పుష్పించి వికసించు ఉద్యానవనంబుల చేతను రమ్యమైయుండు నాపట్టణమున వీరశేఖరుడను రాజు చేతపరిపాలన చేయంబడు నతండొక్కనాడతి సౌందర్యవతులగు స్త్రీలు తన్ను పరివేష్టింప నంతఃపురంబున కొలువుదీరియుండ, నచ్చట నొక శివసత్తమ సిద్ధురాలగు కన్యక ఆకస్మికముగావచ్చి రాజునాశీర్వదించి యతనిచేత యథోచితపూజలు గైకొని యుచితస్థలంబున సింహాసనముపై గూర్చుండి యుండ నారాజు శివసత్తినిజూచి యోపుణ్యాంగనమనోవల్లభీ మీరు యేయేదేశంబులుతిరిగినారు, యేయేసిద్ధక్రియలు నేర్చినారు, యేయేపురంబులయందను రాగమైన సత్యవతింగలదని వినయపూర్వకంబుగా నడుగ శివసత్తియిట్లనియె ఓరాజా నేననేక దేశంబులు తిరిగినాను, అనేక సిద్ధక్రియలు నేర్చినాను గాని ఉదయ పర్వతంబునకు సమీపమైన నొక గ్రామమునఁ గుణవల్లభశక్తియను కన్యకామణింగలదు నది నిలోకంబులోనుండు కన్యకగ గానుపించనందున దాని గుణ మావశ్యకచర్యలచే బోల్పంబడి దయాసత్యశీలంబైన గుణంబులం

బొంది నీతివాక్యములయం దభిలషయై యున్నందున సకలమునులచేఁగొని
యాడబడి వన్నెకెక్కియున్నది గాన, నాస్త్రీవివాహ దః సకల శ్రుతుల
యందుండు వాక్యముల ననుసరించి నెరుకరూపుతో యుండుమహాత్ములకు
శిశ్రూషలంజేయుటయు నాతల్లిదండ్రుల వాక్యంబులకుం జవదాటకయు
నిరాకారంబగునీశ్వరునిందలచుచు తనకాలమును వ్యర్థపుచ్చకఏకచింతతో
పరమోత్సాహయైయున్నది గనుక నీకన్యను సకల దేశపురాజులున్ను వరిం
చబుద్ధింబుట్టి యానుదయ పర్వతంబునకుంబోయి తానా ప్రతివారమునకొక
సారిజేయు ఏకచింతారాధనకు విస్మయంబొంది యెప్పటివలె తనయిల్లుజేరి
భీతిం దెచ్చుకొనివికారరూపులై యుండుటంబట్టి నీవా కన్యకను వరించుటకు
ప్రయత్నోపాయంబులంజేయుమని నంతర్ధానమయ్యె నంతట నారాజు
అహంకారస్వరూపుఁడై నాపూరిభటులలో యవ్వనపురుషులగు యిరువరు
బాలురంబిలిచి ఒరే భటులారా, నేజెప్పినట్లొక కార్యంబును జేసివత్తురని
వారిలో నొకనికి స్త్రీరూపంబునుమరియొకనికి పున్నమున్నట్టుపురుషరూపం
బునుధరించి నీకార్యంబును జేసివత్తురని విన్నవించిన నాభటులు నాలాగే
నెరవేర్చి వచ్చెదమనిన, నారాజా విషయంబును సాంగోపాంగమై జెప్పుట
కారంభించెను. ఏమనిన, ఉదయపర్వత సమీపంబున నొకగుణవల్లభశక్తి
యనుకన్యకామణింగలదు నాకన్యక ప్రతిసోమవారము ఏకచింతారాధన
చేయువాడుకంగలదు గాన మీరిరువరున్ను నాగ్రామంబుజేరి ఆరాధనచే
యుసమయంబున నందరున్ను వేంచేశి పూజకునాయత్తమైజేరియున్నప్పుడు
మీరు స్త్రీలతో జేరినబాలికవలెను పురుషలతో జేరిన బాలునివలెనునిరువ
రున్ను నొకరినొకరుగానక సూరిజనులవలె ప్రవర్తించిరాగలరని బహుమా
నములనిచ్చి నాకన్యకామణిని సరసవాక్యములతో దూషించి బాలురను
నాగ్రామమునకు బంపి నీరాజు దుర్వర్తనలందేజరిల్లుచు నారాజ్య కార్యము
లయుం దృష్టిలేక సౌందర్యవంతులగు స్త్రీలతో సరసోక్తులాడుచు రశికుడై
యుండె, ఇంతలో నీయిరువురు రాజాజ్ఞప్రకారము బయలుదేరి నడవులం
బొరబడి నానుదయపర్వత సమీపమందుండు గ్రామమునుంజేరి సోమవా
రమునకై నెదురుజూచుచుండ నాముందుదినమున సకలదేశపురాజులున్ను
భక్తులున్ను నిరీశ్వరవాదులున్ను వేంచేశి సేవేడుకలంజూచుటకుయత్నించి
యున్నందున నందరున్ను నొక్కచోటంజేరి వారివారి వర్తనలం బలుకుచు
నిరీక్షించుచుండె.

అంతట మరుదినము సోమవారముగాన నాదినము గుణవల్లభశక్తి తన వ్రతమున కావలయు సామగ్రులం దాయత్తపరచి సకల మునులున్ను మునిపత్నులున్ను రాజులున్ను సకలదేశపుపురుషులున్ను స్త్రీలున్ను భిక్షుకులున్ను వేంచేసి యుండుటనుజూచివారివారికినియమానుసారముగ నుచితాసనములిడి కూర్చుండ నియమించె. నటుతర్వాత నాగుణవల్లభశక్తి సోమవార దినమున నొకకలశంబును నిరూపించినందుకు భావనోచిత పూజలను అన్నపానాదులు లేక నాదినమంతయు నేకచింతతోఁ బూజించుచు నారాత్రి పండ్రెండు ఘంటలకు పూజను పూర్తిజేసి హారతులిచ్చుటకు వచ్చియుండు మునిపుంగములతోఁ బురుషులనున్ను మునికన్యకలతోఁ స్త్రీలనున్ను వేరువేరుగా విభజించి నిలుచుండునట్లు నియోగించి కలశమునకు అనేక వివిధ హారతుల నిచ్చుచు సకల జనులను వీక్షించుచు మునిపుంగవులనందరి దగ్గిరం జేరి వారివారికి పాదాన్న ప్రక్షాళనంబు జేయుచు పురుష స్వరూపములను ఈశ్వరునివలె భావించి యెవరెవరికి యేయేభావంబులం దిచ్చగలిగివచ్చిరో నాయాభావంబులై నేకచింతతో నాపురుషులకు పురుష భావంబుంచి హారతుల నిచ్చుచు తదేకధ్యానమైయుండి సమదర్శనభావంబుంచి నందరినింజూచుచు స్త్రీలకూటంబునందిరిగి మునికన్యలతోడ నంతర్యాన స్త్రీయై పురుషరూపముతోజేరి కంగలస్త్రీలనందరిదగ్గిరంజేరి వారివారికి పాదాన్న ప్రక్షాళనంబుజేయుచు స్త్రీస్వరూపములను ఈశ్వరివలె భావించి యెవరెవరికి యేయే భావంబులందిచ్చగలిగివచ్చిరో నాయాభావంబులై నేకచింతతో నా స్త్రీలకు స్త్రీభావంబుంచి హారతులనిచ్చుచు, తదేకధ్యానమైయుండి సమదర్శనముతో నందరికి దీర్ఘదండంబై సాష్టాంగంబుల నిడిలేచి అంజలిబద్ధయై నందరిని కూర్చుండనియోగించి వారివారికిం దగినట్లు నవరసాన్నభోజన కైంకర్యంబులం జేసి తానును శేషములభుజించి నందరు నాయాస్థానంబుం జేరి విశ్రమించుచున్న సమయంబున నీవీరశేఖరరాజ భటులిద్దరునుగలిసి నొకరితో నొకరు మాట్లాడుచు మనమిద్దరము నిచ్చటనే యుండిన నాపత్తుసంభవించునని నానిశీసమయంబుననే బయలుదేరి కొండగుహాలనుంజొచ్చి పోవుచు దారిలో ప్రొద్దుపొడిచినప్పుడు నొకరికొకరు తనరూపులంజూచుచు నెమ్మతియై నొకతటాకముగానుపించనిలిచి విశ్రాంతింజెంది స్నానము జేయుటకు యత్నించ వారివారివస్త్రములందీయుచుచ్చుతో నుండ నప్పుడు పురుషరూపమును జెందిన రాజభటుడు యెప్పటివలె పురుషరూపమున్ను స్త్రీరూపమును జెందిన పురుషుడు స్త్రీలకుంగల్గియున్న చిహ్నాకారంబులంగలిగి పురుషునియాలింగనము చేయు

టకుద్యమించి సరసోక్తులాడ విజృంభించ నా పురుషభటుడు నీ స్త్రీరూపమై యుండు పురుషునిజూచి నిదేమివింతయని భ్రమించి పురుషరూపమై నాతో స్త్రీవేషమునుధరించి నిజ స్త్రీవై తివని దుఃఖించి భగ్గున క్రిందుమీదుబడి పొరలి నీ స్త్రీరూపమునుజూచి యేడ్చుచు వీరశేఖరరాజును దూషించుచుండ నా స్త్రీరూపమైయున్న పురుషుడు నీదుఃఖించుపురుషుని దుఃఖితునిగానెంచక మరిమరి సరసోక్తులకుం బిలచుచు నొకరికొకరు వాదంబులం జేయుచు పరువెత్తుచు ఉజ్జయినినగరంబుజేరి వీరశేఖరరాజునుం గాంచి కేకలు వేసిరి.

ఇట్లుండగ, నాయాశ్చర్యంబునకుఉజ్జయినీనగరమందుండు ప్రజలున్ను రాజున్ను రాజుభార్యలున్ను సమీపించి మీయిరువురివర్తమానంబుల సంగ్రహంబుగనడిగి నందరును దిగ్భ్రమంజెంది వెక్కి వేసారి తల్లడిల్లి ఆశ్చర్యంబులచే గ్రిక్కిరిసి నొకరికొకరు వెతలచేజూచుచు రాజునుంగాంచి మీరిటువంటి పాపకృత్యమునకు లోబడి గుణవల్లభశక్తియను కన్యను అవమానించుటకు యత్నించి నిటువంటి క్రూరములం జేసి పంపినందున నాపతివ్రత వున్నదున్నట్టి ఏకచింతావ్రతమనుష్టించి నందున నిట్టి అపకారము కలిగెనని లోకులందరు అల్లకల్లోలమై వీరశేఖరరాజునుంజూచి విసికి నీపట్టణమునకింకేమి వుత్పాతంబులుద్భవిల్లునోయని యెంచుచుండనప్పుడు నాశివసత్తమ సిద్ధురాలు ఆకస్మికముగానెప్పటివలె నాపురింజేరి వీరశేఖరరాజుంజూచి కోపించి నిటువంటి నీచవుదుర్వర్తనలంజేయువాడై తోచియున్నపక్షమున నేనికార్యమున నవలంబించనని కఠూరమైన వాక్యములంజెప్పుచుండ నారాజు భీతిల్లి శిరసాష్టాంగదండప్రణామంబై చేతుల మోపి మ్రొక్కి అమ్మణీయని స్తోత్రముజేసి నేజేశిన క్రూరకార్యముల తప్పునియెంచక పుత్రునివలెకాపాడిరక్షించుమని భార్యాభర్తలుంజేరి బలుకుచుండ నాశివశక్తికిం దయగలిగి వీరియందుండు ఆయాసమును వదలి నాగుణవల్లభశక్తియొక్క సమరసైక్యమును జెప్పుటకారంభించెను. ఏమనగా, నీగుణవల్లభశక్తియొక్క మాహాత్మ్యమును నావల్లం జెప్పుట కలవింగాదుగాన తెలిసినంతవరకుజెప్పెద విన్నవించుమనిన నారాజు శిరసావహించి విననుత్సహించె. నప్పుడు నానుదయాపర్వతమున నున్న శక్తి తదనుగుణ్యావలంబమై పరమాత్మయొక్క చరణమును జూచుటకొరకు నేవిచారము పయోగకరమో దానిని విమర్శతో సర్వజనులును పరమాత్మ విషయమం దైక్యులవుదురని సోమవారవ్రత కార్యములం జేయుచు ఏకైక చింతతో సమారాధన జేసి సాధనోపాయంబులయందైక్యమై సమరసైక్యంబును పొందియుండు సత్యస్వరూపియగుశక్తిని నిట్లుశోధించుట రాజధర్మము

నకు నేర్పరితనమా యనిభయభ్రాంతినికల్పించి నావీరశేఖరరాజునకు నీతులండెల్పినీవునాశక్తివల్లనుపదేశంబై వారికిశిక్షశూలంజేసి నీక్రూరకార్యములనంతయును వివరించి యెప్పటివలె నాభటునికి పురుషరూపంబవునట్లు దీవించుమని వేడిన నాశక్తిసట్లే అనుగ్రహించుననిజెప్పగ నారాజు అంజలిబద్ధుడై లేచిశిరసావహించినిలిచి శివసత్తమశిద్ధురాలగు కన్యనుపూజించి స్తోత్రములతోధన్యుడైతిననిసంతోషించుచుండ నాశిద్ధురాలుదీవించినదృశ్యమయ్యెను.

అంతట నావీరశేఖరరాజు భీతిల్లి, గుణవల్లభశక్తిని సకలవిధముల స్తుతించుచు పొగడుచు తదేకధ్యానమై యుండునప్పుడు నొక దినంబున తనకు నాశక్తిస్వరూపసాక్షాత్కారమునుజూచి భ్రమసి యోచించుచుండ నాభటులు నెప్పటివలె నారాజునకెదురై నిలిచి మీవలన నిటువంటి శరీరంబునుంబొంది జనిసి క్రూరాత్ముడై యుండుటంబట్టి సకల జనులకునిందాస్పదులై యున్నాననిన నారాజు చింతాక్రాంతుడై బంధువర్గ భటసమూహములతో బయలుదేరుటకుద్యమించి,సకలసామగ్రులంజేర్చి పాదచారులై వెడలి నానుదయపర్వతముంజేరి నెప్పటివలె సోమవారవ్రత వైభవంబులంజూచి ఆనందంబునొంగి తనలోతానుగుందుచు కఠినకార్యములవి తెలియకజేసిన కృత్యములనుదలచుచు నామెపాదములపైబడి మన్నించుడీమన్నించుడీయని ప్రార్థించెను. అంతట నాగుణవల్లభశక్తి నీరాజునుజూచి హరః హరః శివశివయని తానున్నవారిని లేవందీసి వారివర్తమానముల సాంగోపాంగముగవిని తానున్న తపకర్మములమూసి నింతటికార్యమున కర్తృత్వమైతివని దేవుని ఏకచింతతో ప్రార్థించుచు నారాజునుజూచి మీరిచ్చటనే కొన్నిదినములుండిన యధారూపులయిబోయి జేరుదురనిదీవించి తన సమరసైక్యమగు నియమముల నుపదేశించ ప్రారంభించెను

### గుణవల్లభశక్తి యనుగ్రహంబున వీరశేఖర మహారాజు సమరసైక్యమును బొందుట.

అయ్యా రాజవర్యా మీరుసావధానచిత్తులరై ఏకచింతతో వినవుత్సహించుడని బోధించుట కారంభించెను ఏమనిన, "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అనువాక్యమున బ్రహ్మజ్ఞానవిషయమందుత్కట జిజ్ఞాసగలవాడై నపురుషుడే సమరసైక్యమను పదవిని పొందుచున్నాడనిబలికిన నారాజుశిరసావహించివినయపూర్వకభయాకులచిత్తయై భజించి ధారధారగా నేత్రముల బాష్పములొలుక, నాశక్తి నీరాజు వ్యాకులమునుజూచి వివరించుట కారంభించెను. ఏమనగా; నీవ్రతమున సాధనచతుష్టయముంబుంగలిగి వివేకమును పరిశీలించి

శ్రవణాదులచే అంతరంగ బహిరంగసాధనలం జేరబడి ముముక్షులక్షణములంగని జ్ఞాన హేతువగు మహావాక్యాను గుణ్యమై పరోక్ష అపరోక్షమును బొంది భావాభావంబుల తిరస్కరించి సాక్షితత్వమునుగని మిథ్యాస్వరూపమునుబోగొట్టి మిథ్యాబంధమునకు సత్యబంధ నివృత్తిజ్ఞానముచే బంధాభ్యాస సత్యవస్తుజ్ఞాన జన్యసంస్కారప్రమేయదోష ములేకుండునట్లుండి సమరసైక్యమగు ప్రాప్తింజెంది చిత్తవైకల్యము వోవుననిన నారాజు విశ్రాంతింజెంది నేను ధన్యుండనైతి నాజన్మము సఫలంబైనని యని దీర్ఘదండంబులిడి నమస్కరించగ నాశక్తి పరవశత్వంబొంది యెప్పటివలె నాసోమవారమైనందున ఏక చింతారాధనలజేయ నారాజ భటసమూహంబులు నాప్రాజంజేరి రాత్రిపంద్రెండు ఘంటల సమీపంబున నీ పురుషభటు స్త్రీరూపంబును వెరుకతో నెప్పటివలె పురుషరూ పంబు ధరించి పురుషులతోనుండ నిరాగించి పాదప్రక్షాళన పూజపురస్కారాన్న దాన నైవేద్యంబులతో పురుషులను ఈశ్వరస్వరూపమై భావించి స్త్రీలను ఈశ్వరిస్వ రూపమైభావించి సమరసైక్యముగ ఏకచింతతో నారాధించ యెప్పటివలె నెవరికిం దెలి యక పురుషరూపమునుదాల్చిన నీస్త్రీపురుష రూపమును [illegible] నాసమయంబున నందరిని కూర్చుండనిరాగించి నవరసాన్నమగు భోజనములనిడి తానును నాశేష ములభుజించి కొంతసేపు విశ్రమించి నందరికి గోచరంబగునట్లు నీశ్వరుని చిత్తపరిపా కంబులం దెల్పుచు యథోచితముగ నారాజభటునింబిలిచి రాజున కొప్పగించి భగవ దాంశమైన సత్యస్వరూపునినిత్యోత్సాహకార్యంబుల మందలించుట నెవరికిన కాశంబగు నని ఏకచింతతో నారాధించి హారతులిచ్చుచుండ సకల జనులును నీమాహాత్మ్య మును గుర్తెరిగి సకల విధములచే పొగడనెగడనాశక్తి నిత్యంతోత్సాహమైన నావల్లజరి గిన కార్యము గాదని భగవంతునిస్తుతించుచును నారాజబంధు భటసమూహంబులతో చేరం దీవించి యుజ్జయిని దేశంబుంజేరి నిత్రతమనుష్ఠించి సుఖంబుగానుండెనని ప్రార్థించ నారాజు బయలుదేరి నివర్తనములందేజరిల్లుచు యెప్పటివలె పురుషరూపంబుండుటంజూచి విస్మ యంబంది నాగుణవల్లభశక్తిని వేయినోళ్ల నాదేశమంతయు కీర్తించుచు నాసోమవార వ్రతము నందాశక్తిగలవారై సందత్వ్రతమును అనుష్ఠించుచుండ నారాజుశక్తిచే పొం దబడిన సమరసైక్యపదమునం నార్తిగల్గి సర్వార్తిసలం జేజరిల్లక నాదేశమంతయు రాజ రాజసురేంద్రుడని సుఖానుభవంబులంబొంది భక్తులంబూజించుచు తన రాజ్యమును తన పుత్రునికిం బట్టముగట్టి తానును సమరసైక్యదృష్టింగలిగి ఏకచింతతో నావ్రతమును అను ష్ఠించుచు నాభక్తింగలిగి రాజ్యము నేలుచున్నాడనన, నారాజ్ఞప్రబలేశ్వరుడను చక్ర వర్తి ప్రత్యుత్పన్న మతియను భూసురసత్తమునికి వందనపూర్వకంబుగ నేనిత్యోత్సాహి నైతినని జలకంబుతో పాదప్రక్షాళనంబుజేసి నేత్రానంద పరవశత్వంబొంది కొలువుకూ టంబుంజేరి సమరసంబుతో నితరరాజులచే కష్టములేక కప్పంబులంబొంది రాజ్యంబుల నేలుచుండెనని జెప్పిన అంజనేయుండు శ్రీసీతారాములకు నమస్కరించి విస్మయుడై నేజేసిన పుణ్యమే పుణ్యమని భగవంతుని కీర్తించుచు సమరసైక్యమునంగల రాజనీతులను దన తెలివిచేమెచ్చుకొనుచు స్తుతించుచు నారాధించుచు మైమరచి నిత్యోత్సాహియై యుండ భగవంతుడు అంజనేయునిదీవించి నిద్రింతమురండని సుఖనిద్రంజెందిరి.

చతుర్దశ కథారత్నము సమాప్తము.

ఓమ్.

శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః.

# పంచదశకథారత్నము.

పదునైదవదినమున రాత్రి శ్రీసీతారాములిరువురు భోజనంబులం భుజించి సావధానచిత్తులై లేచి నెమ్మదిగ యునుకడిబ్బపై గూర్చుండి తాంబూలాదులందుచు, చల్లగావీచుచుండెడు మలయమారుతంబున కానందించుచు సరసోక్తు లవలీలలం బలుకుచు సుఖాసీనులై యుండ నాసమయంబున వాయుపుత్రుండైన ఆంజనేయుండు శ్రీసీతారాములకనేక శుశ్రూషలచే నమస్కరించి, స్వామీ తమ కరుణాకటాక్ష వీక్షణ్యమువలన సమరసైక్యంబునుం బొందిదీనుండనైతిని. గాన నేడు రూపాతీతభావమగు నొకచరిత్రంబును జెప్పి నన్ను కృపాయత్తునిగ జేయుమని ప్రార్థించిన భగవంతుం డాంజనేయునిం జూచి ఆనందపరవశత్వంబొంది ఓరీ వాయునందనా నీవడిగినటుల నుడివెద వినుమని భగవంతుండు జెప్పనారంభించెను.

## సురద్యుమ్న మహారాజు కథ.

చిరకాలమునకుముందు నైరావతి నగరమును తనపితృరాజ్యమును సురద్యుమ్న మహారాజు ధర్మయుక్తముగా పరిపాలించుచు తన భుజబలంబుచేత నెల్లదేశంబుల గ్రమక్రమంబున జయించి రాజులనెల్లతన యేలుబడికిం దెచ్చుకొని రాజరాజనిపేరు వహించి కీర్తికాముండై యష్టైశ్వర్యవంతుడై తేజరిల్లుచు పంచహజార్ యను బిరుదునుంబొంది సువర్ణమణియను కన్యకనుం బెండ్లియాడి నొక సుపుత్రునింబడసి బ్రాహ్మణుల రప్పించి జాతకమును చూడ నియోగించి భరతర్షభుడని నామంబిడి సకలపురాణేతిహాసంబులం జదివించి యవ్వనప్రాయమున బట్టాభిషిక్తుం జేసిన నప్పుడు తనతండ్రి యేలిన విధంబుగా శాంతశమదమాది షడ్గుణంబులుగలవాడై సర్వసుకర్మములను జేయుచు పాత్రాపాత్రంబుల నెఱింగి వివిధదానంబుల గావించుచు కరుణాసముద్రుడై పురజనులం గాపాడుచు, సన్యాసులగు పెద్దలనాదరించి యర్ఘ్యపాద్యాది విధులంగావించి సంతుష్టులం జేయుచు, వారివలనం బరధర్మమగు మోక్షమార్గమును గ్రహించుచు, మనస్సును పరమపద వాసుని పదపద్మములయందు జొప్పించుచు, రాజసూయాశ్వమేధాది యాగంబులంగావించుచు, యన్నసత్రంబులం గట్టించి భిక్షుకులకు ప్రసాదంబులచే యాత్మసంతుష్టిం గావించుచు ధర్మదేవత నాల్గు పాదములతో వర్తించుటం జేయుచు, సదా

నాత్మజ్ఞాన పరాయణుండై రాజ్యంబును బాలించుచుండ నొక్క నాడు తన రాజ్యకార్యవిచారకములవల్ల బడలికం గలిగి, కొంతవిశ్రాంతిం దెచ్చుకొందమని పవళించి నిద్రించెను. గాన నానిద్రయందు జాగ్రతలోఁగలవ్యవహారంబుల నటుచే సూక్ష్మాంశస్వప్నంబున నొక బ్రహ్మఋషి జడాధారుడై వేంచేసి భరతతత్వభ రాజానుంగని మహాప్రభో రాజాధిరాజా రాజమార్తాండా యనిదగ్గరం జేరి నిమిత్తవచనంబులచే రాజ్యంబున విసుకుంబుట్టునటుల తనరాజ్యమందును, ధనకనకవస్తువాహనములయందును తనశరీరమును లేశమైనన భిమానముగాని యాశాపాశములుగాని యెందునుం మోహభ్రాంతులను జెందక సదా మోక్షాపేక్షగలవాడై దీక్షవైరాగ్యమును బొంది యాదిదేవుని కటాక్షంబుచే నొకగురునివడసి మోక్షమున కర్హుడనాయనని దీవించిన స్వప్నము, నిశ్చయముం జెంది మెలకువంబుట్టి యీవిషయములందాగతమై పరితపించియోచించుచు నానందభరితుడై కొలువుకూటంబునం జేరి బ్రాహ్మణుల రప్పించి నిస్స్వప్నమునం గనినవిషయమును సాంగోపాంగముగ జెప్పి మందస్మితుడై నూరకుండె. నంతట నా బ్రాహ్మణులు, సచ్చిదానందమునుం బొందనిదిశుభసూచకంబులై యుండుటంబట్టి కారణగురువుం జేరి ప్రసాదంబులం బడయుదలయునని జెప్పిన నాభూపతివారలకుబహుమానంబులనిచ్చినదానినింబొంది యథాప్రకారముగా దనతావుంజేరి రాజును దీవించుచునానంద సముద్రమున నోలలాడుచుండిరి. అంతట భరతత్వభ మహారాజు నిస్స్వప్నంబునం దుద్భవించిన విషయంబులం జింతించుచు పెద్దల రావించిపూజించుచు రాజ్యకార్యంబులయందును సత్ప్రవర్తనలం దేజరిల్లుచు సకలదేశములకు సదాచారపరుండై యుండె. ఇట్లుండుసమయంబున నొక్కనాడు భటసమూహంబులం బిలిచి పల్లకీమోయు బోయలనాయత్తపఱచుడనివిన్నవించిన నదే ప్రకారము సిద్ధపరచియుండ నారాజు మంత్రి పురోహితులంబిలిచి నేను, కారణగురువుం జూడబోవుచున్నానని పలికి రాజ్యమునునొప్పగించి పల్లకియందెక్కి నెమ్మదిమై కూర్చుండి తదేకధ్యానముతో భగవంతుని స్మరించి బోయలతో యడవిమార్గముగా బయలు దేరుడని చెప్పెను. అప్పుడునాబోయలు యరణ్యమునుం జొరబడి పోవుచుండ దటస్థరూపముగా నొక్కమహర్షింగని నిదియేయాశ్రమంబని నంజలింజేసి దీనుండై దిగి యడుగనిదియాశ్రమంబుగాదు బాటసారులకు సత్రంబని విన్నవించనందుకొంత జలపానంబుజేసివిశ్రమించి నిసన్యాసిని రాజుజూచి నిక్కడి నేయాశ్రమంబున్నదనిన వారు ప్రీతితో యాశ్చర్యపడి నీయరణ్యమున కావల వసియామదక్షిణాంబు దేవలఋషి యా

శ్రమంబున్నది అందు సకలరాజన్యులును ప్రసాదంబులంబడసిపోవుచున్నా రనిన నారాజామాటలకు సంతసించి బోయలకుత్తరువుజేసిపల్లకినెక్కి దేవల ఋషిని స్తుతించుచుండ నాబోయలు నాయరణ్యమును దాటి పదియామడల దూరంబునందు దేవలఋషియాశ్రమ సమీపంబు జేరిరి. అంతట నలుదిక్కు లుంజూచి తటాకంబు గానంబడుచున్న నుచితస్థలంబునుంగని దిగిస్నానసం ధ్యానుష్ఠానజపతపంబులుజేసి విశ్రమించి క్షుద్బాధం దీర్చుకొనిదేవలఋషి యాశ్రమంబుం జేరి శ్రవణానందంబు జేయు శిష్యులతో తానున్నకూర్చుండి ఆనందించుచుండె.

అచ్చట నాశిష్యులందరు దేవలఋషి జెప్పినట్టివాక్యములయందా శక్తిచే అభ్యాసోచితయనుభవ సందేహములకు దోట్పాటుగా వచ్చువివ రంబులంగ్రహించి తనసందేహంబులం బోగొట్టుచు భావనాసక్తులై సోహ మనువాక్యమునుజపించుచు గురునకుశుశ్రూషలంజేయుచు ప్రవర్తిల్లుచుండిరి. ఇంతలో నాభరతర్షభమహారాజు లేచిదేవలమహర్షిని జూచిమహాత్మా నేనుమిగుల పామరుండను, అజ్ఞానుండను దేవరవారునన్నుగరుణాదృష్టిం జూచి యాదరించి రక్షించవలయునని పెక్కువిధములప్రార్థించ నామహర్షి రాజునుదీవించి తమపేరెద్ది తమరుండుచోటెద్దియని ప్రియవచనంబులతో నడిగెనంతటనారాజు దేవదేవోత్తమా ! నాపేరుభరతర్షభుడను నైరావతి నగరమునకధిపతి యునిధీనుండనై తమయనుగ్రహమునుపొందనిందొచ్చియు న్నానని తనవృత్తాంతమంతయు సాంగముగాజెప్ప నామహర్షి అద్భుతంబొంది యీభూమండలంబంతయు నేకచ్ఛత్రంబునం బాలించి దిక్కులు ప్రతిధ్వను లిచ్చునటుల కీర్తివహించి మహాపురుషుడవై యుండి కొఱగానికార్యమునం దిచ్చపుట్టి వచ్చి యిడుములబడుట చక్రవర్తులకు ధర్మంబుగాదని ననేకవిధం బులవిన్నవించ నాభరతర్షభుండు దీనాక్రాంతుడై పెక్కువిధములంబ్రార్థిం చినాపైపరితాపంబుంచకుము నేనజ్ఞానుండనుసిలోకంబున జేరి మానవులయం దభిలమగలిగి అజ్ఞానాంధకారంబునం జిక్కిధర్మార్థకామ మోక్షంబులనెడు చతుర్విధపురుషార్థములలో మిగులశ్రేష్ఠంబగు మోక్షమును తలంపున బెట్టి తమయాశ్రమంబుజేరవచ్చినవానినిసిట్లునిరాదరణతో జెప్పుట నాకర్మ ఫలంబేయనివ్యసనాక్రాంతుడై మహర్షి పాదంబులపైబడిచింతించుచుయుం డనామహర్షి చిఱునవ్వుతో నారాజునుంగాంచి నిట్లనియె.

ఓరాజచంద్రమా! నీవీలోకంబునంగల సామాన్యులకు వెఱవ వలదు సకలజనానందంబును, సకలదురితహారంబును సర్వభయనివారణం

బును జన్మనాశంబును మోక్షానందంబును గలిగించెడు రూపాతీతభావంబును జక్కగా దేటపడునటుల విస్తరించెదవనిన నారాజు మాటలకాలకించి మహర్షి విభూజించుచు నుగ్రసమాధినిం బొంది కామక్రోధలోభ, మోహ మద, మత్సరంబులైన నంతర శత్రువుల కెడమియ్యక శాంతశమద మాదిగుణములచే యంతరంగ భక్తియోగజ్ఞానపారంగత నాత్మధ్యాన తత్పరుండై పెదవులనుబంధించి మౌనము నవలంబించి యుండె నంతట దేవలమహర్షి నారాజవర్య చిత్తవిరిపాకంబున్నగని బోధించుట కుద్యమించుచు నాభరతర్షభుని జూచి దీవించి వినుమని చెప్పం దొడంగె.

దేవలమహర్షి భరతర్షభ మహారాజునకు రూపాతీతభావమును బోధించుట.

రాజేంద్రా! ప్రకృతిదోషరూప దోషరహితము కేవలాత్మయే పరిపూర్ణమని చెప్పంబడును. ఈపరిపూర్ణమే కాలమునందును స్థూలమును గాని సూక్ష్మమును గాని, కారణమును గాని, మహాకారణమును గాని, పొందనిదగుటచే సర్వలోకంబులయందును, సర్వదేశంబులయందును, సమస్తవస్తువుల యందును నిబిడి నామరూపరహిత స్వతస్సిద్ధమై ఇట్టిదట్టిదని యోచించుటకు చలనమించుకయు లేక నిస్తరంగసముద్రమై ఆత్మపరమాత్మలకతీతమై నేకాలమందును నేకారణశరీరంబులం బొందకయు తెలియంబడకయు నుండు బయలాంశమగు కేవలాత్మయే పరమపదము. ఈపరమపదమే ద్వాదశ మహాత్మ్యంబులం బొందబడిన మంత్రము. నీ మాహాత్మ్యముదప్ప వేఱొండుమంత్రంబులేదుయను నాజ్ఞనుం దెలిపిన నా భరతర్షభుడు నాజ్ఞను గ్రహించి పరిపూర్ణమును దర్శించి మిగుల సద్భావసుండై సచ్చిత్తిని బొందినం జూచి యా దేవలఋషి రాజవర్యా నీ బయలాంశస్వరూపమై సర్వమును నిండి యుండునదే నీ నిజస్వరూపము ఇంతేకాక మఱియు లేదు గాన నీవాక్యంబులలో బుట్టునటువంటి దృశ్యములగు నామరూపంబులు సర్వము భ్రాంతియని దెలిసి నిజగురు మంత్రమును వదలక సదా కేవలాత్మస్వరూపమగు బ్రహ్మానందపరుండై రూపాతీత భావంబును బొందిన అశరీరివాడువని సాంగోపాంగముగ బోధించిన నా భరతర్షభుడు దీర్ఘదండంబులిడి సాష్టాంగనమస్కారములు జేసి స్వామీ! సద్గురువర్యా! నా నిజస్వరూపంబును బొందితి. నింతకంటె నేమియు లేదని తీర్మానించితి. నీగురుపదంబుకంటె నేమియును లేదు. ఈరూపాతీతభావమే సత్యము, యని చెప్పగ సద్గురుడు నీవు కృతార్థుడవు గమ్ము ధృఢనిశ్చయుండవైతివి సర్వసంగపరిత్యాగంబులం జేసి విదేహ

కైవల్యమునుబొంది శాశ్వతసుఖానందంబునుం జెందుమని దీవించి రాజర్షివి
గమ్మని పురికింబంపి నామహర్షి యెప్పటివలె బ్రహ్మానంద పరుండై యుండె.

ఇట్లుండగా నాభరతర్షభుడు యోగుల నాయుత్త పరచి పల్లకినెక్కి
పున్నత్తునింబోలి తన నగరముం జేరి రాజ్యకార్యములనెల్లచక్కగా గుర్తెరిగి
విచారించుచు కేవలాత్మస్వరూపంబునుంబొంది ప్రవర్తించుచు తన్ను గాన
వచ్చు పెద్దలబూజించుచు సదాచారపరుండై యుండె. నంతట భరతర్షభుని
తల్లిదండ్రులు తన కుమారుని చర్యలంజూచి మందహాసోన్ముఖులై మంత్రు
లంబిలిచి వివాహ ప్రయత్నంబులయం దనుచితవిషయముల ప్రయత్నించు
టకు యత్నంబుండి యోచించుచుండ నామంత్రిదనకుంగల నిజచర్యలం
బోలి పుత్రునిరూపంబును నొకపటంబున లిఖించి తన భటులంబిలిచి నీపట
ముసిప్పించి నానా దేశపురాజులకుంజూపి వారి సనుజ్ఞం గైకొని రండని
బహుమానములనిచ్చి వారు నాడవారులై సెలవొసంగిపోవుచుండిరి. తర్వాత
నారాజు తనపుత్రుని కౌశలంబునకునుప్పొంగుచు తనకుంగల ప్రేమాతిశయ
మును భార్యకుం దెలియజేసి మదనోన్మత్తుడై విశ్రాంతింజెంది నానందం
బున నోలలాడుచు భగవత్సారాంశ ధ్యానపరుండై యుండె.

ఇట్లు నారాజభటులు నాయారాజ్యంబునకుంబోవుచు నాభటులలో
నొకనిని నందరుజేరి పొగడుచు నీవు సకలసామర్థ్యంబులలోను ఖ్యాతింజెందని
వాడవగుటచేయుత్తర దేశంబుంజనినక్కడికుశలంబులందెటదెల్లంబుగ ప్రత్యు
త్తరంబుం దెచ్చుటకునోహారంజెప్ప నాభటుడిట్లయొప్పుకొనికొందఱభటులతో
సెలవుపొంది ప్రతివారును నొక్కొక్కదేశంబునకుం జనుచుండ తానును
ప్రయాణమై బోవుచు కొన్నిదినములకంత నుత్తరదేశంబుంజని నాపురాధివ
ర్తమానంబుతెలియుగని నీరాజ్యము మణిభద్రపురంబని దెలిసి నారాజసభం
జేరి మణిభద్రరాజసముఖంబున తనవర్తమానంబుం దెలిపి సురద్యుమ్న చక్ర
వర్తి సుపుత్రికపటమును నేర్చి కానుకొసంగె. అంతట నారాజాపటమునుజూచి
సంతోషాంతభరితుండై సౌందర్యమును సొంపును సుఖవర్చస్సును వర్ణించి
గమనించుచు మంత్రిసింగని జూపిన నామంత్రి వీసగుణశోభస్కారంబులవర్ణిం
చుచు నాభటునింజూచి తన రాజకుమార్తెయగు లలనావతిపటమునునిచ్చి
సుముహూర్తలేఖలంబంప నాభటుడు తనహాస్యాశ్చర్యకరమైనవిద్యలను నారా
జసముఖంబునంజూప నారాజు విస్మితుడై సకలబహుమానముల నిచ్చుట
కుద్యుక్తుడై యుండుసమయంబున నారాజభటుడింద్రజాలమహేంద్రజాల
జలస్తంభన అగ్నిస్తంభన విషయంబులగు అరువదినాల్గువిద్యల వెదజల్లన

ప్పుడు నారాజు భటుని కివ్వందలచిన బహుమానములను తనకుప్పొంగునటులనివ్వగ నాభటుడట్లేపుచ్చుకొని రాజుతో సెలవుపొంది బయలుదేరి తనరాజ్యమునకుపోవుచుండ దారియందు తొలకరిమెరవులవంటి యొకజ్యోతి కానంబడి నచ్చట ఘోరా వేశంబులం బొందిన శబ్దంబులె పుట్టుచుండం దానుభయంబునొంది శంకించుచు మెల్లమెల్లన దారింగడిచి నిలిచి నిలిచి నలుదిక్కులం జూచుచు అస్తమాన మవుసమయంబున నొకపురింజేరె నాదేశమంతయు వాడుకప్రకారము దినదినము అస్తమానము గాకముందే రాక్షస ఘోరాటంబునకుభయపడి, వీధితలుపులనంతయు మూయుచుండ నాభటుడు గుర్తెరుగక నాగ్రామమందే అలసటతో వీధితిన్నెపై బరుండ నారాత్రి వాడుకప్రకారము నారాక్షసి బయలుదేరి నీగ్రామమునంతయు చుట్టుంజూచుచు నీవీధితిన్నెపై బరుండిన భటునింజూచి లేవదీయ నాభటుడు సకలవిద్యలనభ్యాసించి యుండుటంబట్టి నీఘోరరూపమునకు భీతిం జెందక నాగ్రహంబుతో నారాక్షసిని నెడమకాలితో దన్నిన నాకాలింబట్టి వీధిందిరిగి నాభటుని నేలమోపవాడు రాక్షసికి అగ్నిస్వరూపంబుండునట్లు చాకచక్యంబులు జేయ నారాక్షసికి అగ్నియందు భ్రాంతియుండుటం బట్టి భయపడి నిలిచి వానికి నమస్కారంబులు జేసి నన్నీ వేళ గాపాడుము యని వేడ నాభటుడు రాక్షసిని జూచి శంకించి నీవుచాండాలపనులకింపై జనులకపాయంబు నొరవేర్చుట నుచితంబుగాదని మన్నించి దానిపూర్వోత్తరంబులనడుగ నారాక్షసిసవిస్తరంబుగాజెప్ప నీభటుడు ఆగ్రహుడై గుండిలోలోపలమోసపుచ్చి యితరజనులకు హానిలేకుండుటకై యెంచి నీరాక్షసిని మిడుతయానట్లు మంత్రబలంబుచే తలపనట్లే మిడతయై తత్తరపడుచు పైకినెగురుచు తనబలముచే నిజరూపమై గానంబడుటకు వల్లబడక యుండుటంబట్టి నాభటు డామిడతను నొకపెట్టెడబ్బియందిమిడించి భద్రపరిచి నిద్రబోవ నాపురిజనులు నారాత్రి యార్భటంబునకు మిక్కిలిజడిసి నొకరితో నొకరు పలుకక నిద్రించక యాయాసంబై లేవనుశక్తిలేక నుదయంబైనదని వీధి తలుపులను తెరవకయుండ సమయంబున నాభటుడు నిద్రించిలేచి నాగ్రామమంతయు దిరిగిజూచు నప్పుడు వీధితలుపులు మూసియుండు కారణంబునుం గుర్తెరింగి నేటిరాత్రి జరిగిన వర్తమానముల జరిగినది జరిగినట్లు జెప్పుచు నొక్కొక్క యింటితలుపుల తెరవమని బయలుపరచ నాగ్రామస్థులు భయముతో నొకరొకరుంజూచుచు యిదవఱకు గలిగియుండు భయము నేటితో జారెనని నీభటుని స్తుతించుచు నెమ్మదితో యుండ నప్పు డీరాజభటుడు జనులాహ్లాదంబునకు నుత్సహించు

చుండం పురిజనులందరునుదీవించి భటునికి బహుమానములనిచ్చి తనరాజ్యమునకు బంపిన నాభటుడు బహుమానములం బొంది నెలరోజుల కంగయు సకలదేశములకుంజనిన భటసమూహములు నొక్కచోట గుమిగూడి వచ్చియుండు జనులతోఁజేరి తనతనవర్తమానములం జెప్పుకొనుచు నాటిదినమచ్చటనే అలసటందీర్చి మరుదినము నందరు నేకమై నైరావతి నగరముంజేరి రాజుంగాంచి తన తనముచ్చటలం జెప్పుచుండిరి.

అప్పుడా చక్రవర్తి మోహావేశమై యాభటులందరిం బిలువ నందరు మహాప్రభోయని చేతులుజోడించి వందనంబులనిడి తనతన వర్తమానంబుల దెలియునట్లు జెప్పుచు నుత్తరపార్శ్వమున బోయిన భటుని పటమునునిచ్చి వాని తొందరలగు కష్టముల సాంగముగ జెప్ప రాజాశ్చర్యపడి భరతర్షభుని మంత్రినిన్నిరప్పించి నీభటసామర్థ్యంబు లన్వివరించి వారికందఱికి బహుమానము లందివ్వ భటులందరు బుచ్చుకొని సంతోషాయత్తచిత్తులై తన తన యిండ్లకుం జొచ్చిరి. అప్పుడు భటుని వర్తమానంబుల బాగడుచు సంతోషాంతరంగుడై తన అంతఃపురంబుంజేరి భార్యబంధుసమూహంబులం బిలిచి నీపటమునుజూపినందరితో యోచించుచు మణిభద్రరాజ కుమార్తె యాగు లలనావతి రూపమును జూచుచు మన కుమారునికి సరియగు పుత్రిక యని యెంచుచు మంత్రినిబిలిచి వారి వర్తమానంబులకై యెదురుజూచుచు నుండతోడనే మంత్రి గమకించివచ్చి నీలలనావతిపటమునుజూచి నానందాంత శుభసౌఖ్యములంజెంది నీవరకన్యక పటమునుజూచి నేత్రానందాకలంకుడై విలసిల్లుచు చక్రవర్తినింజూచి నాసమ్మతం బాలకించితిగాన తమ మనోభీష్టం బుప్పొంగి నందరుంజేరి శుభకార్యమును జరిపించునటుల నుడివిన తోడనే మణిభద్రరాజునకు శుభలేఖ లంపుదము యనినరాజు నందరి శోభస్కరంబులం గమకించి పత్నియనుమతింగని మంత్రికి తమయిష్టానుసారమై మేమందరమునమ్మతించి నారమని జెప్ప మంత్రి బ్రాహ్మణులరప్పించి మణిభద్రమహారాజునకు శుభలేఖను లిఖించ నందు మహారాజరాజీయులగు మణిభద్రమహారాజ సంబంధులుంగార్కి తమ కొమార్తెయగు లలనావతి యను వరకన్యకు తమ యిష్టవంతమై మావరునకొప్పగించి శుభకార్యముల జరుప కన్యకాంతల సమేతమై బంధువర్గభటవర్గ నానాజనసమేతమై తాముున్ను తమ పత్నీసమేతమైవచ్చి నిందుకొలువుండి నేత్రానందముగ నందరును నీకార్యములజరిపి యెప్పటివలె నానందభరితులవుదురని వ్రాసి భటులతో నంప నాభటుడట్లే మణిభద్రపురంబుంజొచ్చి నానగరమంతయుజూచుచు రాజన

ముఖంబుంజేరి నీశుభ లేఖ నిచ్చెను. తర్వాతనామణి భద్రమహారాజు సింహాసనంబుపై కూర్చుండి తన మంత్రింబిలిచి నీశుభలేఖనుజూపి నందుండువర్తమానముల గుర్తెరింగి సంతోషానంద చిత్తులై యుండి నీవర్తమానమును నానగరమందుండు ప్రజలకుం దెలియజేసి లలనామణియను కన్యకను శృంగారించిపురజనులందరుంజేర బంధుపరివారభట సన్నాహంబుతో రాజున్ను తన పత్నీసమేతమై గాడీబండ్లయం దునిచిత సామాగ్రులంజేర్చి భేరీమృదంగ వాద్యంబులు బురికొల్పుచుండ వెడలుచు నైరావతి నగరముంజేరి రాజవీధిం బోవుచు ధగద్ధగాయమానంబుగ చంద్రునింబోలిన కన్యకతోజేరి నారాజభవనంబు సమీపమందుండ నా సురద్యుమ్న మహారాజు తనబంధుభటపరివారసన్నాహసహితంబై తన సంబంధువులనెదుర్కొని నొకరినొకరు గలసి మెలసి రాజదివాణంబుజేరి నొకవిడిదియందు నందరికి న్నియమనుచితాసనంబిడి తన కొల్వుకూటంబుంజేరి మంత్రితో వివాహప్రయత్నములయం దేజరిల్లుచు నా వారమందు వివాహమును నిర్ణయించి సకల దేశరాజులకును శుభలేఖలంబంప నానారాజులుం పురిజనులుంజేర నా దినము వివాహశుభదినంబై నందున నందరుం జూచుచుండ లలనామణియను కన్యకను శృంగారించి భరతర్షభునింశృంగారించి యిద్దరిం పెండ్లిపీటపై కూర్చుండనియమించి ధగద్ధగాయమానంబుగ నుండుటంజేసి సకల జనులు కీర్తింప సద్బ్రాహ్మణులు శేషలుంజల్ల మునిపుంగవులు దీవించ సకలరాజులు సన్మానంబులంజెల్లించ నా వివాహశుభముహూర్తమును దేదీప్యమానమై సకల జనులుంజేరి నిత్యోత్సాహులై జరుప నాదంపతులానందించుచు లేచి గురునకు సాష్టాంగ దండంబులిడ నా గురుడు నీపత్నీసమేతుల దీర్ఘాయురారోగ్యులై యుండునటుల దీవించ నాయిరువురు కల్యాణమంటపంబు సమీపమున యుండు విడిదింజేర నందరున్ను షడ్రసోపేతాన్నంబులగు నన్నంబారగించి తనతన విడుదులంజేరి భరతర్షభవివాహమును వేయినోళ్ళ కీర్తించుచు నైదుదినంబులుండి తన తన నగరింజేరి సుఖాసీనులై రాజ్యకార్యంబులం దేజరిల్లుచు కాలానుగుణ్యమై వ్యవహారములయం దనూయలేక దంపతిసమేతులై యుండ దనరుచు భగవన్నియమంబున శ్రద్ధాపరులై సకల జనులు పొగడ నేలుచుండిరి.

అంతట మణిభద్రమహారాజు పెండ్లికుమారునిన్ని తనకూతురునిన్ని సమీపంబున రప్పించి నేత్రోత్సవంబుగ జూచుచు తన సంబంధువులగు సురద్యుమ్న చక్రవర్తియనుమజ్ఞనువడసి నీపెండ్లిదంపతులతో తానున్ను తనవ

త్ని బంధు భటవర్గసమూహమై తన నగరింజేరి విందులంజేయుచు కొన్నిదినములుండనియమించిన నాభరతర్షభుడు సకలసురత సౌఖ్యముల ననుభవించుచు తనభార్యయగులలనామణికిం నైరావతి నగరకార్యనిర్వాహనిమిత్తంబులంజెప్ప తాను తనతల్లిదండ్రుల యనుజ్ఞను పొందుచుండుసమయంబున నాభరతర్షభుడున్ను అత్తమామలకు తనవర్తమానంబులంజెప్పివారుభరతర్షభుని వినయంబులకుప్పొంగి నిరువురికిన్ని సెలవిచ్చి సైన్యపరివారంబులతో బోయిరండని దీవించి కుతూహలులై కొంతదూరంబు వారితోడంజనుచు జాగ్రతతో బోయిరండని నా పెండ్లి దంపతులతో సెలవును పొంది నందరును మణిభద్ర పురంబుంజేరిరి

అంతట నాభరతర్షభ మహారాజు తన పత్నీ సైన్య పరివారసమేతమై నడవులంజొరబడి పోవుచు నిశీసమయంబున దినదినమున్ను నొక్కొక్కనగరంబుంజేరుచు నచ్చటచ్చట సన్మానంబులం గైకొనుచు కొన్నిదినంబులకంతయు తన నగరింజేర తన తండ్రియగు సురద్యుమ్న మహారాజు నత్యంతోత్సాహుడై తన కొమరునిం గోడలినిం గౌగలించి సంతోషాంత భరితుడైయుండ నా భరతర్షభుడు నెప్పటివలె నారాజ్యకార్యమున కేవలాత్మస్వరూపుడై సకల రాజులును కీర్తించునటుల కప్పంబులంగైకొనుచు శాంతసమదమాది నిత్యనైమిత్తిక గుణంబులం దేజరిల్లుచు వందిమాగధు లనేకవిధంబులం స్తోత్రంబులుసేయ సామంతులును, మంత్రులును, బాంధవులును, పౌరాణికులును, కవీశ్వరులును, విద్వాంసులును, తన్ను పరివేష్టించి కొలిచియుండ తాను సుధర్మాసనాసీనుడై అఖండునివలె రాజ్యములనంతయు నేలుచుండెనని జెప్పిన నామారుతాత్మజుండు నంజలీబద్ధుడై భగవంతుని నమస్కరించి నీదివ్యచరిత్రంబువలన రూపాతీతభావంబునుంబొందితిననిఆనందాశ్రువులొలుకుచు తన్మయత్వంబొందు సమయంబున నాదశరథనందనుడగు భగవంతుడు ఆంజనేయుని కౌగలించి భక్తసేవాధురంధరుడవు గమ్మని దీవించ నాంజనేయుండు మైమరచి సాష్టాంగ దీర్ఘదండంబులిడి పాదార్చనంజేయుచు స్వామీ నీ దినం బతీతుడైతిని గాన నిద్రింతము రమ్మని సుఖనిద్రంజెందిరి.

పంచదశకథారత్నము.

సమాప్తము.

ఓమ్.

శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః.

# షోడశకథారత్నము.

ఏమనా ఆవదినము రాత్రి శ్రీసీతారాములిరువురున్ను, లీలావినోదంబుగా గోష్ఠీవిలాసంబులాడుచుఁ జల్లగా వీచుచుండెడు మలయ మారుతంబునకు ఆనందంబొంది ముచ్చటలాడుచుండు సమయంబున వాయుపుత్రుండైన అంజనీతనయుండు శ్రీరాములవారికి సమస్కరించి స్వామివేదాంత వేద్యులకును గోచరంబుగాని విరాట్ స్వరూపంబెట్టిదో దానినాకానందమగునట్లు తెలుపవేయున జగదభిరాముండు తనకత్యంత భక్తుండగువాయునందనుని భక్తికిమెచ్చి ఓ కేసరీపుత్రా నీవడిగిన ప్రశ్నకుదగినట్లు యొకకథఁజెప్పెదను శ్రద్ధాయుతుడై వినుమని జెప్పందొడంగెను. ఎట్లన,

## కల్యాణరాజుకథ.

వాయుపుత్రా పూర్వము కర్నాటదేశంబును విచిత్ర వీర్యుండను చంద్రవంశపురాజు పరిపాలన జేయుచుండెను. అతనికి సుమతియనుమంత్రి రత్నంబొండతిప్రియుండు అతనికి సకలైశ్వర్య సంపత్తుగలిగియు, సకల ధర్మ పరోపకారంబును జేసియు నపుత్రకుండగానుండె సంతులకుదాంతి పరితాపంబుఁ బడుచు నొక్కదినంబున దృఢమనస్కుండై యిష్టదేవతారాధనంబుఁజేసి వసిష్టవామదేవాది సన్మునీశ్వరులరావించి ప్రశ్నించినంత వారెల్ల ధర్మంబులఁ గర్మంబులఁ బరిశీలించి, యిట్లనిరి. ఓ విచిత్రవీర్యమహారాజా నీవు పూర్వంబుఁజేసిన ఖర్మంబువలన నింతదనుక సంతానంబు వడయలేదు. ఇపుడన్ననో పుత్రకామేష్టి యాగంబుఁజేసిన దత్క్రతుఫలమున నీకుం దనయులు లభింపఁగలరు. మఱియెద్దానిచేనైనను సంతానఫలంబు లేదన నారాజేంద్రుండందులకుం దగుప్రయత్నంబుజేసి సుహూర్తంబునఁ బ్రారంభించి నిర్విఘ్నంబుగా నెరవేర్చ నయ్యగ్ని గుండంబునఁ బరమ పావనమూర్తియొక్కండు సుప్రసన్నుండయి పాయసంబునిచ్చి దీనినీసతుల భుజింపజేసిన, నేకచ్ఛత్రాధిపతియగు నొక్క సుపుత్రుండును, పతివ్రతాశిరోమణి యనం బఱగ నొక్క సుపుత్రికయుం గలుగుదురని పొమ్మనిన నానగోత్తముండతి సంతసంబున నగరునకేతెంచి మంచి శుభలగ్నంబునఁ దనసతియగు చంద్రకాంతయను చిన్నదానికిఁ గొంతయుఁ జిన్నభార్యయగు మంజువాణికి గొంతెంబునిచ్చి భుజింపఁజేసినఁ గొద్దిదినంబులకు, సతులిరువురు గర్భంబుదాల్చి

నవమాసంబులు నిండినమీఁద శుభతిథి శుభవార శుభనక్షత్రయుత శుభలగ్నంబునఁ బట్టంపురాణి మారుసమానగాత్రుండగు కుమారునిన్ని రెండవ భార్య రతియనంబోలు కుమరితనున్ను ప్రసవించిరి అందుమీఁదవిచిత్రవీర్య మహారాజు సంతోషిత స్వాంతరంగుండై యిరువురకు జాతకర్మాదిక్రియలఁ జరిపి కుమారునకుఁ గల్యాణరాజనిన్ని, కుమారితకుఁకల్యాణియనిన్ని; నామధేయంబులిడి యత్యంత ప్రీతిఁబెంచి శుక్లపక్ష చంద్రునింబోలి యభివృద్ధి యయిన సకల మయిన విద్యలనేర్పించెగనుకవారికి పదునారేండ్లప్రాయమైనంతవిచిత్రవీర్య మహారాజు సుతునకును పుత్రికారత్నంబుకును కల్యాణంబులు జేయయత్నించుచుండెను. ఇట్లుండ దన మంత్రియగు సుమతికినొక కుమారుడుగలిగి సువిలాసియను నామధేయంబుతో రాజకుమారుని నేమరక నుదయాస్తమయ సమయములయందు నిరువురు షికారు వెడలుచుందురు ఇట్లుండగా విచిత్రవీర్యమహారాజు ముందుగాకుమార్తెను కన్యాదానముఁజేసి తరువాత కుమారునకుఁ బరిణయంబుఁజేయఁదలపెట్టితమకూతురగు కల్యాణిని కేకయక్ష్మాపతికిచ్చి, కన్యాదానంబుఁజేసినముహూర్తంబు నడపి దాసదాసీసహస్రంబులతోడ గూతురినత్తవారింటికంపె నామీఁదఁబ్రతిష్ఠానపురమున నిద్దరువిశ్వకర్మకులస్థులు తమ చాకచక్యంబున రెండశ్వంబుల సృజించి, అది దేవదేవమాయా బలంబులు గలదిగానున్ను ఱెక్కలుగలిగినదిగానున్ను, ఆకాశంబునఁగూడ సంచరించునదిగానున్ను, తయారుపరచివీనిని గొనుట కర్హులు రాజాధిరాజులుతప్ప తక్కినవారికి దగదనిన్ని యోచించి వాటినిదీసికొని సకలరాజ్యంబులు దిఱిగియు నెవరును యీ మాయాగుర్రంబులఁ గ్రయంబునకుఁదీసియు ధరింపజాలమని వెఱగుపడిరి. అంతట నీకర్ణాటదేశంబునకువచ్చివిచిత్రవీర్యమహారాజసన్నిధానంబులోనిల్పిరాజునకుఁజూపిఓమహాప్రభో మీరుచక్రవర్తులుగానున్ను శౌర్యధైర్యపరాక్రమవంతులుగానున్ను యున్నారు. ఈయుత్తమాశ్వంబులు భూనభోంతరాళంబుల సంచరించుసామర్థ్యముగలది దేవమాయలంగూడినవివీనిం గ్రహించుటకుందమబోటివారు దక్క మఱియొక్కఅర్హులుగా నేరరు వీనిని మేమనేకయంత్రశాస్త్రంబులవిమర్శించి సృష్టించి తెచ్చినారము దీనికింబదికోట్లసువర్ణనిష్కంబులివ్వవలయునట్లుగాదేని మఱియొక్క చోటికిం గొంపోయెదము అనివచ్చియించిన నాసభలోనున్న రాజమంత్రికుమారులిరువురుఅశ్వలక్షణంబులరసి అశ్వారోహణా సామర్థ్యాలు గనుక వాటిం గ్రమంబుగ ఱెప్పవేయకఁజూచి వీటినే విధముననైనఁ గ్రయంబునకుఁ దీయవలయును అని నిశ్చయించితండ్రి

జూచి కల్యాణరాజిట్లనియె. తండ్రీ యీ యుత్తమాశ్వంబుల నాకుందీసి యివ్వవలయునన విచిత్రవీర్యుండు భయంపడి కుమారా ఇవి దేవగంధర్వులకుం దక్క మనబోటి వారలకర్హంబె! మాయామాత్రంబున భూనభోంతరాళంబులసంచరించునని చెప్పుచున్నారు నీకుం గావలెనేని అత్యంతాతిశయలక్షణాదులచే గూడిన హయంబులంబట్టి యిచ్చెద నీవో! నాకనేకవర్షంబులు సంతానంబులేమిచే, బహుదానధర్మంబులు వ్రతంబులు యాగంబులుం జేసి నందుచేం గల్గినవాడవు మనవంశంబునకే వొక్కండవు లేకున్న నిర్మూలంబగు నేనోవృద్ధాప్యుండనైతి వీటినిమనము భరింపంజాలము, అనుచుబలికినగుమారుండు సమ్మతింపక వీనిందీసియివ్వనిచో మనమేకచ్ఛత్రాధిపత్యము వహించి మనవద్దకు వచ్చిన యీయుత్తమాశ్వములను విడిచి వేరొక్క చోటికిం గొంపోయున్నచో లోకంబునంగల జనులునుసామంతరాజులును నవ్వరా! వీటినేవిధంబునైనం దీయవలయు లేకున్న మనకపఖ్యాతికల్గుననగా రాజుచింతించి ముద్దుకొమరుండు బల్కిన మాటలకు ధైర్యంబునకు మెచ్చి యాశిల్పులకుం బదివేలనువర్ణనిష్కంబులిప్పించి రెంటింబుచ్చుకొనితనకొమారుని కొకటిని మంత్రికొమారున కొకటినిచ్చి వారుదయాస్తమయవేళల వినోదంబుగా నయ్యుత్తమాశ్వంబుల నారోహించి సంచరించునెడ సకలజనంబులును రాజమంత్రులును బ్రమోదించుచుండుసమయంబున నొకానొకదినంబున నాకీలు గుఱ్ఱముల నారోహించి యిరువురు విహరించుచో గల్యాణరాజు యెక్కిన గుఱ్ఱము ఆకాశమార్గంబై జాలదూరంబుగా వింధ్యాచలసమీప భూములం బోవుచుండ నొక గండభేరుండము చూచి యిది యొకయాహారపక్షియని రివ్వునపైబడి గుఱ్ఱముతలపై దన్ని కాలంబట్టుకొనిన పైనున్న గల్యాణరాజు క్రిందికినొరిగె గండభేరుండమున్ను అదియాహార పక్షిగాదని విడిచివేసె నప్పుడది తుత్తునియలై నేలంబడియె గల్యాణరాజున్ను క్రిందపడున వసరంబున నయ్యరణ్యంబునం బతంజలి మహాముని సమిత్కుశఫలార్థియై దిరుగుచుండి ప్రొద్దుజూచుకొరకు నాకాశంబు వీక్షించ గల్యాణరాజు సమీపంబునకువచ్చె నది తెలిసి యాతక్షణమునం దనతపోమహాత్మ్యముల గ్రిందికిం బడనీక మెల్లన భూమికిందింపి మూర్ఛను మాన్పి ధైర్యంబుజెప్పి యులసటుదీర్చి తేరిమీాడం గల్యాణరాజును తననిజాశ్రమంబుజేర్చుకొని యుండు నెడం గల్యాణరాజు అతిభయభక్తివిశ్వాసముపిక్కటిల్ల దనకుం బ్రాణదానంబిచ్చి రక్షించి నందులకై బతంజలి మహాఋషిని వేవిధంబులగొనియాడి ప్రదక్షిణనమస్కారంబు లాచరించికొన్ని దినంబులు శుశ్రూషలుసలుపుచూ

మనంబుమెప్పించి యిట్లనియె. దేవా మహానుభావా మీకంటె నాకిక దైవము గలదా నాకుం బ్రాణదాతవు నీవేగదా ! నేనుంబునర్జన్మంబెత్తినవాడనైతిని గదా మీరే నాకిఁక దలిదండ్రులు మీరే తోడునీడ మీకడనే శుశ్రూషలు సలిపి కృతార్థుండనయ్యెదనని బలుమారుస్తోత్రించి నేనుంధన్యుడగునట్లు విరాట్ స్వరూపంబు దెలుపవేయనినఁ బతంజలిమహాముని యోచించి వీడతి బాలుండయ్యునిట్టియుత్తమ ప్రశ్నవడిగెనని సంతసించి గుణంబునకుం బహుగ మెచ్చి కుమారా చెప్పెదవినుమని యిట్లనియె.

విరాట్ స్వరూపమును పతంజలిఋషి కల్యాణరాజునకు దెలుపుట.

ఓకల్యాణ మహారాజా విరాట్స్వరూపప్రకారము గోరినవాడవైతివి వినుము అందుమనుజుడు అహింసాపరమోధర్మః అనునట్లు హింసావర్జితుండై సంసారంబునందున్నను కంసారియందే మనంబునిల్పి సర్వంబు బ్రహ్మార్పణంబని నిశ్చలమనస్కుండై కోరికలన్నియుమఱచి భగవంతుని పాదకమలములందే కోరికపూని వైరాగ్యంబుచే ఉచ్ఛ్వాస నిశ్వాసంబుల యోగంబువలన బంధించి సర్వసంగంబుల బరిత్యాగంబుజేసి యింద్రియవర్గంబుల లోబఱచికొని ఆత్మారామునిఁ జిత్తంబునంజేర్చి మనంబులీనంబుఁజేసి కనుఁగొనవలయును నప్పుడ సూర్యాదిదేవులను నఖండపరంజ్యోతి సచ్చిదానంద స్వరూపుండు నీతీరునఁగనుపడు. భూతభవిష్యద్వర్తమానంబైన విశ్వంబు విలోక్యమానంబగు నుపృథివ్యాపస్తేజోవాయురాకాశహంకారమహత్తత్వంబులనియెడిసప్తావరణంబులచేత నావృతంబగు మహాండకోశంబైన శరీరంబునందు ధారణాశ్రయంబైన విరాజపురుషుండు తేజరిల్లు నమ్మహాపురుషునికిఁ పాదద్వయంబులుమహాతలంబు, జంఘులు తలాతలంబు, జానుద్వయంబు సుతలంబు, తొడలు వితలాతలంబులు, జఘనంబు మహీతలంబు, పాతాళంబు పాదాగ్రభాగంబులు, రసాతలంబు గుల్భంబు, నాభివివరంబు నభస్థలంబు, వక్షంబు గ్రహతారకాముఖజ్యోతిస్సమూహ సమేతంబగు స్వర్గలోకంబు కంఠము, మహర్లోకము ముఖము, జనలోకంబు లలాటము, తపోలోకము శిరస్సు, సత్యలోకము బాహుదండంబు, యింద్రాదులు కర్ణంబులు, దిక్కులు శ్రవణేంద్రియంబు, శబ్దము నాసాపుటము, లశ్వినీదేవతలు ఘ్రాణేంద్రియము, గంధము వదనము, అగ్ని నేత్రంబులం తరిక్షంబు, చక్షురింద్రియము సూర్యుడు, రాత్రింబవళ్లు రెప్పలు, భ్రూయుగ్మంబు బ్రహ్మపదంబు, తాలువులు జలంబులు, జిహ్వారసంబు వేదంబులు, బ్రహ్మరంధ్రంబులు కోరలు, యముడు దంతంబులు, పుత్రాదిస్నేహకళలు నగవులు, జనోన్మాదకరం

బులయిన మాయావిశేషంబులు కటాక్షంబుల సంతస్సర్గంబులు, పెదవులు
వ్రీడాలోభంబులు, స్తనంబులు ధర్మమార్గంబులు, వెన్ను అధర్మంబు, మేఢ్రం
బులు ప్రజాపతి, వృషణంబులు మిత్రావరుణులు, జఠరంబు సముద్రంబులు,
శల్యసముదయంబులు పర్వతంబులు, నరంబులు నదులు, తనూరుహంబులు
వృక్షములు, నిశ్వాసంబులు వాయువు, ప్రాయంబు నిరవధికమైన కాలంబు,
లీలావినోదంబులు నానావిధజంతుసంతతులు, శిరోజంబులు మేఘంబులు,
వస్త్రంబులు సంధ్యలు హృదయంబు ప్రధానంబు, మనంబు చంద్రుండు,
చిత్తంబు మహత్తత్త్వంబు, అహంకారంబు శివుడు, నడవులు చతుర్యాగంబు,
కటిప్రదేశంబు పశుమృగాదులు, విచిత్రంబులైన శిల్పనైపుణ్యంబులు పక్షు
లు, బుద్ధిమనసు నివాసంబు పురుషుండు సర్వవిశేషంబులు గంధర్వచారణా
దులు, స్మృతి ప్రహ్లాదుండు, వీర్యంబు దానవులు, మఱియు ముఖంబు బ్రా
హ్మణులు, బాహువులు క్షత్రియులు, తొడలు వైశ్యులు, పాదంబులు శూ
ద్రులు, వసురుద్రాదిత్యదేవతలు ద్రవ్యంబులు, హవిర్భాగంబులు కర్మంబులు
యజ్ఞప్రయోగంబులు, యిట్టిసర్వమయుండైన విరాట్స్వరూపంబు కుబుద్ధి
మంతుండైన ముముక్షువైనవాడు మనంబున నిర్దేశించి గనుంగొని ముక్తుం
డగుడని నిన్నుం దెలియుమన నాకల్యాణరాజు శౌలుండయ్యెను గురూపదేశ
గతిని నడిచి విరాట్స్వరూపంబుం గని ఆనందాబ్ధియందోలలాడి పతంజలిని ప్ర
స్తుతించి యపవర్గమార్గంబులెల్ల గ్రహించి మీద ఋషీశ్వరుండు సంతసించి
నాయనా నీవో బాల్యుడవు నీదు తలిదండ్రులేమి చింతిల్లుచుందురో గనుక
నీవితక్షణంబున నంబయులు దేరి పురంబు జేరుమని దీవించి తనకడనుండు పాదు
కలనిచ్చి దీనిం బూజించి ఎక్కడికిం బోదలచినను బోవచ్చునని పలికిన నాక
ల్యాణరాజు సంతోషించి ఋషీశ్వరుని యెదుట వారియాశ్రయంబున మన
మీపాదుకల గ్రహించందగదని యెంచి పాదచారియై కొంతదవ్వరిగి వచ్చు
నెడనచ్చోనొకచోట చిత్రరేఖయను దేవభామిని సరసోక్తులబలుకుచుం గొం
దఱు చెలులతో విహరించుచుండగాం బాదచారియై నడుచు కల్యాణరాజు
దానింజూచి మూర్ఛాక్రాంతుండై కొంతసేపటికిం దెప్పరిల్లి లేచి తనలో
దాను పలుమారు వితర్కించుకొనుచు మరుబారికిం జిక్కి ఆహా యీవనిత
దేవగంధర్వవనితయో; లేక వనదేవతయో అటుగాక నన్ను వరింపవచ్చిన
భామినియో దీనిం జూచి మఱియెవ్వరిజూచినను తృప్తిగలుగునా ఏమి దీని
రూపు దీనిచూపు జింకచూపులకంటె మిక్కిలి తత్తరపాటుగలిగినది దీనిము
ఖంబు పూర్ణచంద్రబింబమునకైన నొక కళంకముండును అదియునుగాన

రాదు దీనిశిరోజములు తుమ్మెదలబారుగాబోలు దీనికనుబొమలు సన్నిష్వను నొప్పించు మదనుని ధనస్సుగాయున్నది దీనినాసికతిలపుష్పంబును ధిక్క రించు దీనినేత్రంబులు కరవిందంబులైన దీటుగావు దీనికర్ణంబులు శ్రీకారం బులుగానోపు దీనియధరంబుజూడజూడనే మధురంబుప్పొంగుచున్నదానిని పానంబుచేసిన నింకెట్టిరుచ్యమౌ దెలిసినదిగాదు కంఠంబుశంఖంబును ధిక్క రించు ఆహా దీనికుంభములు గజకుంభములు పిరుదులు లినుకదిన్నియలు గాని పిరుదులుగావు కుంభములకును పిరుదులకును సమభారంబయి తులఁ దూఁగుహస్తంబులు పల్లవంబులుగాని కరంబులుగావు యూరువులు రంభా స్తంభంబులుగాని తొడలుగానేరదు నడకహంస నడకైనఁ దబ్బిబ్బులు గలుగు గాని దీనికి గలుగనేరదు ఖండితనుగానిది మానవభామినిగాదు ఆహా దీని బొందని జన్మంబు జన్మంబా! ఛీ మృతకళేబరంబుగాని తనువుగానేరదు ఎట్టు లనైన నేకష్టంబులంబడియైన దీనిపొందుఁగలిగిన సమస్తైశ్వర్యములు తులఁ దూఁగును అయినదీనినే తనయనుగుచు నడిగినఁగోపించి శపించిననేమిసేయుదు హా దీనికి నేమానసు గానిమ్ము అని యొత్తుపాటున నామస్తగడయౌనక సమీపించి సంతసచ్చేడియు కల్యాణరాజుంగాంచి మోహించియు నలయ ని యట్టు నిష్ఠురపడి పొదదాటునకుంబోయి రాజేంద్రా నేనుంటిరిమై నీయ రణ్యంబున విహారించుచుండ మీబోటి పురుషులిద్దెసకు రాదగునా? మా బోటిపూబోండ్లుసైము తమపురుషులు కనుగంటనైనఁ జూడఁదగునా! అయిన మీదేశంబెద్ది నామధేయంబెయ్యది మతంబెయ్యది వంశంబెయ్యది ఇచ్చో టికిం దరలివచ్చిన గతంబెయ్యదని అంతయుఁడన కల్యాణరాజు యామె మృదు మధురవచనంబులకు సొమ్మసిల్లి యానందించి నామైగరుణకలిగినట్లు దోచు చున్నదని తలంచి ఓ సుందరీమణీ నా యాంధ్రమండలంబునఁ జంద్రవం శక్షత్రియుండ నామధేయంబు కల్యాణరాజు తండ్రివిచిత్రవీర్యుండ నేనువన విహారంబై డగ్గుచు నిచ్చో నినుంగాంచితి నినుజూచి మరలంబోవలేక నిందుఁ జేరితి తనియుచుంగాక నియ్యెడ మదనుండు కటుకటమ్ములచే సొమ్మసిలగ నుమ్మరుచున్నవాడుగాన ఆవిరహానలంబును చల్లార్ప నీవను శీతలోదకంబు దప్పమరిదియు జతపడదు నన్నుంగడకంటఁజూడుము లేకున్న ప్రాణంబులు నిలువనేరవని పరితాపపడుచున్న కల్యాణరాజుంజూచి చిత్రరేఖయిట్లనియె. ఓ రాజా నేనొక దేవతావేశ్యను నన్నుంజిత్రరేఖయందురు దేవలోకంబున సురేంద్రుసభయందు నమరియుండుదానను నే నీభూలోకంబున నీబోటిమాన వులకడనిలుచుట నుచితంబుగాదనన విని రాజు ఓతన్వి మదనుండు కురుకుట

ష్టులచే విఱివిగఁ బ్రయోగించెదు నేనిక నిముసంబైనం దాళజాల దేవతలకుఁ దమ్ముఖ్యమ్మినవారె విడనాడుట ధర్మముగాదు గదా నీవే నేను దేవతాప్సరసనని నుడివి మరు బారిచేఁ బ్రాణంబులఁ గోల్పోవు నన్నుఁ గరుణించి బ్రోవకున్నదై వతులను నా మధేయముం బెట్టుండునో చూతము స్వప్రాణంబులు నీయధీనంబు నీవు బ్రోచినను సరే లేక విడనాడినను సరే యని మైమఱచి ధరపై నొఱగినఁ జిత్రరేఖ కరుణించి రాజరూపంబునకుఁ మెచ్చి, మోహించి, నా కెట్టికష్టంబులు దేవసభయందు రాగలిగినను కొంది దినములైన నీ రాజకుమారుఁ బొందుటలు ప్రుట నిశ్చయంబని స్థిరచిత్తయై కల్యాణరాజు సమీపంబుఁ జేరి యొయ్యనఁ దనకరంబున లేవనెత్తి నిమిరి ముద్దుబెట్టి యాలింగనంబుఁ జేసి తియ్యనిపలుకుల నొయ్యన నిట్టులనియె మనఃప్రియా నీమనః పరితోషసంబుఁ జేయు నిమిత్తము కొంతదామసించిన మాత్రన నింతటి పరితాపంబునొందుట మీబోటి పురుషులకుఁ దగునా? నాకెట్టిపాట్లొచ్చినను కొద్దిదినములు నీ మనఃప్రియంబుగా నుండెదనని అయ్యారణ్యంబునఁ దనప్రభావంబుచే నొకయంతఃపురంబుసృష్టించి యుద్యానవతి కౌతూహలాయత్తచిత్తంబున మెలంగుచు నానాకేళిబంధముల మదనక్రీడావిహారులై పూపొదరిండ్లయందును కేళీకావనంబులయందును నిర్భయత్వంబునఁ దృప్తిబొందుచున్న యెడ? నయ్యారణ్యంబునఁ బాలదినములనుండి వసించు ప్రళయాంతకుండను రక్కసుం డొకదినంబున నయ్యారణ్యంబెల్ల శోధించియు నాహారంబేమియు దొరకనందున నశనార్థుండై బహుక్రోధుండై యేమిదొఱకకపోయెనని మిక్కిలి కాంక్షతో దిరుగుచుండ నచట నీకల్యాణరాజున్ను చిత్రరేఖయున్ను విహారక్రీడల నుండ నుండుట జూచి బహుదినంబులకు నరభోజనంబు ప్రాప్తించినదని యుప్పొంగి త్వరితంబున వద్దకుఁ బరువిడి నాలుకలు రుచించునట్టి హాసంబుఁ జేయుచు బెడబొబ్బలు పెట్టుచు మహాభయానక రౌద్రాకారంబుతో నొకకేలఁ జిత్రరేఖయున్ను యొకకేలఁ గల్యాణరాజున్ను యెత్తుకొని మహాసంతసంబునం జిత్రరేఖను మాత్రము తనయంతఃపురంబునం దాచి కావలియుంచి కల్యాణరాజును భక్షించుటకై కాలోచితకృత్యంబుల దీర్చి భుజించెదనని యొకచెరసాలయందుంచి బయటరాకుండునట్లు రక్కసులను కావలియుంచి కొలనికిబోయి వచ్చునంతలోఁ గల్యాణతమకుం గలిగిన వ్యవస్థకుం జాల జింతించి అయిననేమి చేయవచ్చునని వగచి రాక్షసుండరుదెంచువరకు చోటనున్న ప్రాణహాని కలుగునని యెంచి లేటాలునఁ బతంజలబుషియిచ్చిన పాదుకద్వయంబును దలంచికొని చిత్రరేఖను విడనాడి తనపురంబుఁ జేరనిష్టపడక నిమిషమాత్రంబున నచ్చుటకే

మూడుక్రోసుల దూరంబుననుండు సౌరాష్ట్రదేశంబుఁజేరి నిమిషంబొక
యేడుగా భావించుచు నేలాగుల నాచిత్రరేఖను గ్రహించఁగలుగుదునని
విచారగ్రస్తుండై యొకయింటివాకిటఁ గూర్చుండి యోచించుచుండు తరి
నాయింటియందుండు కళావతియను వేశ్యసాయంసమయమున వాసినీరార
గవలువఁగట్టి విశేషంబుగ నాభరణములనలంకరించి కాటుకదిద్ది కస్తూరితి
లకంబుదిద్ది పయ్యెదలు జారనొయ్యన ధళుకులు జూపుచు వాకిలిఁజేరి జార
పురుషులఁ జూచుచుండ దనవాకిట యోచించుచుంచు మదనసముండగు
కల్యాణరాజుఁగాంచి బహుమర్యాదతోడ వద్దజేరి వద్దికతోడ నాయకా
మీరిందుఁజేరి లోపలరాక నేమియోచనఁజేసెదరు తామువచ్చెదరని నేనిం
తో యాతురముతో లేచి యున్నదానను మహనీయులుతమబోటివారింగూడి
సుఖింపని జన్మంబు జన్మంబె లోనంబోయి పన్నీటం జలకమాడి వలయు
నంతభుజించి క్రీడావినోదంబుల గాలయుదమురండుపోదమని కరంబునుబట్టి
మరియాదగాఁ బిలుచుకపోయి స్నానమాడించిభుజనంబుఁజేసిశయనగృహంబు
జేరి తాంబూలచందనాదులనలంది వేతరులమదనక్రీడా సంతృప్తులై యలం
కృతంబుగనున్న కొన్నియాభరణంబుల దినదినంబులకు గ్రహించి లేశంబును
లేకఁజేసియుండుమీద రాజుపై నసూయాపరికల్పిత చిత్తంబుజూపెట్టికడకు
నిల్లువెడలించిన కల్యాణరాజున కత్యంత మనోదుఃఖంబు గల్గి చిత్రరేఖపై
మనంబెల్ల పరితాపపడుచున్నను విడకు నీతిరున సీవేశ్యవద్ద భ్రష్టుండైతి
నన్నని వేశ్యలచిహ్నంబులు కపటచిహ్నంబులనియుఁజూపులు చిత్రపుచూపు
లనియు భ్రమలు వెర్రిభ్రమలనియు ధనంబుగల్గి నంతదనుక మనంబిత్తురని
యు, ఘనంబుగ యోచించి యుచ్చోటుఁగదలి యాసౌరాష్ట్రపురవీధినిమూ
ఢస్వరూపుడై పోవుచున్నయెడ నన్నగరపరిపాలకునకును విశారదయనుపుత్రి
కారత్నంబుగలదు అన్నారీ రత్నంబుఁ వయోవంతురాలై అతిచక్కనిదై
తండ్రివివాహంబుఁ జేయనెంచినయెడల నాకంటికిం బ్రియమగు పురుషునిఁ
గోరి వరించుదుఁగాని వేరొక్క పురుషుని వరింపనని దేశాధిపతు నెల్లఁ
బిలుపించి చూపినను తాను మెచ్చక దనకుం సమమగుపురుషుఁడు ధరిత్రి
లోఁగలఁడో లేడో యను శంకతో విచారగ్రస్తురాలై దినం బొక్కయుగం
బుగాఁగాలంబుఁ గడపుచు నాటిసమయంబునఁ దనమేడపైఁ జెలికత్తెల
తోడవిహరించుచుఁ గొలకలగుండవీధి మధ్యమునఁ బాదచారియై యోచ
నతోనడచు కల్యాణరాజుంగాంచి మోహపరవశయై మూర్ఛిల్లియంతలోఁ
జెలికత్తెల శైత్యోపచారంబులకుఁ దెప్పరిలి యోచెలులారా చూచితిరా,

ఇన్నిదినములుగా నా సౌందర్యంబునకున్ మించు పురుషుండు లభించక నా యౌవనంబు వృథాయయ్యె, నిప్పుడే విధినైన నదో వీథిం బఱతెంచు నరోత్తమునిం దెచ్చి నాకుం దృష్టిఁ జేయుఁడు, ఆతండే నా నాయకుండు. అతనిం బరిణయంబుఁ జేయని జన్మంబేల నని చింతనొంది కుందఁగా చెలులు నివ్వెఱపడి యాతిక్షణంబ పరుగులిడి కల్యాణరాజుం జేరి అయ్యా! తమ దేశంబెయ్యది, కులంబెయ్యది, నామధేయంబెయ్యది, ఎక్కటికేఁగదరని యడిగినందుకుఁ గల్యాణరాజు నివాసంబుఁ జెప్పక నే యాత్రఁ జేయఁబోయెదువాఁడ, నాకన్నియు నగరంబులె, అన్నియు గృహంబులె, నాతో మీకేమి పనియున్నది, పొండు పొండని గద్దించి పలుకఁ జెలియొకతె ముఖంబునఁగల రాజలక్షణంబుల నరసి యితండెవ్వఁడో రాజోత్తముఁడు, ఎద్దియో కార్యార్థియై యిటుల విహరించెడు వారని తలఁచి అయ్యా! అయినను మా రాజపుత్రి సువిశారద యను కన్యారత్నంబు మిమ్ము తన యంతఃపురము కిటికీలనుండఁ జూచి మోహించి మిమ్ము వివాహమాడఁ దలంచి సన్నంపినది. కనుక మాకీదయ చేయవలయును రాజుగారున్న తగుమర్యాదతోడ మిమ్ముం గొనిపోవుదుము అని నుడువఁగఁ గల్యాణ రాజేంద్రుండు భయపడక నాశపడకఁ జిత్రరేఖపై విచారముతో నడుచుచుండ నింతలో సువిశారద తన తండ్రికడ కెఱుంగింపఁగా, సౌరాష్ట్రరాజు తగు పరివారములను, ఆందోళికలను పంపి యుప్పురుషునిఁ దోడితెండని యుత్తరవుం జేయు వారెల్లరు ముప్పదిరెండు వాద్యంబులతోఁ జనుదెంచి రమ్మని ప్రార్థించినఁ దాను సమ్మతిపడకను రాకనుండ బలిమిమీఱు వారెల్లఱు వాహనంపైఁ జేకొని రాజసమీపమునం బెట్టఁగా, సౌరాష్ట్రరాజు సమర్యాదఁగావించి మహనీయా, ఇదిగో మాకుమారితయగు సువిశారదరూపపటము చూడుఁడు, యీచిన్నది మిమ్ముఁ గల్యాణమాడ నెంచెఁగాన, నప్పొలంతినిఁ బరిణయంబుఁ గావించుకొని నా రాజ్యంబున సుఖించుచుండుడనఁగ గల్యాణరాజు చిత్రరేఖపైఁ గల మోహంబుచే వెఱ్ఱివానివలెనటించి పిరాజా, తీర్థయాత్రాపరుండనగు నాకేలఁ గల్యాణము, నాకుం గృహంబులు లేవు, పురంబులు లేవు. దినమొక పురమునఁ గాలంబుఁ గడుపుచుఁ దిరుగు సన్యాసులకేల నిట్టి భ్రమలనిఁ బలుక రాజానంతఁ గోపంబుగలిగి మంత్రినిఁ జూచె మంత్రీ, రాజాచిత్తము వారము రోజులు నిదానించవలయు నితం డతిమనోచంచలుండై యుండునట్లు దోచెడు యోచించి యుత్తరవు ప్రకారము నడుచుకొనునట్లు గావించెద నని మనవిఁ జేయు, నాలాగే అయినను నాయాజ్ఞ నుల్లంఘనఁ గావించెఁగనుక నంతదనుకఁ జెరసాలయందు

నుంచుమని యుత్తరవుఁజేయా నట్లే గావించిరి. పురంబునఁ గలవారు ఆహా యిట్టి వెఱ్ఱివాఁడు గలఁడా, యెవఁడో వీధినిఁబోవుచుండ మర్యాదతోఁ బిలిచి విడఁనిచ్చి పోషించెదనని రాజు చెప్పినందుకుఁ గులము గోత్రములేమియుని పోకులు బల్కినయట్లు యీతంతు బలికె. నిట్టిమూర్ఖుఁడైన విడుచునా, వీడె వండో బలుమూర్ఖుఁడు, వీనికి ప్రాప్తంబులేదు. నక్కయెక్కడ నాగ లోకం బెక్కడ, యని యున్నట్లు నూరుఁదిరుగు భిక్షాపాత్రకుఁడగు వీని కిటువంటి ప్రాప్తముండునా! అదియునుం గాదు, లోకంబులో నెందఱో రాజాధిరాజులుండ, నీరాజున కేమిగిట్టె, తాను రాజుగానుండి దోవను పోవు నెట్టివానికిఁ దన కూఁతు నిచ్చెదనని బలవంతపెట్టునా! కుమారి తేయు నిట్టి భిక్షాపాత్రుని మోహించ వలెనా? ఇదివఱ కెందఱో రాజు లువచ్చి కన్యనివ్వమని ప్రార్థించలేదా? అందఱికి నివ్వనని ఇవుడీ ద్రవ్య హీనునిఁ గుమారి గోరినంతనే కొంచెమైన దొడ్డయోచనఁ జేయక నిట్టి వాని బలవంతపఱచునా? యాకన్య వీనిరూపముఁజూచి మోహించెనేమో, అయితే గుణము, ధనము లేకున్న వీనిరూపమెందుకుఁ బనికివచ్చును. గుణ ముఁజూడ వెఱ్ఱివాఁడు, ధనముఁజూడ నిర్ధనుడు, ఆస్తిఁజూడఁ గాళవాస్తి, భూమిఁజూడ రుద్రభూమి, రూపమొక్కటిమాత్ర మున్నది. అయినా పూజ కొలది పురుషుఁడు గలుగునని పెద్దలు చెప్పుదురు తన పూజాఫల మిట్టిది గానుండ నిట్టియైశ్వర్యవంతునైనఁ గోరునా? అని వారివారికిఁ దోచినట్లు పలువిధంబులఁ బలుకుచుండఁ గల్యాణరాజున్ను చెరసాలలోఁజేరియోచించి సువిశారదపైఁ దనకు మిక్కిలి మోహంబున్నను, సమయంబు గాదనియం దొక్క కాగితంబుపై దన నామధేయంబును కర్ణాటదేశంబునుతండ్రినామ ధేయంబును యికను కొద్దిరోజులలోవచ్చి వివాహ మాడెదననియు, నందు లకుఁ దన హస్తంబునంగల ముద్రికయే సాక్షియనియు వ్రాసి,ముద్రిక నం దులోనుంచి యందుంచి పాదుకలపైఁ బదంబులిడి కాశీయాత్ర గావించిన సీ కర్ణతెరి విశ్వనాథ కరుణాకటాక్షంబున నేదోయొక సహాయంబుగల్గిఁ గార్యంబు సమకూర్పవచ్చునని కాశికని యెంచిన మాత్రమున గంగానది యొడ్డున నిలచె నంత సకల పాపహారంబగు నటుల గంగలో స్నానంబులాడి కాలభైరవుని విశ్వనాధుని విశాలాక్షిదేవిని అన్నపూర్ణను గణపతిని దర్శించి పూజారాధనలు గావించి మనంబునం గల కోర్కెలఁ దలంచి యందొక్క చోఁ దపోనిష్ఠతోనుండు యొక ఋషీశ్వరుఁగని నమస్కరించిన ఋషిదీవించి కూర్చుండ నియోగించిన మీఁదఁ గల్యాణ రాజువద్ద యున్న పాదుకలను

గాంచి పురుషోత్తమా, నీవద్దఁగల పాదుకద్వయంబు నిచ్చెదవేని నా వద్ద గల సర్వశత్రు సంహార కరమగు శక్తినియిచ్చెదను. యిచ్చెదవాయన యోచించి యిది కార్యంబున కనుకూలంబై సదని సమంత్రకంబుగాఁ బుచ్చుకొని పాదుకలనిచ్చి కొంతదూరంబరిగి శక్తినిఁ బునశ్చరణఁజేసి ఋషివద్దకుఁ బోయి, పాదుకలను గ్రహించుకొని రమ్మని నంత నదిపోయి ఋషింజూచి పాదుకల నిచ్చెదవా లేకున్నఁ బ్రాణంబులఁ గోల్పోయెదవా, యనదాను యోచించి ఆహా యెంత మూఢుఁడనైతిని, ఉండీనదాని చేఁజేతఁ బోగొట్టుకొను సమయంబువచ్చెను, ఇక నేమిసేయవచ్చును, గ్రహచారవశాతునాలాగున బుద్ధిపుట్టెనని వగచి పాదుకలనిచ్చి యంపె, నామీదఁ గల్యాణరాజు ఇంకా యచ్చటచ్చటఁ గల పుణ్యక్షేత్రంబులఁ దర్శించుచున్న నెడనిక్కడఁ గర్ణాటదేశంబున విచిత్రవిఖ్యాంశు లేక లేక వరంబులతోఁ గలిగిన పుత్రుండు వలదని దీసిన యంత్రపు గుఱ్ఱము వలన పోయిన మార్గము తెలియకనన్నాహారంబుల నాశింపక మంత్రి కుమారుఁడు మాత్రము పురంబుఁ జేరుటకుం జాలాచింతనొందుచు సతీపతులు నిమునమైన పుత్రుంగూర్చి తలపోయుటలు మానక రాజ్యం బెట్టియున్నదని యైన మనసాదలంచకఁ బరిచారకుల సేవ నల్లగైకొనక నిరంతర మశ్రుధారాలోలుకుచుండగా మంత్రిచూచి, ఆహా మోసము వచ్చెనే, యని దిగులుపడి దేశ దేశంబులకుఁ గల్యాణరాజుం గని పెట్టుటకుఁ జారులం బంపెను. సువిలాసియుం దన స్నేహితుఁడును బ్రభుండును నగు కల్యాణ రాజు దాకను మాత్రము చనుదెంచుటకునగఁజెంది తానును మిత్రదుఃఖమున నన్నాహారంబువీడి పరితాపపడుచుండెను. ఇచ్చట చిత్రరేఖయు నా బ్రహ్మరాక్షసునిచేఁజిక్కి మిక్కుటముగైన బాధలకోర్వఁజాలక వానివద్దఁజేరి బలవంతముఁ జేయఁ బలుదుఃఖించి యో బ్రహ్మరాక్షసా వినుము, నేను నీచేతఁజిక్కితినిగదా, ఇక నెందుఁబోగలను, నీసొమ్మునైతిని, అయితే నే నింద్రలోకమున సభలోనున్నపుడు గర్వించిన దాననై యింద్రునిచేత శాపగ్రస్తనైతి నయ్యది కారణంబుగా నేని భూలోకంబునం ద్రిమ్మరుచుంటి నట్టియెడ నారాజోత్తముండును నీవలె బాధపెట్టిపొందఁగోరె, నాతో నెవ్వరేనియు నారు మాసంబుల దనుకఁ గలయరాదు అట్లయినఁ నాతోఁ బొందువానికి శిరంబుసహస్ర వ్రయ్యలగును, ఇది యింద్రుని శాపంబుచెప్పుడు. గనుక నీవు తొందరపడకుము యీ శాపంబు దాటిన నీ యిష్టాను సారముగాఁ బ్రవర్తించెద నని కాలోచితంబుగాఁ బలికి వానికి మృదుమధుర వచనంబులఁ దృప్తిఁ గావించుచు, నిద్రాహారంబు

లేక సహర్నిశంబును కల్యాణ రాజుపై మనంబుఁగలిగి కాలంబుఁగడ
బుచు, ఘడియు లెంచు కొనుచుండెను ఇచ్చట నిట్లున్న సౌరాష్ట్ర దేశం
బున సౌరాష్ట్ర రాజు కల్యాణరాజును చెరసాలలో నుంచిన మరు
నాఁడుదయంబునాఁ గావలియుండువారు చెరసాలఁజూడనం దెవ్వరును లేక,
నొకకాగితపు పొట్లముండుటఁజూచి, దిగ్భ్రమపడి, యికజీవములఁ గోల్పోవ
వలసిన సమయమువచ్చినదని, అయినామనయజాగ్రతయేమియున్నది? ఎప్ప
టియట్ల తాళములువేసి యున్నది. అయితే మనిషి కానరాడు, అతఁడేమో
మాయకాఁడుగా నున్నాడు, కానున్న నెందుఁ బోఁగలఁడు, ఈ సంగతులు
రాజున కెఱింగించినను తరువాత నేమైననుగానిమ్ము దైవఘటన ప్రకారం
బునజరుగునని నిశ్చయుపకులై, రాజునకతి భయభక్తితోడ నెఱింగించిన,
రాజుమంత్రియు నత్యాశ్చర్యపడి చెరసాలం బరిశోధించినంతనందున్న కా
గితంబును ముద్రికయున్నుచూచి నిశ్చేష్టితులై ఓహో మోసపోయితిమే,
తెలియకపోతిమే, చక్రవర్తి తనయుఁడని తెలియకఁ జెరసాలంబెట్టితిమే, మన
కేమికీడు వాటిల్లునో, అటువంటి సుందర పురుషుండును మహాద్భాగ్య సంప
న్నుండును, మనకుమరితకు లభ్యమగునా? అయినాముద్రికనిడి మగుడివచ్చె
దనని మాయమాయెనే, అతనినేలాగునఁ గనిపెట్టఁగలము, అతనువచ్చునం
తవరకును సువిశారద ప్రాణంబులు నిలుచునో? లేకనిలువదో, మనపురంబున
మనచే, నతను మరిగెనను యపనిందయుగలిగెనే! ఇక నేమి చేయవచ్చునని,
యాలోచించి, జరిగినవర్తమానమును చక్రవర్తియగు విచిత్ర మహారాజు
నకుఁ దెలియపరచెఁ దానును యేబదియారు దేశములకును సేవకంగాఁ జారు
లనంపె, సువిశారదయుఁ జెరసాలలో, జిక్కిన కల్యాణరాజు ముద్రిక
యులిఖితంబును, చూచి యానందసందోహయై వేమరు వేమరుకనుల నద్దు
కొని, అయినా యామహనీయుఁడు మాయంబున నెటుకేగునో? ఎందుల
నున్నవాఁడో! ఎప్పుడు దర్శనంబిచ్చి కరంబుఁబట్టి కౌఁగలియిచ్చునో! నానో
ము నెప్పుడు ఫలించునో, యని జాగ్రత్స్వప్నసుషుప్తిన కల్యాణ రాజును
మఱువక నన్నాదులం ద్రుణీకరించి, కాలంబుఁ గడుపుచుండెను. ఇచ్చటఁ
గల్యాణరాజు, మఱియుగయ, ప్రయాగ, హరిద్వారము, మొదలయిన పుణ్య
క్షేత్రంబులదర్శించి, తదనంతరము చిత్రరేఖయుండు యరణ్యంబున కని పా
దుకలపైఁ బదంబులిడ నయ్యరణ్యంబుఁజేరి చిత్రరేఖయుండు గదిఁదెలిసి
యచ్చోటుఁ జేరినంతన చిత్రరేఖ యపరిమితానంద సందోహయై యాలింగ
నంబుఁగావించి నమస్కరించి ముద్దులొలుక నాప్రియా, నిన్నుఁబాసి

యారుమాసంబులు గావచ్చెగదా! ఈ దినంబునకు నీవికరాకున్న రేపటికి నీప్రళయాంతకుండునను జెలియు నట్లుం గాకుండ దైవసంకల్పంబున నేడె నినుంగాంచితి ధన్యాత్మురాలనైతి, నైననుం బాసి నీవెన్ని పాట్లన్ని దినంబులుపడితివో! మనోనాయకా, నాకొఱకై నీకిట్టికష్టంబులొదవె, గదా యనఁ గల్యాణరాజు, తనడవడినెల్ల విశదీకరించి సంతృప్తికరులై యిష్టాగోష్టినున్నయెడ, రక్కసుండతి భయంకరాకారంబుతో దినంబులెన్నుకొనుచు నారుమాసంబులు నేటికిఁ దీఱెఁగదా! ఇకనా నారీమణిం గూడిసుఖింపఁగలిగెను అది యిన్నిదినంబులు వృథాకాలంబుఁ గడపెను, ఇకదానియత్నంబేమిసాగును. ఇక నదిసమ్మతించినను లేకున్నను విడువరాదు, అనిసంతసపడుచు, సకలమైన ఫలహారాదులను చీని చీనాంబరాదులను గైకొని, తీవ్రంబుగ దనయంతఃపురంబుఁ జేరనచ్చో నీకల్యాణరాజు చిత్రరేఖయు శయనగృహంబును జేరిమెలంగు చుంటంగని విస్మయాకులిత చిత్తుండై ఓహో! యీమనుజుండు నాటిదినంబున మనకవశంబుఁగాకుండఁ, దప్పించుకొనిపోయి నేటికి దొఱకెనని రౌద్రాకారుండై, ఓరీ మనూజాధమా, నా నామధేయంబు నీ విదివఱకు వినలేదా? నాపేరు ప్రళయాంతకుండునుమా? నాదుగాదు తప్పించుకొని పోవుటకు, నీకాయుఃప్రమాణ మింతదనుః మండినది గాబోలు. లేకున్న నాయుడవికి "ఆ" నాగృహంబునకు 'ఆ' నా శయనగృహంబు 'నా ప్రియురాలితో' ఎంత ధైర్యముతో నానామధేయంబుఁ గలలోనైన తలంచినంత దేవేంద్రాది దేవతలైనను గడగడ వడంకుచు వారివారి స్థానంబుల విడనాడి ప్రాణంబులఁ దప్పించుకొని ఫలాయన మగుదురు. గర్భిణీస్త్రీలు నాపేరు విన్నమాత్రమున గర్భంబు దూసిపోవును! నా యరణ్యంబునకు నావుత్తరువులేక గరుడ గంధర్వయక్ష సిద్ధసాధ్య నాగవ ఖశ్చరాదులైన రానేరరు, మృగంబులైనను శబ్దించరాదు ఇట్టిశౌర్యధైర్యగాంభీర్యవంతుడనై నీవొక్కమనుజునకు దృణీకరభావము గలిగియున్నది. పర్వంబు పడగనీడను దర్పంబుగఁ గప్ప వసించినరీతి నీటుగ నున్నావు, ఒరే నీ మర్దించిన మాంసము చాలా రుచ్యముగానుండునురా, అని పెడబొబ్బలిడుచు చెట్టున నొక పెట్టివ్వఁ గల్యాణరాజు తన చాక చక్యంబున దానిం దప్పించుకొని, ఓరీ రాక్షసాధమా, నీవానాడుగాదు తటాలున మోసపుచ్చుటకు నేనంపుమార్గణములను దప్పించుకొనిన జాలును, ఇదిగోవంపుచున్నానని ఆలస్యములేక, దాను ఋషీశ్వరునివద్ద సంపాదించిన శక్తిని సమంత్రకంబుగాఁ బ్రయోగంబుఁ జేయ నది మండిపడి చండప్రచండ రౌద్రంబున

భూమ్యాకాశంబున కొక్కటియై ప్రళయాంతకుని గుండెలు ఘల్లుమన గం
డుమీఁటి నురంబునఁదట్టి కుత్తుకందునిమి నేలంబడఁగొట్టి రాజుంజేరి సంతో
షాయత్త చిత్తుంజేసె. అటుమీఁద నిట మనకేమి పనియని గదలి పాదుక
లపైఁ బదంబులిడి సౌరాష్ట్రదేశంబునకరని దలంచి నంత నప్పురంబునం గల
శృంగారవనంబున నిరువురుఁజేరిరి అచ్చటవారట్లుండ సౌరాష్ట్రరాజకుమా
ర్తెను విశారద, విరహానల దగ్ధయై నానాటికి సన్నబారి చెలికత్తెల శైత్యో
పచారంబుచే నటులఁ గాలంబుఁ గడుపుచు నొకనాడు శృంగారవనమున
కై సనుపోయి ప్రొద్దుపుచ్చుదమని దలంచి చెలులతోడ శృంగార వనమున
విహరించుచుండ నెడమభుజంబు ఎడమనేత్రం బదిరె, వచ్చునెడ శుభశకు
నంబులాయె, నిది ఏమో మంచికాలమువచ్చు లక్షణములని వనంబు శృం
గారమును చూచుచుండ సందొక్కచో రతీమన్మథులఁ బోలిన దంపతులఁ
జూచి బాగుగాఁ బరికించి యీతండు మన నాయకుండుగా నున్నాడని మది
నెంచి యాతత్క్షణంబు తండ్రికడ కెఱింగించె. అంతలో సౌరాష్ట్రరాజు చతు
రంగ బలంబులతో సకల సంభ్రమంబులతో ముప్పదిరెండు మంగళవాద్య
ములతోఁ బలువిధంబులగు కానుకలతో శృంగారవనమునుచేరి సమీపించి
అర్ఘ్యపాద్యాదివిధులతోఁ బూజించి కౌఁగలించి నేమంబులనరసి యపరిమి
తానందుండగుచు రాజకుమారా నీ సాహసంబు నీ గుణంబు నీధైర్యంబు
అన్యులకున్నె నా కుమారి నాలకించి నాకుమరితం బరిగ్రహించి నన్ను ధన్యు
నిఁజేయుడు. నాప్రార్థన లంగీకరించుడు. నేఁజేసిన యపగాధంబుల మన్నిం
చుడు, చక్రవర్తి తనయుఁడని తెలియనైతినని యనేక విధంబులఁ బ్రార్థింప
నట్లగాకయని పురంబుఁజేరి నగరుఁజొచ్చి సువిశారదఁ బరిణయంబాడికొన్ని
దినంబు లచ్చోటనుండి ఇరువురు నెలతలతో రథగజ తురగపదాతులతో
సౌరాష్ట్రరాజిచ్చిన దాసదాసీజనంబులతో బయలుదేరి కర్ణాట దేశంబును
సమీపించి తండ్రికిఁ దెలియఁజేయ విచిత్రవీర్యుఁడు నాటికిఁ దనయుంగాంచు
భాగ్యంబు గల్గెఁగదాయని సంతసించి పురంబుఁ జాటంబనిచి యలంకృతం
బుఁగావించి మహాదైశ్వర్యంబుతో మంత్రి సామంత పురోహిత వందిబృంద
పురస్సరంబుగాఁ గొమారుందోడ్తెరంబంపి నగరంబున నుత్సవంబుఁగావించి
నగరుఁజేరి తలిదండ్రులకుఁ గోడండ్రిద్దఱున్ను కుమారుండును నమస్కరిం
చిన నాశీర్వదించి సువిశారదకుం గల్యాణ రాజునకుఁ బునః కల్యాణంబుఁ
గావించి, సకల మహీతలంబెల్లఁ గల్యాణ రాజునకుఁ బట్టంబుఁగట్టిన మీఁదఁ
దా నేకచ్ఛత్రంబుగా, రాజ్యంబుఁజేసి పుణ్యవంతుఁడై కీర్తిఁగాంచి విరాట్

గీ॥ శ్రీ సీ తా రా మ హృ ద యం బ ను,

స్వరూపంబు దర్శించుచు సర్వపాపవిరహితుండై సచ్చిదానంద స్వరూపమైన ముక్తి నొందెననిన, హనుమంతుడు దేవా నిదుర యానంద మగుచున్నది, శయనించుదమనిన శ్రీరామచంద్రుండు వల్లెయని యందరును శయనించిరి.

షో డ శ క థా ర త్న ము,

స మా ప్త ము.

## శ్రీమత్సీతారాములు హనుమత్సమేతులై నగర్యాలంకార వైభవమునుజూచి బహిర్మంటపంబుం జేరుట.

ఇట్లు శ్రీరామచంద్రుండు సన్మార్గ సంరక్షణతత్పరుండై దుష్టులగు రావణ రాక్షసుల సంహరించి విభీషణునికి లంకను పట్టముగట్టి తన నిజపురి యగు అయోధ్యంజేరి దిగంత విశ్రాంత సత్కీర్తియై చతురులగు తమ్ముల చేత సేవింప బడిన పాదములను గలవాడయి ప్రజాపాలన మొనరించుచు సంపదలు ప్రోవులయి యొసగగ రాష్ట్రమును చెన్నొంది నెలనెలకు మూడు వానలు గురిసి పాడి పంటలచేత ప్రబలు రెక్కొని శత్రురోగము అకాల మృత్యువు జారులు చోరులు మొదలుగాగల శబ్దములయుచ్చారణలేక వర్ణాశ్రమాచారవర్తనలన్నియు పన్నకెక్కి ధర్మము నాల్గుపాదములచే వర్తిల్లుచుండునటులం జేయుచుండ ఆంజనేయుండు శ్రీభగవంతునికి పాదశుశ్రూష జేయుచు నానందాతిశయులై సకలజనులు కీర్తించునటుల రాజ్యవైభవమునసోలలాడుచుండిరి. కనుక నిట్లుండు సమయంబున దశరథనందనుండగు శ్రీరామచంద్రుండు లంకనువిడిచి అయోధ్యంజేరితననిజాంతఃపురమును జూడ నందున నాదినము శుభదినమై తేజోవంతమై విశ్రాంతిబొందుమని నాయంతఃపురంబుంటెనపత్నిసమేతమైహనుమంతునితో జేరియానందించుచునరసోక్తులై కేళీవిలాసంబులో నుండు సమయంబున వాయునందనుం డగు హనుమంతుండు శ్రీసీతారాములకు నమస్కరించి భగవంతుని జూచి స్వామీ తమ కరుణాకటాక్ష వీక్షణ్యము వలన నాజన్మంబు సఫలంబైనవి నీ రాత్రి మనమందరు ఏకీభవించియున్నందున నానందేహాముల విడదీయుమనిపరమాత్మోప విషయంబుల నడుగ నాభగవంతుడు షోడశ రాత్రులు పదునాలు రాజుల చరిత్రములను జెప్పి యెప్పటివలె నా దినము నిద్రించి మరుదినము మేలకొనంగలిగి నందరు రాజభవనంబుం జేరియుండగను నేడవదినముదయమున వసిష్ట వామదేవ భరతకౌశల్యాద్యనుమతింబున శ్రీరామచంద్రుండు సీతాసమేతంబుగా కృతాభిషేకుండై దివ్యాంబరకనకమకుటాంగదరత్నభూషణ సమన్వితుండగుటకంగీకరించి యనేక గోభూహిరణ్య కన్యాదానంబుల విప్రులకు సంతుష్టిం గావించి సుముహూర్తంబున శచీసమేతుండగు పాకశాసను పగిది దివ్యాంతః పురంబు వెడలి రథారోహణంబు గావించి భూచక్ర గొడుగులబట్టిని వానర వీరవర్యులు వైభవముగ నడువ విమలాతపత్రము శ్వేలసంఖ్యలు రాగ నాలవట్టంబులు నతిశయిల్ల భూషణాకారులగు పూర్ణేందువదనలు నృత్యంబులు నిర్వహింప దుందుభిధ్వనుల్ బ్రహ్మాండ భాండం

బున నలిగి నట్లు మ్రోయ ప్రజలందరు ముందు వెనుకను జనుదేర సమ్మద
ముతో హనుమదంగద నీలసర్వాదు లప్పుడు మొత్తంబుగా రాగ సమర
విభుఁడు వెంబడింపఁగ రఘుపతి శతకోటి భాస్కర ప్రభావిభాసిత గాత్రాం
తర హాటకాచిత పరిశుద్ధ పీతకౌశేయ వాసుండై మకరకుండల విచిత్రతర
నానారత్న ద్యుతిభరిత గండస్థలుండును మందస్మిత చంద్రికా కలిత కలా
పరిపూర్ణ చంద్రవదనా నందకందళిత ఘుమఘుమాయమాన పరిమళమిళిత
మృగమద రేఖావిరాజితుండును పరిష్కృత కనకముకుటాంగద ప్రభావిభావ
భుజాంతర సమస్తకుండును సుబ్రహ్మణ్య దేవుండును నగు శ్రీ రాఘవేం
ద్రుండు మందగమనంబున సుందర నిర్మిత రత్నోపల దగద్ధగాయమాన
సలలిత హేమసౌధాంతర ప్రవర్తిత దుకూలాంబర గంధధూప మృగమద
భాషాధీశ మలయజ హరిచందన కర్పూరాది వివిధోచిత మంగళద్రవ సం
గ్రహ ప్రకాశమాన విద్రుమ స్తంభకలిత కాంచన రంభాలంకృత ప్రసూన
మాలికావిలసిత స్థానంబును రుక్మరత్న పుష్యరాగోపరి వజ్రవైడూర్య పద్మ
రాగ సంఘటిత వివిధసింహాకార రాజ్యలక్ష్మీవిలాస మహారాజాది యోగ్య
పరిపాలన భద్రసింహాసనంబులకు లలితోపచార పుణ్యాహ వాచనల స్వస్తి
మంగళాష్టక నిగమాచార సంపన్నులైయున్న రఘువరుండు సీతతోడంగూడి
శృంగార రథంబుపై నెక్కి నగర్యాలంకార వైభవముతో ప్రవేశించుచున్న
సమయంబున గరుడ గంధర్వకిన్నర కింపురుషాది దేవదుందుభులు ప్రసూన
వర్షంబులు గురియించుచు భృగుచ్యవనపరాశరాత్రేయ కాత్యాయన వసిష్ఠ
వామదేవ పులహ పులస్త్య కశ్యపాగస్త్య మైత్రేయ విశ్వామిత్ర రుచి
కాగ్ని మౌద్గల్య కణ్వదేవశ్రవణ ఋష్యశృంగ పర్వత నారద మతంగ మంక
ణాంగీరస శతానంద మందపాల ప్రముఖులైన మహర్షులు శిష్య ప్రశిష్య
సమేతులై పరివేష్టించి నగర్యాలంకారముపై నడువ వివిధ దేశాధీశులు పుత్ర
మిత్ర కళత్రానుగుణ్యులై శ్రీరామ చంద్రుని నామముల గీర్తించుచు
పునఃపునః ప్రణామంబు లాచరించుచు గ్రక్కిరిసి ముందుగొన దళంబులు తం
డోపతండంబులై గమకింపకౌస్తుభ చేలాంచిత కుచకుంభాగ్రరత్నమౌక్తిక
హారంబులు మెఱయ మదనమోహన ప్రసూనసాయక నివహంబుల తెఱం
గున పురజనంబులుమిసిమిగల పళెండి తట్టల పుష్పాక్షత ధూపదీప కర్పూర
తాంబూల సుగంధ ఖర్జూర కదళికా నారికేళ నవీన వస్త్రంబులు గైకొని
జగన్మోహనాకారులైన పుణ్యసతీలలామంబులు హారతుల నిచ్చుచు జను
దేర నత్యంతాతి శయంబున స్త్రీజనంబులే సుషిర గాంస్యాది చతుర్విధ

వాద్యసాధనంబులం గడలుకొన భూసురాశీర్వాదంబు లుప్పతిల్ల జయజయ
ధ్వానంబులు చెలంగ భరతాది సోదరులు సుగ్రీవాది కపులును విభీషణాది
రాక్షసులును జనక కేకయాది బంధు వర్గంబులును సుమంత్రాది మంత్రివ
రులును బరివేష్టించి జగజ్జేగీయమాన జానకీ సమేతండై బహిర్మంటపంబుం
జేరి భూరి యశోపాత్రుడై లోకులుగొల్వ శ్రీరఘుకులోద్భవుండు సింహా
సనమును పాదగాంచి మ్రొక్కి నిలువ కలశసంభవ ఋషిగణములు యాశీ
ర్వాదములు ఘటింప పవనజనీలాంగదులు నొకవంకగనక పీఠంబులం గదిసి
యుండ దానవతి మహాదైత్యుడు నొకవంకగన్నులపండువుగా జూచుచుండ
జనక బాంధవ మిత్రసచివులు నొకయెడమణిమయాసనముల ఘనము లొం
దుచుండ పాల దేశాధిపతులు సన్నుతింప దేవదుందుభినినద శబ్దంబుల్నిండ
సురులు మునులు వర్ణింప శోభితంబుగ జనక జాత్మజతో రఘువంశ కుంజ
రుండు నిండు కొల్వుం దీర్చ్చుడ భరతుండా వేళ ఛత్రంబు బట్టి నిలిచె,
నింద్రజిద్వైరి శత్రుఘ్ను డిష్టముగనుభయదిక్కుల నేంచేసి విభవ మలరగ
చామరంబులు వీవగా నప్పుడు పూర్వసాగర స్వర్ణపూర్ణ కుంభముల్ గొని
ద్విదుడు ద్రవముగవచ్చుచు, దక్షిణాంబుధి వారిదగ్గొని నళుండు మహా
వైభవమున న్వచ్చుచు, బశ్చిమార్ణవతోయపాత్రగ్గొని జాంబవంతుండు
సంభ్రమమున వచ్చుచు, నుత్తరదిక్కున మహోదధీ తీర్థంబుగ్గొని పవన
తనయుసితో నందకాజ్ఞారి భగవంతుని మ్రొక్కి నిలిచి కలశోదకంబును
ముందు మహిత వేదికలను క్రమము గావించు నిలిపి నిటల తటఘటితాం
జలులై నిలిచియున్న గురుని యనుమతింగొని మునిపుంగవులప్పుడు హను
మంతుని గీర్తించి శ్రీసీతారాములకు పూజలు జేయ పుంగవులు దివ్యజల
పూరిత కుంభములెత్తి వేదములను తేజములతో బఠింప దేవతలందరు రాజిత
కీర్తియైన రఘురామునికి స్నపన చేసి యప్పుడె సురాసుర సంఘము లుల్లసిల్ల
రాజులు సంతసిల్ల నతివేడుకలం జేసి జనక విభాస పట్టమునుగట్టి దేదీప్య
మానమై వెలుగొందు నప్పుడు హనుమంతుని జూచి దశరథ నందనుండు
దీవించి సత్పాత్రుడై సకలజనుల సన్మాత్రిడై లౌకికమార్గము యందు
సదాచారపరుడై కుమ్మరపురుగు నటించు చందమున విషయంబులం గోరక
నిష్కాముడై పెద్దలయెడ శ్రద్ధయు భక్తియు విశ్వాసము నోపికయు గలిగి
నిత్యుడై సదా భగవంతుని యందు నిచిత్తము నేకాగ్రతపరచి కారణగురు
వును స్మరించుచు స్వరూప సాక్షాత్కారుడై వర్తించుచుండుమని కీర్తిం
చగ నా వాయునందనుండు శ్రీసీతారాములకు నమస్కరించి మైమరచి

లేచి భగవంతుని పాదములు తనకనుల పండువై నచ్చటనే స్మరించుచు నిత్యోత్సాహియై యుండ నందరును హనుమంతుని సకలవిధముల పొగడి శ్రీరామ, శ్రీరామ, శ్రీరామ, యని ఆత్మధ్యాన పరాయణులై యుండుటను శ్రీరామ చంద్రుడగు భగవంతుడు వీరలంగని ఆనంద సముద్రమున నోలలాడుచు నేకచ్ఛత్రాధిపతియై సకల దేశముల నేలుచు సుఖం బనుభవించుచుండెనని శ్రీ సాంబమూర్తి శ్రీరామ మాహాత్మ్యంబును పార్వతీదేవికి సాంగోపాంగముగ నుపదేశించ నామె తన్మయత్వం బొంది మైమరచి వీక్షించి మెలకువం గలిగి సర్వాధిష్ఠాన చైతన్య స్వరూపుడైన పరమశివునకు పట్టపురాణియైన పార్వతీదేవి యతిప్రీతిగో శ్రీరామ మంత్రమును జపించుచు భర్తకు నెప్పటివలె శుశ్రూషలు జేయుచు నారాధించుచు సేవించుచు బూజించుచు ధ్యానించుచు నమస్కరించు చుండగ నాసాంబమూర్తి పార్వతినింగని యాశీర్వదించి సచ్చిదానంద స్వరూపులై హిమవంతంబుం జేరి సుఖాసీనులై యుండిరి.

శ్రీ సాంబమూర్తి పార్వతీదేవికి నుపదేశించిన శ్రీ సీతారామ మహాత్మ్య

షోడశ రాజుల కథ — సమాప్తము.

అమెరికన్ డైమెండు ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

